# ఆపద్బాంధవులు

దివిసీమ ఉప్పెన
పునర్నిర్మాణ ప్రభావశీలురు





మండలి బుద్ధప్రసాద్

# ఆపద్బాంధవులు



దివిసీమ ఉప్పెన -

పునర్నిర్మాణ ప్రభావశీలురు

డా॥ మండలి బుద్ధప్రసాద్

గాంధీక్షేత్రం కమిటి
అవనిగడ్డ-521121
కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్

2

# *Aapadbandhavulu*

by Dr. Mandali Buddha Prasad

*Published* : 19-11-2018

*Copies* : 1000

*Editor* :
Dr. G.V. Purnachand

*Published by* :
**Gandhi Kshetram Commitee**
Avanigadda-521 121,
Krishna Dist., A.P.

*For Copies* :
**Emesco**
Chandram Buildings,
Machavaram
VIJAYAWADA - 520 004
Ph. : 0866 - 2436642/43, 8121098500

*Printed at* :
**Sri Sri Printers**
VIJAYAWADA - 520 002
Cell : 9490634849

**Rs: 100/-**






भारत के उपराष्ट्रपति
VICE-PRESIDENT OF INDIA

## మనిషిలోని దైవత్వం జాగరూకమైన వేళ..

దివిసీమలో జరిగిన ఉప్పెనలో జరిగిన మహోత్పాతం ఎన్నడూ మరిచిపోలేని భయానక ఘట్టం. 1977 నవంబర్ 19 అర్ధరాత్రి సమయంలో వచ్చిన పెను ఉప్పెనలో వేలాది మంది ప్రజలు, లక్షలాది పశువులు మరణించడంతో పాటు మహా వృక్షాలు కూడా కూకటి వ్రేళ్లతో కూలిపోయాయి. వందలాది గ్రామాలు నీట మునిగాయి. ఇళ్లూ, భవనాలూ, రహదారులు, పంట పొలాలూ విధ్వంసమయ్యాయి. నేల నేలంతా పెళ్లగించిపోగా, వృక్షాలు కూలిపోగా, కరెంటు స్తంభాలు నేలరాలగా, ఎక్కడ చూసినా పశువులూ, మనుషుల కళేబరాలతో నిండిపోగా దివి సీమ ఈ భువిసీమలో మృత్యుసీమగా మారింది. ఆ ప్రాంతానికి చేరుకుని శవాలను తొలగించేందుకే ఎన్నో రోజులు పట్టింది.

నాలుగు దశాబ్దాల క్రితం జరిగిన ఈ దారుణ మారణ కాండ నన్ను కదల్చివేసింది. ఆనాడు నేను జనతా యువమోర్చా అధ్యక్షుడుగా పరిస్థితులు బాగుపడేందుకు నేను చేయగలిగినంత కృషి చేశాను. అయితే మృత్యుదేవత తాండవించిన ఆ ప్రాంతంలో శవాలను తొలగించి, సహాయ పునరావాస కార్యక్రమాలు నిర్వహించేందుకు, మళ్లీ ఆ ప్రాంతంలో జీవ కళ ఉట్టిపడేలా చేసేందుకు ఎందరో మహానుభావులు నిస్వార్థంగా పనిచేశారు. సమాచార వ్యవస్థ ఇప్పటి విధంగా లేని ఆ రోజుల్లో అక్కడి భీభత్సం గురించి తెలుసుకుని స్వచ్ఛందంగా సేవాతత్పరతతో పనిచేసిన వారిగురించి కొనియాడడానికి మాటలు సరిపోవు.

కాని మరుపు అనేది మనిషికి దేవుడిచ్చిన వరం. అదే లేకపోతే మనం ఆ మృత్యువాతావరణం నుంచి ఇప్పటికీ తేరుకోగలిగేవాళ్లమే కాము. కాని ఆ రోజుల్లో తమ ఆరోగ్యాన్నీ, వయస్సునూ లెక్క చేయకుండా, ప్రాణాలకు తెగించి, మైళ్లకు మైళ్లు నడిచి సేవా కార్యక్రమాలు నిర్వహించిన వారి గురించి మాత్రం ఎప్పుడూ మరిచిపోకూడదు. ఆ మరుపు లేకుండా ఉండేందుకే ఇవాళ 40 సంవత్సరాల తర్వాత కూడా వారి గురించి మనం స్మరించుకుంటున్నాం. అవనిగడ్డ గాంధీ క్షేత్రం కమిటీ తరఫున శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఆపద్బాంధవులు పేరుతో ఈ పుస్తకం వెలువరించి చరిత్ర పుటల్లో వారి స్థానాన్ని చిరకాలం నిలిచిపోయేలా చేయడం ఒక చారిత్రక అవసరంగా నేను భావిస్తున్నాను.

బుద్ద ప్రసాద్ గారి తండ్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తాను స్వయంగా అభివృద్ధి చేసిన అవనిగడ్డ మృత్యుగడ్డగా మారడం, దివిసీమ సముద్రంలో కలిసిపోవడం చూసి చలించిపోయారు. మనో నిబ్బరంతో సేవాకార్యక్రమాలు నిర్వహించి, ఒక మానవతా మూర్తిగా నిలిచిపోయారు.

అయితే ఈ సమయంలో ఆ సమయంలో శ్రీ సోంపల్లి సోమయ్య చేసిన సేవలు మరిచిపోలేం. శ్రీ భోగాది దుర్గా ప్రసాద్, శ్రీ సోంపల్లి సోమయ్య ఇద్దరూ ఆర్.ఎస్.ఎస్ లో మా గురువులు. ఆ భీభత్స ఘట్టంలో మొత్తం ఆర్ ఎస్ ఎస్ నిర్వహించిన పాత్ర మరిచి పోలేనిది. రాష్ట్రీయ స్వయం సేవక్ గురించి తెలుసుకోవాలంటే దివిసీమలో వారు చేసిన సేవా కార్యక్రమాల గురించి తెలుసుకుంటే చాలు, వారి గురించి అర్థం చేసుకోవడం కన్నా అపార్థం చేసుకోవడం ఎక్కువ జరిగిందని అర్థమవుతుంది. శ్రీ బాలా సాహెబ్ దేవరస్, శ్రీ నానాజీ దేశ్ ముఖ్ ప్రేరణతో వేలాది మంది ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తలు అహోరాత్రాలు, అహర్నిశలు పునర్నిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. నాటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ కూడా దివిసీమ పర్యటనకు వచ్చి సంఘ్ కార్యకర్తల సేవాకార్యక్రమాలను చూసి ప్రశంసిం చారు.

రామకృష్ణ మిషన్, ఆచార్య వినోభా భావే, శ్రీ విశ్వేశ్వ తీర్థ స్వామీజీ, శ్రీ సత్యసాయి బాబా, జిల్లెళ్లమూడి అమ్మ, శ్రీ ముక్కామల నాగభూషణం, శ్రీ బిల్లీ గ్రాహం, మదర్ థెరిస్సా మొదలైనవారు దివిసీమ పునర్నిర్మాణ ఘట్టంలో నిర్వహించిన పాత్ర కూడా మరచిపోలేనిది. ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు.. అని త్యాగరాజ స్వామి ఇలాంటి వారి గురించే కీర్తించి ఉంటారు.

స్వార్థం, పరస్పర హననం, యాంత్రిక జీవనం, మానవత, తోటి వారి పట్ల కరుణ మృగ్యం అవుతున్న ఈ రోజుల్లో 40 సంవత్సరాల క్రితం మన మధ్య సంచరిస్తున్న వారే ఎలా స్పందించారో తెలుసుకుంటే మనలోని మనిషి మేల్కనక తప్పదు. దివిసీమ పునరావాసం అనుభవాలు తర్వాత జరిగిన ప్రకృతి వైపరిత్యాల్లో ప్రభుత్వాలు, సేవా సంస్థలు, ప్రజలు ఎలా స్పందించాలో పాఠాలు నేర్పాయి.

మనిషిలోని దైవత్వాన్ని తెలియజేసి, మానవ సేవయే మాధవసేవ ప్రాధాన్యతను మరో సారి లోకానికి వెల్లడించే ఈ అపూర్వమైన పుస్తకాన్ని ప్రచురించాలనే ఆలోచన వచ్చినందుకు మిత్రుడు మండలి బుద్దప్రసాద్ ను ఆత్మీయంగా అభినందిస్తున్నాను.

ముప్పవరపు వెంకయ్యనాయుడు





CHIEF MINISTER

ANDHRA PRADESH

# సందేశం

'పాలింకి పోవటానికి ఉన్నట్లే మనసు ఇంకిపోవటానికీ మాత్రలుంటే బాగుండు' అంటుంది ఓ కవయిత్రి. దివిసీమ ఉప్పెన విషాదం తర్వాత ఆ ప్రాంతంలో జీవచ్ఛవాలుగా మిగిలిన వారిని చూస్తే ఈ మాటలు జ్ఞాపకం వచ్చాయి. ఆ తర్వాత కొంతకాలానికి అక్కడో నాగరికతనే నిర్మించారు.

నాలుగు దశాబ్దాల క్రితం సముద్రం జలసర్పమై దివిసీమను కాటువేసింది. వేలాది జీవితాలకు చితిపేర్చింది. సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో లేని ఆ కాలంలో వచ్చిన ఉప్పెన... విపత్తుల వేళ ప్రభుత్వాలు ఎలా స్పందించాలో చెప్పక చెప్పింది. సముద్రం ఉప్పొంగి బతుకులను ఛిద్రం చేసిన అదే నేలపై ఆ తర్వాత మానవత్వం ఉప్పొంగింది. మమకారం పెల్లుబికింది. దివిసీమ జనజీవితాల్లో వెలుగు నింపింది. ఈ గడ్డకు ఏమీ కాని బిడ్డలైన విదేశీయులూ సహాయ పునర్నిర్మాణ, పునరావాస కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు. మహిమాన్విత మదర్ థెరిస్సా స్వయంగా వచ్చి సేవలందించారు.

నేటి నవ్యాంధ్రప్రదేశ్ శాసన సభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్ గారి తండ్రి, నాటి రాష్ట్రమంత్రి మండలి వెంకటకృష్ణారావుగారి చొరవతో ముందుకు వచ్చి దివిసీమ ఉప్పెన తర్వాత ఆ ప్రాంత పునర్నిర్మాణంలో భాగస్వాములయ్యారు. మండలి స్థాపించిన గాంధీ క్షేత్రం పునర్నిర్మాణ కార్యక్రమాలకు దిశానిర్దేశం చేసింది. ఉప్పెన తర్వాత ఉద్యమ స్ఫూర్తితో సాగిన పునర్నిర్మాణ కార్యక్రమం దేశ విదేశాలను సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తింది. నాటి ఉప్పెన తర్వాత మిగిలిన ప్రజలు సంతోషంగా, ఆనందంగా, నిశ్చింతగా జీవిచడానికి మండలి వెంకట కృష్ణారావుగారు ఎంతో చొరవ తీసుకున్నారు. పునర్నిర్మాణ కార్యక్రమాలలో దేశ, విదేశీయులు భాగస్వాములయ్యారు. వీరిలో ప్రముఖపాత్ర వహించిన పాతికమంది సేవను ప్రస్తుతిస్తూ 'ఆపద్బాంధవులు' పేరుతో పుస్తకంగా మనముందుకు తీసుకొచ్చారు. విపత్తుల తర్వాత పరిస్థితిని ఎదుర్కొనే బృందాలకు ఈ పుస్తకం ఎంతో స్ఫూర్తినిస్తుంది.

విపత్తులు, ఉపద్రవాలతో మానవాళికి మరణశాసనం రాసిన బెంగాల్ కరవు, ధాతుకరవు, గుంటూరు కరవును చరిత్ర మర్చిపోదు. దివిసీమ విషాదం వీటి కోవకే చెందుతుంది. పుస్తకంలో జాన్ డేవిడ్, డైక్‌మెన్ లాంటి మహనీయులతో మండలి వెంకటకృష్ణారావుగారి స్నేహాన్ని బుద్ధప్రసాద్ గారు చక్కగా రాశారు. జాన్ డేవిడ్ గారి గురించి (పే. 106) 'ఆయన అందించే సేవలు ఎవరో ఒక దాత వచ్చి ఆదుకునే పద్ధతిలో ఉండవు. అవి ఒక తండ్రి తన బిడ్డల యోగక్షేమాలు కనిపెట్టుకున్నట్లు ఉంటాయి' అని రాసిన మాటలు ఎంతో సత్యాలు.

'నదులు సముద్రంలో కలిసేందుకు వచ్చేది, చిట్టచివరి గజం వరకూ ఉన్న తీరప్రాంత వాసులకు మంచినీరందించటానికే' (పే. 115) అనే వాక్యాలు ఆ నేలమీద నివసిస్తున్న ప్రజలపై బుద్ధప్రసాద్ గారి ఆర్తికి, కవితా స్ఫూర్తికి నిదర్శనాలు.

ఆనాటి చరిత్రకు చిత్రిక పట్టిన ఈ పుస్తకం విపత్తుల నివారణకు సన్నద్ధమయ్యే ప్రభుత్వాలకు ఒక మార్గదర్శిని కూడా. 'మ్యాన్ మేక్స్ హిమ్ సెల్ఫ్' అంటారు చరిత్రకారుడు గార్డన్ చైల్డ్. మానవుడే చరిత్ర నిర్మాత. కృష్ణా నదీతీరాన, దివిసీమ ఉప్పెన తరువాత అటువంటి చరిత్రను పునర్నిర్మించిన మహోన్నతుల మానవతా కార్యక్రమాలను 'ఆపద్బాంధవులు' శీర్షికతో పుస్తకంగా మనముందుకు తీసుకొచ్చిన ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్ గారికి హృదయ పూర్వక అభినందనలు.

**(నారా చంద్రబాబునాయుడు)**

*ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి*

## ఆపద్బాంధవులు... ఈ వరుసలో !

# కడలిని మించి ఉప్పొంగిన కరుణ...

**- డా. జి వి పూర్ణచందు**

అది ఒక భయంకరమైన కాళరాత్రి....

పదేనువేల మంది నిండుప్రాణాలను బలిగొన్న ఒక పీడకల.

లక్షలాది పశువులు అశువులు బాసిన వేళ...

చెట్లు, కరెంటు స్తంభాలు సహా నిలబడ్డదంటూ ఏదీ లేని దుస్థితి. ప్రాణాలు నిట్టనిలువునా కుప్పకూలిన నడిరాత్రి అది!

సరిగ్గా నేటికి 40 యేళ్ల క్రితం...

యుద్ధభూమిలో రక్తశిక్తమై నేలకూలిన వీర సైనికుల్లా పడివున్న మహావృక్షాలు... విజయవాడ నుండి 90 కిలో మీటర్ల దూరాన ఉన్న అవనిగడ్డ దారి పొడవునా అవే దృశ్యాలు. ఒక్కో మహావృక్షమూ 10 మీటర్ల కైవారం కలిగినదే! వేళ్లతో సహా పెకలించుకుని కూలిపోయాయి.

భయంకర మైన గాలులు పలుగులు తెచ్చి తవ్వి కూల్చినట్టుగా ఉంది ఆ దృశ్యం.

"దారిలో ఈ పరిస్థితి చూస్తుంటే ముందుకు వెళ్లాక అక్కడ దివిసీమలో- ఒకనాటి ఆ దివ్యసీమలో- సజీవుడైన వ్యక్తి ఎవరైనా మిగిలి ఉంటాడా...? అనిపించింది" అని టైమ్స్ ఆఫ్ ఇండియా విలేకరి వ్రాశాడు. డిసెంబరు 31న అంటే, ఉప్పెన వచ్చిన 45 రోజుల తర్వాత వ్రాసిన విషయం ఇది. ఉప్పెన వచ్చిన రోజుల్లో ఈ దృశ్యం ఎంత భయానకంగా ఉండి ఉంటుందో ఊహకందని విషయం.

ఉప్పెన అంటే "సముద్రం పోటు పెడుతూన్న సమయంలో ఏర్పడిన తుపాను కారణంగా వచ్చిన ముంపు" అని నిర్వచనం చెయ్యవచ్చు. బందరు, దివిసీమ-ఈ రెండూ-సముద్రమట్టంలో ఉన్న ప్రాంతాలు కాబట్టి, సముద్రపు నీరు ఊరు లోపలికి చొచ్చుకు వస్తుంటుంది. సముద్రపు పోటు (పొంగు-tide), తుపాను(వాయుపీడనం)

వలన ఎగిసి పడే కెరటాలు(waves) కలగలసి 1977 ఉప్పెన ఏర్పడింది. సముద్రానికి పోటు వచ్చే సమయంలోనే తుపాను అక్కడే తీరం దాటినప్పుడు బలమైన గాలులతోపాటూ సముద్రం ఎగిరి దూకినట్టు మీదపడి అప్పటికప్పుడు అందినది అందినట్టు లోపలికి లాక్కుపోయింది.

సమాచార వ్యవస్థ, సాంకేతిక పరిజ్ఞానం అంతగా అభివృద్ధి చెందని ఆ రోజుల్లో మారుమూల ప్రాంతాల్లో వార్తాప్రసారానికి అకాశవాణి ఒక్కటే ఏకైక సాధనంగా ఉండేది. నిజానికి, రేడియోలో ఉప్పెన కోస్తాతీర ప్రాంతాన్ని ముంచెత్తనున్నదనే హెచ్చరికలు పదేపదే వస్తున్నాయి. కానీ, ప్రజలు, అధికార యంత్రాంగం కూడా ఆ హెచ్చరికల్ని అంతగా పట్టించుకోలేదు. తుపాను ఈ ప్రాంతాల్లోనే తీరాన్ని దాటుతుందని తెలిపినప్పటికీ కచ్చితంగా దివిసీమ మీద విరుచుకుపడ్తుందనే అంచనా లేదు. ఈ తుపాను తాకిడి మనకుండదనీ, అది మామూలు గాలివానే ననే ధీమాతో ఉన్నారంతా!

అయితే ప్రకృతి మరోవిధంగా తలచింది. ఆ రాత్రి తన ప్రతాపాన్నంతా దివిసీమపైనచూపింది. అలల ఉధృతిని అంచనా వేసే సాంకేతిక సాధనాలు లేవు. కేవలం ఒక గంటన్నర కాలంలో 16కి.మీ. మేర భూమి యావత్తూ సముద్రంగా మారిపోయింది. 31 గ్రామాలు రెండు నిట్టాళ్ళ ఎత్తు నీటిలో సమాధి అయిపోయాయి.

అవనిగడ్డ వద్ద డెల్టాప్రాంతంలో ఏర్పడిన దీవి దివిసీమ! ఇక్కడ కృష్ణానది బంగాళాఖాతంలో కలిసే ముందు రెండుగా చీలిపోయింది. ఒక పాయ కోడూరు మండలం హంసలదీవి వద్ద బంగాళాఖాతంలో కలవగా మరోపాయ నాగాయలంక మండలంలోని గుల్లలమోద సమీపంలో బంగాళాఖాతంలో కలుస్తుంది. కృష్ణానది సాగరుణ్ణి కలిసే ఈ దివ్యసీమ నిరంతర తుఫాన్లకు వేదికగా మారిపోయింది. చుట్టూ జలాలు ఉన్నప్పటికీ త్రాగునీరు, సాగునీరు కొరత... అలాగే, చివరి అంచున భూమిదాకా కృష్ణానది కాలువల ద్వారా నీరు అందకపోవటం లాంటి సమస్యలతో సతమతమయ్యే ప్రాంతం ఇది. వ్యవసాయం ఒక గడ్డుసమస్యగా ఉన్న ఈ భూమ్మీద అర్ధరాత్రి తుపాను విరుచుకుపడింది.

- ప్రభుత్వ అధికారిక ప్రకటన ప్రకారం 1977 నవంబరు 19 అర్ధరాత్రి సమయంలో ఉప్పెన వచ్చింది.
- సముద్రం పొడవునా 80 కిలోమీటర్ల మేర 16 కిలోమీటర్ల విస్తీర్ణంలో ఈ ఉప్పెన కేంద్రీకృతమయ్యింది.

- 6 మీటర్ల ఎత్తున కెరటాలు ఎగిసిపడ్డాయి.
- ఆరోజు ఉదయం 8-30కి మొదలుపెట్టి, మర్నాడు ఉదయం వరకూ 1337.2 మి.మీ వర్షపాతం నమోదయ్యింది.
- ఒక్క కృష్ణాజిల్లా దివిసీమలోనే 8,000మంది మృత్యువాత పడినట్టు ప్రభుత్వ లెక్కలు చెప్తున్నాయి.
- 2,765 పశువులు మరణించాయి.
- 91 గ్రామాలు నీటమునిగిపోయాయి.
- 91,785 మంది తుపాను బాధితులు ప్రాణాలతో బయటపడ్డారు.
- 3,18,570 ఇళ్ళు దెబ్బతిన్నాయి. ఆనాటి అంచనా ప్రకారం 2,765,000 రూపాయల నష్టం జరిగినట్టు అంచనా.
- 4,836 ప్రభుత్వ భవనాలు దెబ్బతిన్నాయి. 3,398,00 రూపాయల
- 2,408 కిమీ. మేర రోడ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి.
- 8,547 లక్షల ఎకరాల్లో 14,703,95 రూపాయల మేర పంట నష్టం జరిగింది.

పల్లపు ప్రాంతాలు 10-15 అడుగుల లోతు నీటిలో 10గంటల సేపు మునిగి ఉన్నాయి. అలాంటి స్థితిలో బ్రతికున్నవారి సంఖ్య అరుదుగా మారిపోయింది. ప్రాణనష్టాన్ని ఆస్తినష్టాన్ని వెలకట్టలేని స్థితి అది! ఎగిసి పడిన అలలతో పాటుగా సముద్రంలో కలిసి పోయిన ప్రాణుల సంఖ్య ఎంతో తెలియదు. తుపాను తర్వాత వేలాది శవాలు నీళ్లలో తేలుతూ కనిపించాయి. మరణించిన వారిలో అత్యధికశాతం మత్స్యకారులు. కనీసంలో కనీసం 10% మంది ప్రజలు సముద్రంలో కలిసిపోయి ఉంటారని అంచనా. ఉప్పెన రోజున మృత్యుదేవత తాండవించినా మరుసటి రోజు నుంచే కరుణరసం వరదలెత్తి ప్రవహించిందక్కడ. పెను ఉప్పెన వచ్చినా దివిసీమ గుండె ధైర్యం చెదరలేదు. ప్రాణాల్తో బయటపడిన వారి మనో నిబ్బరాన్ని చూసి సమస్త ప్రపంచం విస్తుపోయింది. సహాయచర్యల కోసం ఒక వైపు దాతలు, కరుణామూర్తులు వెల్లువలా వస్తుంటే, బాధితులు తమ దుఃఖాన్ని మరచి, వారు కూడా సేవలో భాగస్వాములు కాగలగటం విశేషం.

తమ సమీపబంధువుల్ని, మిత్రుల్ని, అమ్మల్ని, నాన్నల్నీ, అక్కల్నీ, చెల్లెళ్లనీ, అన్నల్నీ, తమ్ముళ్లనీ, పసికూనల్నీ తమ కళ్లముందే సముద్ర కెరటాలు కబళించుకు పోతుంటే నిశ్చేష్టులై నిలిచిన దివిసీమ వాసుల గుండె బావురుమంది. ఆయినా,

తమాయించుకుని తమలో తామే సహకరించుకోవటానికి ఉద్యుక్తులయ్యారు దివిసీమ ప్రజలు.

గుర్తుపట్టలేనంతగా దెబ్బతిన్న అనేక శవాలను సామూహిక దహనం చెయ్యాల్సి వచ్చింది. వారంరోజులు, పదిరోజులు, పదిహేనురోజులు...మృతదేహాల్ని తొలగించి ఖననమో దహనమో చేస్తున్నకొద్దీ కొత్త మృతదేహాలు దొరకసాగాయి. సముద్రంలోకి కొట్టుకుపోయిన వారెందరో లెక్క తెలీదు.

మనది ఎల్లకాలం 'పుచ్చుకునే చెయ్యి' కాదు, మనది 'ఇచ్చేచెయ్యి'నీ, "ఇవ్వగలిగిన చెయ్యే'ననీ నిరూపించిన దాతలు కేవలం అన్నదాన శిబిరాల్లాంటి సాధారణ సేవలకు పరిమితం కాకుండా దివిసీమను పూర్వంకన్నా మెరుగైన స్థితికి పునర్నిర్మించాలని పూనుకోవటం బాహ్యప్రపంచం అబ్బురంతో చూసిన ఒక దివ్యదృశ్యం.

సర్వోదయ నాయకులు వినోబాభావే, ప్రభాకర్ జీ వంటి జాతీయ నాయకులు, బాలాసాహెబ్ దేవరస్, పెజావర్ స్వామి వంటి హిందూ ధార్మిక సంస్థల నేతలు, సత్యసాయిబాబా, జిల్లెళ్లమూడి అమ్మ, మదర్ థెరిసా, స్వామీ రంగనాథానంద, స్వామీ బోధస్వరూపానంద వంటి ఆధ్యాత్మిక వేత్తలు, బిల్లీగ్రాహం, ఆచార్య మైఖేల్ ఎ. విండీ, డా. డైక్‌మన్, శ్రీ జాన్ డేవిడ్ లాంటి విదేశీ కారుణ్యమూర్తులు, ఎందరో వదాన్యులు, ఆయా ప్రముఖులు నిర్వహించే సంస్థలకు చెందిన వేలాది కార్యకర్తలు, లయన్స్, రోటరీ, ఎపెక్స్ క్లబ్ లాంటి అంతర్జాతీయ సంస్థలు ఒకరేమిటీ...ఎందరో ఈ పునర్నిర్మాణ కార్యక్రమంలో భాగస్వాము లయ్యారు. వారందరితోనూ స్థానిక ప్రజలు- అందరూ ఉప్పెన బాధితులే- చేదోడువాదోడుగా నిలిచి తోడ్పాటు నందించారు.

తీరం పొడవునా శాశ్వత తుపాను సహాయ శిబిరాల్ని ఏర్పాటు చేశారు. భవిష్యత్తులో వచ్చే తుపాన్లకు తట్టుకునేలా పక్కా ఇళ్లను నిర్మించారు. కాలనీలకు కాలనీలు కొత్తగా వెలిశాయి. అనేకమంది సేవామూర్తుల పేర్లను ఆయా కాలనీలకు పెట్టుకుని వారి సేవలకు కృతజ్ఞతలు చెప్పుకున్నారు దివిసీమవాసులు.

ప్రభుత్వం చాలా నిర్మాణాత్మకంగా వ్యవహరించటం వలన లక్షలాది రూపాయల నిధుల్ని శాశ్వత పునరావాస కార్యక్రమాలకు వెచ్చించటం జరిగింది. కొన్నేళ్ళయిన తరువాత తాము నిర్మించిన కాలనీల పరిస్థితి ఎలా ఉందో పరిశీలించ టానికి వచ్చిన దాతలు కొందరు మరికొంత అదనపు సాయాన్ని అందించిన దాఖలాలు కూడా ఉన్నాయి.

**అధికారిక లెక్కలప్రకారం బాధితులకు అందిన సేవల వివరాలు ఇలా ఉన్నాయి :**

**సేవా కార్యక్రమాలు -**

ఆహారపదార్థాలు : 8,234 టన్నులు

బట్టలు : 2,00,505 వస్త్రాలు

గృహనిర్మాణ సామాగ్రి : 1,21,82,000 వస్తువులు

ప్రభుత్వం ద్వారా పంపిణీ

అయిన బియ్యం గోధుమలు : 15,500 టన్నులు

**పునర్నిర్మాణ కార్యక్రమాలు -**

గృహనిర్మాణాలు జరిగిన గ్రామాలు : 83

నిర్మించిన గృహాలు : 16,500

తుపాను షెల్టర్లు నిర్మించినవి : 112

దివిసీమ ఉప్పెన అనేక కొత్త పాఠాలు నేర్పింది. వాతావరణ హెచ్చరికల ప్రాధాన్యత ఆ తరువాత బాగా పెరిగింది. హుధుద్ తుపాను లాంటి అనేక ప్రళయాలు ఆ తరువాత రాష్ట్రాన్ని ఎంతకుదిపినా, ఉప్పెన ప్రభావిత ప్రాంతాల్లోంచి ప్రజలను ముందే సురక్షిత ప్రాంతాలకు తరలిచటం ద్వారా అపారమైన జన నష్టాన్ని మాత్రం నివారించగలుగుతున్నాం అంటే, దివిసీమ ఉప్పెనలోలా మనం నేర్చుకున్న పాఠాలే ఇందుకు కారణం.

దాతలకు, దాతృత్వానికి కొదవలేదని, ఆత్మవిశ్వాసం ఉంటే ఎంతటి పెనువిపత్తునైనా ఎదిరించి, బతుకు ప్రయాణాన్ని తిరిగి కొనసాగించవచ్చనీ దివిసీమ ఉప్పెన నిరూపించింది.

ఇంతటి సమాచార వ్యవస్థ లేని ఆ రోజుల్లో బైట ప్రపంచానికి ఈ ఉప్పెన వార్తలు చాలా ఆలస్యంగా తెలిశాయి. బిల్లీ గ్రాహంగారు టీవీ కెమెరాలున్న విలేకర్ల బృందాన్ని కూడా వెంటనిడుకుని రావడం వలన విదేశాలకు మరింతగా దివిసీమ వార్తలు తెలిసేందుకు అవకాశం ఏర్పడింది. ప్రపంచ వ్యాప్తంగా దాతలు ముందుకు రావటానికి ఇది ఎంతగానో తోడ్పడింది. సహాయసామగ్రితో వస్తున్న లారీలు మైళ్లకు మైళ్ళు బారులు తీరి నిలబడ్డాయి. ఎవరెవరో, ఎక్కడెక్కడినించో అజ్ఞాత దాతలు పంపిన సహాయ సామగ్రి లెక్కకు మిక్కిలిగా ఉంది.

రెడ్‌క్రాస్, రామకృష్ణమిషన్, గుజరాతీ మార్వారీ సహాయ పునరావాస సంఘం,

టాటా రిలీఫ్ కమిటీ, అవేర్ గురునానక్ మిషన్, గీతావ్యాస్ మండల్(నాగపూర్), భారత్ సేవాశ్రమ సంఘ్, విశ్వహిందూపరిషత్, ఎఫికోర్, కేర్, కాసా, ఎ.ఎం.జి. ఇంటర్నేషనల్, ఆర్థిక సమతామండలి, రాష్ట్రరోడ్డు రవాణా సంస్థ, పోలీస్ హౌసింగ్ కార్పొరేషన్, అనేక ప్రభుత్వశాఖల ఉద్యోగులు ఇంకా ఎందరో మహానుభావులు సర్వశక్తులూ కేంద్రీకరించి దివిసీమను పునర్నిర్మించారు.

నష్టపోయిన 20,000 ఇళ్లలో 13,000 ఇళ్లను తిరిగి నిర్మించారు. అనేక కొత్త కాలనీలు వెలిశాయి. కొత్త గ్రామాలు వెలిశాయి. దీనదయాళపురం అనే కొత్త గ్రామాన్ని ఏర్పరచగా, ఆనాటి విదేశాంగ మంత్రి శ్రీ అటల్ బిహారీ వాజపేయి ఆ గ్రామాన్ని ప్రారంభించారు. ప్రభాకరపురం, రామకృష్ణపురం లాంటి గ్రామాలన్నీ ఇలానే ఏర్పడ్డాయి. పాతపేర్లు, పాతజ్ఞాపకాల స్థానే ఈ నవజీవనం చివురులెత్తిందక్కడ.

ఆనాడు రాష్ట్ర విద్యామంత్రిగా ఉన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అప్పటికి 20 యేళ్లుగా అహర్నిశలూ శ్రమించి నిర్మించుకుంటూ వచ్చిన దివిసీమ సముద్రం పాలు కాగా నిలువెత్తు దుఃఖంలో కూరుకుపోయినా మనో నిబ్బరాన్ని ప్రోది చేసుకుని, జవసత్వాలను కూడగట్టుకుని ఆయన దివిసీమగాంధీగా ఆనాడు చూపిన సాహసోపేతమైన మనోనిబ్బరం గొప్పది. మోకాళ్లలోతు నీళ్లలో ఇంకా తేలియాడుతున్న శవాలను తప్పించుకుంటూ పంచె పైకెగగట్టి ముందుకు సాగుతూ బాధితులను ఓదారుస్తూ, వారందరికీ తక్షణ సహాయ సహకారాలు అందించటంలో ఆయన చూపిన సమర్థత, భవిష్యత్తును నిర్మించటానికి ఆయన ప్రదర్శించిన చాకచక్యం, వరుసలు కట్టే విధంగా దాతలను సమీకరించి, వారి సహాయసహకారాలను సమన్వయ పరచటంలో ఆయన చూపించిన నాయకత్వ ప్రతిభ గొప్పవి. ఆ మహనీయుడొక్కడే ఆనాడు దివిసీమకు కొండంత ఆశాదీపమై వెలుగులు ప్రసరింపచేశారు. ఆయన పలుకుబడి, చొరవ, దాతలను గుర్తించి, వారి దృష్టికి సమస్యను తీసుకువెళ్లి, సానుకూలంగా వారిని స్పందింప చేయటంలో వారు ఆనాడు నిర్వహించిన పాత్రకు జేజేలు పలకవలసిందే!

ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ జలగంవెంగళరావుగారు మండలి వెంకట కృష్ణారావుగారి ఆలోచనలకు తగ్గట్టుగా వేగంగా స్పందించటం, జాతీయస్థాయిలో రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, ప్రధాని శ్రీ మురార్జీదేశాయ్, శ్రీమతి ఇందిరాగాంధీ, ఎందరో పీఠాధిపతులు ఆధ్యాత్మికవేత్తలు కమ్యూనిష్టు నాయకులు, ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ బాధితులకు చెప్పిన స్వాంతన వచనాలు, ఊరడిల్లిన ప్రజలను పునర్నిర్మాణ భాగస్వాములను చేస్తూ చేపట్టిన కార్యాచరణ ఇవన్నీ బుద్ధప్రసాద్‌గారి

మదిలో నేటికీ పదిలంగా ఉన్నాయి. ముఖ్యంగా అన్ని రాజకీయపార్టీలవాళ్లూ విబేధాలను మరిచి చేసిన సహాయకార్యక్రమాలు మరువ లేనివి. వాటిని తన మనోఫలకం మీద మరొకసారి సందర్శించుకుని డా. మండలి బుద్ధప్రసాద్‌గారు ఈ పుస్తకరచనకు పూనుకున్నారు. దివిసీమ ఉప్పెన బాధిత ప్రాంతాల్లో వికాసవంతమైన పునర్నిర్మాణానికి సహకరించిన ఆనాటి ఆపద్బాంధవుల జీవిత చిత్రణల సమాహారం ఈ గ్రంథం. ఈ 2017 నవంబరు 17నాటికి దివిసీమ ఉప్పెన వచ్చి 40 యేళ్ల కాలం పూర్తయిన సందర్భంగా ఆ ఆపద్బాంధవుల సేవలను పునశ్చరణ చేసుకోవటం లక్ష్యంగా ఈ గ్రంథరచన సాగింది.

నిజానికి బుద్ధప్రసాద్ గారు ఆనాటి ఉప్పెన సమయంలో ప్రత్యక్షంగా సేవాకార్యక్రమాల్లో పాల్గొన్న వ్యక్తి. తండ్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారికి కుడిభుజంగా నిలబడి, ఒక క్రమపద్ధతిలో సేవలను దివిసీమ నలుమూలలకూ, అలాగే దివిసీమ వెలుపల ఈ తుపానుకు దెబ్బతిన్న ఇతరప్రాంతాలకూ అందేలా జాగ్రత్త వహించారు.

ఉప్పెననాటికి శ్రీ బుద్ధప్రసాద్ హైదరాబాద్‌లో డిగ్రీ చదువుతున్నారు. గాంధీక్షేత్రం కార్యనిర్వాహకుడిగా యువజనుల్లో చైతన్యాన్ని ప్రోదిచేస్తూ సమాజ సేవాకార్యక్రమాలెన్నో చేపడుతున్న 21యేళ్ల యువకుడు.

నిజానికి, ఉప్పెన వచ్చిన మర్నాటినుండే కృష్ణారావుగారి కార్యక్షేత్రం అయిన అవనిగడ్డ గాంధీక్షేత్రం దగ్గర 10,000 మందికి పైగా నిర్వాశితులు వచ్చి రోదిస్తుంటే అప్పటికప్పుడు వారికి సహాయ కార్యక్రమాలు, భోజన ఏర్పాట్లు, వైద్య సదుపాయాలు కల్పించి ఓదార్చిందీ, ఆదుకున్నదీ, ధైర్యం చెప్పి ప్రోత్సహించిందీ బుద్ధప్రసాద్ గారే.

నాటి ఉప్పెనకు, ఉప్పెన అనంతరం జరిగిన నిర్మాణాత్మక సేవలకు ప్రత్యక్ష సాక్షి బుద్ధప్రసాద్‌గారు. తన జ్ఞాపకాల దొంతరల్లోంచి ఆనాటి విశేషాలను వెలికితీసి, తన రికార్డుల్లో భద్రపరచిన ఛాయాచిత్రాల్ని ఇతర సమాచారాన్ని క్రోడీకరించి ఈ వ్యాసాలను సమకూర్చారు.

డా. మండలి బుద్ధప్రసాదుగారు సాహితీబంధువు. ఆయన మనసు ఆర్ద్రతతో నిండిన కరుణాభాండం లాంటిది. 'ఆదరణ' అనే ఒక ఆదర్శానికి అచ్చమైన ఆచరణకు ఈ పుస్తకంలో అక్షర రూపం ఇచ్చారాయన. ఆనాటి పీడకలల గురించికాకుండా, ఆ పీడకలల్ని ఒక సేవాయజ్ఞంగా మలచిన ఎందరో ఆపద్బాంధవులైన మహనీయుల సేవానిరతిని పునశ్చరణ చేసుకోవటం లక్ష్యంగా ఈ పుస్తక రచన చేశారాయన.

మానవత్వాన్ని తట్టి లేపేది జీవితంలో మనోహరమైన ఆనందక్షణాలు కావు.

పెంజీకటిని ఆవరింపచేసిన విషాద సంఘటనలే మనిషిని మానవుడిగా మలుస్తాయి. "నరుడు నరుడౌట దుష్కరమ్ము సుమ్ము" అని గాలిబ్ వాక్యాల్ని మహాకవి దాశరథి తెనిగించారు. దివిసీమ ఉప్పెన నరుడు మానవుడవటం సుసాధ్యమని నిరూపించింది.

సేవ సేవకు ఉత్తేజాన్నిస్తుంది. Service inspires service అంటారు. ఈ "ఆపద్బాంధవు"ల సేవలు సేవా తత్పరులైన ప్రతి ఒక్కరికీ స్ఫూర్తిదాయకంగా ఉంటాయి. నాటి చరిత్రకు అద్దం పడతాయి. రేపటి అవసరాలకు కరదీపికగా ఉపయోగిస్తాయి. ఆ సేవానిరతిని నేటి తరానికి పరిచయం చేసినప్పుడు అది అనేక జ్యోతులను వెలిగించే ఒక అఖండ జ్యోతిగా నిలిచిపోతుంది. అనేకమంది మనసుల్లో అంతటి సేవాస్పందనలను ప్రేరేపించటమే ఈ పుస్తకం పరమ ప్రయోజనం.

ఈ పుస్తకాన్ని బుద్ధప్రసాద్‌గారు మాత్రమే వ్రాయగలరు. ఆనాడు దివిసీమలో జరిగిన అన్ని సేవాకార్యక్రమాల్లోనూ కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారితోపాటు బుద్ధప్రసాద్ గారి పాత్ర, ప్రమేయం ఉన్నాయి కాబట్టి!

దివిసీమ పునర్నిర్మాతల్లో ప్రముఖంగా చెప్పుకోవలసిన వ్యక్తి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు. ఈ గ్రంథాన్ని సాక్షాత్తూ ఆయన కుమారుడు శ్రీ బుద్ధప్రసాదు వ్రాస్తున్న కారణంగా కృష్ణారావుగారి సేవా నిరతి గురించి తిరుమల రామచంద్రగారు వ్రాసిన "మానవతామూర్తి మండలి వెంకట కృష్ణారావు" అనే వ్యాసాన్ని ఈ పుస్తకంలో అనుబంధంగా అందిస్తున్నాం.

దివిసీమ పునర్నిర్మాణంలో భాగస్వాములైన జాతీయ, అంతర్జాతీయ ప్రముఖులు కొందరి సేవలను మాత్రమే ఈ గ్రంథంలో అందిస్తున్నాం. ఇది తొలి యత్నం. ఇంకా గణనీయమైన సేవలు చేసిన వ్యక్తుల విశిష్ట సేవల గురించి చెప్పుకోవలసిన విశేషాలు అనేకం ఉన్నాయి. తరువాయి భాగాల్లో వాటిని అందించ గలమని మనవి.

దివిసీమ ఉప్పెన వచ్చిన 40 యేళ్ళ సందర్భంగా ఆనాటి సేవామూర్తుల సేవాస్ఫూర్తిని నేటి తరానికి అందించటం లక్ష్యంగా ఈ పుస్తకాన్ని వెలువరిస్తున్నాం. రేపటి తరానికి ఈ పుస్తకం చేరేలా, చూడవలసిన బాధ్యత పెద్దలదే!



# ముందుమాట

**- గొల్లపూడి మారుతీరావు**

కృతజ్ఞత మానవీయతకు ముందుమాట. ఆ విలువ ఈ పుస్తకమంతా విస్తరించి ఉంది.

మండలి బుద్ధప్రసాద్‌గారు సాహితీ బంధువు. అజాత శత్రువు. సామర్థ్యాన్నీ, ప్రతిభనీ, సేవనీ, వితరణనీ, ఉదాత్తతనీ ప్రత్యేకంగా వెతుక్కుని వెళ్లి పలకరించి అక్కున చేర్చుకోవడం వారికి వారసత్వం.

40 సంవత్సరాల కిందట - అంటే 1977 నవంబరు 19న అర్ధరాత్రి దివిసీమ ప్రాంతాన్ని పీడకలగా మార్చిన భయంకరమైన ఉప్పెన గురించి కాదు ఈ పుస్తకం. ఆ పీడకలను ఒక సేవాయజ్ఞంగా మలిచిన ఎందరో మహనీయుల పునశ్చరణ ఈ పుస్తకం. మనిషిలో మహనీయతను ఆనందం ఆవిష్కరించదు. విషాదం తట్టిలేపి - మానవత్వ విలువలకు పట్టాభిషేకాన్ని జరిపిస్తుంది.

దివిసీమ ఉప్పెనలో 8000 మంది ఏమవుతోందో, మీద పడిన ఉపద్రవ మేమిటో తెలిసేలోగానే కన్నుమూశారు. 3000 పశువులు మరణించాయి. 3 లక్షల పైగా ఇళ్లు నేలమట్టమయాయి. వినాశం కన్నా - ఆ క్షణాలలో మీద పడుతున్న ఉపద్రవాన్ని ఎరుగలేని నిస్సహాయుల మరణ యాతన వర్ణనాతీతం. గుట్టల శవాల మధ్యనుంచి మరునాడు రైలు పట్టాల మీద గుంటూరు వరకూనడిచిన ఒక వ్యక్తి ప్రత్యక్ష కథనాన్ని విజయవాడ రేడియో స్టేషన్‌లో రికార్డు చేస్తూ కాళ్లూ చేతులూ చల్లబడగా కళ్లు ధారాపాతంగా వర్షించడం నా అనుభవం.

40 సంవత్సరాల కిందట మన సమాచార వ్యవస్థ ఇంతగా ప్రాచుర్యాన్ని పొందలేదు. స్థూలంగా చెప్పగలిగిన హెచ్చరికలు గ్రామస్థులకు చేరలేదు. 2014 అక్టోబరు 12న విశాఖపట్నం మీద విరుచుకుపడిన హుద్ హుద్ తుఫాను నాటికి సమాచార వ్యవస్థ బలపడింది. 185 కిలోమీటర్ల వేగంతో దూసుకువచ్చిన తుఫాను

తాకిడికి ప్రజలంతా వారం రోజుల ముందునుంచీ హెచ్చరికలు అందుకొంటూండగా – తుఫాను తాకిన సమయంలో విశాఖపట్నంలో మా కాలనీలో బయట జరుగుతున్న భీభత్సాన్ని అమెరికా హూస్టన్ నుంచి మా తమ్ముడి కూతురు ఎప్పటికప్పుడు చెప్తోంది. అదీ వాతావరణ కేంద్రాలు, ఉపగ్రహ ప్రసారాలు, సమాచార వ్యవస్థ చెయ్యగల మేలు. హుద్ హుద్ తుఫానులో ఆస్తి నష్టం జరిగినా ప్రాణ నష్టం జరగలేదు.

దివిసీమ తుఫాను నాటికి మండలి బుద్ధప్రసాద్ గారికి 22 సంవత్సరాలు. తండ్రిగారు మూర్తీభవించిన మానవతా మూర్తి - మండలి వెంకట కృష్ణారావుగారి ఆధ్వర్యంలో పునరావాస కార్యక్రమాలు యుద్ధప్రాతిపదికన ఎలా జరిగాయో పూస గుచ్చినట్టు వివరించిన - ఆనాటి ఉపద్రవానికి భాష, కుల, మత, దేశ ప్రసక్తి లేకుండా ప్రపంచమంతా ఉద్యుక్తం కావడం - ఆ కథనాల సమీకరణ ఈ పుస్తకం.

బుద్ధప్రసాద్ గారు ఒకమాట అన్నారు : ప్రపంచంలో ఎక్కడా జరగనంత పెనువిపత్తు ఇక్కడ జరిగింది. ప్రపంచంలో ఎక్కడా జరగనంత స్థాయిలో ఇక్కడ పునర్నిర్మాణంకూడా జరిగింది. ఇది ఒక ఆశావాది చూడగల, చూపగల ఆరోగ్యకరమైన కోణం.

మంచితనానికీ, మహనీయతకు కాలదోషం లేదు. ఎన్ని సంవత్సరాలు గడిచినా ఆ కృషి, ఉవ్వెత్తున లేచిన ఆ సేవా తత్పరత అనుక్షణం స్మరణీయం. అనుసరణీయం.

కాగా, ఆశ్చర్యపోయేటంత స్పష్టంగా, నిర్దుష్టంగా ఆ వ్యక్తులు, వారి కృషీ బుద్ధప్రసాద్ గారి మనస్సులో నిలిచిందనడానికి - కేవలం పాత్రికేయుడిలాగ కాక, ఆనాటి విషాదాన్నుంచి ప్రజల్ని తేరుకుని మళ్లీ జీవనం సాగించే దిశగా గతినిర్దేశం చేసిన ఎందరో ఆపద్బాంధవులకు నివాళి ఈ అద్భుత గ్రంథం.

ఎంతటి విషాదం నుంచయినా మానవతా విలువలు జీవనాన్ని పునరుజ్జీవనానికి దోహదకారులు కాగలవని నిరూపించడానికి ఈ పుస్తకం ప్రత్యక్ష సాక్ష్యం. అంతే కాదు. నిరాశ్రయులై తల్లిదండ్రుల్ని పోగొట్టుకున్న 300 మంది అనాథలకు ఆశ్రయాన్ని కల్పించిన తండ్రిగారి గాంధీక్షేత్రపాలన, అంతర్జాతీయంగా వెల్లువెత్తిన మహనీయుల సేవా కార్యక్రమాలకు తలమానికంగా నిలిచిన కృష్ణారావుగారి త్యాగనిరతి - ఇప్పటి బుద్ధ ప్రసాద్‌గారి వ్యక్తిత్వానికి స్ఫూర్తిగా నిలిచాయని మనకి అర్థమౌతుంది.

ఎంతమంది మహానుభావులు! ఎంతటి త్యాగనిరతి!

తను స్వయంగా వడికిన ఒక వస్త్రాన్ని, తన వంతు విరాళంగా ఒకరూపాయినీ

ఇచ్చి వినోబా భావే అనుయాయులు ప్రభాకర్‌జీని ఆరు రోజుల తర్వాత పంపించారు.

హిమాలయాలకు వెళ్లి తపస్సు చేసుకోవాలా? బెంగాలు వెళ్లి విప్లవకారులతో చేతులు కలపాలా అనే సందిగ్ధంలో ఉన్న వినోబాగారికి బాపూ దర్శనమయింది. అంతే. ఆయన జీవితం వెనక్కి తిరిగి చూడనవసరంలేని మలుపు తిరిగింది.

ప్రభాకర్‌జీ నేతృత్వంలో ఉవ్వెత్తున పునరావాస కార్యక్రమాలు సాగాయి. 1982న వినోభాకు గుండెపోటు వచ్చింది. 8వ తేదీనుంచి పరిత్యాగం చేసి అపర భీష్మునివలె స్వచ్ఛంద మరణానికి సిద్ద పడ్డారు. వారి అంత్యక్రియలకు తన తండ్రిగారితో కలిసి బుద్ధప్రసాద్ గారూ వెళ్లారు.

అమెరికన్ క్రైస్తవ సమాజానికి చెందిన బిల్లీగ్రాహం దివిసీమ వార్త వింటూనే హుటాహుటిన అవనిగడ్డ చేరి వేలాదిమంది అమెరికన్ దాతలను సమీకరించి 'బిల్లీ గ్రాహం నగర నిర్మాణం' చేశారు. గణపేశ్వరం, ఇసుకరేవు, మాలపల్లి గ్రామాలను దత్తత తీసుకున్నారు. భగవాన్ సత్యసాయిబాబా భక్తులు 'సత్యసేవా సమితి' పక్షాన మరపురాని సేవలందించారు. ప్రతీ యింటికి వెళ్లి స్త్రీలకి బొట్టుపెట్టి, పలకరించి బట్టలు పెట్టారు. దీనాతిదీన స్థితిలో ఉన్న ఆ గ్రామ మహిళలు వారి కారుణ్యానికి కరిగి ముద్దయ్యారు. 2011 ఏప్రిల్ 23న వారి నిర్యాణం. బుద్ధప్రసాద్ గారు పుట్టపర్తి వెళ్లి నివాళులర్పించారు.

రామకృష్ణ మిషన్‌కి చెందిన యతిశ్రేష్ఠులు స్వామి రంగనాథానంద, స్వామి భోధ స్వరూపానంద దివి సీమను దివ్యసీమగా మార్చే యజ్ఞాన్ని నిర్వహించారు. గ్రామశ్రీ పధకం పేరిట 60 లక్షల వ్యయంతో 1100 పక్కా ఇళ్ల నిర్మాణం చేయించారు.

కృష్ణాపురం నుంచి కోడూరు వరకూ రోడ్లు, కాలవ గట్లూ, ఇంటి కప్పులూ శవాలతో కప్పి ఉన్నాయి. చచ్చిన జంతు కళేబరాలు సరేసరి. స్వచ్ఛంద సేవకుల బృందానికి ప్రభాకర్ జీ ఆధ్వర్యంలోని 'శవసేన' అంత్యక్రియలను నిర్వహించింది. 1977 నవంబరు 27న దివిసీమకు వచ్చిన ప్రధాని ఇందిరాగాంధీ ఈ కార్యకర్తల్ని అభినందించారు.

మానవత్వాన్నే మతంగా భావించుకుని, కరుణ అనే పదానికి పర్యాయంగా నిలిచిన డా॥ ఎస్. జాన్ డేవిడ్ దివి ఉప్పెన జరిగినప్పుడు అమెరికాలో ఉన్నారు. వెంటనే హుటాహుటిన భారతదేశానికి వచ్చి దివి సీమని వెదుక్కుంటూ టాక్సీలో 16 గంటలు ప్రయాణం చేసి చేరుకున్నారు. ఆ రోజుల్లోనే గాంధీక్షేత్రం పత్రిక

బుద్ధప్రసాద్‌గారి సంపాదకత్వంలో వెలువడి జాన్ దేవిడ్‌గారి సహకారంతో 12 సంవత్సరాలు నిర్విఘ్నంగా సాగింది.

మరొకపక్క బాలాసాహిబ్ దేవరస్ నేతృత్వంలో ఆర్.ఎస్.ఎస్. కార్యకర్తలు నడుంకట్టి రోజూ 10 వేల మంది నిరాశ్రయులకు స్వయంగా వండి అన్నం పెట్టారు. బట్టలు, ఆహారం, మందులు, మంచినీళ్లు పంచారు. అవనిగడ్డ, పర్రచివర, పల్లిపాలెం, యడవపాలెం, పెదగొండ్లపాలెం, గరువు హరిజనవాడ ప్రాంతాల్లో ఒక్కొక్కటి 900 రూపాయల చొప్పున కుటీరాలను నిర్మించారు.

ఈ పుస్తకం పేజీలు తిప్పబోయేవారికి ఈ వాక్యాలు పునరుక్తిగా కనిపించవచ్చు గాని - సాటి మనిషి కన్నీరు పెడుతున్నప్పుడు ప్రపంచం అంతా ఒక్కటయి వారిని అక్కున చేర్చుకోవడం ప్రపంచ చరిత్రలోనే అపూర్వమైన ఘట్టం - అని నిరూపించే ఉద్యమం ముందు పేజీలలో జరిగిందని చెప్పాలని నా ఆత్రం.

నెపోలియన్లు, హిట్లర్‌లూ, సద్దాం హుస్సేన్‌లూ మానవత్వం మీద బొత్తిగా విశ్వాసాన్ని సడలించిన నేపథ్యంలో ఒక్క విపత్తు కారణంగా మానవత్వం విశ్వరూపం దాల్చడం ఈ పేజీలలో మీరు చూడబోతున్నారు.

ఆర్ద్రతకీ, కరుణకీ, సేవా తత్పరతకీ ఎల్లలు లేవని 40 సంవత్సరాల కిందటి దివిసీమ ఉప్పెన కారణంగా సమీకృతమైన మానవత్వపు విలువల ఉప్పెనకు ఇది అక్షరరూపం. ఒక పీడకలను దివ్య ఉపాసనగా మలిచిన ఎందరో అపద్బాంధవుల కథనం. ఇంగ్లీషులో చెప్తేకాని నాకు తృప్తి లేదు.

This is a great tribute to enduring human values of the mankind. This is a great testimony to that invaluable trait called "service".



# దివిసీమ పునర్నిర్మాతలకు అభివందనం

- మండలి బుద్ధప్రసాద్

1977 నవంబరు 19 దివిసీమ గుండె తల్లడిల్లిన రోజు. 20వ శతాబ్దపు మహా ప్రళయం సంభవించిన రోజు. దివిసీమను అతలాకుతలం చేసిన రోజు. దివిసీమ ఉప్పెనగా ప్రసిద్ధమైన భీకర తుపానులో రెండునిట్టాడుల యెత్తున ఎగిసిన కెరటాలను నేలమీదకు విసిరి, 10 వేల నిండు జీవితాలను సముద్రం పొట్టనబెట్టుకున్న రోజు. ఊళ్లకు ఊళ్లు తుడిచిపెట్టుకు పోయాయి. లక్షలసంఖ్యలో పశువులు అశువులుబాసాయి.

ఆ ఘోర ఉత్పాతం జరిగిన 40వ సంవత్సరం ఇది. ఆ మహాజలప్రళయపు భారంలోంచి బైటపడి ఊపిరి పీల్చుకుని తనను తాను పునర్నిర్మించుకుని, మళ్లీ నవనవోన్మేషితమై విరాజిల్లుతోంది దివిసీమ.

ఆనాటి చేదు గుర్తుల్ని చెరిపేస్తూ నవజీవాలను, జవసత్వాలను నింపుకుని నవజీవనాన్ని ప్రారంభించింది దివిసీమ. ఇందుకు చేయూత నిచ్చిన ఆపద్బాంధవుల శేముషీ కృషిని సంస్మరించుకోవటం, వారి ఆదరణకు కృతజ్ఞతలు చెప్పుకోవటం నా బాధ్యత. కర్తవ్యం కూడా!

ఉప్పెన సమయంలో అవనిగడ్డ నియోజకవర్గంలో శాసనసభకు ఏకగ్రీవంగా ఎన్నికై, శ్రీ జలగం వెంగళరావు మంత్రివర్గంలో విద్యా సాంస్కృతిక శాఖ మంత్రిగా ఉన్న మా నాన్నగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఉప్పెన బాధితులకు తక్షణ సేవలతోపాటు, దివిసీమ పునర్నిర్మాణానికి చేసిన కృషి అనన్య సామాన్యమైనది. అప్పటివరకూ దివిసీమలోని ప్రతి గ్రామమూ అభివృద్ధి చెందటానికి పాటుబడి సాధించిన విజయాలన్నీ ఆ ఒక్క కాళరాత్రి ఉప్పెనలో కడలిపాలు కాగా, దిక్కుతోచని దివిసీమ ప్రజలకు ధైర్యాన్ని చెప్పి, అక్కున చేర్చుకుని ఆదరించిన ఆ సన్నివేశాలు ఇంకా నాకళ్లముందు కదలాడుతున్నాయి.

దివిసీమలో మునుపటి చాలా గ్రామాలు తుడిచిపెట్టుకు పోగా, తిరిగి కొత్త జీవితాన్ని పునర్నిర్మించుకోవలసిన గురుతర బాధ్యతను శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు తన భుజస్కంధాలమీద వేసుకుని కార్యాచరణకు పూనుకోవటం స్వయంగా నేను ఎరుగుదును. అప్పటికి నాకు 20 యేళ్లు. హైద్రాబాదులో డిగ్రీ చదువులున్నాను. గాంధీక్షేత్రంలో గాంధేయ సిద్ధాంతాల అనుసారంగా సేవా కార్యక్రమాలలో చురుకైన పాత్ర పోషిస్తున్నాను.

మిన్ను విరిగి మీదపడ్డట్టు దివిసీమ మీద జలరాశులు దాడిచేస్తే, అంతకు రెట్టింపు ఎత్తున మానవత్వం ఉప్పొంగి పొరలింది. అనతికాలంలోనే దివిసీమ మళ్లీ కళకళలాడేందుకు మానవాతావాదులైన ఎందరో దేశ విదేశ వితరణ శీలురు వేగంగా ముందుకు రావటంతో ఇది సుసాధ్యం అయ్యింది.

కులం, మతం, ప్రాంతం, రాజకీయ వైరుధ్యాలకు అతీతంగా ప్రపంచంలోని మానవతావాదులంతా కదలివచ్చి దివిసీమను దివ్యసీమగా తీర్చిదిద్దటానికి నడుం కట్టారు. ఎందరో మహానుభావులు తమ సేవలను అందించేందుకు తగిన ప్రేరణ నివ్వటమే కాకుండా, వారందరినీ సమన్వయపరచి మా నాన్నగారు పునర్నిర్మాణ కార్యక్రమాలను ముందుకు నడిపించారు.

ఉప్పెన వచ్చిన రోజుల్లో ఒకసారి హంసలదీవి వెళ్లాను. వేణుగోపాలస్వామి దేవస్థానం వద్ద ఒక వృద్ధ సర్దార్జీ బాసిపీట వేసుకుని ఎదురుగా మందులు పెట్టుకుని కూర్చున్నాడు. ఆయనకు తెలుగు భాషరాదు. అక్కడున్న ప్రజలకు ఆయన భాషరాదు. అయినా బాధితప్రజలకు ఆ సమయంలో ఆరోగ్య సమస్యలు తలెత్తకూడదనేదే ఆయన తపన. ఇలా ఇతరులకోసం పరితపించే ఎందరో కరుణామూర్తుల్ని దివిసీమ పునర్నిర్మాణ సమయంలో నేను చూశాను. అవన్నీ గొప్ప జ్ఞాపకాలని భావిస్తాను. ప్రతీ ఒక్కటి నాకళ్లముందు ఇంకా మెదుల్తూనే ఉన్నాయి.

దివిసీమ పునర్నిర్మాణ ప్రభావశీలురైన మహనీయులను మరిచిపోవటం కృతజ్ఞతారాహిత్యం అవుతుంది.

ఆదిత్య హృదయంలో సూర్యభగవానుణ్ణి కృతఘ్నఘ్నాయ" అని వర్ణన ఉంది. కృతఘ్నుల్ని నాశనం చేసే స్వామికి నమస్కారం అంటుంది. మీరు గనక కృతజ్ఞతగా మెలిగితే, నేను మిమ్మల్ని మరింతగా అనుగ్రహిస్తాను" అని అల్లాహ్ అన్నట్టు దివ్య ఖురాన్ చెప్తుంది. కృతజ్ఞతాభావం అనేది మన పాపాల్ని కడిగేసి, మనల్ని పవిత్రీక

రిస్తుంది" అని బైబుల్ చెప్తుంది. కృతజ్ఞత అనేది మనిషికి ఒక ప్రాథమిక లక్షణంగా ఉండాలి.

దివిసీమ పునర్నిర్మాణ ప్రభావశీలురికి కృతజ్ఞతలు చెప్పకపోతే నేనుకూడా కృతఘ్నుడిగా పాపాన్ని మూట గట్టుకొన్నట్టే అవుతుందని ఎప్పటినుండో పదేపదే నా మనసులో తొలుస్తూ ఉంది. అయితే కృతజ్ఞతలు ఏ విధంగా తెలపాలి...?

నేను అర్పించదలచిన కృతజ్ఞతలు మరెందరో మానవతావాదులకు ప్రేరణ కలిగించేవిగానూ, స్ఫూర్తి నింపేవిగానూ, ఉత్తేజితుల్ని చేసేవిగానూ ఉండాలని భావించాను. వారి సేవానిరతి ప్రపంచానికి ఒక మార్గదర్శనం చేసేదిగా ఉండాలి... వారి మానవతా దృక్పథాన్ని మన సమాజం అందిపుచ్చుకుని అక్షరాలా అదే మార్గాన సాగాలి... అని భావించాను.

ఈ 'ఆపద్బాంధవులు' పుస్తకంలో నేను ప్రస్తావించిన ప్రముఖులలో ఒకరిద్దరు తప్ప మిగతా వారెవరూ సజీవులుగా నేడు మన కళ్లముందు లేరు. ఈ పుస్తకం వారు చూసే అవకాశం కూడా లేదు. వారిపట్ల కృతజ్ఞత చెప్పుకోవటం అనేది కేవలం మాటలకు పరిమితం కాకూడదు. వారి స్ఫూర్తిని అణువణువునా జీర్ణించుకోవలసి ఉంది. పదేపదే స్మరించాలి కూడా! ఆ సంస్మరణే నలబై యేళ్ల తరువాత ఈ పుస్తకం ద్వారా చేసే అవకాశం నాకు కలిగింది.

ప్రాణాలు ధారపోసినా తీరనంత ఋణగ్రస్థుల్ని చేసేంతగా మనకు సేవలందించిన వారికి శాశ్వతంగా ఋణపడి ఉంటాం మనమంతా! హనుమంతుడు అలాంటి మహోపకారం చేశాడని రాముడు తన కృతజ్ఞతలు చెప్తూ పట్టాభిషేకం అనంతరం ఇలా అంటాడు"

"మదంగే జీర్ణతాం యాతు యత్త్వయోపకృతం కపే/ నర: ప్రత్యుపకారాణా మాపత్స్వాయాతి పాత్రతాం" అని! మనం ఆపదలలో ఉండగా ఎవరైనా మిత్రుడు ఉపకారం చేస్తే తరువాతికాలంలో ఆ మిత్రుడికి ప్రత్యుపకారం చెయ్యాలనుకుంటాం. కానీ ఆ మిత్రుడికి ఆపద వచ్చినప్పుడు కదా మనం ప్రత్యుపకారం చేయగలిగేది.? "కాబట్టి హనుమా! నీకు నేను ప్రత్యుపకారం చెయ్యాలని కోరుకోను. నీ ఋణం తీర్చుకోవటానికి నీకు ఆపదలు కలగాలని కలలో కూడా అనుకోలేను. అందుచేత నువ్వు చేసిన మహోపకారాలన్నీ నాలోనే జీర్ణమైపోతాయి అంటాడు రాముడు.

అవును! దివిసీమ వాసులు ఆపద్బాంధవుల మానవతా స్ఫూర్తి నరనరానా జీర్ణించుకుని సదా కృతజ్ఞతాభరులై జీవిస్తున్నారు.

మనుషుల్లో నిస్వార్థ పరాయణత అనేది ఇంకా మిగిలి ఉన్నదని దివిసీమ ఉప్పెన అనంతరం జరిగిన పునర్నిర్మాణ కార్యక్రమాలు నిరూపించాయి. మనిషి లోపల అంతర్గతంగా నిబిడీకృత దైవగుణాలైన నిస్వార్థత, సేవా నిరతి, ఆదరణ, దృఢసంకల్పం, మనోధైర్యాలను వెలికి తెచ్చి పురోగమనానికి బాటలు వేసింది.

ఎందరో మహానుభావులు... సేవకు ప్రతిరూపాలు... వారందరితోనూ కలిసి పనిచేసే అదృష్టం నాకు కలిగింది. ఎన్నో అనుభూతులు, ఎన్నో అనుబంధాలు, ఎన్నో అనుభవాలు... 40 యేళ్ల తరువాత ఆజ్ఞాపకాలు నేటికీ ఉత్తేజదాయకంగా ఉన్నాయి.

వాటిని నేటి తరంతో ఇలా పంచుకోవటం ద్వారా ప్రతీ ఒక్కరినీ అవి ఉత్తేజపరుస్తాయని నమ్ముతున్నాను. ఈ "ఆపద్బాంధవులు" గ్రంథంలో 40 యేళ్లనాటి దివిసీమ ఉప్పెన అనంతరం పునర్నిర్మాణం జరిగిన తీరునీ, జరగటానికి కారకులైన మహనీయుల మహోన్నత కృషిని, ప్రధానంగా ప్రపంచాన్ని ప్రభావితం చేసిన జాతీయ, అంతర్జాతీయ ప్రముఖుల సేవా నిరతినీ ప్రస్తావించటం జరిగింది. ఇది నా మొదటి పుష్పాంజలి మాత్రమే! ఇంకా ఎందరో మూర్తిమంతులు దివిసీమ పునర్నిర్మాణంలో విలువైన కాలాన్ని, ధనాన్ని, జీవితాన్ని అంకితం చేసిన వారున్నారు. వారందరి సేవల వివరాలను మరో సంపుటంలో అందించే ప్రయత్నం చేస్తాను. త్యాగశీలతకు, సేవానిరతికి పట్టంగట్టి, ఎందరినో కార్యోన్ముఖుల్ని, సేవా కార్యక్రమాల్లో భాగస్వాముల్ని చేయటానికి కృషిచేసిన ఆనాటి ఆ మహోన్నతమూర్తుల్ని ఈ విధంగా సంస్మరించుకునే అవకాశం కల్పించుకున్నాను.

వాస్తవానికి ఈ గ్రంథాన్ని మా నాన్నగారే వ్రాసి ఉండాల్సింది. కానీ, సమయాభావం కారణంగా వారు వ్రాయలేకపోయారు. ఆ మహానుభావుల మానవీయ విలువలు అంది పుచ్చుకోవటం, మానవసేవే మాధవసేవ అని ప్రబోధించిన వివిధ మత పెద్దల స్ఫూర్తిని మన హృదయాల్లో నింపుకోవటానికి ఈ గ్రంథం ఉపయోగ పడ్తుందని ఆశిస్తున్నాను.

దివిసీమ ఉప్పెన అనంతరం జరిగిన నిర్మాణ కార్యక్రమాలలో భాగస్వాములైన ఆపద్బాంధవులందరి దివ్యస్మృతికి నీరాజనంగా ఈ గ్రంథాన్ని అర్పిస్తున్నాను.

"కృతజ్ఞత" ఈ పుస్తకానికి మరోపేరని సవినయంగా మనవి చేస్తున్నాను.





# ఆచార్య వినోబా భావే

గాంధీ మహాత్ముని సత్యాగ్రహ సిద్ధాంతానికి ఒక ఆకృతి కల్పిస్తే ఆ ఆకృతి వినోబాభావే రూపంలో కనిపిస్తుంది. వినాయక నరహరి వినోబా భావే అనే మహనీయుడు అహింసతో కరకురాతి గుండెల్లో కూడా కరుణరసాన్ని, ఆర్ద్రతను స్రవింపచేయవచ్చని నిరూపించిన గాంధేయవాది. అహింస, మానవతావిలువలు అనేవి ఆయనకు రెండుకళ్లు.

భూదానోద్యమం అనగానే ప్రపంచవ్యాప్తంగా స్ఫురణకు వచ్చే ఒకే ఒక పేరు వినోబాభావే గారిదే! మహాత్ముడికి ఆధ్యాత్మిక వారసుడిగా వినోబాను దేశీయులు గుర్తించి గౌరవించారు.

దేశ స్వాతంత్ర్య పోరాటానికి సమాంతరంగా నడిచిన భూదానోద్యమం ద్వారానే కాకుండా ఆచార్య వినోబాజీతో దివిసీమకు ప్రత్యేకమైన అనుబంధం ఉంది.

1977 దివిసీమ పెను ఉప్పెన సమయంలో దేశవ్యాప్తంగా గాంధేయ నిర్మాణ కార్యకర్తలు సహాయ పునరావాస కార్యక్రమాల్లో పాలుపంచుకోవటానికి వినోబాజీ ఇచ్చిన పిలుపే కారణం.

ఆయన స్వయంగా వడికిన వస్త్రాన్ని, దానితో పాటు తన వంతుగా ఒక రూపాయి విరాళాన్నీ ఇచ్చి ప్రభాకర్'జీని సహాయ పునరావాస కార్యక్రమాలను పర్యవేక్షించవలసిందిగా 25-11-1977న పంపించారు వినోబా. దేశ వ్యాప్తంగా ఉన్న గాంధేయ నిర్మాణ కార్యకర్తలను ఆ మేరకు ఆదేశించారు కూడా!

ఆచార్య వినోబాభావే మౌలికంగా విద్యావేత్త. తత్వవేత్త. సాహితీవేత్త కూడా! ఆయన బహుభాషా పండితుడు. సంస్కృతంతోపాటు మరాఠీ, గుజరాతీ, హిందీ ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో రచనలు చేశారు. భగవద్గీతను మరాఠీలోకి అనువదించారు. భగవద్గీత ప్రభావం ఆయన పైన ఎంతగానో ఉంది. నా "జీవితానికి భగవద్గీత ఊపిరి" అని ఆయన ఎన్నోసార్లు ప్రకటించారు.

1895 సెప్టెంబరు 11న మహారాష్ట్రలోని గాగోదా గ్రామంలో జన్మించిన వినోబా తన 21వ యేట 1916లో మహాత్మాగాంధీ చెంతకు సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళారు. అదే ఆయన జీవితాన్ని పెద్ద మలుపు తిప్పింది. అంతకు ముందు హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసుకోవాలా లేక బెంగాల్ వెళ్ళి విప్లవకారులతో చేతులు కలపాలా అని మానసిక సంఘర్షణతో సతమతమవుతున్న సమయంలో యువ వినోబాగారికి బాపూ సందర్శనమయింది. "భగవంతుడు నన్ను గాంధీజీ దగ్గరకు చేర్చాడు. వారిలో నాకు కేవలం హిమాలయాల శాంతి మాత్రమే కాక, బెంగాల్ దేశానికి ప్రత్యేకమైన ఉజ్జ్వల దేశభక్తి కూడా లభించింది. నా రెండు కోరికలు ఫలించాయ"ని భావేజీ చెప్పుకున్నారు.

గాంధీజీ 1940 అక్టోబరులో వినోబాజీతో ప్రథమ పరిచయం ప్రపంచానికి కలిగించారు. వ్యక్తి సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించదలచిన గాంధీజీ ప్రథమ సత్యాగ్రహిగా వినోబాని ఎంచుకున్నారు. ద్వితీయ సత్యాగ్రహి జవహర్ లాల్ నెహ్రూ. ది. 5-10-1940న దేశానికి, ప్రపంచానికి వినోబాని పరిచయం చేస్తూ గాంధీజీ సుదీర్ఘమైన ప్రకటన చేశారు. అందులో వినోబా ఔన్నత్యాన్ని గాంధీజీ కళ్ళకు కట్టినట్లుగా వివరించారు.

ఆ విధంగా వినోబాపై గాంధీ ప్రభావం ప్రసరించి గాంధీజీ ఆధ్యాత్మిక వారసుడిగా ఆయన ప్రసిద్ధి కెక్కారు. "కలియుగే వినోబా"గా గాంధీజీ ఆయనను సంబోధించారంటే, ఆయన ఉన్నతిని అర్థం చేసుకోవచ్చు..

వినోబా పేరు చెప్పగానే ఎవరికైనా ముందు స్ఫురించేది భూదానోద్యమం. భూదానోద్యమానికి అంకురార్పణ తెలుగునాట జరగటం విశేషం.

హైదరాబాద్ సమీపాన గల శివరామపల్లిలో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో పాల్గొనడానికి వచ్చిన వినోబా తెలంగాణలో ఏర్పడిన అశాంతి నివారణార్థం శ్రీరామనవమి పర్వదినాన (15-04-51) తెలంగాణ పాదయాత్ర ప్రారంభించారు.

18వ తేదీన పోచంపల్లి చేరారు. అక్కడ ఒక అపూర్వ సంఘటన జరిగింది. పోచంపల్లి హరిజనులు "మాకు పని కావాలి. మాకు కొంచెం భూమి ఇప్పించారంటే దాని మీద కష్టం చేసుకొని మా పొట్ట మేము పోషించుకుంటాం" అని వినోబాని ప్రార్థించారు. ఆ సాయంకాలం జరిగిన ప్రార్థనా సభలో వినోబా "సోదరులారా! మీలో ఎవరైనా ఈ హరిజన సోదరులకు సహాయపడగలరా?" అని యాదాలాపంగా అడిగారు. ఆశ్చర్యంగా సభికుల్లోంచి శ్రీ వెదిరే రామచంద్రారెడ్డి అనే భూస్వామి లేచి వంద ఎకరాల భూమిని దానం ఇవ్వడానికి ముందుకు వచ్చాడు. భగవత్ సంకల్పమా అన్నట్లు ఆ సంఘటన జరిగింది. భూదానోద్యమానికి నాందీవాచకం పోచంపల్లిలో జరిగింది.

ఆ రోజు నుంచి ఊరూరికి పాదయాత్ర చేసి వినోబా పేదల కోసం భూమి అడగటం ప్రారంభించారు.

పదమూడు సంవత్సరాల పాటు భారతదేశం నలుమూలలా 36, 500 మైళ్ళు పాదయాత్ర చేసి 44 లక్షల ఎకరాల నేలను దానం పొందారు. అలాగే 1,60,000 గ్రామాలు గ్రామదానంగా ఆయనకు లభించాయి. ఈ భూదాన గ్రామదానోద్యమాల విలువ అంకెలను బట్టి ఉండదు. పండిట్ నెహ్రూ చెప్పినట్లు "అసలు గొప్పతనమనేది ఎకరాల సంఖ్యలో కాదు, ప్రజలలో ఉత్పన్నమవుతున్న నూతన భావన, నవీన తేజస్సుని బట్టి అంటుంది".

అమెరికా రాయబారి శ్రీ ఎల్.ఎస్. వర్త్ బింకర్ "భూదానోద్యమం వికాసం భారతదేశపు ధూళి దూసరిత గ్రామీణ క్షేత్రాల్లోనే జరిగినా వినోబా యొక్క తత్త్వజ్ఞాన ప్రభావం మాత్రం అంతర్జాతీయ క్షేత్రంలో బహుదూరగామి అవుతుంద"ని అన్నదాంట్లో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. "ఇరవయ్యో శతాబ్దంలో భారతదేశానికి చెందిన ఒక సాధువు కనీసం ఒక హద్దు వరకు చరిత్రని ప్రభావితం చేయటం పట్ల ప్రసిద్ధ గ్రంథకర్త "అర్షద్ కోర్ట్స్" ఆనందభరితుడయ్యారు.

వినోబాజీ పదహారు దేశ, విదేశీ భాషల్లో నిష్ణాతులు. వేదాలు, ఉపనిషత్తులు, ఇతర సంస్కృత ధర్మ గ్రంథాలు అధ్యయనం చేసి అపార పాండిత్యాన్ని గడించారు. అపర జ్ఞానసంపన్నుడాయన. ధార్మిక, ఆధ్యాత్మిక విషయాలకే కాకుండా దేశ సమస్యలను గమనిస్తూ వాటి పరిష్కారానికి మార్గాలు చూపేవారు. "నేను నా జీవితంలో చేసిన పనులన్నిటికీ ముఖ్యోద్దేశం హృదయాలను కలపడమే" అని అన్నారు వినోబా. ఆయన రచించిన వివిధ గ్రంథాల సారాంశమిదే. ఆ భావనలోంచి ఉద్భవించిందే ఆయన "జై జగత్" నినాదం.

సత్యం అహింసలపై ఆధారపడిన శ్రమనిష్ఠ స్నేహపూర్ణ సర్వోదయ సమాజం ఏర్పడాలని వినోబాజీ వాంఛించారు. అన్ని తరగతులవారు తమ ఆదాయంలో కొంత "సంపత్తి దానం" చేసి సర్వోదయ సమాజ స్థాపనకు తోడ్పడాలని ఆయన కోరేవారు. మేధావులు, బుద్ధిదానం చేసి తమ సేవలు గ్రామానికి అందిస్తే వారి కుటుంబ పోషణ భారం గ్రామం వహిస్తుందని చెప్పారు. ధనవంతుల వివాహాదుల్లో అధిక వ్యయం తగ్గించి ఒక్కొక్క నుయ్యి చొప్పున త్రవ్వించి "కూలి దానం" చేసి దేశ పురోభివృద్ధికి తోడ్పడాలని కోరారు. నెలకొకరోజు ఉపవాసం చేసి దాని వల్ల మిగిలిన సొమ్ము సంవత్సరానికి ఒక మొత్తంగా ఇచ్చి సేవా కార్యక్రమాలు చేయాలని కోరారు.

నా చిన్నతనంలో తెనాలికి చెందిన ప్రముఖ కంటి వైద్యులు డా. వెంపటి సూర్యనారాయణగారు గ్రామాల వెంట తిరుగుతూ సర్వోదయ ఉద్యమాన్ని ప్రచారం చేస్తుండేవారు. వినోబా రచనలను విక్రయిస్తూ ఉండేవారు. వారు అవనిగడ్డ వచ్చిన సందర్భంలో కొన్ని "గీతా ప్రవచనాలు", "లోకనీతి", "స్త్రీ శక్తి" వంటి వినోబా విరచిత గ్రంథాలను చదివి ఆకర్షితుడైనాను. ఆ తరువాత వినోబా శిష్యురాండ్రు లక్ష్మీ బకన్ పుతీన్, నిర్మలవేద్ మొదలగువారు పాదయాత్ర చేస్తూ వినోబా ఆశయాలను ప్రచారం చేస్తూ అవనిగడ్డ వచ్చారు. చల్లపల్లి నుండి అవనిగడ్డ వరకు వారి పాదయాత్రలో పాల్గొని వారి సందేశాలకు ఉత్తేజితుడనై వినోబా పట్ల మరింత భక్తిప్రపత్తులు పెంచుకున్నాను.

నా చిన్ననాట నుండి వినోబాని కళ్లారా చూడాలి. వారి దర్శనం చేసుకోవాలి అనే తహతహ ఎంతగానో ఉండేది.

1982 జనవరిలో సేవాగ్రామ్ లో బేసిక్ విద్యావిధానంపై జరుగుతున్న సమావేశానికి మమ్మల్ని రమ్మని ప్రముఖ గాంధేయ విద్యావేత్త శ్రీ కె.ఎస్. ఆచార్యగారు ఆహ్వానించారు. నేను, ప్రముఖ పండితులు శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి గారు, మా గాంధీ గురుకుల ప్రధానోపాధ్యాయులు శ్రీ మల్లిశెట్టి రామచంద్రరావుగారు బయలుదేరి సేవాగ్రామ్ వెళ్లాం. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని పవనార్ వెళ్ళి పావనమూర్తి, వినోబాభావేని సందర్శించాలని మా ఆరాటం. ఈ విషయాన్ని గాంధీ మహాత్ముని కోడలు శ్రీమతి నిర్మలా దాసుగాంధీగారికి విన్నవించి మాకు వినోబా దర్శనమయ్యేలా చూడమని కోరాము.

శ్రీమతి నిర్మలాగాంధీ మమ్మల్ని పరిచయం చేస్తూ వినోబాజీకి లేఖ వ్రాసి మా

చేతికి ఇచ్చారు. గుజరాతీ భాషలో వ్రాసిన ఆ లేఖలో అవనిగడ్డ గాంధీక్షేత్రంలో మేము చేస్తున్న సేవా కార్యక్రమాలను ఎంతగానో ప్రశంసిస్తూ వ్రాశారు. సేవాగ్రాం నుంచి ఆటో తీసుకుని పవనార్‌కి బయలుదేరి వెళ్ళాము.

ధామ్‌నది ఉత్తర తీరాన వార్ధా-నాగపూర్ జాతీయ రహదారి మీద, వార్ధా నగరానికి 9 కి.మీ. దూరంలో పవనార్ ఆశ్రమం ఉన్నది. చిన్నకొండ మీద ప్రశాంత ప్రదేశంలో ఉందది. పవనార్ ఆశ్రమ స్థలం ఒకప్పుడు శ్రీ జమునా లాల్ బజాజ్ అవుట్ హౌస్‌గా ఉండేదట. వినోబా అక్కడ ఆశ్రమాన్నేర్పరుచుకొని వ్యవసాయం నిమిత్తం ఆ భూమిని దున్నబోయే సరికి చిన్న దేవాలయం, కొన్ని విగ్రహాలు బయటపడ్డాయి. వాటిలో శ్రీరాముడు వనవాసం నుంచి తిరిగి వచ్చి భరతుని కలిసిన ఘట్టాన్ని చిత్రించిన ఘట్టముంది. దానిలో సీతామాత, లక్ష్మణుడు, ఆంజనేయుడు కూడా ఉన్నారు. మిగిలిన వాటిలో శివపార్వతి, విష్ణు, బుద్ధ, మహావీర, గంగా నదుల విగ్రహాలున్నాయి. 1500 సంవత్సరాల పూర్వం ధామ్‌నదీ తీరాన ప్రవణపూర్ అనే మహానగరముండేదని, ప్రవరసేనుడు అనే రాజు దానిని పరిపాలించేవాడని ఆయన శిల్పకళను ఎంతగానో ఆదరించాడని చెపుతారు. ఆనాటి శిల్పాలే అవి. పవనార్ ఆశ్రమంలో ఆ ప్రాచీన విగ్రహాలతో పాటు ఇప్పుడు క్రీస్తు విగ్రహం, కొరాన్ సూక్తి గల రాయి కూడా ప్రతిష్ఠించబడ్డాయి. ఈ శిల్పాల ద్వారా భిన్న సిద్ధాంతాల సమన్వయాన్ని భగవత్ సంకల్పం తోడుకాగా వినోబా సాధించారు.

పవనార్ ఆశ్రమంలో "బ్రహ్మ విద్యా మందిర్", "పరంధాం ఆశ్రమం" అనే రెండు విభాగాలున్నాయి.

ఆశ్రమ ప్రధాన విభాగమైన బ్రహ్మ విద్యా మందిరంలో మహిళలు ఆధ్యాత్మిక విద్యాభ్యాసం చేస్తారు. బ్రహ్మచర్యాశ్రమాన్ని అవలంబిస్తున్న దాదాపు 30 మంది సోదరీమణులు ఇందులో నివసిస్తున్నారు. పరంధామాశ్రమం పురుషుల విభాగంగా ఉంది. ముద్రణ, ప్రచురణ, గ్రామాభ్యుదయ కార్యక్రమాలు చేస్తూ గోశాలలో వారు పనిచేస్తూ జీవిస్తుంటారు. వారు దాదాపు 6 గంటలు శారీరకశ్రమ చెయ్యాలి. మిగతా సమయంలో పవిత్ర గ్రంథాధ్యయనం, ప్రార్థనలు, ధ్యానంతో గడిపి ఆధ్యాత్మికోన్నతి సాధనకు కృషి చేస్తారు.

వినోబాభావే 1970 సంవత్సరం నుంచి బ్రహ్మ విద్యా మందిరంలోనే స్థిర నివాస మేర్పరుచుకున్నారు. మేము బ్రహ్మవిద్యామందిరంలో అడుగిడేసరికి ఆశ్రమ

వాసినులు విష్ణుసహస్రనామం మృదుమధుర స్వరంతో జపిస్తున్నారు. ఆ వాతావరణం చూచి మమ్ము మేమే మరచిపోయాము. ఆ తరువాత సర్వధర్మ ప్రార్థన గావించారు. "ఓం తత్ సత్ శ్రీ నారాయణాతు, పురుషోత్తమ గురుతూ" అంటూ వినోబా విరచిత సర్వధర్మ ప్రార్థన జరిగింది. ఆ పరమ పవిత్ర వాతావరణంలో మేము ప్రార్థనలో పాలుపంచుకున్నాము.

ప్రార్థన ముగిసిన తరువాత శ్రీమతి నిర్మలాగాంధీగారు వ్రాసిన లేఖను వినోబా కార్యదర్శికి అందజేశాము. ఆమె ఆ లేఖను తీసుకువెళ్ళి వినోబాకి చూపించారు. కాసేపటి తర్వాత మమ్మల్ని లోపలికి పిలిచారు.

బ్రహ్మ తేజస్సుతో ప్రకాశిస్తున్న వృద్ధమూర్తి వినోబాజీ అక్కడ హాలులో ఒక చిన్న వేదికపై ఆసీనులై ఉన్నారు. మేము వారి ముందు వినమ్రతతో నమస్కరించాము. మమ్మల్ని వారి ముందు కూర్చోమని సైగ చేశారు.

వినోబా మాతో తెలుగులో సంభాషణ ప్రారంభించి "ఆంధ్రులు శూరులు గదా!" అని అన్నారు. ఆయన మాటలకు మేము ఆనందించే లోపు ఆయన నవ్వుతూ "ఆరంభ శూరులు" అన్నారు. "అలా కాకుండా ఉండమని దీవించండి" అని అడిగాము. వారు హిందీలో "మరనేతక్ శూర్ బనో, మర్ నే కే బాద్ భీ శూర్ బనో" (మరణించే వరకు శూరులవండి, మరణించిన తరువాత కూడా శూరులవండి) అని సందేశాత్మకంగా అన్నారు.

1977లో ఉప్పెన వచ్చి దివిసీమ తుడిచి పెట్టుకుపోయినప్పుడు వినోబాజీ తాను వడికిన వస్త్రాన్ని, ఒక రూపాయి విరాళాన్ని ఇచ్చి ప్రభాకర్‌జీగార్ని సహాయ కార్యక్రమాలు నిర్వహించమని పంపిన. ఆ విషయం వినోబాజీకి గుర్తుచేసి దివిసీమ పునర్నిర్మాణ కార్యక్రమాలపై మేము చేస్తున్న సేవా కార్యక్రమాలను వివరిస్తూ తెలుగులో వ్రాసిన ఒక నోట్ వారికిచ్చాను. వారు దానిని శ్రద్ధగా చదివారు.

గాంధీక్షేత్రం-సేవాశ్రమాలకు తమ దీవెనలు ఇమ్మని ప్రార్థించాము. వారు ఆశ్రమం లెటర్ పాడ్ మీద "గాంధీక్షేత్రం ఔర్ సేవాశ్రం, అవనిగడ్డ (కృష్ణాజిల్లా), ఆంధ్రా కే సింహే బాబాకి శుభ కామన, రామ హరి, 23-1-1982" అని వ్రాసి ఇచ్చారు.

ఆ పరమ పవిత్రమూర్తికి ప్రణమిల్లి ఆశీస్సులందుకుని సెలవు తీసుకొని బయటకొచ్చాము. పవనార్ ఆశ్రమాన్ని పరికించి అక్కడ పుస్తక విక్రయశాలలో వినోబా

సాహిత్యాన్ని తీసుకున్నాము. ఆ విధంగా ఈ యుగపు మహర్షి సందర్శనం మాకు లభించింది.

1982 నవంబరు 5వ తేదీ వినోబాజీ హార్ట్ఎటాక్ వచ్చింది. రెండు, మూడు రోజుల్లో ఆరోగ్యం కుదుటబడింది. కానీ 8వ తేదీ నుండి వినోబా జలౌషధ పరిత్యాగ నిర్ణయం తీసుకున్నారు. వినోబా నిర్ణయం దేశాన్ని కలవరపరచింది.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ కూడా వచ్చి వినోబాని నిర్ణయం మార్చుకోమని బ్రతిమలాడింది. సర్వోదయ నాయకులు, సహచరులు వినోబా నిర్ణయాన్ని మార్చలేక పోయారు.

15.11.82 దీపావళి పర్వదినాన ఉదయం 9-30 గంటలకు వినోబా తన 87వ ఏట బ్రహ్మ నిర్యాణం పొందారు.

వినోబా దేహయాత్ర చాలించిన వార్త విన్న వెంటనే అవనిగడ్డలో ఉన్న మా నాన్నగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు (సహకార మంత్రి) వినోబా అంత్యక్రియలలో పాల్గొనే నిమిత్తం వార్ధాకు బయలుదేరారు. వారితో పాటు నేను, సర్వోదయ నాయకులు శ్రీ జయసింహాచారి కూడా వెళ్ళాము.

వార్ధాలో మరునాటి ఉదయం రైలు దిగి అక్కడి గెస్ట్ హౌస్ లో కాలకృత్యాలు తీర్చుకొని కారులో పవనార్ కి బయలుదేరాము.

దారి పొడుగునా వినోబా అంతిమ దర్శనం కోసం కాలినడకన, సైకిళ్లపై విషన్నవదనాలతో అసంఖ్యాకంగా ప్రజలు కదిలి వస్తున్నారు. మహిళలు పిల్లలను ఎత్తుకుని వినోబా తుది దర్శనానికి బారులు తీరి నిలుచున్నారు. వినోబా మృత దేహాన్ని సందర్శించి అంజలి ఘటించి ఆ చెంతనే కూర్చున్నాము.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ తన రష్యా పర్యటనను మధ్యలో నిలుపు చేసి హుటాహుటిన హెలికాప్టర్ లో పవనార్ కి వచ్చారు.

ఆశ్రమవాసులు సర్వమత ప్రార్థనలు నిర్వహించారు. వినోబా విరచిత సర్వధర్మ ప్రార్థనలు గావించారు. తరువాత బైబిలు, ఖురాను, గురుగ్రంథసాహిబ్, బౌద్ధ, జైన సూక్తులు చదివారు. ఋగ్వేదం నుంచి అగ్నిసూత్రం పఠించారు.

ఉదయం 10.55 గంటలకు వినోబా దేహమున్న పూల పల్లకిని ఆశ్రమవాసులు మోసుకుంటూ అగ్నిసంస్కారం చేసే చోటికి బయలుదేరారు. ఆ పూలపల్లకీ ముందు మేము నడక సాగించాము. విషాద గంభీర వాతావరణం అలుముకుంది.

ఆశ్రమానికి కొద్ది దూరంలో ధామ్‌నది ఒడ్డున పేర్చిన చితిపై వినోబా దేహాన్నుంచారు. శ్రీమతి ఇందిరాగాంధీ మొదలగువారు కట్టెలను వినోబాజీ భౌతికదేహం పైన ఉంచారు.. దాదాపు 50 సంవత్సరాల పాటు వినోబా అనుచరులుగా ఉన్న వృద్ధమూర్తి శ్రీమతి మహాదేవి చితికి నిప్పంటించారు. స్త్రీలు, పురుషులు సమానులే అని విశ్వసించిన వినోబా కోరిక ఆ విధంగా తీర్చబడింది. అగ్నిజ్వాలలు నింగినంటాయి. లక్షలాది ప్రజానీకం జోహార్లు మిన్నంటాయి.

శ్రీమతి ఇందిరాగాంధీ విచార వదనంతో మౌన ముద్రాధారిణియై ఒక చెట్టు క్రింద ఒంటరిగా విచారంగా నిలుచున్న దృశ్యం ఇప్పటికీ నా కనులకు కట్టుతుంది.

దహన సంస్కారం పూర్తయిన పిమ్మట ఆశ్రమంలో అడుగిడితే ఆ ప్రదేశం బోసిపోయినట్లు కనిపించింది. వినోబా సోదరుడు శివాజీ భావే, వృద్ధ సర్వోదయ నాయకుడు శ్రీ దాదా ధర్మాధికారి ఆశ్రమవాసులకు ధైర్యం చెపుతూ కనిపించారు. వినోబాజీ ఆంధ్రప్రదేశ్ లో అత్యంత ఆప్తులైన డా. వెంపటి సూర్యనారాయణ దంపతులు కూడా అంత్యక్రియలకు హాజరయ్యారు.

భారతదేశ చరిత్రలో అత్యున్నత శిఖరాల నందుకున్న ఆయన బోధనలు నేటికీ, ఏనాటికైనా ఆచరణీయాలు. ప్రపంచ చరిత్రలో ఆయన సామ్య యోగిగా చిరస్మరణీయులు. ఆయన బోధనలను నేటి సమాజం మనసా, వాచా, కర్మణా ఆచరించ గలిగినట్లయితే మరల మనం పూర్వ వైభవ స్థితికి చేరుకోగలుగుతాం.

దివిసీమ పునర్నిర్మాణం కోసం దేశ వ్యాప్తంగా ఉన్న గాంధేయవాదులు, నిర్మాణ కార్యకర్తలు నడుం కట్టడానికి ప్రధానకారకులు వినోబాజీ.

కేవలం తక్షణ సహాయచర్యలతో సరిపెట్టకుండా, బాధితులకు తమ బాధలు మరిచేలా వారిని పునరుజ్జీవితుల్ని చేయాల్సిన బాధ్యత తీసుకోవాలనే ఆలోచన కలిగించిన వారు వినోబాభావే. దాన్ని తక్షణం ఆచరణలోకి తెచ్చినవారు ప్రభాకర్‌జీ వంటి సర్వోదయ కార్యకర్తలు.

ఆమార్గానే సమస్త సేవాబృందాలు తమతమ కులమతభేదాలను మరిచి పునర్నిర్మాణ కార్యక్రమంలో భాగస్వామ్యం కావడమే ముఖ్య విషయం!





ఆచార్య వినోబాబావే అంతిమయాత్రలో శ్రీ మండలి వెంకట కృష్ణారావు. శ్రీ బుద్ధప్రసాద్



# డా॥ బిల్లీగ్రాహం

"నేను భారతదేశాన్ని అనేక సార్లు పర్యటించాను. నాకు భారతదేశం అన్నా భారత ప్రజలన్నా చాలా ప్రేమ. ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలో 1977 ఉప్పెన కారణంగా భీకర విధ్వంసం జరిగినప్పుడు నా మనసు కలచి వేసింది. నేను వెంటనే వెళ్లి ఉప్పెన ప్రాంతాల్ని సందర్శించాను. నా జీవితంలో మరచిపోలేని భయంకర విధ్వంసం అది. ఇంత జరిగినా కృంగిపోకుండా అక్కడ నిలిచిన బాధితులతో నేను మాట్లాడినప్పుడు వాళ్లు ప్రదర్శించిన మనోధైర్యం నన్ను చాలా ప్రభావితుణ్ణి చేసింది. వాళ్లు ఆ నేలమీదే అక్కడే తమ జీవితాలను పునర్నిర్మించుకోవాలని కోరుకున్నారు ఇంతటి మనో నిబ్బరాన్ని నేనెక్కడా చూడలేదు" అన్నారు క్రీస్తుసందేశ ప్రచారకుడుగా ప్రపంచ ప్రఖ్యాతి పొందిన శ్రీ బిల్లీ గ్రాహం.

40 యేళ్లక్రితం దివిసీమ ఉప్పెన జనజీవితాన్ని ఛిన్నాభిన్నం చేసిన దృశ్యాల్ని స్వయంగా దివిసీమకు వచ్చి సందర్శించి, బైట ప్రపంచానికి తెలియజేసి, దివిసీమ పునర్నిర్మాణానికి ప్రపంచవ్యాప్తంగా సాయం అందటానికి ప్రధాన కారకుడు శ్రీ బిల్లీగ్రాహం గారు.

"నేను అమెరికా తిరిగి వెళ్లాక ఆ విధ్వంసానికి సంబంధించిన దృశ్యాల్ని చూపించి, బాధితులు పడ్తున్న అవస్థల్ని అమెరికన్ క్రైస్తవ సమాజానికి వివరించాను. వేలాదిమంది అమెరికన్ దాతల కారణంగానే "బిల్లీ గ్రాహం నగర్ నిర్మాణం" అనే కల నెరవేరింది. మన స్నేహానురాగాల్లో వాళ్లంతా భాగస్వాములయ్యారు. సంతోషకరమైన

ఈ రోజున అలసట ఎరుగకుండా కృషిచేసి విజయాన్ని సాధించిన మీ అందరికీ ధన్యవాదాలు. ముఖ్యంగా నిర్మాణ సారధ్యం వహించిన కమిటీ వారికి నా అభివాదాలు' అని సందేశంలో పేర్కొన్నారు. భవిష్యత్తులో ఒకరోజున తప్పకుండా అక్కడికి వస్తానని వాగ్దానం చేశారు.

బిల్లీగ్రాహం ప్రపంచ ప్రసిద్ధి పొందిన క్రైస్తవ మతప్రచారకుడు. క్రీస్తు సువార్త సందేశ వ్యాపకుడాయన. దివిసీమ ఉప్పెన సమయంలో రెవ. డా. సిహెచ్ దేవానంద రావుగారు రాష్ట్ర పర్యాటక, క్రీడల, గ్రంథాలయ శాఖామాత్యులుగా ఉండేవారు. విద్యాశాఖ మంత్రిగా ఉన్న మా నాన్నగారు, దేవానందరావుగారూ మంచి సన్నిహితులు. ఆయన క్రీస్తు సువార్త ఉత్సవ కమిటీ ఉపాధ్యక్షులు కూడా!

ఫిలిప్పైన్స్ నుండి బిల్లీ ఇండియా వచ్చినప్పుడు. ఆయనకు భారత రాష్ట్రపతి స్వయంగా స్వాగతం పలికారు.

దివిసీమ ఉప్పెన ఉదంతం జరిగిన సమయంఅది నీలం సంజీవరెడ్డిగారు రాష్ట్రపతి ఉప్పెన బాధితులకోసం ఆయన సహాయాన్ని అర్థించారు. బిల్లీ వెంటనే హైదరాబాద్ వచ్చారు.

ముఖ్యమంత్రి సహకారంతో 8 డిసెంబర్, 1977 భారతీయ వైమానిక దళానికి చెందిన ప్రత్యేక విమానంలో బిల్ గ్రాహంగారి బృందాన్ని గన్నవరం విమానాశ్రయానికి తోడ్కొని వచ్చారు. అక్కడి నుండి ప్రత్యేక హెలికాప్టర్లో దివిసీమ ఉప్పెన ప్రభావిత ప్రాంతాల సందర్శనకు తీసుకువెళ్లారు. మా నాన్నగారు బిల్ గ్రాహం బృందానికి స్వాగతం పలికారు.

బిల్ గ్రాహం గారితో పాటుగా రెవ. డా. వాల్టర్ స్మిత్, ఇంకా అనేకమంది ఫోటోగ్రాఫర్లు, ఫిల్మ్ మేకర్లు, విదేశీ ఛానల్ల వాళ్లూ ఉన్నారు. నిజానికి గ్రాహంగారి వెంటవచ్చిన ఈ బృందం తీసిన చిత్రాలే దివిసీమ ఉప్పెన కలిగించిన బీభత్సాన్ని బయట ప్రపంచానికి తెలియచేశాయి.

మా నాన్న గారు అన్నింటికన్నా ఎక్కువగా దెబ్బతిన్న సొర్లగొంది, గొల్లపాలెం గ్రామాలకు గ్రాహం బృందాన్ని తీసుకువెళ్లారు. గ్రాహం అక్కడి ప్రజల్ని అక్కున చేర్చుకుని ఓదార్చారు. వాళ్లు చెప్పుకున్నదంతా శ్రద్ధగా విన్నారు.

అప్పటికీ వందలాది మృతకళేబరాల్ని ఇంకా తొలగిస్తూనే ఉన్నారు. ఆ శవాల మధ్యనుండి, శిథిలాల మధ్య నుండి ఆయన ఆ ప్రాంతాన్నంతా పర్యవేక్షించారు.

ఇక్కడ వీళ్లకు ఆరోగ్యదాయకమైన వసతులు కల్పించకపోతే మిగిలినవాళ్లు కూడా బతకలేరనే భావన ఆయనకు కలిగింది. ఇంత పెద్ద విపత్తు తానెప్పుడూ చూడలేదన్నా డాయన. మా మనసు తల్లడిల్లిపోతోందని బాధపడ్డాడు. మృత్యులోయలో విహరిస్తు న్నట్టనిపించింది! ఆ కుళ్ళిన శవాల్ని, బంధువుల రోదనల్నీ చూస్తుంటే నా భావోద్వేగాల్ని ఆపుకోలేకపోతున్నాను. మాటల్లో చెప్పలేని దుఃఖం కలుగుతోంది..." అంటూ బాధితులకు సహానుభూతిని అందించారు.

తాను వ్యవస్థాపించిన "బిల్లీ గ్రాహం ఇవాంజెలిస్టిక్ అసోసియేషన్ అత్యవసర ప్రపంచ నిధి" నుండి లక్ష డాలర్ల తక్షణ సహాయాన్ని ప్రకటించారు. స్థానిక క్రైస్తవ సంఘాలు, కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు ఈ నిధిని వెచ్చిస్తాయని ప్రకటించారు. ఇందుకోసం ఆర్చిబిషప్ డా. ఎస్ అరులప్పగారు, మంత్రి డా. సిహెచ్. దేవానందరావుగారు, మా నాన్నగారు వీళ్లతో ఒక కమిటీని అప్పటికప్పుడు ఏర్పరచారు.

మా నాన్నగారు బిల్లీ గ్రాహంగారితో మాట్లాడుతూ, "మా తెలుగు భాషలో గ్రాము అంటే ఊరు. మీరు ఒక గ్రామాన్ని దత్తత తీసుకోండి గ్రాహమ్ గారూ, ఆ గ్రామాన్ని మీ పేరుతో 'బిల్లీ గ్రాహమ్ నగర్" అని పిలుచుకుంటాం అన్నారు. ఆ ప్రతిపాదనకు వెంటనే సానుకూలంగా ప్రతిస్పందించారు గ్రాహం.

గణపేశ్వరం, ఇసుకరేవు మాలపల్లి గ్రామాలను దత్తత తీసుకున్నారు. ఇళ్ల నిర్మాణం నిమిత్తం తక్షణం ఇంటికి 10,000 రూపాయల చొప్పున 20 ఇళ్ల నిర్మాణం కోసం 2 లక్షల రూపాయల నిధిని, తుపాను పీడిత ప్రాంతాల్లో దెబ్బతిన్న 20 చర్చిల రిపేరు నిమిత్తం 2 లక్షల రూపాయల్ని అందించారు.

కమిటీ వారు కూర్చుని 285 ఇళ్ల నిర్మాణం చేపట్టాలని నిర్ణయించారు. ముఖ్యమంత్రి ప్రతి ఇంటి నిర్మాణానికి 2,500 రూపాయలను ముఖ్యమంత్రి సహాయ నిధి నుండి ఇవ్వటానికి అంగీకరించారు. లబ్దిదారులైన బాధితులు శ్రమదానం ద్వారా మిగతా ఖర్చును పూడ్చటానికి అంగీకరించారు.

బిల్లీ గ్రాహం నగర్'కు ఆర్చిబిషప్ డా. అరులప్పగారు 1978, ఏప్రియల్ 21వ తేదీన శంకుస్థాపన చేశారు. నాలుగు నెలల కాలంలోనే ఏప్రియల్ 21 నాటికి 40 ఇళ్లు పూర్తయ్యాయి.

బిల్లీ గ్రాహం సంస్థ కార్యవర్గం బిల్లీ గ్రాహం నగర్ వ్యవస్థాపనకు అంగీకరించ టానికి కావలసిన సమాచారంతో అమెరికాలో దేవానందరావుగారు, ఆయన సతీమణి విశేష కృషి చేశారు.

మంత్రి దేవానందరావుగారు దివిసీమలోని బోడగుంట గ్రామంలో జన్మించారు. ఆయన కూడా దివిదీపాలలో ఒకరు. కానీ సికిందరాబాదులో స్థిరపడ్డారు. ఆంధ్రప్రదేశ్ క్రిస్టియన్ రిలీఫ్ & రిహాబిలిటేషన్ కమిటీ కార్యదర్శి శాంసన్ రామకృష్ణయ్య గారు బిల్లీ గ్రాహం నగర్ నిర్మాణానికి అందించిన సహకారం గొప్పది.

రామకృష్ణయ్యగారి భార్య పద్మా శాంసన్ గారు నేను చదువుకున్న న్యూ గవర్నమెంట్ కాలేజీలో ఇంగ్లీషు లెక్చెరర్‌గా ఉండేవారు. వారి కుటుంబంతో మొదటి నుండీ నాకు అనుబంధం ఉంది.

ఆర్చి బిషప్ అరులప్పగారు, మా నాన్నగారు మంచి స్నేహితులు. మదర్ తెరిసా నోబెల్ బహుమతి పొందిన తరువాత తొలిసారిగా హైదరాబాద్ వచ్చినప్పుడు అరులప్పగారి ఇంట్లోనే బస చేశారు. నేనూ మా నాన్నగారూ వారింట్లోనే మదర్‌ని కలుసుకునే అవకాశం కలిగించారాయన.

ఈ 285 ఇళ్ల నిర్మాణం మరియు 21 చర్చిల మరమ్మత్తు ప్రాజెక్టు నిర్వహిస్తున్న తీరు అధ్యయనం చేయటానికి బిల్లీ గ్రాహంగారి ప్రతినిధి రెవ. వాల్టర్ క్రిస్ట్ గారిని నియమించారు. 1978, జూలై 25న క్రీస్టుగారు నిర్మాణ పనులు జరిగే స్థావరానికి వచ్చి చూశారు. ఎంతో సంతృప్తి చెందిన క్రీస్ట్ గారు బోర్డ్ ఉపాధ్యక్షులు డా. వాల్టర్ స్మిత్ గారికి పూర్తి అనుకూల నివేదికని చాలా వివరణాత్మకంగా అందించారు. బోర్డువారిని అంగీకరింపచేయటానికి ఈ నివేదిక ఎంతగానో తోడ్పడింది.

కమిటీ వారు రెండవ విడతగా 120 ఇళ్ల నిర్మాణాన్ని ప్రారంభించారు. 22 మార్చి, 1979న వాల్టర్ స్మిత్ దంపతులు, రెవ డా. ఆర్ ఆర్ కున్విల్లె మరొకసారి వచ్చి నిర్మాణ పనుల్ని పర్యవేక్షించారు. బిల్లీ గ్రాహంగారి బృందంలో 'జాన్ పొల్లోక్' అనే అధికారిక చరిత్రకారుడు ఉన్నారు. ఆయన డిసెంబర్ 5న వచ్చి మరొకసారి పర్యవేక్షించి వెళ్లారు.

బిల్లీ గ్రాహంగారు అందించిన 32 లక్షల రూపాయలకు అదనంగా ప్రభుత్వము, ఇతరులు ఇచ్చిన మొత్తాలతో అనుకున్న విధంగా ఆ 285 ఇళ్ల నిర్మాణాన్ని, 21 చర్చి భవనాల మరమ్మతుని కమిటీవారు పూర్తి చేశారు. ఇళ్లకు రక్షిత మంచినీటి సరఫరా పనులు మాత్రమే జరుగుతున్నాయి. నిజానికి ఆ సమయంలో సిమెంటు, ఇనుము ధరలు విపరీతంగా పెరగటం వలన ఇళ్ల నిర్మాణ వ్యయం బాగా పెరిగింది. అయినా గ్రాహంగారు ఆ విషయాన్ని అర్థం చేసుకుని ఖర్చులకు తగినట్టుగా నిధులు పెంపుచేశారు.

బిల్లీ గ్రాహం నగర్ ప్రారంభోత్సవానికి గ్రాహంగారు వచ్చేట్లయితే నేనూ వస్తానని భారత దేశాధ్యక్షుడు డా. నీలం సంజీవరెడ్డి అన్నారు. కానీ, గ్రాహంగారికి సమయం సమకూరలేదు. ఉప్పెన బాధితులకు ఇతోధికంగా సాయపడాలని రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు గ్రాహంగారిని అభ్యర్థించటం, వెనువెంటనే గ్రాహంగారు రాష్ట్రానికి రావటం జరిగింది.

ఇంతమంది కలిసి ఎవరి పాత్ర వారు నిర్వహించటం వలనే బిల్లీ గ్రాహం నగర్ నిర్మాణం జయప్రదం అయ్యింది. 29-6-1980న గ్రాహంగారి కుమారుడు ఫ్రాంక్లిన్ గ్రాహంగారు, ఈ "బిల్లీ గ్రాహం నగర్"ని దైవ వికసనానికి అంకితం చేయటానికి ఉపాధ్యక్షులు డా. వాల్టర్ స్మిత్ గారు వచ్చారు. బిల్లీ గ్రాహంగారు తాను రాలేకపోతున్నందుకు విచారం వెలిబుచ్చుతూ సందేశం పంపారు.

50 యేళ్ళపాటు మత ప్రచారకుడిగా అంతర్జాతీయ ఖ్యాతి పొందిన వ్యక్తి బిల్లీ గ్రాహం. ఐసన్ హోవర్, జాన్సన్ నిక్సన్'ల నుంచి బరాక్ ఒబామా వరకూ దాదాపు 12మంది అమెరికన్ అధ్యక్షులకు ఆయన అత్యంత సన్నిహితుడు కూడా! మార్టిన్ లూదర్ కింగ్ జూనియర్'ని అరెస్టు చేసినప్పుడు ఈయనే బెయిలిప్పించి విడిపించాడు.

బిల్లీ గ్రాహం తన ఆత్మకథని "జస్ట్ వాట్ ఐ యామ్" పేరుతో వ్రాసుకున్నారు. అదొక శ్రమజీవుని అధికారపత్రం లాంటిది. బిల్లీగ్రాహం 1950లో దైవప్రచార సంస్థను బిల్లీ గ్రాహం ఇవాంజెలిస్టిక్ అసోసియేషన్ పేరిట వ్యవస్థాపించాడు.

అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుని టెలివిజన్, రేడియో లాంటి ప్రసార సాధనాల ద్వారా క్రైస్తవ సువార్త ప్రచారం చేసిన వారిలో బిల్లీ గ్రాహం అగ్రగణ్యుడు. టెలివాంజెలిస్టుగా వీరికి గొప్ప పేరు. టెలివిజన్ ద్వారా మతప్రచారకుడని 3.2 మిలియన్ల మంది చేత "క్రీస్తు నా రక్షకుడు" అంగీకరింపచేసిన వాడుగా గ్రాహంగారికి గుర్తింపు.

1960లకే ఆయన ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తులు, అత్యున్నతంగా గౌరవించదగిన వ్యక్తుల జాబితాలో ఉన్నారు. అమెరికా అధ్యక్షులకు ఆధ్యాత్మిక సలహాదారుగా, అనేక అంతర్జాతీయ అంశాలు ముఖ్యంగా యుద్ధాలు, ప్రపంచ శాంతి, జాతి వివక్షతలు, సామాజిక ఉన్నతి లాంటి అంశాల మీద ఆయన మాటకు విలువ ఉండేది.

నిజానికి గ్రాహంగారు ప్రెసిడెంట్ నిక్సన్'తో స్నేహం కారణంగా డెమొక్రటిక్ పార్టీలో సభ్యుడుగా చేరారు. కానీ, "క్రీస్తుకు రాజకీయ పార్టీ లేదు" అంటూ సున్నితంగా రాజకీయ అంశాలను తిరస్కరిస్తూ వాటికి దూరంగా ఉండేవారు.

2010 తరువాత వృద్ధాప్యం కారణంగా ఆయన ప్రజా జీవితంలోంచి విరమించుకుని విశ్రాంతి తీసుకోసాగారు. క్రీస్తు సందేశ వ్యాప్తి కోసం ఆయన నెలకొల్పిన సంస్థకు ఆయన కుమారుడు నేతృత్వంలో క్రీస్తుసేవలు కొనసాగుతూనే ఉన్నాయి. కరుణామూర్తిగా, శాంతిదూతగా బిల్లీ గ్రాహం గారి సేవలు చిరస్మరణీయం.

ఒక ఇవాంజలిస్టుగా, ఆధ్యాత్మిక సలహాదారుగా క్రైస్తవమతానికి, సమస్త మానవాళికీ అనుపమానమైన సేవ లందించిన పరమ పవిత్ర బిల్లీగ్రాహంగారు తన 99వ యేట 2018 ఫిబ్రవరి 21న మరణించారన్న వార్త ప్రపంచ ప్రజలను దిగ్భ్రాంతి పరచింది. అమెరికా అధ్యక్షులకు పాస్టరుగా పేరెన్నికగన్న గ్రాహం గారి మృతికి అధ్యక్షులు డోనాల్డ్ జె ట్రంపుగారు తన తీవ్ర విచారాన్ని వెలిబుచ్చారు. ఆయనలాంటి వ్యక్తి మరొకరు లేరని, ఆయనది ప్రత్యేక వ్యక్తిత్వం అనీ ట్రంపుగారు చెప్పిన మాటలు అక్షరసత్యాలు.



ఉప్పెనబాదిత ప్రాంతాల్లో పర్యటిస్తున్న శ్రీ బిల్లిగ్రాహం, శ్రీ దేవానందరావు, శ్రీ మండలి వెంకటకృష్ణారావు



# మదర్ థెరీసా

"దివిసీమ ఉప్పెన బాధితులు నిస్పృహ చెందక, నిందలు వేయక, తమకు వచ్చిన విపత్తును ధైర్యంగా ఎదుర్కొన్నారు. మదర్ థెరిసా దివిసీమ ఉప్పెన బాధిత ప్రాంతాలలో పర్యటించిన తరువాత అన్నమాటలు... ఇవి!

మదర్ థెరీసా ఉప్పెన అనంతరం డిసెంబర్ మొదటివారంలో దివిసీమకు వచ్చి బాధితులను పరామర్శించారు.

ఆమె పర్యవేక్షణలోనే సహాయకచర్యలు నడిచాయి. ఉప్పెన పెను విషాదం జరిగినప్పుడు ఆమె గుజరాతులో ఉన్నారు. కలకత్తా నుండి సిస్టర్సు తరలి రావటానికి వేరే ఏర్పాట్లు చేసి, ఆమె హైదరాబాదు మీదుగా విజయవాడ చేరుకున్నారు.

మదర్ థెరీసా రాకతో ఉప్పెనకు తల్లడిల్లిన ఆ ప్రాంతం అంతా కరుణ రసం ఉప్పొంగింది. క్రైస్తవ సంస్థలు సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనటానికి ఆమె రాక ఎంతగానో ఉపకరించింది. కుళ్లిన స్థితిలో ఉన్న మృతదేహాలను తొలగించే సమయంలో చేపట్టవలసిన చర్యల గురించి ఆమె గతానుభవంతో అనేక సూచనలు చేశారు. అంత్యక్రియలు జరుగుతున్నప్పుడు సిస్టర్స్ అందరూ అక్కడ మోకాళ్ల మీద కూర్చుని ప్రార్థన చేసేవారు. మందపాకల దాని పరిసర గ్రామాలలో మదర్‌థెరిసా పర్యటించి బాధితులను ఓదార్చారు.

'దివిసీమలో ఉప్పెన-తుఫాను బాధితులు నిస్పృహజెందక, నిందలు వేయక తమకు వచ్చిన విపత్తును ధైర్యంగా ఎదుర్కొన్నారని" మదర్ థెరిస్సా ప్రశంస లందించారు.

"పేదలసేవే ఉత్తమసేవ" అని అంటూ ఇళ్లు లేనివారికి ఇళ్లు కట్టి ఇవ్వడంలో, గింజలు పోయినవారికి ఉపాధి చూపడంలో తోడ్పడాలని సేవాసంస్థలకు విజ్ఞప్తి చేశారు.

1979లో మదర్ థెరీసాగారికి నోబుల్ బహుమతి వచ్చిన తరువాత తొలిసారి హైదరాబాదుకు వచ్చి ఆర్చిబిషప్ హౌస్'లో బసచేశారు. ఆర్చి బిషప్ సామినేని అరుళప్ప తమిళనాడులో స్థిరపడిన తెలుగు కుటుంబంలో జన్మించిన వ్యక్తి. రోమన్ కేథలిక్ ఆర్చిడయోసిస్ (హైదరాబాద్) బిషప్ గాఉండేవారు. భారతదేశంలో అత్యధిక కాలం ఆర్చి బిషప్'గా పనిచేసిన వ్యక్తి ఈయనే, 1971 నుండి 2000 వరకు ఆయన ఆ పదవిలో ఉన్నారు. పోప్ పాల్ - నుండి అత్యున్నత పురస్కారం పొందిన తొలి భారతీయుడాయన. ప్రేమించు-సేవించు అనేది ఆయన నినాదం, ఆయన విధానం కూడా.

అరుళప్ప గారు, మా నాన్నగారు మంచి స్నేహితులు. ఆయన మా నాన్నగారికి మదర్ థెరీసాని కలిసేందుకు అప్పాయింట్'మెంట్ ఏర్పాటు చేశారు.

అప్పుడు నాన్నగారితో కలిసి నేను కూడా వెళ్ళాను. ఆర్చిబిషప్ హౌస్'లో క్రింద డ్రాయింగ్ రూములో మమ్మల్ని కూర్చోబెట్టారు. మెట్లమీంచి ధవళ వస్త్రాలతో మదర్ థెరీసా దిగివస్తుంటే, ఒక తెల్లని కాంతిపుంజం నడిచివస్తున్నట్టనిపించింది. సంవత్సరాలు గడిచినా ఆ నాటి ఆ దృశ్యం కళ్లముందు ఇంకా కదలాడుతూనే ఉంది.

ఆమె తిన్నగా మా దగ్గరకొచ్చి ఎంతో ఆప్యాయంగా మమ్మల్ని పలకరించి ఆశీర్వదించారు.

ఆమె దివిసీమ ఉప్పెన సమయంలో ఆ ప్రాంతాలను పర్యటించి, అక్కడ సేవాకార్యక్రమాలను నిర్వహించిన విషయాన్ని మా నాన్నగారు గుర్తుచేశారు. "మీ రాకతో కడలిని మించిన కరుణ ఉప్పొంగి మరుభూమిగా మారిన దివిసీమ ఇప్పుడు కొత్త ఊపిరులు పోసుకుని, జవసత్వాలను పుంజుకుని దివ్యసీమగా మారింది" అని చెప్పారు. అక్కడ జరిగిన పునరావాస కార్యక్రమాలన్నింటినీ నాన్నగారు ఆమెకు వివరించారు. ఆమె సంతోషం వ్యక్తపరచారు.

1979, ఆగష్టు 8, 9 తేదీల్లో కలకత్తాలో జరుగుతున్న ఎ.ఐ.సి.సి. సమావేశాలకు వెళ్లాలని నిర్ణయించుకున్నాం. కలకత్తా వరకూ వెళ్తున్నాం కాబట్టి. ఆ సందర్భంగా మదర్ దర్శనం కోసం అనుమతి కోరుతూ నేను ఉత్తరం వ్రాసాను. 8

ఉదయం కలకత్తా చేరిన వెంటనే మిషనరీస్ ఆఫ్ చారిటీస్ వారికి ఫోన్ చేశాను. వాళ్లు సాయంత్రం 5 గంటలకు ప్రార్థనా కార్యక్రమం ఉంటుంది. ఆ సమయంలో వస్తే అమ్మను కలుసుకోవచ్చని చెప్పారు. 5 గంటలకు ముందే అక్కడ ఉండేలాగా వెళ్లాను. అప్పటికే అనేకమంది విదేశీయులు కూడా అక్కడ ఉన్నారు. అమ్మ మేడమీద ఉన్నారని, అక్కడకు వెళ్లవలసిందిగా కార్యాలయ సిబ్బంది మాకు దారి చూపించారు.

ఆ సమయంలో పై అంతస్థులో ఉన్న పెద్ద హాలులో ప్రార్థనా సమావేశం జరుగుతోంది. దాదాపు వందమంది నీలిరంగు అంచు తెల్లని చీరెలు ధరించిన సిస్టర్స్ ప్రార్థనలు చేస్తున్నారు. వాళ్లలో మదర్ ఉన్నారేమోనని చూశాను. ఒక వృద్ధ స్త్రీని చూసి ఆమే ననుకున్నాను. కానీ, ఆమె కళ్లజోడు పెట్టుకుని ఉంది. మదర్ కళ్ల జోడు పెట్టుకున్న ఫోటోలు నేనెప్పుడూ చూళ్లేదు. అందువలన ఆమె కాదేమో అనుకున్నాను. అక్కడ ఆఫీసు రూములో ఉన్న సిస్టర్ వచ్చి, మదర్ విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆరోగ్యం బాగాలేదు. మాట్లాడటానికి అవకాశంలేదు..." అన్నారు.

"మేము మాట్లాడటానికి రాలేదు...దర్శించుకుని ఆశీస్సులు తీసుకోవటానికి వచ్చాము" అన్నాను.

ఆమె అక్కడున్న బెంచీమీద కూర్చోమని చెప్పి, నా విజిటింగ్ కార్డు తీసుకుని వెళ్లింది. మరో బెంచి మీద ఒక విదేశీ వనిత తన పిల్లలతో వచ్చి కూర్చుంది. ఆమెని చూసి చైనా లేదా జపాన్ నుండి వచ్చి ఉంటుందని అనుకున్నాను.

ఇంతదూరం వచ్చాము-అమ్మను కలుసుకోగలనా లేదా అని నాకు ఆందోళన కలిగింది. ఆమెను కలుసుకోకుండా వెళ్లటానికి మనసు అంగీకరించటం లేదు. ఆమె నుండి పిలుపు వస్తుందని ఎదురు చూస్తున్నాను.

ఇంతలో చక్రాల కుర్చీలో కూర్చోబెట్టుకుని అమ్మను మా దగ్గరకే తీసుకు వచ్చింది సిస్టర్. నేను తీసుకు వెళ్లిన జామపండ్లను ఆమె చేతికిచ్చి, కాళ్లకు నమస్కరించాను. ఆమె తలనిమిరి ఆశీస్సులు అందించింది. "ఇదే నీకు నా సందేశం..." అని ఒక కార్డు నా చేతికిచ్చారు. దాని మీద...

*"మౌనానికి ఫలితం ప్రార్థన*
*ప్రార్థన ఫలితం విశ్వాసం*
*విశ్వాసం ఫలితం ప్రేమ*

ప్రేమ ఫలితం సేవ

**సేవ ఫలితం శాంతి** – మదర్ థెరీసా" అని వ్రాసి ఉంది.

మేము ప్రచురిస్తున్న గాంధీక్షేత్రం మాసపత్రికను మదర్ చేతికిచ్చాను. పుస్తకమంతా తిరగేసి, "నాకు ఇంగ్లీషు, బెంగాలీ తప్ప మరే భాషా రాదు" అంటూ ముఖచిత్రంపై గాంధీబొమ్మ కింద వ్రాసిన వాక్యాలను చూపిస్తూ "ఇవేమిటీ?" అనడిగారు.

"స్వచ్ఛమైన సంకల్పము చతికిలబడి పోదు...అచ్చమైన వాక్కు కడకు అప్రియమ్ము కాదు" అనే గాంధీజీ సూక్తిని ఇంగ్లీషులోకి అనువదించి చెప్పాము.

గాంధేయ భావవ్యాప్తికి, సమాజ సేవానురక్తికి తోడ్పడటమే గాంధీక్షేత్రం పత్రిక ఉద్ధేశమని చెప్పాను. ఆమె ఎంతగానో సంతోషించారు. "మంచిపని" అని మెచ్చుకోలుగా చూశారు. ఆమెకు శ్రమ ఇచ్చినందుకు మాకు బాధకలిగింది. అయినా ఆమెను దగ్గరగా చూడగలిగిన భాగ్యం, ఆశీస్సులు పొందగలిగామన్న తృప్తీ కలిగాయి.

నిజానికి ఆమె ఆరోగ్య పరిస్థితిని బట్టి ఇలా మంచం దిగి మా దగ్గరకు వచ్చి గడపటం సాధారణ విషయం కాదు. నిజంగానే మేము ఆమెకు శ్రమ కలిగించాము. ఆమె మాత్రం శ్రమ అనుకోకుండా ఆనందంగా మా దగ్గరకు వచ్చి పలకరించారు. ఆశీర్వదించారు. అందుకే ఆమె విశ్వమాత అయ్యారు.

మహిమాత్ములైన పవిత్రాత్మలను దైవత్వం కలిగిన వారిగా గుర్తిస్తారు. ఆమె మరణానంతరం పోప్ జాన్ పాల్ గారి ద్వారా దైవ ఆశీర్వాదం ( బీటిఫికేషన్) ఆమెకు లభించింది. ఆమెను క్రైస్తవ మతస్థులే కాదు, ఇతరులుకూడా దైవాంశ సంభూతగా గౌరవిస్తారు. "బ్లెస్డ్ థెరీసా అఫ్ కలకత్తా" అనే బిరుదు కూడా ఆమెకు లభించింది.

ఆల్బేనియా దేశానికి చెందిన రోమన్ కేథలిక్ సన్యాసిని ఆమె! ఆగ్నీస్ గోక్షా బొజాక్షు ఆమె అసలు పేరు.

ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి కోఫీ అన్నన్ "పరోపకారం, సేవ, భగవత్పరమైన సేవలకు మదర్ ఒక ఉదాహరణ" అన్నారు. దేశదేశాల్లోని అనాథ దుఃఖితులను ఆదుకోవటానికి దేవదూతలాగా వచ్చిన వ్యక్తిగా ఆమెను ఎందరో ఆరాధిస్తారు.

తండ్రి 'నికోలా ఒయాన్షియా' మరణానంతరం తల్లి 'డానా ఫైన్' బీదల సేవలో ఎక్కువగా కాలం గడిపేవారు. సేవాకార్యక్రమాలకు వెడుతూ తన కూతురుని కూడా వెంటబెట్టుకు వెళ్ళేవారామె!

సేక్రెడ్ హార్ట్ చర్చితో ఆమెకు ఎక్కువ అనుబంధం ఉండేది. చర్చికి భారతదేశంలోని మిషనరీలు వ్రాసే ఉత్తరాల విషయంలో చర్చి వారికి ఆమె సహకరిస్తూ ఉండేవారు. అలా కలకత్తాలోని బెంగాల్ మిషన్ గురించిన అవగాహన ఆమెకు ఏర్పడింది. భవిష్యత్తులో బెంగాల్ని ఆమె తన కార్యక్షేత్రంగా చిన్ననాడే ఆమె ఎంచుకున్నారు.

తన 18వ యేట ఆమె ఐర్లండ్ వెళ్లారు. హైస్కూలులో టీచర్ గా చరిత్ర పాఠాలు చెప్పేవారు. 1931లో ఆమె క్రైస్తవ సన్యాసినిగా మారారు. ఫ్రాన్సుకు చెందిన ప్రసిద్ధ సన్యాసిని థెరీసా డి లిసీయూ అనే ప్రసిద్ధ క్రైస్తవ సన్యాసిని అంటే ఆమెకు ఎనలేని గౌరవం. సన్యాసం స్వీకరించాక తన పేరును ఆమె గుర్తుగా థెరీసాగా మార్చుకున్నారు. పేదవారి పట్ల పెన్నిధిగా మారాలనే సంకల్పం చెప్పుకున్నారు. 1946లో ఆమెకు తీవ్ర అనారోగ్యం చేసింది. డార్జిలింగు నుండి రైల్లో ప్రయాణిస్తున్నప్పుడు ఆమె అంతరాత్మ ప్రబోధం ఆమెకు వినిపించింది. దుఃఖార్తుల సేవకే తనను దేవుడు పంపించాడనేది ఆ అంతరాత్మ ప్రబోధం. "ఇంక నా జీవితాన్నంతా సేవలోనే గడుపుతాను" అని ఆమె గట్టి సంకల్పం చెప్పుకున్నారు. ఆమె అందించిన సేవలు మహత్తరమైనవే అయినప్పటికీ అవి "సముద్రంలో నీటి బిందువులే" అని సవినయంగా ప్రకటించారామె.

మదర్‌థెరిసా 1980లో భారతదేశ అత్యున్నత పౌర పురస్కారమైన 'భారతరత్న'ను పొందారు. 1962 లో పద్మశ్రీ పురస్కారంతో భారత ప్రభుత్వం ఆమెను గౌరవించింది. 1968లో బిబిసి వారు ఆమె ఇంటర్వ్యూ ప్రసారం చేశారు. వాటికన్ పోప్ జాన్ 23వ శాంతి పురస్కారం 1971లో ఆమెకు లభించింది.

భారతదేశ అత్యున్నత పురస్కారం అంతర్జాతీయ అవగాహనకు గాను జవహర్లాల్ నెహ్రూ అవార్డు (1969) అందుకున్నారు.

1979లో శాంతి స్థాపనకు ఆమె చేపట్టిన కార్యక్రమాలకు గుర్తింపుగా ఆమెకు నోబెల్ పురస్కారం లభించింది. బీద ధనిక దేశాల మధ్య తారతమ్యాన్ని పూడ్చటంలో ఆమె విజయం సాధించినందుకు గుర్తింపుగా ఈ పురస్కారం లభించింది. "తన సందేశం ద్వారా ఆమె ప్రతీ మానవుని హృదయాంతరాళాలలో ప్రవేశించే ప్రయత్నం చేశారు" అని నోబెల్ పురస్కారం ఆమెకు బహూకరిస్తూ జాన్ సెనెస్ వ్యాఖ్యానించారు.

ప్రపంచంలో ఎక్కడ ఏ ప్రమాదం జరిగినా అక్కడ థెరెసా సేవలు అందేవి.

ఇథియోపియా కరువు, రష్యన్ చెర్నోబిల్ సంఘటన, బేరూత్ అంతః కలహం ఇలా అనేక దేశాలలో దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడిన ప్రతిసారి ఆమె సహాయ చర్యలకు పురమాయించేవారు. మందులు, ఆహారపదార్థాలూ పంపించేవారు.

1984లో ఢిల్లీలో అల్లర్లు జరిగినప్పుడు ఆమె శాంతి యాత్ర నిర్వహించారు.

ఆమె మరణించేనాటికి మదర్ థెరీసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ 123 దేశాలలో 610 సంఘాలను కలిగి, హెచ్ఐవి/ ఎయిడ్స్, కుష్టు మరియు క్షయ వ్యాధిగ్రస్తులకు ధర్మశాలలను, గృహాలను, ఆహార కేంద్రాలను, బాలల మరియు కుటుంబ సలహా కార్యక్రమాలను, అనాథ శరణాలయాలను మరియు పాఠశాలలను నిర్వహిస్తోంది.

1990లో ఆమె నిర్వహిస్తున్న మిషనరీస్ ఆఫ్ చారిటీస్ సంస్థ అధ్యక్ష పదవికి ఆమె రాజీనామా చేశారు. ఆశ్రమంలోని ముఖ్యులంతా ఆమె వారసురాలిని ప్రత్యక్ష ఎన్నికల ద్వారా ఎన్నుకుంటామని ఆమెను కోరారు. ఆమె అందుకు అంగీకరించారు. రహస్య ఓటింగ్ పద్ధతిలో ఎన్నిక జరిగింది. ఆ ఎన్నికల్లో ఏకగ్రీవంగా థెరిసానే అందరూ అధ్యక్షురాలిగా ఎన్నుకున్నారు. భగవంతుని కోరికగా దాన్ని ఆమె భావించారు. 1997, మార్చి 13 వరకూ ఆమె ఆ పదవిలో కొనసాగారు. సెప్టెంబరు 5న ఆమె తన భౌతిక దేహాన్ని త్యజించారు.

దేశ విదేశాలకు చెందిన రాజకీయ ప్రముఖులెందరో ఆమె భౌతికకాయాన్ని తుదిసారిగా దర్శించుకునేందుకు వచ్చారు. పోప్ ప్రతినిధి, వాటికన్ విదేశాంగమంత్రి, భారత రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్, ప్రధాని ఐ.కె. గుజ్రాల్, అమెరికన్ అధ్యక్షుని భార్య హిల్లరీ క్లింటన్, ఇటలీ అధ్యక్షుడు లూయీస్, బంగ్లా ప్రధాని షేక్ హసీనా, బ్రిటన్ ఉపప్రధాని, కెనడా ప్రధాని ఇలా ఎందరో ప్రముఖులు భారతదేశానికి వచ్చి ఆమెకు నివాళులర్పించారు.

దేవుడు తన ద్వారా సేవ చేయిస్తున్నాడనే ఆమె భావం చెరిగిపోనిది! ఆమె దేవునికి తనతో బంధాన్ని నిలుపు కోవడానికి పరితపించిన మహనీయురాలు. ఆమె ఈ గడ్డ మీద పుట్టకపోయినా ఈ దేశపు ఆధ్యాత్మిక సంపదను ఆకళింపు చేసుకుని, మానవసేవను భగవంతునికి సేవగా భావించిన పుణ్యమూర్తి.

అన్నివిధాలా వైకల్యాన్ని పొందిన వ్యక్తుల్ని ఆదరించటం ద్వారా వాళ్ళలో తామూ మనుషులమేననే భావన కలిగించటం ఆమె సాధించిన ప్రధాన విజయం.

రాజకీయాలకతీతమైన సేవనందిస్తూ, దేశ విదేశాల ప్రజలను శాంతిమార్గాన నడిచేలా ప్రబోధించి మహాత్మా గాంధీ తరువాత అంతగా అంతర్జాతీయ ఖ్యాతి పొందిన శాంతిదూత మదర్ థెరిసాయే!





మదర్‌తెరిస్సాతో దివిసీమ పునర్నిర్మాణ కార్యక్రమాల గురించి చర్చిస్తున్న శ్రీ మండలి వెంకటకృష్ణారావు



# భగవాన్ సత్యసాయి బాబా

1977 నవంబరు 19న దివిసీమలో జలప్రళయం సంభవించింది. అదే సమయంలో పుట్టపర్తిలో నవంబరు 20 నుండి మూడు రోజుల పాటు సత్యసాయి సేవా సంస్థల అఖిల భారత సమావేశం జరుగుతోంది. భగవాన్ సత్యసాయిబాబా ఆ సమావేశాన్ని మానుకుని సేవాతత్పరులైన కార్యకర్తలు దివిసీమలో ఉప్పెన బాధితుల్ని ఆదుకోవటానికి వెళ్లమని ఆదేశించారు.

నవంబరు 23వ తేదీ బాబావారి జన్మదినోత్సవం రోజున "దివి ఉప్పెన విపత్తులో సజీవులకు సేవలందించటం అందరి ధర్మం" అని బాబావారు తన సందేశంలో ఆదేశించారు.

ఉప్పెనకు గురి అయిన ప్రాంతాలలో కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలకు చెందిన సంస్థ శాఖ కార్య నిర్వాహకుల్ని సభ్యుల్ని రక్షణ విధుల్ని ఆలోచించాల్సిందిగా ఆదేశించారు. బాధితులకు ఏ ఏ సహాయాలు అందించాలో చాలా స్పష్టంగా నిర్దేశించారు.

అప్పటికప్పుడు ఆ జన్మ దినోత్సవాల్లో ఉన్న భక్తులంతా కలిసి 8 లక్షల రూపాయలను పోగు చేసి ఇచ్చారు. ప్రత్యేకంగా దివి తుపాను కోసం 'శ్రీ సత్యసాయి కేంద్ర ధర్మసంస్థ తుపాను రక్షణ నిధి' పేరుతో ప్రశాంతి నిలయం స్టేట్ బ్యాంకులో ఒక అక్కౌంటు తెరిచారు. ఆ వెంటనే నిధి 11 లక్షలకు పెరిగింది. అది స్వామి స్వయంగా ఇచ్చిన ఆదేశం.

200 మంది ఆరితేరిన సేవాదళ స్వచ్ఛంద సేవకులు, 20 మంది వైద్యులు, ధోవతులు చీరలు, పిల్లల బట్టలు, మందులతో సహా సత్యసాయి సెంట్రల్ ట్రస్టు వారు కృష్ణాజిల్లా దివి తాలూకా, గుంటూరు జిల్లా బాపట్ల, రేపల్లె తాలూకాలలో సేవా శిబిరాల ఏర్పాటుకు పూనుకున్నారు.

ఆంధ్రప్రదేశ్ నలుమూలల నుండి సేవాదళం సభ్యులు స్త్రీ, పురుషులెందరో తరలి వచ్చారు. బియ్యం, ఇంకా ఇతర ఆహార ద్రవ్యాలను లారీలలో తరలించారు.

కృష్ణాజిల్లా కొత్త మాజేరులో మొదటి శిబిరం ఏర్పాటు అయ్యింది. 15 మంది మహిళా సేవకులు, 20 మంది పురుష సేవకులతో పాటు ఇద్దరు డాక్టర్లు ఈ శిబిరంలో సేవలందించేందుకు సిద్ధంగా ఉన్నారు.

ఈ శిబిరంలో వైద్య సేవలతో పాటు రోజూ 5,000 మందికి అన్నదానం చేసేవారు. దాదాపు 400 మంది పిల్లలకు పాలు అందించేవారు. రోజూ వందల సంఖ్యలో రోగులకు వైద్య సేవలు అందించేవారు. పేపర్లలో వస్తున్న దానికి అనేక రెట్లు విధ్వంసం జరిగిందని సేవాదళ్ కార్యకర్తలు గుర్తించారు. అందుకు తగ్గట్టుగా ప్రతిస్పందించారు.

శిబిరం ప్రారంభించిన కొత్తల్లో నిజానికి ప్రజలు పెద్దగా స్పందించలేదు. రెండు మూడు రోజుల పాటు వేచి చూద్దాం. ఎంత మాత్రం సేవలు అందిస్తారో ......" అన్నట్టు గడిచింది. మహిళా వాలంటీర్లు స్వామి పాటలు పాడుకుంటూ, భక్తి ప్రచారం చేస్తూ సేవా కార్యక్రమాలలో పాల్గొనటం చూసి మొదటగా పిల్లలు వాళ్ళతో చేరారు. తరువాత మహిళలు, ఇలా ఒక్కొక్కరే ముందు కొచ్చి వాళ్ళు కూడా సేవా కార్యక్రమాలలో సేవలందించగలమంటూ పాల్గొన సాగారు. ఒక జ్యోతితో అనేక జ్యోతులు వెలిగించ వచ్చున్నట్లు స్వామి వెలిగించిన సేవా జ్యోతిని స్వయంగా బాధితులే అందుకున్నారు.

సమాచార వ్యవస్థ గాని, పంపిణీ వ్యవస్థ గానీ ఏ మాత్రం అందుబాటులో లేని ఆ సమయంలో బియ్యం, సరుకులు బాగు చేయటం, కూరలు తరగటం, వంట పనులు, వడ్డనలలో సహకరించసాగారు. వాళ్లంతా ఆనాడు తమ సమీప బంధువుల్ని, అయినవాళ్ళని, రక్త సంబంధీకుల్ని కోల్పోయిన వాళ్లే! కడుపులో బాధ నుండి సేవ ఎంత విముక్తి నిస్తుందో అర్థమయింది.

ఎక్కడ చూసినా గుట్టలుగా పడి ఉన్న శవాలు, భరించలేని దుర్గంధం వ్యాపించి

ఉంది. నిన్నటి దాకా పంట చేలుగా ఉన్నవన్నీ పశువుల కలేబరాలతో కుళ్లిపోయి భయానకంగా ఉంది. అక్కడ కొద్దిసేపు ఉంటే అనేక అంటు వ్యాధులు ఏర్పడే పరిస్థితి.

సత్యసాయి సేవాదళం వారు క్రమశిక్షణతో సుశిక్షుతులైన సైనికుల్లాగా అనేక ముందు జాగ్రత్తలతో తీసుసుకున్న చర్యల వల్ల ఎక్కడా కలరా గానీ, మరో అంటూ వ్యాధి గాని వ్యాపించలేదు. అదంతా బాబా మహిమ. వారిచ్చిన శిక్షణ వలెనే అది సాధ్యమైందని ప్రతి ఒక్కరూ నమ్మారు.

మూడు పూటలా భోజనం సుష్టుగా అందరికీ అందేలా జాగ్రత్త పడేవారు. రాత్రిపూట అన్నం ఎక్కువగా వండి ఉదయాన్నే జీవనోపాధి కోసం వెళ్లేవారికి చద్ది కట్టి పంపేవాళ్ళు సేవాకార్యకర్తలు.

అసలే ఉప్పెన బీభత్సంలో అతలాకుతలం అయిన దివిసీమలో కార్యక్రమాలు ముమ్మరంగా ఊపందుకుంటున్న దశలో ఒకరోజు భయంకరమైన గాలివాన వచ్చింది. దాని వలన సేవా కార్యక్రమాలకు తీవ్ర అంతరాయం కలిగింది. సేవా కార్యకర్తలు, బాధితులు అందరూ కూర్చుని స్వామిని ప్రార్థించారు. వెంటనే వాన ఆగింది. పనులు మళ్లీ ముమ్మరం అయ్యాయి.

ఉప్పెన వచ్చిన 20 రోజుల తరువాత మాజేరులో సాధారణ స్థితి వచ్చింది. దాంతో శిబిరాన్ని 4 మైళ్ళ అవతల గుండుపాలెంకు మార్చారు. ఆ చట్టుపక్కల పల్లెపాలెం, గొల్లపూడి, రుద్రవరం, రంగనాయకమ్మపేట తుమ్మలచెరువు, సత్యనారాయణపురం, వెంకట దుర్గాపురం, కొయ్యలపాలెం గ్రామాలలో పరిస్థితి చాలా దైన్యంగా ఉంది. ఎక్కడ చూసినా పాతిపెట్టకుండా వదిలేసిన మానవ కళేబరాలు, జంతువుల కళేబరాలు కుళ్ళి ఘోరమైన దుర్గంధం వ్యాపించి ఉంది. విరిగి పడిపోయిన ఇళ్ళు, గాలివాన నాటి బీభత్సానికి సాక్ష్యాలు అలానే ఉన్నాయక్కడ.

మృతదేహాలను తొలగించటం, ఆరోగ్యవంతమైన వాతావరణం కల్పించటం, వైద్యసేవలు అందించటంకోసం, సేవాదళ కార్యకర్తలు దృఢంగా నిలబడటం వలెనే సాధ్యమయింది.

దారుల్లేని ఆ డొంకల్ని బాగు చేసి రవాణా సౌకర్యం కల్పించారు. సేవాదళ కార్యకర్తలు కూలిన కొంపల్ని నిలబెట్టుకునేందుకు గ్రామీణులకు సహాయపడేవాళ్లు. నాలుగైదు వేలమందికి భోజనాలు అందించేవాళ్లు. ప్రభుత్వం వారు సమకూర్చిన

ట్రాక్టర్లలో భోజనాలను ప్రతి గ్రామానికి తీసుకువెళ్ళి అందించారు. పూటకు 4,500 మందికి భోజనాలు ఏర్పాటు చేశారు.

అక్కడ మంచినీరు లేకపోవటంతో బందరు నుంచి నీళ్ళ ట్యాంకుల్లో నీటిని తీసుకువెళ్ళి అందించారు. బంధుజనాన్ని కోల్పోయిన ఆ పీడకలను సాధ్యమైనంత త్వరగా వాళ్ళు మరిచిపోయేలా చేయటమే సేవాదళ కార్యకర్తల పరమావధిగా వాళ్లు పని చేశారు. నవంబరు 19న ఉప్పెన, తుపాను ఏకమై వస్తే డిసెంబరు నెలాఖరు దాకా సత్యసాయి సేవాదళ కార్యకర్తలు అందించిన అపురూప సేవలు దివిసీమ ప్రజలకు చిరస్మరణీయమైనవి.

మాజేరు, గుండుపాలెం తరువాత సేవాదళం వారు అత్యధికంగా బ్రంకుల గ్రామంలో సేవలు కేంద్రీకరించారు. తుపాను వలన అధిక నష్టానికి గురైన ఏడు గ్రామాలకు ఈ బ్రంకుల గ్రామం కేంద్రంగా ఉండేది. ఇక్కడ 2 వేల మంది మనుషులు, వేలాది పశువులు ప్రాణాలు కోల్పోయాయి. నాగాయలంక నుండి 8 మైళ్ళ దూరాన ఈ గ్రామం ఉంది. ఎలాంటి వాహనాలూ వెళ్ళే అవకాశం లేని స్థితి. నేలంతా బురదతో నిండి పోయింది. తలగడదీవి నుండి సామానంతా నెత్తిన మోసుకుని బురదలో పడి నడుస్తూ బ్రంగుల చేరుకున్నారు సేవాదళ కార్యకర్తలు.

నవంబరు 27 నాటికి నాగాయలంక దాటి బ్రంకుల దగ్గర శిబిరం ఏర్పాటు చేసుకునే సరికి బెంగుళూరు నుండి స్వామి పంపిన సహాయ సామగ్రి విజయవాడకు చేరుకుంది. అందులో గుడారాలు, మందులు, పప్పులు, ధాన్యాలతో పాటు వంటలు చేసుకోవటానికి గిన్నెలు, గరిటెలు అన్నీ ఉన్నాయి.

యుద్ధప్రాతిపదికన శవాల తొలగింపు పనిచేపట్టారు కార్యకర్తలు. పోలీసులు, రాజమండ్రి సెంట్రల్ జైలు నుండి వచ్చిన ఖైదీలు పూనుకుని శవాలకు అంతిమ సంస్కారాలు పూర్తి చేశారు.

ఈ బ్రంకుల శిబిరంలో పూటకు 1,500 మందికి భోజనాలు ఏర్పాటు చేశారు. ఆ సమయంలో ముగ్గురికి కాన్పులు కూడా చేయవలసి వచ్చింది.

గుంటూరు జిల్లా అడవులదీవిలో కూడా తాత్కాలిక షెడ్లులు వేసి 5,000 మందికి తాత్కాలిక ఆశ్రయం కల్పించారు. వారందరికీ భోజనాలు, వైద్య సేవలు కల్పించారు.

సముద్ర తీరం వెంబడి ఉన్న 27 గ్రామాలకు వెళ్లి కలరా లాంటి అంటు

వ్యాధులు ప్రబలకుండా వ్యాక్సిన్లు ఇచ్చారు. వాహనాలలో భోజనాలు పంపి వాళ్ళని ఆదుకున్నారు. స్వరగుండి గ్రామంలో 1,000 మందికి ఆశ్రయం కల్పించి భోజనాలు అందేలా చేశారు. పిల్లలకు తప్పనిసరిగా పాలు అందేలా చూశారు.

సొర్లగొంది గ్రామంలో 800 మంది మరణించారు. 1200 మంది కట్టుబట్టలతో ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకుని నాగాయలంక చేరుకున్నారు. బర్రంకుల శిబిరం నుంచే నాగాయలంకలోని ఆ శరణార్ధులకు ప్రభుత్వ వాహనాల్లో భోజనాలు పంపి ఆదుకున్నారు. సొర్లగొంది, మూలపాలెం, దిండి గ్రామాలలో ప్రజలు ఆనతి కాలంలోనే సేవాదళ కార్యకర్తల సేవలతో తెప్పరిల్లారు.

నదికి ఆవలి తీరంలో గుంటూరు జిల్లాలో కూడా తుపాను బీభత్సం అధికంగానే ఉంది. సత్యసాయి సేవాదళం కార్యకర్తలు బాపట్ల పరిసరాల్లో గణపవరం మొదలైన చోట్ల శిబిరాలు నెలకొల్పి సేవలందించారు.
కొన్ని రోజుల సేవ తరువాత పాతవారి స్థానంలో ఎప్పటికప్పుడు కొత్త సేవా కార్యకర్తలు వచ్చి చేరేవారు.

ఇతర సేవా సంస్థలకు, శ్రీ సత్యసాయి సంస్థలకు తేడా చాలా స్పష్టంగా కనిపిస్తుంది. స్వామి ఆదేశానుసారం నిబద్ధతతో భక్తి పూర్వకంగా సేవలందించే కార్యకర్తలు శ్రీసత్యసాయి సేవా సంస్థలో ఉంటారు. నిరాడంబరంగా ఉంటారు. సేవ చేయటంలో ఒక సంతృప్తిని వాళ్ళు పొందే విధంగా పనిచేస్తారు. సేవ ద్వారా తనకో గుర్తింపునో, పేరు ప్రతిష్టలనో కాకుండా తన అహంకారాన్ని దింపుకునే ప్రయత్నం సేవాదళం కార్యకర్తలు చేస్తారు. వాళ్ళలో క్రోధం, అసూయ, పోటీతత్త్వాలు ఉండవు. అవి ఉన్నవారు ఈ సేవాదళంలో ఎక్కువ కాలం ఉండలేరు కూడా!

తన కార్యకర్తలను స్వయంగా బాబాయే తన సందేశాల ద్వారా ఉత్సాహ పరిచేవారు. భజన, ధ్యానం, అధ్యయనాలను సాధన కార్యక్రమాలుగా భగవాన్ శ్రీసత్యసాయి ప్రబోధించేవారు. దినచర్య అనేది ప్రేమతో ఆరంభం కావాలి రోజంతా ప్రేమతోనే గడపాలని, ప్రేమతో నింపి, ప్రేమతో ముగించాలనే సందేశం బాబా వారిది. దైవానుగ్రహం దొరకాలంటే ఇలా జీవించాలని చెప్తారు బాబా.

మొదట ఆకలి, ఆరోగ్యాలను తీర్చిన తరువాత తుపాను ధాటికి గురైన ప్రజలకు కొంత సేద తీరే అవకాశం లభించింది. ఆ తరువాత బట్టల పంపిణీ మీద దృష్టి పెట్టారు. ఇంటింటికి వెళ్లి సేవాదళ కార్యకర్తలు సేకరించిన బట్టలను బాధితుల

లెక్కలను బట్టి ప్రతి వ్యక్తికి కొత్త బట్టలను అందించారు. ప్రతి ఇంటికి వెళ్లి స్త్రీలను పలకరించి, బొట్టుపెట్టి బట్టలు పెడుతుంటే ఆత్మీయులను కోల్పోయిన విషాదంలో కూడా ఆర్తులంతా ఎంతో పులకరించిపోయారు. అలా చేయాలనేది బాబావారి ఆజ్ఞ. స్వామే స్వయంగా వచ్చి ఇస్తున్నట్టు ప్రజలు భావించారు. ప్రతి ఇంటికి వంట పాత్రలు, ఉప్పు, పప్పులు, బియ్యం వగైరా అందించారు.

ప్రజలు వివిధ సంస్థలు కూడా దివి గ్రామాల పునర్నిర్మాణానికి శ్రీ బాబావారి పిలుపు మేరకు విశేషంగా స్పందించారు. ఆర్థికంగాను, నూతన గృహాలను నిర్మించి ఇళ్లను కట్టించి ఇవ్వటం ద్వారాను, లాంతర్లు, దుప్పట్లు, బట్టలు, బియ్యం, ఇతర నిత్యావసరాలు అందజేయడం ద్వారా వాళ్ల జీవితాలలో కొత్తకోణాలు ఆవిష్కరింప చేశారు.

బత్రంకుల హరిజనవాడలో 60 ఇళ్ళు కట్టించే పనిని యుద్ధప్రాతిపదికన అప్పటికప్పుడు చేపట్టారు. నెల రోజుల్లోపే 22-12-1977న శ్రీ కస్తూరిగారిచే ఆ ఇళ్ల సముదాయం ప్రారంభించబడింది కూడా! అక్కడ సామాజిక రక్షిత భవనాన్ని కూడా శ్రీసత్యసాయి సంస్థలు నిర్మించాయి.

"జాతి, మత, కుల భేద భావాలు లేకుండా నిస్వార్థంగా సేవ చేయటానికి అన్నదాతగా, శక్తిదాతగా స్వామి మాకు ప్రసాదించిన ధైర్యోత్సాహాలే కారణం గాని వేరొకటి కాదని మా అందరి అభిప్రాయం" అని ఎంతో వినయంగా చాటుకున్న సేవాదళ కార్యకర్తల వినయపూర్వక వచనాలు ప్రతిఫలాపేక్షరహిత సేవకు అక్షర నిదర్శనాలుగా భావిస్తాను.

సత్యసాయిబాబా మహిమల గురించి భిన్నాభిప్రాయాలు, విమర్శలు చేసేవారు కూడా సత్యసాయి సేవా నిరతిని మాత్రం కొనియాడక తప్పలేదు. నేరుగా సత్యసాయిబాబా ట్రస్టు ఆధ్వర్యంలో గాని, సాయి సేవా సంస్థల ఆధ్వర్యంలో గానీ పెక్కు విద్యాసేవ, దాన కార్యక్రమాలు నడుస్తున్నాయి. 166 దేశాలలో 10 వేల సత్యసాయి సేవాసంస్థలున్నాయి.

ప్రశాంత నిలయంలోని సత్యసాయి ఉన్నతవిద్యాసంస్థ (Sri Satya Sai Institute of Higher Learning) ప్రస్తుతం దీని పేరు శ్రీ సత్యసాయి యూనివర్సిటీ. భారతదేశం మొత్తంలో జాతీయ విద్యా ప్రమాణ తులనా మండలి ద్వారా "A" రేటింగ్

పొందిన ఒకే ఒక సంస్థ. ఇదే కాకుండా ఒక సంగీత విద్యాలయం, అనంతపురంలో ఒక ఉన్నత విద్యాలయం ఉన్నాయి.

పుట్టపర్తి లోని శ్రీ సత్యసాయి ఇనిస్ట్యూట్ ఆఫ్ హైయర్ మెడికల్ సైన్సెస్ (Sri Satya Sai Insttitute of Higher Medical Sciences) 220 పడకలు గల ఒక సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ అప్పటి ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారిచే 1991, నవంబరు 22న ప్రారంభించబడింది. బెంగళూరు వైట్ ఫీల్డ్ లోని సత్యసాయి జనరల్ హాస్పిటల్ లక్షలాది మందికి ఉచిత వైద్యం అందించింది.

శ్రీ బాబా విశ్వవ్యాప్తంగా తెలుగు జాతికి విఖ్యాతి సముపార్జించి పెట్టారు. సత్యసాయి నేను అమెరికా వెళ్ళినపుడు న్యూయార్క్ నగరంలో కమ్యూనిటీ చర్చికి వెళితే అక్కడ సత్యసాయి సత్సంగం జరుగుతోంది. మలేసియా, మారిషస్ దేశాలలో వారి భక్తులు అధికం. వేలమంది విదేశీ భక్తులు బాబా పట్ల అపారమైన భక్తి విశ్వాసాలు కలిగి ఉండేవారు.

తెలుగుజాతికే కాకుండా తెలుగు భాషకు బాబా ద్వారా ప్రాబల్యం లభించింది. బాబా ప్రసంగాలు తెలుగులోనే చేసేవారు. "ఇది నా మాతృదేశం. ఇది నా ప్రియ భాష అని ఎదగొట్టి పలుకనేరని వ్యక్తి జీవచ్ఛవంతో సమానమ"ని పదే పదే ప్రసంగాలలో చెప్పేవారు. బాబా వారి అనుగ్రహభాషణాలు తెలుగులో సులభమైన ఉపమానాలతో, మధ్య మధ్య పాటలతో, పద్యాలతో హృద్యంగా సాగేవి.

"వ్యక్తిగత శీలము కలిగినప్పుడే నాయకుడుగా తయారు కావచ్చు. వ్యక్తిగత గుణములు మనం పోషించు కోవాలి. వ్యక్తిగత శీలము, సామాజిక శీలము, జాతీయ తత్త్వమూ, మనం అభివృద్ధి పరచుకోవాలి. జాతీయ భావమే పోయింది. నేను, నా కుటుంబము అంతవరకే ప్రయాణము చేస్తున్నాము. దేహాభిమానము ఎంత ప్రధానమో, దేశాభిమానము అంత ప్రధానము. దేశము వేషము యొక్క ప్రతిబింబమే. దేశము, వేషము రెండూ బింబ ప్రతిబింబాలే" అని బాబా బోధనలు సాగుతాయి. ఆ ప్రబోధమే దివిసీమ ఉప్పెనలో దేశ వ్యాప్తంగా ఉన్న బాబా భక్తులు సేవలందించడానికి స్ఫూర్తి నందించినది.

**స్వామి నొక్క మాటు సంస్మరించిన చాలు**
**కన్నతల్లి ఎత్తుకున్నయట్లు**
**పాలవెల్లి నడుమ ఓలలాడినయట్లు**

**నిత్యశాంతి దాయి! సత్యసాయి!**

**స్వామి నొక్కమాటు సంస్మరించిన చాలు**
**వెండికొండ నవ్వు చుండినట్లు**
**గుండెలోన శివుడు తాండవించినయట్లు**
**నిత్యశాంతిదాయి! సత్యసాయి!**

ప్రపంచ మానవాళిలో ప్రేమతత్త్వాన్ని, సేవానిరతిని నాటేందుకే తాన అవతరించినట్టు ప్రకటించుకున్న భగవాన్ సత్యసాయి వారి గురించి కరుణశ్రీ వ్రాసిన పద్యాలు ఇవి.

"మీ హృదయాల్లో ప్రేమ దీపం వెలిగించి అనుదినం ప్రజ్వలింప జేయాలనే నేను వచ్చాను. ఏదో ఒక మతం తరఫునో, సంఘం తరఫునో ప్రచారానికి రాలేదు. ఒక సిద్ధాంతానికి అనుచరుల్ని ప్రోగేయాలనీ రాలేదు. శిష్యుల్ని, భక్తుల్ని ఆకర్షించటం నా అభిమతం కాదు. ప్రేమ అనే మార్గం, ధర్మం, బాధ్యత ఈ ఆత్మ సత్యాన్ని చెప్పడానికి వచ్చాను. ప్రేమే భగవంతుని ఆరాధించడానికి అత్యుత్తమ మార్గం. ఈ ప్రేమే నేను మీ కిచ్చే సందేశం" అంటారు శ్రీ బాబా. 'భగవంతునుని ప్రేమించటమే భక్తి' అని ప్రబోధించారాయన. 'మనిషి ప్రత్యేకత తోటి మానవుని గౌరవించి, సేవించే తత్త్వాన్ని కలిగి ఉండటమే' నంటారు స్వామి! సేవలో సంపూర్ణంగా మునిగిపోవాలని తన సేవాదళ కార్యకర్తలకు సూచిస్తుంటారు.

సేవ, దాన ధర్మాలు సకల ప్రాణుల పట్ల ప్రేమ, సాధన, వృద్ధాప్యంలో భగవంతుడే సత్యం. మిగిలింది మాయ, శాకాహార సేవన, మాదక ద్రవ్యాలు, మద్యం, ధూమపానాల నుండి దూరంగా ఉండటం, సంసారం పట్ల వైరాగ్య భావం, ఇంద్రియ నిగ్రహం, ధ్యానం - భగవన్నామ రూప సంస్మరణం, భక్తి జపం, సాధన అన్ని మతాలూ భగవంతుని కడకు చేరుస్తాయన్న విశ్వాసం. తల్లిదండ్రులు, గురువులు పెద్దల పట్ల భక్తి ఇవీ శ్రీ సత్యసాయి ప్రబోధించిన మూల సూత్రాలు. ఆయన తన సందేశాలను ఆచరణలో చూపిన మహానుభావుడు.

నేను కళ్ళారా చూసిన వాస్తవాలు అనేకం ఉన్నాయి.

1975లో ప్రపంచ తెలుగు మహాసభలకు సన్నాహాలు జరుగుతున్న నేపథ్యంలో ఒకరోజు రవీంద్రభారతి మీదుగా రోడ్డుపైన నడుచుకుంటూ వెళుతున్నాను. మా

నాన్నగారి కారు వాయువేగాలతో వెళుతూ, నన్ను చూసి బ్రేక్ వేసి ఆపారు. నన్ను కారులోకి రమ్మన్నారు. ఆ కారు సరాసరి వెళ్లి బేగంపేట విమానాశ్రయం దగ్గర ఆగింది. పుట్టపర్తి భగవాన్ సత్యసాయి బాబావారు విమానంలో బొంబాయి వెళుతున్నారని, వారిని ఆహ్వానించటానికి మా నాన్నగారు విమానాశ్రయానికి వచ్చారని అర్థం అయ్యింది. విమానాశ్రయంలో భక్తులు స్వామి కోసం వేచి ఉన్నారు. కానీ, సాయిబాబా వారు విమానం లోంచి దిగలేదు. మా నాన్నగారు విమానం దగ్గరకి వెళ్లి బాబా వారిని కలిసి వచ్చారు. నన్నూ, హిందూపురం శాసనసభ్యులు శ్రీ జి. సోమశేఖర్ గారిని విమానం లోనికి వెళ్లి వారిని దర్శించి రమ్మని చెప్పారు. నేను వెళ్లి సాయిబాబా వారికి నమస్కరించి వారి ఆశీస్సులు తీసుకుని క్రిందకు వచ్చాను. అంతా ఒక నిమిషం వ్యవధిలో జరిగింది.

ఆ తరువాత ఏడాదికో రెండేళ్లకో పుట్టపర్తి వెళ్ళటం జరిగింది. ఉత్సవాలు జరుగుతున్న సందర్భం అది. మమ్మల్ని వేదిక ప్రక్కనే ఉన్న ఒక గదిలో కూర్చోబెట్టారు. స్వామివారే ఆ గదిలోకి వచ్చారు. మా నాన్నగారు నన్ను పరిచయం చేశారు. "మీ అబ్బాయి నా కెందుకు తెలియదు? హైదరాబాద్ లో ఆ రోజు విమానంలో చూశాను గదా!" అన్నారు. నా కాశ్చర్యం వేసింది. అరనిమిషం సేపు వారిని కలవటం, వారు దానిని మననం చేసుకొని ప్రముఖంగా గుర్తు పెట్టుకోవటం నా అదృష్టంగా భావించాను.

ఆ తరువాత సాయిబాబా వారు, మీకు నమ్మకాలు లేవు కదా అని మా నాన్నగారితో అంటూ, మా అమ్మకు రుద్రాక్షలు, విబూది సృష్టించి ఇచ్చారు. మా అందరికీ విబూది ప్రసాదించారు.

యువతను సంస్కృతి పథం వైపు నడిపించాలని బాబా తాపత్రయం. వారి ప్రసంగాలలో గోచరించే "సంస్కృతి అంటే ఏమిటి? సంస్కరింపబడినదే సంస్కృతి. వరి పండుతుంది. దానిని అట్లే భుజిస్తున్నామా? గడ్డి నుండి ధాన్యము వేరు చేస్తున్నావు. ధాన్యము నుండి పొట్టును వేరు చేస్తున్నావు. బియ్యము నుండి అన్నము చేస్తున్నావు. అగ్ని పాకము జరిగిన తరువాతనే భుజిస్తున్నావు. అట్లా సంస్కారము జరిగిన తరువాత ఆహారముగా మారుతున్నది. సంస్కరించటం చేత విలువ పెరిగింది. సంస్కారము చేత విలువ పెరుగుతుంది. పరిశుద్ధము అవుతుంది. చెడ్డను దూరము చేసి మంచిని పోషించడమే సంస్కారము అని అర్థమయ్యే ఉపమానముతో బోధించారు. సౌందర్యము,

సౌశీల్యము, సౌజన్యము, సౌభ్రాతృత్వం – ఇవి ఎన్ని ఉండినప్పటికీ సంస్కృతి లేకుండిన ఇవన్నియు నిరుపయోగమని" బాబా వారు బోధించారు.

1926లో పెద్ద వెంకన్న రాజు ఈశ్వరమ్మ దంపతులకి. ఓ నిరుపేద వ్యవసాయ కుటుంబంలో అనంతపురం జిల్లాలోని పుట్టపర్తి అనే గ్రామంలో జన్మించిన సత్య సాయి బాబా అసలు పేరు సత్యనారాయణ రాజు.

20వ శతాబ్దంలో ప్రపంచంలోనే ప్రసిద్ధి చెందిన ఆధ్యాత్మిక గురువు సత్యసాయి. 2011 ఏప్రిల్ 23న నిర్యాణం చెందారు. వారి అస్తమయ వార్త విన్న వెంటనే పుట్టపర్తికి వెళ్ళి నివాళులర్పించాను. బాబా వారి పార్థివ దేహము చెంత కొన్ని గంటలు కూర్చుని అంజలి ఘటించాను. 20వ శతాబ్దంలో జన్మించిన ప్రపంచ ప్రసిద్ధి చెందిన మహోన్నత వ్యక్తికి కడసారి ప్రణామాలను అర్పించాను.



సత్యసాయిబాబాకి కృతజ్ఞతలు తెలుపుతున్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు



# జిల్లెళ్లమూడి అమ్మ

దివిసీమ ఉప్పెన సంభవించిన వెను వెంటనే జిల్లెళ్లమూడి అమ్మ ఉప్పెన బాధితులకు అందచేయటానికి నిత్యావసర వస్తువులు, పాత్ర సామాగ్రి తీసుకుని అవనిగడ్డకు వచ్చారు. దివిసీమ బాధితుల్ని పరామర్శించటానికి స్వయంగా వచ్చిన తొలి ఆధ్యాత్మికవేత్త జిల్లెళ్లమూడి అమ్మ!

ఆమె వచ్చిన సమయానికి గాంధీక్షేత్రంలో వేలాదిమంది బాధితులున్నారు. వారిని ఓదార్చి, తాను తీసుకువచ్చిన వస్తువులను వారికి అందించారు.

1976లో అనుకుంటా జిల్లెళ్లమూడి అమ్మ హైదరాబాద్ వచ్చారు. ఆ సమయంలో ఆమె ప్రసిద్ధ పత్రికా సంపాదకులు పొత్తూరు వెంకటేశ్వరరావుగారి ఇంటివద్ద బసచేశారు. మా నాన్న మండలి వెంకట కృష్ణారావుగారు అక్కడకు వెళ్లి మొదటిసారి అమ్మను కలుసుకున్నారు. వారితోపాటు నేను కూడా అమ్మ దర్శనానికి వెళ్లాను. స్వామీజీలు, బాబాలపట్ల మా నాన్నగారికి అంత నమ్మకం ఉండేది కాదు. కానీ, అమ్మను చూశాక ఆమె పట్ల ఆయనకు గౌరవభావం కలిగింది. ఆ తరువాత అమ్మ ఆహ్వానం మేరకు జిల్లెళ్లమూడి వెళ్లారు. అక్కడ నడుస్తున్న విద్యాలయాలను సందర్శించారు.

జిల్లెళ్లమూడి అమ్మ నిరతాన్న దాత. అమ్మ నిర్వహిస్తున్న అన్నపూర్ణాలయం మా నాన్నగారిని ఎక్కువ ఆకర్షించింది. తిరుమల తిరుపతి దేవస్థానంలో భక్తులకు అన్నదాన పథకం ప్రారంభించటానికి ఎన్నో ఏళ్లముందే ప్రతిరోజూ అన్నసమారాధనని అమ్మ ప్రారంభించి నిర్వహించారు. ఇప్పుడు అనేక దేవాలయాల్లో అన్నదాన కార్యక్రమం

జరుగుతోంది. అయితే, అమ్మ తన భక్తులకు అందిస్తున్నది అన్నదానం కాదు. ఇది తల్లి తన బిడ్డకు పెట్టుకోవటం లాంటిది. అది అన్నదానం ఎలా అవుతుంది..? అనేవారామె! "ఎవరి అన్నం వారు తింటున్నారు, ఒకరికి ఒకరు పెట్టడమేమున్నదీ?" అని! జిల్లెళ్లమూడి అమ్మలోని ఆ తల్లి హృదయం నాన్నగారిని ఎక్కువగా ఆకర్షింప చేసింది. జిల్లెళ్ళమూడి నుండి వచ్చాక నిరతాన్నదానం గురించి నాన్నగారు చాలా మందితో చేప్పేవారు. తన బిడ్డలు బాధతో ఉన్నారని, వారిని ఓదార్చాలని ఉప్పెన వెలిసిన వెంటనే హుటాహుటిన బయలుదేరి వచ్చిన అమ్మలోని ఆ తల్లిహృదయం నాన్నగారిని కదిలించివేసింది.

"సృష్టి స్థితి లయకారిణివి కదా... ఇంత ఘోరమైన పని ఎందుకు చేశావు, వేల సంఖ్యలో బాధితులు ఎలా అలమటిస్తున్నారో చూశావా..." అని ఎవరో అడిగితే, ఆమె అత్యున్నత ఆధ్యాత్మిక భావావేశంతో ఆర్ద్రంగా అన్నారు... "నిజమే నాన్నా! నీకు వీళ్లే కనిపిస్తున్నారు. కానీ, ఈ ప్రకృతి విలయతాండవానికి ఇంకా ఎన్నెన్ని జీవరాశులు ఎన్నెన్ని పశువులు, పక్షులు, పాములు, కప్పలు, ఎలుకలు, పురుగులు, చీమలు పిపీలకాది పర్యంతం సమస్త జీవరాశి, మొక్కలు, చెట్లు సమస్తమూ నశించిపోయాయి. వాటిగురించి ఎవరూ మాట్లాడటం లేదు కదా...మనిషి ప్రాణం ఒక్కటే కాదు, సమస్త ప్రాణాలూ గొప్పవే..." అంటూ వాటికోసం ఆమె పరితపించారని శ్రీ పి ఎస్ ఆర్ ఆంజనేయ శాస్త్రి వ్రాశారు.

"మాకు సాధన ఏమిటమ్మా?" అని భక్తులు అడిగితే, "అలసి సొలసి వచ్చిన వారికి మంచినీళ్లు, అన్నం పెట్టించటం కంటే సాధన ఏముంది..." అనేవారట అమ్మ. తాను ఆచరించి చూపించిన సత్యం ఇది.

జాతకాల మీద నమ్మకం ఉన్న ఒక భక్తుడు నీ రాశి ఏమిటమ్మా అనడిగితే, ఆమె ఠక్కున "బియ్యపు రాశి" అని సమాధానం ఇచ్చారట. ప్రపంచంలో ఎవరూ ఆకలితో లేకుండా ఉండే రోజు రావాలని అమ్మ కోరుకుంది. "అమ్మా! నీక్కూడా ఆశలు, అసంతృప్తులూ ఉన్నాయా అని ప్రశ్నిస్తే, "ఎందుకు లేవూ? మీ అందరికీ తృప్తిగా పెట్టుకోవాలని ఆశ, అందరికీ పెట్టుకోలేకపోతున్నాననే అసంతృప్తీ ఉన్నాయి" అని చెప్పారట అమ్మ.

అమ్మని ఆమె భక్తులు రాజరాజేశ్వరీ దేవి అవతారంగా భావిస్తారు. అమ్మలా ఈ జీవరాశిని పోషించటానికే ఆమె ఈ నేల మీద అవతరించారని భావిస్తారు. 28

మార్చి 1923లో మానవరూపంలో గుంటూరు జిల్లా మన్నవలో ఆమె జన్మించారు. ఆమె చిన్ననాటి నుండీ అనేక మహిమలు ప్రదర్శిస్తూ దైవత్వం కలిగిన వ్యక్తిగా గుర్తింపు పొందారు.

1936లో జిల్లెళ్లమూడి పెద్దగా ఉన్న నాగేశ్వరరావుగారితో ఆమెకు వివాహం జరిగింది. 1956 వరకూ ఆమె మామూలు గృహిణిగా జీవించారు. అయితే ఆమెలోని దైవత్వ చిహ్నాలను గుర్తించిన ప్రజలే వరుసగా వచ్చి ఆమెను దర్శించుకోవటం ప్రారంభించారు. కాలక్రమంలో ఆమె గురించిన ప్రచారం ఊపందుకోవటంతో దేశ విదేశాల్లో అనేకమంది భక్తులుగా వచ్చి అమ్మను ఆశ్రయించసాగారు.

తొలిరోజుల్లో వచ్చిన భక్తులందరికీ అమ్మ స్వయంగా వండి వడ్డించేది. వసతి కల్పించి ఆదరించేది. ఆమె ప్రబోధించే ఆధ్యాత్మిక అంశాలను ఆసక్తిగా వినేవారంతా!

భక్తుల తాకిడి పెరగటంతో ఆమె "అందరిల్లు" పేరుతో ఒక వసతి గృహాన్ని వ్యవస్థాపించారు. జాతి, మత, కుల, లింగ వివక్ష లేకుండా సమస్త మానవులు తన సన్నిధిలో విశ్వాత్మతా భావంతో కలిసి జీవించాలని ఆమె భావించారు. పోషించటం ఆశ్రయం ఇవ్వటం ఇవీ లక్ష్యాలు. సంస్కృతం, తెలుగు భాషలు చదివేందుకు మాతృశ్రీ విద్యా పరిషత్ పేరుతో ఒక కళాశాలను వ్యవస్థాపించారు. విద్య, వైద్య సదుపాయాలు, వృద్ధుల సేవ, మానవతా వికాసం వీటిని ఆమె నిరంతరం కొనసాగించారు. మాతృభావాన్ని, భారాన్ని వహించిన మహనీయమూర్తి అమ్మ!

"అన్ని బాధల కన్నా ఆకలి బాధ భయంకరమైనది. దుర్భరమైనది. అన్నం దొరకక ఎవరూ మరణించకూడదు" అంటూ అమ్మ వెలిగించిన పొయ్యి అరవై ఏళ్లుగా ఆరకుండా వెలుగుతూనే ఉంది.

"విన్నవాడు విమర్శిస్తాడు, కన్నవాడు వివరిస్తాడు" అనే వారట అమ్మ.

"అంతా భగవానుడే చేస్తున్నాడనుకో! తమ బతుకు బతకలేని బలహీనులు ఉన్నారు. వారికి తోడ్పాటునందించు. ఈ సృష్టీ భగవంతుడే! సమాజసేవ ఈశ్వర సేవే! ఆ సేవ కలిగించే తృప్తే ఆనందం. అదే ఐశ్వర్యం. తృప్తే ముక్తి" అన్న అమ్మ బోధన నిత్య సత్యం!

దివిసీమ ఉప్పెనలో ఆర్త జనులను తన మాతృహృదయంతో ఓదార్చి వారిలో మనస్థైర్యాన్ని పెంచిన మహోన్నత మానవతామూర్తి జిల్లెళ్ళమూడి అమ్మ.





జిల్లెళ్ళమూడి అమ్మతో శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు



# స్వామీ రంగనాథానంద

వ్యక్తులు లేకపోతే సంస్థకు ఉనికి లేదు. సంస్థ లేకపోతే వ్యక్తులకు అస్తిత్వం లేదు. వ్యక్తులవలన సంస్థకీ సంస్థవలన వ్యక్తులకీ సమానంగా ప్రతిష్ఠ కలిగిన సందర్భాలు అరుదుగా కనిపిస్తాయి. స్వామీ రంగనాథానంద అంతర్జాతీయ రామకృష్ణ మఠానికి అంతటి పేరుప్రఖ్యాతులు సముపార్జించిపెట్టిన గొప్ప ఆధ్యాత్మికవాది.

వివేకానందుడి తరువాత శ్రీ రామకృష్ణ పరమహంస బోధనల్ని తన రచనలు, ప్రసంగాల ద్వారా ప్రపంచ పరివ్యాప్తం చేసిన యతిశ్రేష్ఠుడు స్వామీ రంగనాథానంద.

మానవసేవే మాధవసేవ అనే వివేకానంద సూక్తిని ఆచరణలోకి తెచ్చిన మహెూన్నతుడాయన!

దివిసీమ ఉప్పెన అనంతరం అక్కడ జరగవలసిన అతి ముఖ్యమైన సేవ పునర్నిర్మాణం అనే ఆలోచనను తొలుత కలిగించింది స్వామీజీయే! అంతేకాదు, దివిసీమని దివ్యసీమగా రూపొందించటంలో రామకృష్ణ మఠం కమిటీ నిర్వహించిన పాత్ర ప్రముఖమైంది కూడా!

1978 జనవరి 2వ తేదీన ఉప్పెనలో పూర్తిగా కనుమరుగైన గొల్లపాలెం గ్రామాన్ని రామకృష్ణ పురం పేరిట పునర్నిర్మించటానికి స్వామీజీ అంకురార్పణ చేశారు. తుపాను పునరావాస కేంద్రాల నిర్మాణంతోపాటు ఉప్పెనకు దెబ్బతిన్న గ్రామాల అభివృద్ధి ప్రణాళికను కూడా రూపొందించారాయన.

స్వామీ రంగనాథానంద రచనలతో ప్రభావితులైన లక్షలాదిమందిలో నేనూ ఒకణ్ణి! నిర్వేదం, నిరాశల్ని ఆయన చావుకన్నా విషాదకరమైనవిగా భావిస్తారు.

"వివేకానందుడి అభిప్రాయం ప్రకారం, మనిషి శారీరకంగా నిక్షేపంగా బతికినా నిరాశపడటం మానసికంగా ఆధ్యాత్మికంగా చావడం వంటిది" అంటారాయన. బాధితులు తమ ఆధ్యాత్మికశక్తితో, మనోబలంతో, మనోనిబ్బరంతో విషాదాన్ని ఎదుర్కోవాలని బాధితులకు ధైర్యం చెప్పారు.

"నా ముందు ఇక్కడ సామాన్య మానవుని కోసం పలుకార్యక్రమాల్లో సేవలో నిమగ్నులయిన వారిని చాలామందిని నేను చూస్తున్నాను. కనుక నాకు నిజంగా జీవిస్తున్న వారి మధ్య ఉన్న భావన కలుగుతోంది. ఆ భావన నాకు ఉత్తేజాన్నిస్తోంది." అని వ్రాసుకున్నారాయన.

"ఈ పునరావాస పనులు మొదట గుజరాతులో జరిగాయి. ఇప్పుడు పెద్ద ఎత్తున ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో మారుమూలప్రాంతాల్లో పునర్నిర్మాణ కార్యక్రమాలకు 1100 ఆర్.సి.సి.పక్కా ఇళ్ల నిర్మాణం కోసం 60 లక్షలకు పైగా రూపాయల ఖర్చు అవుతున్నాయి. మేము ఇళ్లు కట్టేయ్యడంతో పాటు కొత్త ఇళ్లలోకి పోయాక వారి జీవితములు ఇంకా సుఖమయం, సార్థకం అయ్యేందుకు కావాల్సిన అనుబంధ సేవలనుకూడ దృష్టిలో ఉంచుకున్నాము. ఈ విషయమంతా ఆలోచించి సమగ్ర గ్రామీణ వికాస పరిశోధన పథకాన్ని త్వరగా అమలు చేయడానికి వీలయ్యేట్లుగా రూపొందించాము. ఈ పథకానికి "గ్రామశ్రీ" అని సార్థకమయిన పేరుంది. పల్లెటూళ్లకు సిరిని, శోభను తీసుకురావటం అని దీని అర్థం. మనదేశంలోని చాలా గ్రామాల్లో అదొక్కటే ఇంతవరకూ లేనిది. మన సంప్రదాయంలో శ్రీ భావన ఎంతో అందమయినది! శ్రీ అంటే సొగసు అనికూడా అర్థం" అంటూ, దివి ఉప్పెన బాధితుల పునరావాస కార్యక్రమాలకు ఆయన గ్రామశ్రీ పథకం అని పేరుపెట్టి తక్షణం గృహాల నిర్మాణ కార్యక్రమాల కోసం రంగంలోకి దిగారు.

సంపూర్ణ గ్రామాభివృద్ధి కార్యక్రమానికి అంగాలయిన విద్య, ఆర్థిక చర్యలు, సాంస్కృతిక అభివృద్ధి, ఆరోగ్యం, పరిసరాల పరిశుభ్రత, యువసంక్షేమం, కుటుంబ నియంత్రణ మొదలైనవన్నీ మిళితమై ఉండేలా ఆయన గ్రామాల కార్యాచరణను ప్రకటించారు.

స్వామీజీ ప్రతిపాదించిన ఈ గ్రామశ్రీ పథకం మానవవికాసానికి గుణాత్మకమైన పెంపుదల కోసం అంకితమైనది. "సమగ్రమానవ వికాసం, సంక్షేమాలే శ్రీ అంటే"

అనేది ఆయన సిద్ధాంతం. అది గ్రామస్థాయినుంచి ప్రారంభం కావాలంటారాయన. విజయవాడలోని రామకృష్ణ మిషను కార్యకర్తలు ఈ గ్రామశ్రీ పథకాన్ని పర్యవేక్షించారు.

మనజాతీయ కార్యక్రమాలు పరిసరాల శుభ్రతను, ఆరోగ్యాన్ని అలక్ష్యం చేశాయని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. ఈ కారణం వలనే ఆరోగ్య రక్షణ పథకాలన్నీ ఫలితం శూన్యంగా మారాయంటారు. నదులు, కాలువల తీరాల్ని, రైలు కట్టల్ని, రహదారుల్ని మలమూత్రాలు విసర్జించేందుకు వాడుకునే అలవాటు మాన్పించాలని ఆయన అనేవారు. పరిసరాల పరిశుభ్రతను పాటించేలా తగిన శిక్షణ ఇవ్వాలనేది ఆయన కోరిక. పరిసరాల పరిశుభ్రతను పాటింపచేయటాన్ని ఆయన సాంఘిక విప్లవానికి మొదటి అడుగుగా భావించారు.

కొంతమంది వ్యక్తులు తాము ఆహారం తింటున్నప్పుడు ఇతరులు చూడకూడ దనుకొంటూ ఉంటారు. కానీ, మలమూత్రాల్ని మాత్రం బహిరంగంగా విసర్జిస్తారు. బహిరంగంగా తినటం, చాటుగా మలమూత్రాలకు వెళ్లటం మంచిదని సూచించేవారు.

మనిషిని ఇంకా మంచివానిగా ఉన్నతునిగా, నిర్మలునిగా చేయటం అనే అంశానికే ప్రాధాన్యం ఇచ్చారాయన. బాగా బతకడం మీద సరైన అవగాహన లేకపోవడం వలన పల్లెటూరువాళ్లూ, పట్నం కూలీలు తాము సంపాదించే దాంట్లో చాలా డబ్బు వృథా అవుతోందంటారాయన.

ప్రతీ మనిషిలోనూ దైవత్వం ఉంటుందనీ, దాన్ని మేల్కొలిపే ప్రయత్నం చేయాలనీ స్వామీ వివేకానంద చెప్పిన సూక్తికి అనుకూలంగా ప్రజల్లో భౌతికమైన శారీరకమైన వాటిని మించిన అందాన్ని, నైతిక విలువల్ని, ఆధ్యాత్మిక విస్తారాన్ని గుర్తింప చేయాలని స్వామీజీ సూచించేవారు. ఎవరికివారు తమలో దైవత్వాన్ని మేల్కొల్ప గలగాలంటే ఇలా జరగాలి. గ్రామశ్రీ పథకాన్ని ఈ దృష్టితోనే ఆయన రూపొందించారు.

మనిషి మానవుడై ఎదగాలంటే, సంపూర్ణ మానవ వికాస కార్యక్రమం చేపట్టాలని స్వామీ రంగనాథానంద ప్రబోధంలోని ఆంతర్యం మనోనేత్రంతో అర్థం చేసుకోగలగాలి. "ప్రతివారిలో ఆత్మ అనే దివ్యమయిన నిప్పుకణిక ఉంది. కాని, ఇది అజ్ఞానమనే నివురుగప్పి ఉంది. బూడిదను ఊదేస్తే, ఎల్లప్పుడూ ఉండే ఆత్మజ్ఞానమనే నిప్పు మళ్లీ ధగధగమంటుంది..." అని మారుతున్న సమాజానికి శాశ్వత విలువలు అనే గ్రంథంలో స్వామీ రంగనాథానంద వ్రాసుకున్నారు.

దివిసీమలోని 10 గ్రామాలు, బాపట్లలోని ఆదివాసీ తండాను గ్రామశ్రీ

పథకంలో దత్తత తీసుకున్నారు. ఈ సంస్థ రామకృష్ణ మిషను ఆధ్వర్యంలో తుపాను బాధితులకు పక్కా ఇళ్ల నిర్మాణం పథకం చేపట్టింది.

గ్రామశ్రీ ద్వారా పునర్నిర్మించిన మూడు గ్రామాల ప్రారంభోత్సవానికి స్వామీజీ దివిసీమ వచ్చారు. ఆ మూడు ఊళ్లలో ఒకదానికి వివేకానందపురం అని నామకరణం చేశారు. కాంతీభాయిగారు కూడా ఆ సభలో స్వామీజీతో పాల్గొన్నారు. రామకృష్ణమిషను వారు కట్టిన దేవాలయాలుగా ఈ నిర్మాణాలను స్వామీజీ సంభావించారు.

కుటుంబానికో పక్కా ఇల్లు, కొంచెం భూమి, విపత్తులు వచ్చినప్పుడు ఊరంతా తలదాచుకునేందుకు రెండంతస్థుల సాంఘిక రక్షణ భవనం, ఒక కొత్త దేవాలయం అలాగే, ప్రజలు సిరితోపాటు సరస్వతిని కూడా ఆరాధించాలని రంగనాథానంద ఆ రోజున తన మహోపన్యాసంలో ఉద్బోధించారు. వేలాదిగా తరలి వచ్చిన ప్రజలు ఆసక్తిగా వారి ఉపన్యాసం విన్నారు.

"లక్ష్మి ఉన్నచోట సరస్వతి ఉండదనే భావన తప్పు అని ప్రకటించారు. లక్ష్మీ సరస్వతుల్ని ఒకేచోట నిలపగలిగేలా చూడాలన్నారు. సరస్వతి ఉన్న చోటుకు లక్ష్మి తనకుతానై నడిచి వస్తుంది ఆ ఇద్దరూ అక్కచెల్లెళ్ళే వారిని మన ఊళ్లోకి, కుటుంబాల్లోకి ప్రవేశపెట్టేదాకా భారతదేశంలో సిరి కలగబోదు" అని ప్రబోధించారు.

ఆ రోజున స్వామీజీ ప్రసంగం మహోద్విగ్నంగా సాగింది. "నిగ్గుదేలిన ప్రామాణికమయిన విద్యా విజ్ఞానం నుండే సమస్త మానవ సంపద సంక్షేమం ప్రభవిస్తాయి. కనుక, మానవునికి సంబంధించినంతమేరకు మొదటి సంపద విజ్ఞానం- విద్య. తదుపరి సంపద సంక్షేమం- అది "శ్రీ" అంటే! అంటూ తన గ్రామశ్రీ పథకం లక్ష్యాన్ని జనసామాన్యానికి అర్థం అయ్యేలా వివరించారు రంగనాథానంద స్వామీజి.

దివిసీమ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని కేవలం ఇళ్లు కట్టించి ఇచ్చే సేవా కార్యక్రమంగా కాక, సర్వోన్నత మానవీయత నెలకొల్పే లక్ష్యంగా స్వామీ రంగనాథానంద భావించారు. ఆధ్యాత్మిక దృష్టితో చూడటం అంటే మతదృష్టితో చూడటం కాదని ఆయన నిరూపించారు. అత్యున్నత తాత్త్వికత ఆయన గ్రామశ్రీ పథకంలో మనం గమనించవచ్చు.

1973నాటికి జంట నగరాల్లో రెండు రామకృష్ణ మఠాలుండేవి. స్వామి యతీశ్వరానంద మహరాజ్ హైదరాబాద్ వచ్చినపుడు ఆయన సమక్షంలో రెండు సంస్థలూ ఒక్కటయ్యాయి. అప్పటి నుంచీ దాదాపు రెండు దశాబ్దాలపాటు స్వామి

రంగనాథానంద దానికి అధ్యక్షులుగా ఉన్నారు. దశాబ్దాల పాటు మఠం విస్తరణలో ఆయన చేసిన కృషి గొప్పది.

శ్రీ జలగం వెంగళరావు ప్రభుత్వం లోయర్ ట్యాంక్‌బండ్ ప్రాంతంలో ఈ మఠానికి ఎనిమిది ఎకరాల భూమి కేటాయించింది. సన్యాసులు, భక్తులు, స్వచ్ఛందంగా పూనికుని ఆ స్థలాన్ని బాగుచేయించి వాడకానికి తెచ్చారు.

రామకృష్ణ మఠానికి దేశ వ్యాప్తంగా 120, విదేశాల్లో 40 కేంద్రాలున్నాయి వీటికి తోడు భక్తులు ఏర్పాటు చేసుకున్న సేవా కేంద్రాలు అనేకం వున్నాయి. కర్ణాటకలోని బేలూరులో ప్రధాన మఠం ఉంది. మన రాష్ట్రంలో హైదరాబాద్‘తోపాటు విశాఖ, రాజమండ్రి, విజయవాడ, కడప పట్టణాలలో శాఖలున్నాయి.

సమాజానికి భౌతికంగా, మానసికంగా, సాంప్రదాయకంగా, ఆధ్యాత్మికంగా సాయపడటం ఈ సంస్థ లక్ష్యం. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న రామకృష్ణ మఠాల్లో సుమారు పదకొండు వందలమంది సన్యాసులు ఉన్నారు. అందులో చాలామంది ఉన్నత విద్యావంతులు. హెూదాల్నీ, ఆస్తిపాస్తుల్నీ వదులుకుని వచ్చినవారే.

వివేకానందుడు ప్రవచించిన అన్నదానం, విద్యాదానం, జ్ఞానదానం అనే వాటికి ప్రతిరూపాలుగా దివి ఉప్పెన తర్వాత పునర్నిర్మాణ కార్యక్రమం చేపట్టింది. ఇవి. దరిద్రుల్ని, మూర్ఖుల్ని, రోగుల్ని దైవంగా భావించి సేవ చేయాలనేది ముఖ్య లక్ష్యం. అక్కడ నిర్మితమైన శ్రీ రామకృష్ణ దేవాలయమ్ ప్రధాన ఆకర్షణ. పెద్ద గ్రంథాలయం ఆడిటోరియం, వివేకానంద ఇనిస్ట్యూట్ ఆ హ్యూమన్ ఎక్స్ లెన్స్ వివిధ భాషలను నేర్పే భాషా సంస్థలను స్వామి రంగనాథ నెలకొల్పారు. రామకృష్ణ మఠం ప్రారంభోత్సవాల్లో పాల్గొనే మహద్భాగ్యం నాకు కలిగింది.

ఈ సంస్థ ప్రారంభించినప్పటి నుంచీ ప్రకృతి విపత్తులు సంభవించినప్పుడల్లా సహాయక చర్యల కోసం పెద్ద మొత్తంలో నిధులను సమకూరుస్తున్నది.

1977-79 లో దివిసీమలో తుపాను చెలరేగినప్పుడు, 1993-96 లో లాతూరులో భూకంపం సంభవించినపుడు, 2004 లో సునామీ సంభవించినపుడు ఈ సంస్థ ఎనలేని సహాయం చేసింది. సంస్థకు కేవలం భారతదేశం నలుమూలల నుండే కాక విదేశాల నుంచి కూడా విరాళాలు అందుతాయి.

స్వామీ రంగనాథానంద అసలు పేరు శంకరన్ కుట్టి. కేరళ రాష్ట్రంలోని త్రిసూర్ గ్రామంలో 1908 డిసెంబరు 15న జన్మించారు. 5-6 తరగతుల వరకే చదివారు. 18 ఏళ్ళ వయసులోనే మైసూరు రామకృష్ణ మఠంలో చేరి పాత్రలు తోమటం,

వంట చేయటం, బట్టలు ఉతకటం లాంటి పనులు చేయడం ద్వారా ఆధ్యాత్మిక సేవామార్గంలోకి అడుగుపెట్టారు.

రామకృష్ణ మఠంలో ఆయనకు ఉపనిషత్తులు, గీత, ఇతిహాసాలు, భారతీయ సాంస్కృతిక చరిత్ర, సంస్కృత సాహిత్యం, రామకృష్ణ - వివేకానందుల సాహిత్యాన్ని చదివే అవకాశం బాగా కలిగింది. ఆంగ్లభాష మీద చక్కని పట్టు సాధించారు.

శ్రీ రామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యులు శ్రీ శివానంద స్వామిజీ శంకరన్‌కి రంగనాథస్వామి అనే పేరుపెట్టి, సన్యాస దీక్ష ఇచ్చారు.

రెండవ ప్రపంచ యుద్ధం రోజుల్లో రంగూన్ లోని రామకృష్ణ మఠానికి కార్యదర్శిగా ఉన్నారు. దేశ విభజన రోజుల్లో కరాచీ రామకృష్ణమఠం కార్యదర్శిగా ఉన్నారు 1948 తరువాత ఢిల్లీ రామకృష్ణ మిషనుకి కార్యదర్శిగా ఉండి ఆ కేంద్రాన్ని అభివృద్ధి పరిచారు. 1962 నుంచి 67 వరకు కలకత్తా రామకృష్ణ మిషన్ సాంస్కృతిక అధ్యయనం కేంద్రం కార్యదర్శిగా వెళ్ళారు. 1998లో అధ్యక్షులుగా కలకత్తాలోని బేలూరు మఠానికి వెళ్ళారు. ఇందిరాగాంధీ జాతీయ ఐక్యతా పురస్కారం (1986), గాంధీ శాంతి పురస్కారం(1999) పొందారు.

సేవకు పరమార్థాన్ని చాటిచెప్పిన మహోన్నత మానవీయతామూర్తి స్వామీ రంగనాథానంద.




*నరేంద్రపురం ప్రారంభిస్తున్న స్వామి రంగనాథానంద, శ్రీ మండలి వెంకటకృష్ణారావు*



అనాధపిల్లలతో సంభాషిస్తున్న స్వామి రంగనాధానంద, శ్రీ మండలి వెంకటకృష్ణారావు, స్వామి సదానంద



# స్వామి బోధస్వరూపానంద

"నడవండీ! ఎక్కడెక్కడ మహమ్మారి క్షామాలు చెలరేగుతున్నాయో, ఎక్కడెక్కడ ప్రజలు మనస్థాపాన్ని పొందుతున్నారో, మీరంతా అక్కడికే నడవండి...! వాళ్ల వ్యథల్ని ఉపశమింపచేయండి. ఒకవేళ ఆ సేవలో నిమగ్నమై మీరు ప్రాణాలను కోల్పోవచ్చు... అయితేనేం...? ప్రతి నిత్యం ఎన్నెన్ని ప్రాణులు పుట్టటం లేదూ...గిట్టటం లేదూ...??? దానివలన విశాల విశ్వానికేమైనా లోటు కలిగిందా? చావనేది ఎప్పటికైనా తప్పదు. చావటం మీద కన్నా గొప్ప ఆదర్శాన్ని ఏర్పరచుకుని ఆ ఆదర్శ సాధనలో మృత్యువు నొందటం ధన్యత అవుతుంది" అనే స్వామి వివేకానంద సందేశాన్ని చిత్తశుద్ధితో స్వీకరించి జీవితాన్ని పావనం చేసుకున్న వారు సేవామూర్తి స్వామి బోధ స్వరూపానంద!

"మానవ సేవే మాధవసేవ" అనే సిద్ధాంతానికి అనుగుణంగా వివేకానందులు రామకృష్ణ మిషన్ని వ్యవస్థాపించారు. ఆనాటి నుండి ఆర్తజనులకు సేవలందించటమే ఒక నిరంతర కార్యంగా, ఐహికసుఖాలను త్యజించి, త్యాగనిరతితో జీవితాన్ని సేవకు అంకితం చేసిన వారిలో స్వామి బోధ స్వరూపానంద ముఖ్యులు.

దివిసీమ ఉప్పెనలో పక్కా ఇళ్ళ నిర్మాణానికి నాంది పలికిన సేవామూర్తి బోధస్వరూపానంద. తుఫాను ఉధృతి ఆగగానే రాజమండ్రి రామకృష్ణ మిషన్‌లో ఉన్న స్వామి భోధస్వరూపానంద, కార్యదర్శి స్వామి నందానందతో సంప్రదించి, ఇద్దరు ముగ్గురు బ్రహ్మచారులను తీసుకుని విజయవాడ చేరారు. అజిత్‌నగర్ లో సహాయ కార్యక్రమాలు ప్రారంభించారు. గుంటూరు వెళ్లి నల్లచెరువు, చుట్టుగుంటలలో

సేవా కార్యక్రమాలు కొనసాగించారు. బాపట్ల వెళ్లి భీమవారిపాలెం, ఉప్పరపాలెం, రైలుపేట, చిల్లరగొల్లపాలెం, గోవిందానగర్ కాలనీలలో సహాయం చేశారు. మచిలీపట్నం వెళ్లి రిలీఫ్ క్యాంపులలో ఉన్నవారికి చాపలు కొని ఇచ్చారు.

26వ తేదీ ఉదయం శ్రీ కె.ఎల్. రావుగారితో కలిసి స్వామి బోధస్వరూపానంద అవనిగడ్డకు వచ్చారు. శవాలను తొలగించటానికి శవసేన కార్యకర్తలను దళాలుగా ఏర్పాటు చేస్తున్న సమయంలో, మండలి వెంకట కృష్ణారావుగారిని కలుసుకున్నారు.

మానాన్నగారు వారిని కోడూరు ప్రాంతానికి వెళ్లవలసినదిగా సూచించారు. కృష్ణాపురం నుండి కోడూరు వరకు రోడ్డు, కాలవగట్లు, ఇండ్లకప్పులు శవాలతో కప్పబడి ఉన్నాయి. వాటిని ఆ రోజే తొలగిస్తున్నారు. ఆ భీభత్స దృశ్యాలను చూచి ఆయన చలించిపోయారు. నిరాధారులైన ఆత్మీయులను కోల్పోయిన వేలాది జనం కిక్కిరిసి ఉన్న కోడూరు బజారులో వారిని చూసి ఓదారుస్తూ, కోడూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని చేరారు. అక్కడ ఇసుక దిబ్బల మీద స్థావరం ఏర్పాటు చేసుకున్నారు. కోడూరు చుట్టుపక్కల పూర్తిగా ఊడ్చుకొని పోయిన పది గ్రామాల ప్రజలకు బియ్యం, పప్పు, పచారి దినుసులు, కూరగాయలు పంచిపెట్టారు. దుప్పట్లు, బట్టలు, పాత్రలు ఇచ్చారు. 5 లక్షల రూపాయల విలువగల తాత్కాలిక సహాయాన్ని 3 నెలల పాటు ఇచ్చి ప్రజలను పోషించారు.

తీరప్రాంతాలలో తరచూ తుఫానుల వలన ప్రజలు కష్టనష్టాలకు గురౌతున్నారు. ఇండ్లు పడిపోతున్నాయి. ఆర్.సి.సి. స్లాబుతో ఇల్లు కడితే ప్రతీఇంటికీ 2,500 రూపాయలు చొప్పున ఇవ్వటానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయాలు బోధస్వరూపానంద స్వామికి ఉత్సాహాన్ని ఇచ్చాయి. వేయి ఇళ్ళు కడతానని చెప్పారు. అడ్వాన్సుగా ముఖ్యమంత్రి నిధి నుంచి 10 లక్షలు ఇచ్చారు. మద్రాసు వెళ్లి స్వామి ఉద్ధవానంద సహకారంతో ఇంజనీర్లను సంప్రదించి, తుఫానులకు తట్టుకునే విధంగా ఇంటి నమూనా తయారు చేయించి తీసుకువచ్చారు. రూ. 5,000లతో ఒక ఇల్లు అవుతుందని ఎస్టిమేట్ వేశారు.

మొట్టమొదటి పక్కా ఇండ్ల నిర్మాణ కార్యక్రమానికి 1978, జనవరి 1వ తేదీన పాలకాయతిప్పలో పునాదిరాయిని మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావు గారు వేశారు. 2వ తేదీన గొల్లపాలెంలో స్వామి రంగనాథానంద శంఖుస్థాపన చేశారు. పులిగడ్డ వద్ద సిమెంట్ రాళ్ళు తయారు చేసే కర్మాగారాన్ని నెలకొల్పారు.

గ్రామాన్నంతా బుల్‌డోజర్‌లతో చదును చేసి ప్రతీ ఇంటికి రోడ్డు సదుపాయం ఉండేటట్లు తీర్చిదిద్దారు. గ్రామాల నిర్మాణం ప్రారంభించబడింది. సహాయ కార్యక్రమాల లోనూ, శాశ్వత నిర్మాణ పథకాలను రూపొందించడంలోను నిర్విరామ కృషి సల్పిన స్వామి బోధస్వరూపానందకు అనారోగ్యం కలిగినందున, రాజమండ్రి రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి నందనానంద తాత్కాలికంగా నిర్మాణ బాధ్యతలను రామకృష్ణ మిషన్ లో పని చేస్తున్న స్వామి ప్రథమానంద శాశ్వత గృహనిర్మాణ పథకాల బాధ్యతను స్వీకరించారు.

గ్రామాలకు సరియైన రోడ్లు లేవు. మట్టి రోడ్లన్నీ గండ్లు పూడ్చినా లారీలు వెళ్ళలేక పోయేవి. మంచినీరు లేదు. ఇండ్లు కట్టే సముద్రతీర గ్రామాలలో ఉండటానికి అవకాశాలు లేవు. అటువంటి క్లిష్ట పరిస్థితులలో స్వామి ప్రథమానంద దీక్ష వహించి అహోరాత్రులు రామక ృష్ణ మిషన్ కార్యకర్తలను ఉత్సాహపరచి 18 నెలలకాలంలో 1105 ఇండ్లు కట్టించారు.

229 ఇండ్లతో కట్టిన గొల్లపాలెం గ్రామానికి 1978 నవంబరులో ప్రధాని శ్రీ మురార్జీ దేశాయ్ ప్రారంభోత్సవం చేసి రామకృష్ణపురం అని పేరు పెట్టారు.

143 ఇండ్లతో కట్టబడిన వివేకానందపురానికి రామకృష్ణ మిషన్ కార్యదర్శి శ్రీ స్వామి గంభీరానంద ఫిబ్రవరిలో ప్రారంభోత్సవం చేశారు. 137 ఇండ్లు గల శారదాపురానికి (ఊటగుండం) మార్చిలో రామకృష్ణ మిషన్ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ మహారాజ్ ప్రారంభోత్సవం చేశారు.

112 ఇండ్లతో పాలకాయతిప్ప పరమహంసపురంగా, 114 ఇండ్లతో ఉల్లిపాలెం నరేంద్రపురంగా రూపొందించబడ్డాయి.

స్వతంత్రపురంలో 112 ఇండ్లు, శ్రీరామపురంలో 41 ఇండ్లు, బస్వాని పాలెంలో 28 ఇండ్లు, కృష్ణాపురంలో 22 ఇండ్లు, బాపట్ల యానాది కాలనీలో వంద ఇండ్లు మొత్తం 1105 ఇండ్లు కట్టారు.

ఈ నిర్మాణ పథకాన్ని రూపొందించిన స్వామి బోధస్వరూపానంద జ్ఞాపకంగా బస్వానిపాలెం పేరును బోధస్వరూపపురంగాను, ఈ పథకాన్ని జయప్రదంగా పూర్తి చేసిన స్వామి ప్రథమానంద (ప్రీతమ్ మహారాజ్) జ్ఞాపకార్థం పిండివారిదిబ్బను ప్రీతమ్ పురంగాను పిలవాలని స్థానిక ప్రజలు నిర్ణయించుకున్నారు.

గొల్లపాలెం, ఇరాలి, పాలకాయతిప్పలలో తుఫాను రక్షణ కేంద్రాలను నిర్మించారు.

ఇరాలి, శ్రీరామపురం, పాలకాయతిప్ప, కోడూరు, బాపట్ల యానాది కాలనీలలో దేవాలయాలను, ఒక చర్చిని నిర్మించారు. కోడూరు హైస్కూళ్లలో ఓపెన్ ఎయిర్ థియేటర్లను నిర్మించారు.

అవనిగడ్డ సేవాశ్రమంలో మంచినీటి సరఫరా పథకం ఏర్పాటు చేశారు. అన్ని గ్రామాలలోను పంచాయితీరాజ్ డిపార్ట్ మెంట్ వారు రోడ్డు వేయించారు. ఎలక్ట్రిసిటి డిపార్ట్ మెంట్ వారు వీధి దీపాలు వేశారు. నిర్మాణమైన ప్రతి ఇంటికి ఎలక్ట్రిసిటి ఇవ్వడానికి రామకృష్ణ మిషన్ వారు ఎలక్ట్రిసిటి డిపార్ట్మెంటు వారికి డబ్బు కట్టారు. ఫారెస్టు డిపార్ట్ మెంటువారు మొక్కలు ఇచ్చారు. ఈ నిర్మాణ కార్యక్రమాలన్నింటిని పూర్తి చేసిన తరువాత, జూలై 25వ తేదీన ఆనాటి కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ మోహన్ కందా అధ్యక్షతన స్వామి ప్రథమానందకు, స్వామి బోధస్వరూపానందకు కృతజ్ఞతలను తెలియజేసి స్థానిక ప్రజలు వీడ్కోలు ఇచ్చారు.

ఈ బృహత్తర నిర్మాణ పథకానికి 70 లక్షలు ఖర్చు అయింది. ప్రభుత్వం 20 లక్షలు ఇచ్చింది. ఆంధ్రప్రభ ఆరున్నర లక్షలు, ఈనాడు మూడు లక్షలు, ఎన్.టి.ఆర్., ఏయన్నార్‌లు దాదాపు 9 లక్షలు, దక్కన్ క్రానికల్ బెంగుళూరు జిందాల్ పరిశ్రమ, సింధీ అసోసియేషన్ చెరొక రెండేసి లక్షలు, అమెరికా తెలుగు అసోసియేషన్, ఏలూరు జగత్ మిల్లు లక్ష వంతున, ఇంకా చిన్న చిన్న మొత్తాలుగా విరాళాలు ఇచ్చారు.

రామకృష్ణ మిషన్ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ, సహాయ కార్యదర్శి స్వామి గహనానందాజీ, స్వామి ఆత్మస్థానందాజీ, హైదరాబాద్‌లో ఉన్న రామకృష్ణ మిషన్ అధిపతులు స్వామి రంగానాథానందజీ, వివిధ ప్రాంతాలలోని రామకృష్ణ మిషన్ స్వామీజీలు ఎందరో వచ్చి ఈ కార్యక్రమాలను చూసి ఆనందించారు. ఆ సందర్భాల్లో వారిని దర్శించి వారి సందేశాలను వినే మహద్భాగ్యం నాకు కలిగింది.

సర్వాంగసుందరంగా నిర్మించిన ఈ గ్రామాలలో నివసించే ప్రజల ఆర్థిక స్తోమతులను పెంచేటందుకు కోడూరు పంచాయితీ వారు ఇచ్చిన ఐదు ఎకరాలలో శారదాశ్రమం ఏర్పాటు చేసి బొంబాయి వాణిజ్యవేత్త శ్రీ ష్రాఫ్ ఆధ్వర్యంలో, స్వామి రంగనాథానంద స్వామీజీ ఆలోచనలకు ప్రతిరూపంగా 'గ్రామశ్రీ సొసైటీ'ని స్థాపించారు. శ్రీ కుప్పా వెంకటరామశాస్త్రిగారు సహాయ కార్యదర్శిగా ఉండి నిర్వహించారు.

సమాజసేవ చరిత్రలో రామకృష్ణ మిషన్ వారు చేసిన ఈ బృహత్తర మానవసేవ సువర్ణాక్షరాలతో లిఖించబడగలదు.

అయితే ఇది అనుకున్నంత తేలికగా దానికదిగా జరిగిపోయిన విషయం కాదు. స్వామీజీ నిద్రాహారాలు మాని పని చేశారు. అనారోగ్యాన్ని లెక్కచేయకుండా కష్టించారు. అనుకున్న లక్ష్యాన్ని వేగంగా దాటాలనే ఆయన సంకల్పం ముందు వ్యక్తిగత అనారోగ్యం లెక్కలోది కాకుండాపోయింది. గ్రామాల వెంట కాలినడకన బాగా తిరిగారు.

వివేకానందుల వాక్కే ఆయనకు శిరోధార్యం. "ఆర్తజన సేవలో మరణిస్తే మాత్రం ఏమిటీ...? మనవల్ల జనసామాన్యానికి మేలు కలుగుతోంది"...అనే భావన ఆయన్ని మృత్యువుకు మరింత దగ్గర చేసింది.

చివరికి ఆయన తీవ్రమైన గుండె జబ్బుకు గురయ్యారు. అయినా మనోధైర్యాన్ని కోల్పోలేదు. పని చేయటానికి శరీరం సహకరించక పోయినా మనసు పీడిత ప్రజల చుట్టూనే తిరిగింది.

గుండె జబ్బు ఎక్కువైతే, మద్రాసు రామకృష్ణ మిషన్ ఆసుపత్రిలో చేర్చారు. అనేకసార్లు మా నాన్నగారితో పాటు మద్రాసు వెళ్ళి ఆయన్ను పరామర్శించి వచ్చాను. తరువాత మరొకసారి ఆసుపత్రికి వెడితే అంతకు రెండు రోజుల క్రితమే స్వామీజీ త్రివేంద్రం వెళ్ళారని స్వామి ఉద్యానందగారు చెప్పారు.

ఆరోగ్యం కుదుటబడితే క్షణం విశ్రాంతి తీసుకోకుండా తిరిగి పనిలోకి ఉద్యుక్తులయ్యే స్వభావం ఆయనది. అలాగే త్రివేంద్రం వెళ్లి ఉంటారని అనుకున్నాను. కానీ, అదే ఆఖరి పర్యటన అని, ఆయన తిరిగి మద్రాసుకు రారనీ, దూరతీరాలకు వెళ్లి పోతారనీ ఆనాడు నేను కలలో కూడా అనుకోలేదు. మళ్లీ ఆయన్ని చూడ లేకపోతాననే భావనే నాకు భరించరాని దయ్యింది.

త్రివేంద్రం రామకృష్ణా మిషన్ వారి చిత్రా మెడికల్ సెంటర్లో చికిత్స పొందుతూ 1981, జూలై 4న ఆయన కన్నుమూశారు. పూర్వాశ్రమంలో ఆయన పేరు మాధవన్. 1960లో మద్రాసు మఠంలో స్వామి శంకరానంద జీ మహారాజ్ శిష్యుడిగా చేరారు. 'ఇనిస్టూట్ ఆఫ్ కల్చర్' కలకత్తా, ఢిల్లీలలో, త్రివేంద్రం, రాజమండ్రి మఠాలలో పనిచేశారు.

భౌతికంగా ఆయన లేరుగానీ, వారి ఆత్మ మనల్ని వెన్నంటే ఉంది. ఆయన నిర్మాణాలే మన కళ్లెదుట ఉన్నాయి. నేటికీ చెక్కు చెదరకుండా! వారి సేవాతత్పరత ప్రతి ఒక్కరికీ ఒక స్ఫూర్తి.



రామకృష్ణాపురం శంకుస్థాపన సభలో ప్రసంగిస్తున్న స్వామి బోధస్వరూపానంద



# స్వామి ప్రథమానంద (ప్రీతి మహారాజ్)

దివిసీమ ఉప్పెన బాధితులకు పక్కా గృహాలు నిర్మించాలన్న ఆలోచనకు స్వామి బోధస్వరూపానంద నాంది పలికితే, నిర్మాణ బాధ్యతలను వహించినవారు స్వామి ప్రథమానంద.

నిర్మాణ విషయాలలో అపార నైపుణ్యం కలవారు కావడం వల్ల వారికి రామకృష్ణ మిషన్ ఈ గృహ నిర్మాణం సారథ్య బాధ్యతలు అప్పగించింది. ఎంతో ఓర్పుతో, నేర్పుతో బాధిత ప్రజల్లో ఒకరుగా మెలుగుతూ నిర్మాణ కార్యక్రమాన్ని నిర్వహించారు స్వామి ప్రథమానంద.

స్వామి ప్రథమానంద నిరాడంబరమూర్తి, నిర్మాణ దక్షుడు. దివిసీమలో కార్యకలాపాలు పూర్తయిన పిమ్మట వారు ఈటానగర్ లో బ్రహ్మాండమైన ఆసుపత్రి భవనాన్ని నిర్మించారు.

ఆయన దివిసీమలో అడుగిడే నాటికి ఉప్పెన మూలంగా నిరాశ్రయులైన పది గ్రామాల ప్రజల కోసం రామకృష్ణ మిషన్ చేపట్టిన గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమానికి శంకుస్థాపన జరిగింది.

1977 లో బేలూరు రామకృష్ణ మఠం శిక్షణా కేంద్రంలో ట్రెనింగ్ పూర్తి చేసుకున్న స్వామి ప్రథమానందను, మరొక నలుగురు బ్రహ్మచారులతో పాటు ప్రథమానంద వారు దివిసీమకు పంపారు. దివిసీమలో అడుగుమోపగానే గృహనిర్మాణ కార్యక్రమాన్ని ఉరకలు పెట్టించారు స్వామీజీ.  నిర్మాణాలు జరిగే ప్రాంతానికి అతి

చేరువలోనే పులిగడ్డలో హాలో బ్రిక్స్ తయారు చేయించి, రవాణాకు ఖర్చు, జాప్యం లేకుండా చూశారు.

సముద్ర తీరప్రాంతంలోని దుర్భరమైన ఉక్కపోతను, తీక్షణమైన ఎండను భరిస్తూ, తిండి ధ్యాసను కూడా మరచి ఆయన అహరహం శ్రమించారు. 'ప్రీతిద' అని అందరూ ప్రేమగా పిలుచుకొనే స్వామీజీ, సమయం చిక్కినప్పుడు పునరావాస కేంద్రంలో పంపిణీ చేస్తున్న భోజనాన్నే వరండాలో నిలబడి తినేవారు. ఆయన పడుతున్న శ్రమ చూసి, ఆయన శిష్యులే ఆశ్చర్యపోయేవారు. అందరికీ అన్ని సమయాల్లో అందుబాటులో ఉంటూ, స్వంత విషయాలు పట్టించుకోకుండా, శ్రమిస్తున్న స్వామి ప్రథమానందకు తీవ్రమైన కడుపునొప్పి వచ్చినా కూడా, పనిలో ఆయన వెనుకంజ వేయలేదు.

దివిసీమలో పని పూర్తయిన వెంటనే స్వామి ప్రథమానందను రామకృష్ణ మిషన్ వారు అరుణాచల్‌ప్రదేశ్ లోని ఈటానగర్‌లో ఒక వైద్య కేంద్రాన్ని నిర్మించడానికి పంపారు. అక్కడి ప్రజలు గిరిజనుల సంస్కృతి ఆయనకు పరిచయం లేనిది. ఆ ప్రాంతంతో ఎంతమాత్రం పరిచయం లేకపోయినా అక్కడి వారినందరినీ కలుపుకొని అచిరకాలంలోనే స్వామి ప్రథమానంద అద్భుతమైన భవనాన్ని నిర్మించారు. ఆసుపత్రి భవనమే కాదు, రోడ్లను, విద్యుత్ సరఫరా విధానాన్ని, ఆసుపత్రి వార్డుల నిర్మాణం, డాక్టర్ల నుంచి స్వీపర్ల వరకు ఆసుపత్రి సిబ్బంది నియామకం, వారికి తర్ఫీదు మొదలైన సమస్త విషయాలు ఆయన ఆధ్వర్యంలోనే జరిగాయి.

స్వామీజీ బాహ్యస్వరూపం చాలా నిరాడంబరంగా ఉండేది. ఆయన ధరించేది సన్యాసి వస్త్రాలే అయినప్పటికీ, వాటిపై కూడా ఆయనకు శ్రద్ధ ఉండేది కాదు. చిరిగిన పీలికలతో తిరుగుతుండేవారు. శరీరం శుష్కించివున్నా, వేసుకున్న బట్టలు చిరిగినవైనా ఆయన ముఖంలో బ్రహ్మతేజస్సు కొట్టవచ్చినట్లు కనిపించేది.

తన మస్తిష్కం చెప్పినంత త్వరగా తాను విషయాలను కాగితంపై పెట్టలేక పోతున్నానని ఆయన తరచూ అంటుండేవారు. ఆయన మాట్లాడే విధానం కూడా ఎంతో వేగంగా ఉండేది. అంతటి ఉత్కృష్ట బాధ్యతలను నిర్వహించి కూడా, ఈటానగర్ వెళ్ళవలసి వచ్చినపుడు ఎటువంటి భావోద్రేకం పొందకుండా నిరాసక్తంగా కేవలం ఒక జత దుస్తులు గల తన సంచిని భుజానికి తగిలించుకొని నిశ్శబ్దంగా వెళ్ళి పోయారు. అది నిజమైన సన్యాసి – అంటే సర్వసంగ పరిత్యాగి చేసే పని. ఇంతటి

మహత్కార్యం చేసిన స్వామి ప్రథమానందను దివిసీమ ప్రజలు ఎప్పటికీ మరచిపోలేరు.

ఆయనతో నాకు ఎంతో సాన్నిహిత్యం ఉండేది. అవనిగడ్డ వచ్చినప్పుడు మా ఇంట్లోనే భోజనం చేసేవారు. ఊరుమిరపకాయలంటే వారికి ఎంతో ఇష్టం. ఆ తరువాత ఎప్పుడైనా ఆయన ఈటానగర్ నుంచి దివిసీమకు వస్తే మా ఇంటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించి, వెళ్ళేటప్పుడు ఊరమిరపకాయలు తీసుకు వెళ్తుండేవారు.

ఆయన మంచి గాయకుడు కూడా. నిర్మాణ కార్యక్రమాలు పూర్తయిన పిమ్మట సాయంత్రాలు భజనలు చేసేవారు. అప్పుడప్పుడు నన్ను కూడా పిలిస్తే వెళ్తుండేవాడిని. వారితో పాటు సూర్జిత్ మహారాజ్, స్వామి శశాంకానంద, శశికాంతానంద, ఉద్ధవానంద, స్వాత్మానంద, అక్షరాత్మానంద, సనత్ మహారాజ్, సుందర మహారాజ్ ప్రభృతులు చేసిన సేవ నిరుపమానమైంది.

స్వామి నందనంద రాజమండ్రి రామకృష్ణ మిషన్ కార్యదర్శిగా వ్యవహరిస్తూ, ఈ యావత్ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తుండేవారు.

ఎప్పుడూ నవ్వు ముఖంతో ఉండే స్వామి ప్రథమానంద, నవ్వుతూనే 2004 ఫిబ్రవరి 10వ తేదీన తన 73 వ ఏట పరమపదించారు.



స్వామి ప్రథమానంద, శ్రీ ఎన్.టి. రామారావు, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ మండలి



# స్వామి చిదానంద

తుఫానులు, ఉప్పెనల వంటి ప్రకృతి వైపరీత్యాలు తలెత్తినపుడు ప్రజలు తలదాచుకోవడానికి తుఫాను రక్షిత నిలయాలను నిర్మించాలనే ఆలోచన 1977 నవంబర్ 19వ తేదీన సంభవించిన ఉప్పెన, తుఫాను తరువాతే కలిగింది. దివిసీమ పునర్నిర్మాణం అనేది ప్రధాన లక్ష్యం అయితే, భవిష్యత్తులో తుఫానులూ, ఇతర విపత్తులూ కలిగినప్పుడు తలదాచుకోవటానికి ప్రతి గ్రామంలోనూ ఒక రక్షితకేంద్రాన్ని కూడా నిర్మించాలనేది ఆనాటి సేవా తత్పరులు పెట్టుకున్న ప్రధానమైన ఆశయం. ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు కలిసి తుఫాను రక్షిత నిలయాలను నిర్మించ తలపెట్టారు.

దివిసీమలో చిట్టచివరి గ్రామమైన గొల్లలమోదలో శివానంద నిర్మించ తలపెట్టిన తుఫాను రక్షిత నిలయ నిర్మాణానికి 2-2-1978న శ్రీ శంకర శివానంద సుబ్బారావు చౌదరి శంకుస్థాపన చేయగా 9-8-1978న 'దివ్యజీవన సంఘం' హృషీకేశ్ అధ్యక్షులు స్వామి చిదానందజీ మహారాజ్ దివ్యాశీస్సులతో ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డిగారు ప్రారంభించారు. ఆ రోజు కుంభవృష్టి కురుస్తున్నా, బురదలో అతికష్టం మీద ప్రారంభోత్సవ కార్యక్రమం నిర్వహించబడింది. రాష్ట్రంలోనే తొలి సైక్లోన్ షెల్టర్ అది. దీన్ని నిర్మించిన ఘనత 'దివ్యజీవన సంఘా'నికి దక్కింది. ఈ సందర్భంలో ఋషీకేశ్‌లో దివ్యజీవన సంఘంగా పనిచేస్తున్న శివానందాశ్రమం గురించి తెలుసుకోవలసిన అవసరముంది.

దివ్యజీవన సంఘం భారతదేశ ఆధ్యాత్మిక ఖ్యాతిని ప్రపంచవ్యాప్తం చేసిన ప్రసిద్ధ ఆధ్యాత్మిక గురువు స్వామి శివానందచే 1936లో ఋషీకేశ్‌లో స్థాపించబడింది.

ఈనాడు ఈ సంఘానికి ప్రపంచవ్యాప్తంగా కేంద్రాలున్నాయి. స్వామి శివానంద శిష్యులు కొందరు మారిషస్, యూ.ఎస్.ఎ., ఆస్ట్రేలియా, కెనడా, మలేషియా, దక్షిణాఫ్రికా, దక్షిణ అమెరికా, యూరప్ లలో స్వతంత్ర సేవాసంస్థలను స్థాపించి నిర్వహిస్తున్నారు. ఈ సంస్థలన్నీ మానవసేవే మాధవసేవ అన్న లక్ష్యంతో పనిచేస్తూ, భారతీయ ఆధ్యాత్మిక సంపదను యావత్ ప్రపంచానికి అందజేస్తున్నాయి.

స్వామి శివానంద ఈ సంస్థను స్థాపించటానికి వెనుక ఒక చరిత్ర ఉంది. 1936లో స్వామీజీ తన శిష్యులతో పాటుగా తీర్థయాత్రల నుంచి తిరిగివెడుతూ, హృషీకేశ్‌లో గంగానదీ తీరాన ఒక చిన్న పర్ణశాలలో బసచేసిన సందర్భంలో సర్వమానవాళికి సేవలు అందేందుకు "దివ్యజీవన సంఘం" పేరుతో ఒక ఆశ్రమాన్ని నిర్మించాలనే ఆలోచన అప్పుడే వారికి కలిగింది. అందుకు హృషీకేశ్ తగిన స్థలంగా భావించారు. ఆ రాత్రి ఒక పూరిపాకలో ఆయన విశ్రమించారు. ఆయన శిష్యులు కూడా అందరూ ఆ చిన్ని పాకలోనే సర్దుకున్నారు. ఆ తరువాత తెహ్రీ ఘర్వాల్ రాజు స్వామీ శివానందాశ్రమ నిర్మాణానికి అవసరమైన స్థలాన్ని అందజేశారు. ఆ స్థలంలోనే హృషీకేష్ లో ప్రస్తుత శివానందాశ్రమం నెలకొని ఉంది.

ఈ సంస్థకు స్వామి చిదానంద 1963 ఆగష్టు నుంచి 2008 ఆగష్టు 28 వరకు అధ్యక్షులుగా పనిచేశారు. ఆధ్యాత్మిక మహాపురుషులలో అగ్రగణ్యులైన స్వామి చిదానందగారిని కలుసుకోవడం ఒక గొప్ప అనుభూతి. ఒక మహాయోగిగా, జ్ఞానిగా, ఆధ్యాత్మికవేత్తగా, సేవాతత్పరుడుగా యావద్భారతదేశంలో ఆయన సుప్రసిద్ధులు.

ఇంతకుముందే చెప్పినట్లు స్వామి శివానంద మరణాంతరం 1958 నుంచి 1963 వరకు ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన స్వామి కృష్ణానంద సరస్వతి అధ్యక్ష బాధ్యతలు చేపట్టారు. 1963 ఆగష్టులో స్వామి శివానంద మహాసమాధి పొందిన పిమ్మట, స్వామి చిదానంద దివ్యజీవన సంఘానికి అధ్యక్షులుగా ఎన్నికైయారు. అప్పటికే ప్రపంచమంతటా శాఖోపశాఖలుగా విస్తరించిన ఈ సంస్థ ఆధ్యాత్మిక కార్యకలాపాల్ని సమున్నత స్థాయికి తీసుకువెళ్ళారు స్వామి చిదానంద.

సర్వసంగ పరిత్యాగులు కేవలం ఆముష్మిక మార్గాన్వేషణకు మాత్రమే పరిమితం కాకుండా, సేవా పరాయణతను అలవర్చుకోవాలని ఉద్బోధించి అందుకు వారిని సమాయత్తం చేశారు. దీనితో ఆయన ప్రపంచవ్యాప్తంగా భారతీయతాత్వికతను అనుసరించేవారితో పాటు అసంఖ్యాకులైన దీనజనావళికి ఆరాధ్యుడైనారు.

స్వామి చిదానంద తమ శిష్యులకు మార్గనిర్దేశనంచేసే పనిలో భాగంగా, భారతదేశం నలుమూలలే కాకుండా, దక్షిణాఫ్రికా, మలేషియాలలో కూడా విస్తృతంగా పర్యటించారు. ఆ తరువాత 1968 నుంచి ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాలలో ఆయన పర్యటించారు. ఆయన వెళ్ళినచోటల్లా భక్తులు, శిష్యులు ఆయననెంతో సాదరంగా స్వాగతించి, ఆయన చెప్పే విషయాలను అత్యంత శ్రద్ధాసక్తులతో వినేవారు.

ఆది నుంచి స్వామి శివానంద కార్యకలాపాలను కొనసాగించడానికి, దివ్యజీవన సంఘం సందేశాన్ని నలుదిశలా వ్యాపింపజేయడానికి స్వామి చిదానంద నిర్విరామంగా కృషిచేశారు. స్వీయ క్రమశిక్షణతో అందరినీ ఆకట్టుకున్నారు. ఉదాహరణకు కెనడాలో ఒకసారి 30 రోజులపాటు నిరాహార దీక్షచేసి, అక్కడి ప్రజలను ఆకర్షించి, వాంకోవర్లో శివానందాశ్రమ స్థాపనకు నిధులు సమకూర్చారు. ఈయన పరిధులు లేని విశ్వసమ్మతమైన యోగాన్ని అవలంబించారు. తరచుగా సత్సంగాలను ఏర్పాటు చేస్తూ, జీసస్, అహురా మజ్దా, గౌతమ బుద్ధుడు మొదలైన ప్రవక్తల సూక్తులను హృదయోల్లాసంగా గానం చేసేవారు.

స్వామి చిదానంద గాంధీక్షేత్రం – సేవాశ్రమం సందర్శించి అనాథాశ్రమంలోని పిల్లలను పలకరించి, ప్రత్యేకించి మా నాన్నగారిని అభినందించారు. మా నాన్నగారి పట్ల వారికి ప్రత్యేక అభిమానం ఏర్పడింది.

మా నాన్నగారి షష్ట్యబ్దిపూర్తి ఉత్సవ సందర్భంలో స్వామి చిదానంద పంపిన సందేశం ఎంతో విశిష్టమైంది. వారి సందేశం ఈ విధంగా ఉంది :

"పూజ్యశ్రీ ఎం.వి. కృష్ణారావుగారి అరవయ్యవ జన్మదినమహోత్సవం వంటి శుభ సందర్భంలో ఈ సందేశాన్ని పంపే మహదవకాశం నాకు లభించినందుకు ఎంతో సంతోషిస్తున్నాను. ఈ సందేశం ద్వారా వారిపై నాకు గల అభిప్రాయాలను తెలియజేసే సదావకాశం నాకు ఒనగూరింది. పూజ్యశ్రీ కృష్ణారావుగారి వంటి ఉదాత్తుల జీవితం, కృషి మన జాతికి నిజమయిన సిరిసంపదలు. ఎందుచేతనంటే అటువంటి ఆదర్శ జీవితం, ఉన్నత సమాజసేవ మన దేశంలోని యువతకు సర్వకాలిక ప్రేరణనిచ్చి వారి జీవిత పథాలకు ఆవశ్యకమైన కాంతిని ప్రసాదించగలవు.

నిజమయిన సంస్కృతికి, నాగరికతకు నిస్వార్థసేవే కొలమానం. జీవిత పరమార్థానికి మాధుర్యాన్ని అందించేది అదే. అది లేకుంటే జీవితం నిస్సారం, నిర్వీర్యం అయిపోతుంది. నిస్వార్థ సేవామయమైన అట్టి జీవితం మన దేశపు సంస్కృతి, మతం,

తాత్వికతలలో కనబడే ఉన్నతాదర్శాలలో ఒకటి. 'పరోపకారార్థ మిదం శరీరం' అని జ్ఞాననిధులైన మన ప్రాచీన స్మృతికర్తలు ప్రకటించారు. అంటే 'ఓ మానవుడా! ఇతరులకు ఉపకారం చేయటానికే సుమా నీకు ఈ శరీరం ఇచ్చినది' అని అర్థం. మన ప్రాచీన ఋషులు, యోగిపుంగవుల దృక్పథంలో భగవత్ సృష్టిలోని సర్వజీవులకు సేవ చేయటమే మానవ జీవితానికి పరమార్థం. పరోపకారంలోనే పుణ్యం ఉన్నది. చిన్ననాటి నుంచి, షష్ట్యబ్దిపూర్తి జరుగుతున్న నేటివరకు శ్రీ ఎం.వి. కృష్ణారావు జీవితమంతా అట్టి పరోపకార గాథే!

మన మాతృభూమి అయిన భరతవర్షానికి ఇటువంటి ఉదాత్త చరితుల అవసరం ఎంతైనా ఉంది. శ్రీ కృష్ణారావు జీవితమంతటా ఇటువంటి ఆదర్శప్రాయమైన ఉదాహరణలకు కొదువలేదు. ఇటువంటి ఆదర్శమూర్తుల నిస్వార్థ త్యాగాల వల్లనే మన మాతృభూమి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పొందగలిగింది. దురదృష్టవశాత్తు మన సమాజంలో ఈనాడు అటువంటి ఉదాత్త ఉన్నతాదర్శాలు, నిస్వార్థ సేవాపరాయణత కొరవడుతున్నాయి. శ్రీ కృష్ణారావు గారి వ్యక్తిత్వంలో కనిపించే స్వార్థరహిత, నిజాయితీ, అంకితభావంతో కూడుకున్న కారుణ్య దృక్పథం ఈ అంధకారంలో ఆశాజ్యోతివలె ప్రకాశిస్తున్నది. ఇటువంటి ఆదర్శమూర్తుల అవసరమే ఈనాడు మన జాతికి మిక్కుటంగా ఉన్నది. గులకరాళ్ళు వందలు వేలు దొరుకుతాయి. కానీ, నిక్కమయిన జాతిరత్నాలు లభించడం అరుదు. మనదేశం ఇప్పుడున్న ఈ విషమ స్థితిలో అసంఖ్యాకులయిన నిబద్ధతగలయువతకు ఈ ఉజ్జ్వల ఆదర్శమూర్తి జీవితం స్ఫూర్తిప్రదమవుతుంది. అరవై గ్రామాల్లో వైద్యశిబిరాలు, ప్రజా సౌకర్యాల్లాంటి అరవై సమాజ సేవా పథకాలను ప్రారంభించడం ద్వారా కృష్ణారావుగారి షష్ట్యబ్దిపూర్తి ఉత్సవాన్ని నిర్వహించడం ప్రశంసనీయ చర్య. ఇది ఆయన ఉత్తమ ఆదర్శాలకు అద్దంపడుతున్నది. ఇందుకు షష్ట్యబ్దిపూర్తి సంఘం వారిని మనసారా అభినందిస్తున్నాను" అని సందేశం పంపారు స్వామిచిదానంద.

పూర్వాశ్రమంలో స్వామి చిదానంద పేరు శ్రీధర్ రావు. ఈయన 24-9-1916న శ్రీనివాసరావు, సరోజినీ దంపతుల ఐదుగురు సంతానంలో రెండవ కుమారుడిగా మంగుళూరులో జన్మించారు. శ్రీనివాసరావు ఒక ప్రముఖ జమీందార్. ఎన్నో గ్రామాలలో సువిశాలమైన భూసంపద, దక్షిణ భారతదేశంలోని ముఖ్య ప్రదేశాలలో విశాలమైన భవంతులు కలిగివున్న భాగ్యవంతుడాయన. సరోజిని సాత్వికురాలైన

ఉత్తమ ఇల్లాలు. వీరి కుటుంబం పుణ్యకార్యాలు నిర్వహించడంలోను, దానధర్మాలు చేయడంలోను, అతిథి అభ్యాగతులను సమాదరించడంలోను ప్రసిద్ధి చెందింది. ఈ ప్రభావం శ్రీధర్‌రావుపై సహజంగానే పడింది.

బాల్యంలో 8 సంవత్సరాల వయసులోనే శ్రీధర్‌రావును ఆధ్యాత్మికత వైపు ఆయన తాతగారి స్నేహితుడు అనంతయ్యగారు మళ్లించారు. రామాయణ, మహాభారతాల వంటి పురాణేతిహాసాలలోని కథలను, తాపసిక జీవనాన్ని గడిపి ధన్యులైన ఋషిపుంగవుల చరిత్రలను సమయం చిక్కినప్పుడల్లా ఆయన శ్రీధర్‌రావుకు వినిపిస్తుండేవాడు. దీనికి తోడు, శ్రీధర్‌రావు మేనమామ ఐహిక జీవనం పట్ల నిరాసక్తతను కలిగించే విషయాలను ఈయనకు చెప్తుండేవారు. ఆధ్యాత్మిక జీవనం పట్ల మొగ్గుచూపడానికి ఈ అంశాలు శ్రీధర్‌రావులో బీజాలునాటాయి.

ప్రాథమిక విద్య మంగుళూరులో పూర్తిచేసుకున్న పిమ్మట, మద్రాసులోని ముత్తయ్య చెట్టియార్ హైస్కూల్ లో 1932 లో శ్రీధర్‌రావు చేరారు. ఆ పాఠశాల అంతటికీ తెలివైన విద్యార్థిగా గుర్తింపు పొందారు. ఆయన స్ఫురద్రూపం, తెలివితేటలు, సత్ప్రవర్తన అధ్యాపకులనందరినీ ఆకర్షించేవి.

1936 లో చెన్నైలోని లయోలా కాలేజీలో చేరారు. ఈ కళాశాలలో ప్రతిభావంతులైన విద్యార్థులను మాత్రమే చేర్చుకుంటారు. చురుకైన విద్యార్థిగా రాణించి, 1938 లో బి.ఎ. డిగ్రీ చేపట్టారు.

ఇంటికి తిరిగివచ్చిన శ్రీధర్‌రావు ధ్యాసంతా దీనజనోద్ధరణపైనే ఉండేది. దానధర్మాలకు కొదువలేని ఇంట్లో ఈయన సేవాకార్యక్రమాలకు ఏ ఆటంకం రాలేదు. ఆకలితో అలమటించే అన్నార్తులే కాక, ఆయన వద్దకు ఎవ్వరు ఏ కోరికతో వచ్చినా, వట్టి చేతులతో తిరిగిపోలేదు. ఈయన సహాయ సానుభూతులు కేవలం మనుషులకే పరిమితం కాలేదు. ఈయన కృపాంబుధిలో పశుపక్ష్యాదులు కూడా ఓలలాడాయి.

మూగజీవాలతో ఆయన ఎంతగా మమైక్యం చెందారంటే, ఆయన వాటి భాష తెలిసినట్లుగా ప్రవర్తించేవారు. ఇంట్లోని భోగభాగ్యాలు, సంపదలు ఆయనను ఆకర్షించలేకపోయాయి. ఎప్పుడూ ఆధ్యాత్మిక చింతనలోనే కాలం గడిపేవారు. సర్వకాల సర్వావస్థలలోను నిరంతర చింతనా మనస్కులై ఉంటూ, ఆధ్యాత్మిక సాహిత్యాన్ని పఠిస్తూ, ఇంట్లో వారికి, బయటివారికి సముచితమైన సలహాలిస్తూ, ఇరవై ఏళ్ల వయసుకే 'గురువు'గా పేరు తెచ్చుకున్నారు.

రామకృష్ణ పరమహంస వేదాంతం, స్వామి వివేకానంద రచనలు ఈయనను అమితంగా ప్రభావితం చేశాయి. ఇంట్లోని సుఖలాలసత మధ్య ఇమడలేక ఎవరికీ చెప్పకుండా తిరుపతి సమీపంలోని కొండ చరియల ప్రక్కన గల ఒక ఆశ్రమానికి వెళ్లిపోయారు. ఈయన ఉనికిని కనుక్కొని, తల్లిదండ్రులు అతి కష్టం మీద నచ్చజెప్పి తిరిగి ఇంటికి తోడ్కొనివెళ్ళారు. ఐతే, ఎంతోకాలం ఈ ముచ్చట సాగలేదు. ఋషీకేశ్ లోని స్వామి శివానందతో అప్పటికే ఈయన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నారు. 1943లో ఆశ్రమంలో చేరడానికి ఈయనకు స్వామి శివానంద నుంచి అనుమతి లభించింది. ఆశ్రమంలో చేరగానే, ఈయనకు వైద్య కేంద్రంలో రోగులకు చికిత్సచేసే పనిని అప్పగించారు. ఈయన అమృతహస్తం సోకి, రోగాలు మటుమాయం అవుతుండడంతో ఈయన పేరు చుట్టుప్రక్కల మారుమ్రోగింది.

శ్రీధర్‌రావు ఆశ్రమంలో చేరిన వెంటనే ఆయన ప్రతిభను అందరూ గుర్తించారు. ఆశ్రమంలో సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూనే ఆయన ఉపన్యాసాలిచ్చారు, పత్రికలకు వ్యాసాలు వ్రాశారు, సందర్శకులకు ఆధ్యాత్మిక విషయాలపై ఉద్బోధలు చేశారు. 1948లో "యోగ-వేదాంత, అటవీ విశ్వవిద్యాలయా"న్ని స్థాపించినపుడు స్వామి శివానంద ఆ విశ్వవిద్యాలయానికి ఈయన్ని వైస్-ఛాన్సలర్ మరియు రాజయోగ ఆచార్యులుగా నియమించారు. ఈ విశ్వవిద్యాలయం ఇప్పుడు "యోగ-వేదాంత, అటవీ అకాడెమీ"గా కొనసాగుతున్నది. మొదటి సంవత్సరంలోనే విద్యార్థులకు 'పతంజలి రాజయోగ' బోధించి, రాజయోగం పట్ల వారికి అభిమానాన్ని, ఆసక్తిని పెంపొందింప జేశారు.

ఆశ్రమంలో చేరిన మొదటి సంవత్సరమే స్వామి శివానంద జీవితచరిత్రను 'కాంతిపుంజం' (లైట్ ఫౌంటేన్) పేరుతో వ్రాశారు. ఈ రచన స్వామీజీ శిష్యులకు, అభిమానులకు ఎంతో స్ఫూర్తిదాయకంగా విరాజిల్లుతున్నది. స్వామి శివానంద ఒక సందర్భంలో ఈ పుస్తకం గురించి ఇలా అన్నారు-"శివానంద గతిస్తాడు కానీ లైట్ ఫౌంటేన్ శాశ్వతంగా నిలుస్తుంది". ఈ రచన ఎంతటి ఉత్కృష్టమైనదో చెప్పడానికి స్వామీజీ పై మాటలే నిదర్శనం.

విభిన్న రకాలైన కార్యకలాపాలను నిరంతరాయంగా కొనసాగిస్తూనే శ్రీధర్‌రావు 1947లో ఒక యోగా మ్యూజియంను స్థాపించారు. ఇందులో వేదాంతతత్వానికి

సంబంధించిన సమస్త విషయాలు, యోగ సాధన విధానాలు ఫోటోల రూపంలోను, చిత్రాల రూపంలోనూ పొందుపరిచారు.

1948 చివరినాటికి స్వామి శివానంద ఈయనను దివ్యజీవన సంఘానికి ప్రధాన కార్యదర్శిగా నియమించారు. దానితో శివానందాశ్రమ నిర్వహణ భూరిబాధ్యత ఈయన భుజస్కంధాలపై పడింది. ఆ క్షణం నుంచే ఆయన ఆశ్రమాన్ని తన ఆధ్యాత్మిక జీవన విధానంతో ప్రభావితం చేశారు. ఆశ్రమవాసులందరి మానసిక స్థాయిని దివ్యత్వానికి చేరువ చేశారు.

గురుదేవులు స్వామి శివానంద ఈయనకు 1949 జులై 10 వ తేదీన గురుపూర్ణిమ పర్వదినాన మహోత్కృష్టమైన సన్యాసాశ్రమాన్ని అనుగ్రహించారు. అప్పటినుంచే ఆయన స్వామి చిదానందగా మారారు. చిదానంద అంటే అంతర్దృష్టి కలిగి, దివ్యానందాన్ని అనుభవించేవాడని అర్థం.

యావజ్జీవితాన్ని మానవసేవకే అంకితం చేసిన స్వామి చిదానంద 28.8.2008న తమ 91 వ ఏట పరమపదించారు. వారి దివ్యస్మృతికి ఇది నా నివాళి.



*గుల్లలమోదలో నిర్మించిన తొలి తుఫాను రక్షిత నిలయం*



స్వామి చిదానంద, శ్రీ మండలి వెంకటకృష్ణారావు



# స్వామీ విశ్వేశతీర్థ స్వామీజీ

కర్మ అంటే మనం చేయవలసిన విధి. మనకు మనంగా విధించుకుని చేసే ఒక బాధ్యత అది. "నానా జనస్య శుశ్రూష" అనేకమంది మనుష్యులకు చేసే సేవ. దాన్నే కర్మ(డ్యూటీ) అని, మోక్షసాధనకు అదే మార్గం అనీ ప్రబోధించిన మహితాత్ములు సేవామూర్తి ఉడిపిలోని పేజావర్ పీఠాధిపతి శ్రీ శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీ దివిసీమ ఉప్పెన సమయంలో నిర్వహించిన పాత్ర గొప్పది. సేవచేయటం అనేది దేవుడికి మనం చెల్లించుకునే ఒక తప్పనిసరి పన్ను అంటారాయన.

ఎక్కడ ప్రకృతి విలయతాండవం చేసినా ప్రభుత్వానికన్నా ముందే అక్కడకు చేరి గంజికేంద్రమో, సహాయ శిబిరమో ఏర్పాటు చేయటం ఆయన తనకు తాను విధించుకునే విధి. ఒకరు చెప్పారనో, ఒకరొచ్చి అడిగారనో కాదు, తనకు తానే అందరికన్నా ముందు కదిలే తత్త్వం స్వామీజీది.

ఉప్పెన బాధితులను ఓదార్చడానికి వచ్చిన స్వామి విశ్వేశతీర్థ మా నాన్నగారిని కలవడానికి మా ఇంటికి వచ్చారు. ఆ రోజు మా నాన్నగారి కాళ్లలో ముళ్లు దిగడం వలన తీవ్రమైన జ్వరానికి లోనైనారు. డాక్టర్లు విశ్రాంతి అవసరమని చెప్పారు. స్వామీజీ జ్వరంతో బాధపడుతున్న మా నాన్నగారి మంచం వద్దకు వచ్చి తల నిమిరి ఆశీర్వదించి, సహాయ కార్యక్రమాలకు ఏ ప్రాంతానికి వెళ్ళమంటారని అడిగారు. మా నాన్నగారు "స్వామీ మీరు పరమహంసలు. హంసలదీవి పుణ్యక్షేత్రంలో ప్రజలకు తమ సేవలు అందించమ"ని సూచించారు.

మహారాష్ట్రలో, మహాబలేశ్వరం వద్ద జన్మించిన కృష్ణానది 1600 కి.మీ. ప్రవహించి హంసలదీవి వద్ద సాగరసంగమం చెందుతుంది. హంసలదీవిలో వెలసిన శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానాన్ని దేవతలు కట్టారని ప్రజల విశ్వాసం. వందల సంవత్సరాల క్రితం మచిలీపట్టణం వద్ద వచ్చిన ఉప్పెనలో, 77లో వచ్చిన దివిసీమ ఉప్పెనలో వందలాదిమంది ఆ గుడిలో తలదాచుకుని ప్రాణాలు దక్కించుకున్నారు. హిందువులకు పరమ పుణ్యక్షేత్రమైన హంసలదీవికి స్వామీజీని వెళ్ళమని చెప్పడం వారిని కూడా సంతోషపరచింది.

స్వామీజీ హంసలదీవికి వెళ్ళి అక్కడ ప్రజలకు సహాయ కార్యక్రమాలు నిర్వహించి, ఆ గ్రామాన్ని విశ్వహిందూపరిషత్తు ద్వారా పునర్నిర్మించాలని నిర్ణయించు కున్నారు.

ఆ వెంటనే పరిషత్ ఆంధ్రప్రదేశ్ శాఖ తుపాను, ఉప్పెన బాధితుల సహాయ సమితిని ఏర్పాటు చేసి, హంసలదీవికి పునర్జన్మ నిచ్చే పనికి పూనుకుంది. గ్రామంలో శిబిరం ఏర్పరచి గృహ నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించింది.

300 చదరపు గజాల స్థలంలో 235 చ. అడుగులుండే 150 ఇండ్లను నిర్మించడానికి 10 లక్షల రూపాయల పథకం తయారయింది. రామకృష్ణ మిషన్ స్వామి పూజ్య నందనారనంద స్వామి అధ్యక్షతలో 1978, జనవరి 24న పూజ్య పెజావర్ స్వామి గృహ సముదాయానికి శంకుస్థాపన చేశారు.

టౌన్ ప్లానింగ్ డైరెక్టర్ తయారు చేసిన లేఅవుట్‌ను అనుసరించి మద్రాసు వాస్తవ్యులు, ప్రముఖ గృహవాస్తు శిల్పి శ్రీ సి.ఆర్. నారాయణరావు రూపొందించిన ప్లానుకు అనుగుణంగా గృహసముదాయ నిర్మాణం సాగిపోయింది. పరిషత్ సేకరించిన విరాళాలకు తోడుగా పూజ్య పెజావర్ స్వామి 41.5 లక్షలు, రోటరీ వారి లక్ష రూపాయలు, పరిషదధ్యక్షులు గౌ. మహారాణా భగవత్ సింగ్ గారు రూ. 10,000/, హైదరాబాద్ బట్టల వర్తకుల సంఘం వారు రూ. 16,000/-, అమెరికాలోని హిందువులు సేకరించి పంపిన రూ. 15,000/-, రాష్ట్ర ప్రభుత్వ మిచ్చిన మ్యాచింగ్ గ్రాంటు రూ. 3 లక్షల 75 వేలతో మొత్తం రూ. 10 లక్షల ఖర్చుతో నిర్మింపబడిన 150 ఇండ్లు, తీర్చిదిద్దబడిన బాటలు, వీధి దీపాలతో కళకళలాడుతూ హంసలదీవి మళ్లీ పుట్టింది. అమాయకులైన గ్రామ ప్రజల ముఖాలలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి.

30.1.83న శ్రీ శ్రీ పెజావర్ స్వామీజీ అవనిగడ్డ గాంధీక్షేత్రంలో గాంధీ వర్ధంతి కార్యక్రమంలో పాల్గొన్నారు. వారికి గాంధీక్షేత్రం తరఫున శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి గారు సంస్కృతంలో స్వాగతం పలికారు. నాన్నగారు హంసలదీవిలో స్వామీజీ చేసిన సేవలను ప్రశంసించారు. ఆనాడు స్వామీజీ ఈ విధంగా అనుగ్రహభాషణ చేశారు :

"గాంధీజీ కేవలం స్వాతంత్ర్యాన్నే మనకు సంపాదించి పెట్టలేదు. సామాన్య దళిత పీడిత జనులలో ఆత్మ విశ్వాసాన్ని పుట్టించారు. మనం కూడా ఇతరులతో సమానమే అనే భావాన్ని వారిలో కలిగించటం గాంధీజీ గొప్పదనం. భాగవతంలో రంతి దేవుడు చెప్పినట్లు, గాంధీజీ కూడా 'నత్వహం కామయే రాజ్యం ...' ఇత్యాదిగా చెప్పాడు. నాకు రాజ్యం వద్దు. అపునర్భవం (మోక్షం) వద్దు. భోగం వద్దు. కేవలం దుఃఖితులనుద్ధరించటం, వారి ఆర్తి నాశనం చేయటమే నాకు కావలిసిందన్నారు. సామాన్య జనులు తాపత్రయంలోపడి స్వార్థంకోసం తాపం అనుభవిస్తారు. మహాత్ములు మాత్రం అన్యుల దుఃఖం పోగొట్టటానికి తపస్సు చేస్తారు. తప, తాప అనే రెండు శబ్దాలున్నాయి. మన దుఃఖం పోగొట్టుకోవటానికి, మనం సుఖం పొందటానికి చేసేది తాపం. మాహాత్ముడు మాత్రం మన పూర్వ భారత తపశ్శాలురవంటి వాడు. మన దాస్యం పోగొట్టటానికి ఆయన ఉద్భవించి తపస్సు చేశాడు.

**గాంధీ క్షేత్రం :** ఇక్కడ ఉన్న సంస్థలు, అనాథ శరణాలయాలు ప్రజాక్షేమం కోసం, గాంధీజీ ఆశయాల సాధన కోసం నడుస్తున్నాయి. దీన్ని సందర్శించటం వల్ల మాకు చాలా ఆనందం కలిగింది.

ఈ కాలంలో వర్తకులు, ఉద్యోగులు, రాజకీయ నాయకులు ఎవరి మట్టుకు వారే తాము సేవ చేస్తున్నామంటున్నారు. నిజానికది సేవ కాదు. ద్రవ్యం పోగుచేసుకొనే కార్యాన్ని సేవ అంటున్నారు. అది "సేవ్"(save) అవుతోంది. కొందరితరులకు "షేవ్" (shave) చేస్తున్నారు. కాని గాంధీక్షేత్రంలో అసలైన సేవ జరుగుతోంది. ఇక్కడ అనేక కార్యక్రమాలు కొనసాగిస్తూ చేస్తున్న సేవ మాకు సంతోషం కలిగించింది.

కృష్ణారావుగారు మాకు చిరపరిచితులు. వారు రాజకీయంలో ఉండి తుపాను సందర్భంలో ప్రజల కోసం చేసిన కృషి చూచాను. అప్పుడు వారిలో విషాదం కనిపించింది. అది నాలో పరివర్తన కలిగించింది. అది చూచే నేను ముందుకొక అడుగు వేసి కొంత పని చేశాను. పదవులు శాశ్వతం కావు. ప్రజా హృదయాలలో ఈ

విధంగా స్థానం సంపాదించుకోవటం శాశ్వతం. గ్రామీణ సేవా కార్యక్రమం వీరి వల్ల పురోభివృద్ధి పొంది లోక క్షేమకరం కావాలని కోరుతున్నాను. భగవద్గీతలో మొదట విషాదం పొంది తర్వాత కర్మ యోగంలో పడిన అర్జునుడు లాగే వీరు కూడా తమ విషాదం వల్ల కలిగిన ఆలోచనలకు కార్యరూపమిచ్చి కృషి చేస్తున్నారు.

**ద్విసూత్రా కార్యక్రమం :** ఇక్కడి చుట్టుప్రక్కల గ్రామాల నుంచి స్త్రీ పురుషులు చాలామంది వచ్చారు. మన త్రిమతాచార్యులు చెప్పిన ద్విసూత్ర కార్యక్రమముంది. స్త్రీ, బాల, యువ, వృద్ధులైన హిందువులు ప్రతిరోజు తమ కిష్టమైన దైవాన్ని ప్రార్థించాలి. శరీర శుభ్రత కోసం స్నానం చేసినట్లే, ముఖం కడిగి నట్లే వస్త్రాలు ఉతుక్కున్నట్లే మనస్సుకి అందే అంతఃకరణంలో ఏర్పడ్డ మాలిన్యం పోగొట్టుకోవటానికి అంతఃకరణ స్నానం కూడా అవసరం. అది బాహ్య విషయాల వల్ల మలినమవుతూ ఉంటుంది. జలంతో శరీర ప్రక్షాళన జరిగినట్లు భక్తి జలంతో అంతఃకరణ శుద్ధి జరుగుతుంది. సర్వ ప్రాణుల అంతఃకరణలోను పరమాత్ముడు ఉన్నాడు. అందరి యెడల సద్భావంతో అందరికీ చేతనైనంత వరకు ఉపకారం చేయటం పరమాత్మకు సేవ చేయటమే అవుతుంది.

తనంతట తాను ఎన్ని గంటలు ముక్కు మూసుకొని జపం చేసినా ఇతరులకు సేవ చేయనిదే మోక్షం రాదనీ మన పూర్వ ఋషులు ఘోషించారు. స్వేచ్ఛా విహారానంతరం నియమిత సమయంలోనే పూజ చేసినంత మాత్రాన భగవంతుడు తృప్తి చెందడు. లోకారాధన- భగవదారాధన రెండూ చేయాలి. శంకరాచార్యులు "దేయం దేనజ నాయ చ విత్తం" ఇత్యాదిగా చెప్పినట్లే, మధ్వాచార్యులు కూడా లోక సేవ చేయమని బోధించారు. ప్రజా సేవ దృష్టితో భగవత్సేవ చేయటం జరిగితే 20 సూత్రాల కార్యక్రమం కూడా చక్కగా, సక్రమంగా సాగుతుంది. కీర్తిమంతంగా సాగటానికి ద్విసూత్ర కార్యక్రమం కొనసాగించండి. ఇక్కడికి వచ్చిన వారందరి పైన శ్రీకృష్ణ భగవానుని అనుగ్రహం ప్రసరించాలని కోరుతూ విరమిస్తున్నాను."

సేవకు స్వామీజీ కొత్త రూపాన్నిచ్చారు. అది మనిషిగా పుట్టిన ప్రతి ఒక్కరి విధి. సేవ చేయనిదే మోక్షం లేదనే భావనని జన వాహినిలో ఆయన కలిగించారు. ఆధ్యాత్మిక అభ్యున్నతి (spiritual upliftment) అనేది మానవ సేవ చేసినప్పుడే సిద్ధిస్తుందని ఆయన ప్రబోధించారు. ఆధ్యాత్మికతను సేవతో ముడిపెట్టిన కారుణ్యమూర్తి శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీ.

13 వశతాబ్ది నాటి ద్వైత సిద్ధాంత ప్రవర్తకులు మధ్వాచార్యుడి శిష్యపరంపరకు చెందిన అధోక్షజ తీర్థస్వామి పెజావర్ మఠాన్ని వ్యవస్థాపించారు. ఆ పీఠాన్ని ఇప్పటివరకూ 31 మంది అధిష్ఠించారు. శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీ 32వ వారు. వారి అద్వైతం కేవలం శివకేశవ పరమైనదో లేక జీవాత్మ-పరమాత్మ పరమైనదో కాదు, అది సమస్త మానవాళిపరమైనదిగా నా కనిపిస్తుంది. ధనిక, బీద తారతమ్యాలు లేని అద్వైతం వారిది.

పెజావర్ ఉడిపి శ్రీకృష్ణ మఠం ప్రాంగణంలోని అన్నబ్రహ్మ సత్రంలో ముస్లిం సోదరులకు ఖర్జూరాల్ని అందచేసి ఉపవాస దీక్షలను విరమింప చేశారాయన. అద్వైత భావనకు ఇది సరికొత్త సామాజిక బాష్యంగా భావిస్తాను. ఇలా ఒక పీఠాధిపతి అన్య మతస్థుల్ని తన ఆశ్రమానికి ఆహ్వానించి, ఆ మతస్థులను వారి మతానుసారం గౌరవించిన సందర్భాలు మనం అరుదుగా చూస్తాం. పంక్తి భోజనంలో పాల్గొన్న దాదాపు 150 మంది ముస్లిం సోదరులకు ఫలాలు, ఖర్జూరాలు ఆయనే స్వయంగా వడ్డించారు. వారితో కాసేపు ముచ్చటించారు.

పెజావర్ మఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ విశ్వేశతీర్థ స్వామీజీ అసామాన్యమైన వ్యక్తి. పరమ పూజ్యనీయులు.



తుపాను బాధిత ప్రాంతం హంసలదీవిలో విశ్వేశతీర్థ స్వామీజీ



# ప్రభాకర్‌జీ

మహాత్మా గాంధీకి అత్యంత సన్నిహితంగా మెలిగి వారి ప్రేమాభిమానాలు చూరగొన్న తెలుగు వారిలో ప్రభాకర్‌జీ ముఖ్యులు.

1938 నుండి సేవాగ్రామ్ ఆశ్రమంలో మహాత్ముని చెంత పెరిగి గాంధీ నిర్యాణానంతరం వారి స్థానంలో సేవాగ్రామ్ ఆశ్రమ ప్రతిష్టాన్ కార్యదర్శి అయ్యారు. ఆజన్మ బ్రహ్మచారి. నిర్మాణ కార్యరంగానికి జీవితాన్ని అంకితం చేశారు. సర్వోదయ ఉద్యమానికి, నిర్మాణ కార్యక్రమాలకి సంధానకర్తగా వ్యవహరించారు.

తెలుగు నాట సర్వోదయ ఉద్యమానికి ఊపిరి పోశారు. దీనజన సేవకే జీవితాన్ని అంకితం చేసిన త్యాగధనుడు.

గాంధీగారి నిర్మాణ కార్యక్రమానికి తనకు తాను అర్పించుకున్న మహాత్యాగి, ఏకైక తెలుగు బిడ్డ ప్రభాకర్‌జీ.

ప్రభాకర్‌జీతో పరిచయం జీవితంలో నేను చేసుకున్న అదృష్టం. వారి జీవిత చరమదశలో వారితో అత్యంత ఆత్మీయంగా మెలిగాను. నిస్వార్థ సేవా నిరతను, నిష్కామ కర్మ యోగి ప్రభాకర్‌జీని తెలుగుజాతి మరచిపోవడం దురదృష్టకరం.

అనంతపురంలో ఒక క్రైస్తవ కుటుంబంలో జన్మించిన ప్రభాకర్‌జీ అసలు పేరు జోసెఫ్. గాంధీజీ అయన్ని ప్రభాకర్ అని పిలవటంతో ఆ పేరే స్థిరపడింది. సేవాగ్రామ్ ఆశ్రమంలో వారిని "భాయిజీ" అని ఆదరపూర్వకంగా పిలిచేవారు. ఆచార్య వినోభా బావే, శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ మురార్జి దేశాయ్ వంటి ప్రముఖులు

ప్రభాకర్‌జీని అత్యంత గౌరవంగా చూసేవారు. మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి గారు ప్రభాకర్‌జీకి సహాధ్యాయి.

1973లో వినోబాజీ శిష్యురాండ్రు అఖిల భారత పాదయాత్ర చేస్తూ విజయవాడ చేరిన సందర్భంలో గాంధీ పర్వతం మీద సభ జరిగింది. ఆ సభలో మొదటిసారిగా ప్రభాకర్‌జీని చూసే అవకాశం లభించింది. అటు తరువాత రెండు మూడుసార్లు వారిని చూసినప్పటికీ 1977 వరకు వారితో సన్నిహిత సంబంధం కలుగలేదు.

యువజనులలో గాంధేయతత్వ ప్రచారానికి ఒక సంస్థను నెలకొల్పాలని మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు ఆలోచన చేసి 1977 జనవరి నెలలో హైదరాబాద్ గాంధీ జ్ఞాన మందిరంలో శ్రీయుతులు ప్రభాకర్‌జీ, కోదాటి నారాయణరావు ప్రభృతులతో చర్చలు జరిపి గాంధేయ సమాజ సేవా సంస్థను అవనిగడ్డలో స్థాపించారు. ఆ చర్చల సందర్భంలో శ్రీ ప్రభాకర్‌జీని దగ్గరగా చూసే అవకాశం లభించింది. ఆ సంస్థను ప్రారంభించడానికి 1977 జనవరి 30న ప్రభాకర్‌జీ అవనిగడ్డ విచ్చేశారు.

మహాత్ముని మహనీయ ఆశయాలను కార్యరూపంలోకి తెచ్చే సంకల్పంతో నాన్నగారి కృషితో 1968లో స్థాపింపబడిన గాంధీక్షేత్రాన్ని శ్రీ ప్రభాకర్‌జీ తొలిసారి తిలకించారు. అప్పుడే ఆ సందర్భంలో ఆయన దివిసీమ గత స్మృతులను నెమరు వేసుకున్నారు. స్వర్గీయులు కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, డాక్టరు పట్టాభి సీతారామయ్యగార్లు దివిసీమపై తమ దృష్టిని నిల్పి ఖాదీ ఉత్పత్తి కేంద్రాలను నెలకొల్పి అభ్యుదయ పరంపరకు పునాది వేశారని ఆయన గుర్తుకు తెచ్చారు. దివిసీమ ఖద్దరు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి వహించిందని, తదాది గాంధీయోద్యమంలో దివిసీమ ప్రముఖపాత్ర వహించిందని, సహాయ నిరాకరణోద్యమంలో దివిసీమ వారు ముందున్నారని ప్రభాకర్‌జీ జ్ఞప్తికి తెచ్చారు.

అప్పటికి జమీందారీ రైతు ఉద్యమ కారణంగా దివిసీమలో కమ్యూనిష్టులు ప్రాబల్యం సంపాదించుకున్నప్పటికీ గాంధీ ఉద్యమ పునాదులు గట్టిగా ఉండటం వల్ల అది సజీవంగా ఉండడమే కాక, తిరిగి వ్రేళ్లూనుకుని వర్ధిల్లసాగింది. దీనికి ప్రత్యక్ష నిదర్శనం ఈ గాంధీక్షేత్రం ప్రాంగణంలో జరిగే వివిధ నిర్మాణ కార్యకలాపాలు అని ప్రభాకర్‌జీ పేర్కొన్నారు. అనతి కాలంలో దివిసీమ ఆంధ్రదేశానికి గాంధీ ఉద్యమ కేంద్రం కాగలదని ఆకాంక్షించారు.

రెండు రోజులు అవనిగడ్డలో గడిపి, గాంధేయ సమాజ సేవా సంస్థ శిక్షణా శిబిరంలో పాల్గొని, ఇక్కడ జరుగుతున్న కార్యక్రమాల పట్ల సంతృప్తి చెంది ఆనందంతో ఆయన తిరిగి వెళ్ళారు.

తిరిగి జూన్ నెల 3, 4, 5 తేదీలలో గాంధేయ సమాజ సేవా సంస్థ రెండవ శిక్షణా శిబిరాన్ని నిర్వహించింది. శిబిరాన్ని శ్రీ ప్రభాకర్‌జీ ప్రారంభించారు. అదే సమయంలో గాంధీక్షేత్రం రంగస్థలంపై గాంధీజీ విగ్రహాన్ని శ్రీ ప్రభాకర్‌జీ ప్రతిష్ఠించారు.

ప్రభాకర్‌జీ శిక్షణా శిబిరంలో గాంధీజీతో తమ అనుభవాలను కథల రూపంలో చెప్పారు. వేదిక మీద గాక శిబిర సదస్సుల మధ్య కూర్చుని వారి క్షేమ సమాచారాలు తెలుసుకుంటూ, కొద్ది కాలంలోనే అందరికి ఆప్తుడయ్యారు. చివరి రోజున గాంధీక్షేత్రం కార్యకర్తలను సమావేశపరచి కార్యకర్తల నైతిక ప్రవర్తన ఎలా ఉండాలో వివరించి చెప్పారు.

ఆయన ఉపన్యాసానికి ప్రభావితుడైన ఒక కార్యకర్త ఇక ముందు ధూమపానం చేయనని వాగ్దానం చేశారు. ధూమపానమంటే గుర్తు వచ్చింది ప్రభాకర్‌జీ విద్యార్థి దశలో ఎడతెగకుండా ధూమపానం చేసేవారట. “నేను చిన్నప్పుడు చైన్ స్మోకర్‌ని” అని మాటల సందర్భంలో ఆయన చెప్పారు. ఆంధ్ర జాతీయ కళాశాలలో జాతీయ భావాలు నాటుకొని మహాత్ముని చేత ప్రభావితుడైన తరువాత ఆయన ధూమపానం మానివేశారు.

ఒక కార్యకర్త తానిక నిరంతరం ఖద్దరు ధారణ చేస్తానని ముందుకు వచ్చి వాగ్దానం చేశాడు.

మా నాన్నగారు తన చిరుకోపం తగ్గించుకొనుటకు ప్రయత్నిస్తానని చెప్పారు. కొద్ది రోజులలోనే ప్రభాకర్‌జీ వ్యక్తిత్వం కార్యకర్తలను ఇలా సూదంటురాయి వలె ఆకర్షించి ప్రభావితులను చేసింది.

గాంధీ మహాత్ముడు నైతిక విలువలకు ప్రథమ స్థానమిచ్చారు. నైతిక సూత్రాలకు ప్రాధాన్యత నివ్వటంతో పాటు తానే స్వయంగా ఆచరించి ఆదర్శప్రాయడైనారు ప్రభాకర్‌జీ.

గాంధీక్షేత్రంలో పనిచేస్తున్న వివిధ సంస్థలను సమన్వయ పరచడానికి “గాంధీక్షేత్రం” కమిటీని ఏర్పరచారు. ఈ కమిటీ ఆధ్వర్యాన గాంధీక్షేత్రం కార్యకలాపాలు

జరుగుతాయి. గాంధీక్షేత్రం కమిటీ అధ్యక్షునిగా ఉండవలసిందిగా నాన్నగారు ప్రభాకర్‌జీని కోరారు. కార్యకర్తలందరు సంతోషించారు. ప్రభాకర్‌జీ అంగీకరించారు. అప్పటి నుండి గాంధీక్షేత్రంతో ప్రభాకర్‌జీ అనుబంధం దృఢతరం కాజొచ్చింది.

గాంధీక్షేత్రంలో 40 మంది అనాధ బాలబాలికలతో అనాధ శరణాలయం నడుపుతుండే వాళ్ళం. అనాధ బాలల వసతి కొరకు, గాంధీక్షేత్రంలోనే నడుపబడుతున్న హిందీ ప్రచారక విద్యాలయం వసతి కొరకు ఒక ఎకరం విస్తీర్ణంలో సేవాశ్రమం స్థాపించాలని నాన్నగారు ఆశించారు. సేవాశ్రమంకు గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలా గాంధీ, మనుమడు శ్రీ కనూ గాంధీ గార్లచే ప్రారంభోత్సవం చేయించాలని ప్రభాకర్‌జీ నిర్ణయించారు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ కార్యకర్తల సమ్మేళనం గాంధీక్షేత్రంలో జరపడానికి నిశ్చయించారు.

ప్రభాకర్‌జీ అంటే ప్రతి కార్యకర్త "భాయిజీ", "భాయిజీ" అంటూ వెంట తిరుగుతారు. సర్వోదయ ఉద్యమంలో కార్యకర్తలను ప్రభాకర్‌జీ జ్ఞప్తి ఉంచుకొన్నట్లు మరే నాయకుడు గుర్తు పెట్టుకోలేదు. ఆయన వారి పట్ల చూపిన ప్రేమాభిమానాలు మరెవ్వరూ చూపలేదు.

1977 అక్టోబరు 5వ తేదీన మహాత్మాజీ కోడలు శ్రీమతి నిర్మలా గాంధీ, మనుమడు శ్రీ కనూ గాంధీ అవనిగడ్డ విచ్చేశారు. దివిసీమ ప్రజలు అపూర్వమైన స్వాగతం ఇచ్చారు. గాంధీ వాదానికి తమ మద్దతు ప్రకటించారు. శ్రీమతి నిర్మలా గాంధీ సేవాశ్రమాన్ని ఆనందోత్సాహాల మధ్య ప్రారంభించారు.

మరునాడు శ్రీమతి నిర్మలా గాంధీ ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సమ్మేళనం ప్రారంభించారు. ప్రభాకర్‌జీ అధ్యక్షత వహించారు. రాష్ట్రం నలుమూలల నుండి నిర్మాణ కార్యకర్తలు వచ్చి పాల్గొన్నారు. సమ్మేళనం రెండు రోజుల పాటు సాగింది. 7వ తేదీ సాయంత్రం శ్రీమతి నిర్మలా గాంధీ, శ్రీ కనూ గాంధీ వీడ్కోలు ఉపన్యాసాలిస్తూ తమ నిక్కడకు తీసుకు వచ్చి గాంధీక్షేత్రం చూసే సదవకాశం కల్పించిన ప్రభాకర్‌జీకి కృతజ్ఞతలు చెప్పారు.

నిజానికి ఆ మూడు రోజులు దివిసీమ వాసులకు మరపునకు రానివి. నిద్రాణమైన జాతిని మేల్కొల్పేందుకు నూతన చైతన్యాన్ని పెంపొందించేందుకు గాంధీ వాదమే శరణ్యమని చాటి చెప్పిన రోజులవి.

నవంబరు 13న అఖిల భారత హరిజన సేవ సంఘాధ్యక్షులు, గాంధేయ

వృద్ధులు శ్రీ శ్యామలాల్‌జీని ప్రభాకర్‌జీ అవనిగడ్డకు తీసుకువచ్చారు. వారిచే సేవాశ్రమంలో జాన్ డేవిడ్ బ్లాకు ప్రారంభోత్సవం చేయించారు. నవంబరు 14న బాల దినోత్సవంలో ఇరువురూ పాల్గొన్నారు.

ప్రభాకర్‌జీ ఎవరింటికి వెళ్ళినా ముందు ఇంట్లో ఆడపడుచులను పలకరించి, పిల్లల యోగక్షేమాలు అడిగి తెలుసుకునేవారు. అందుకు నిదర్శనం మా ఇంట్లో మా అమ్మగారితోను, మా చెల్లెండ్లతోను సమీప బంధువులా ఉండేవారు. పెద్ద వాళ్ళని ఎవరిని తీసుకు వచ్చినా ముందు ఆయన్ని తీసుకువెళ్ళి పరిచయం చేసేవారు.

శ్రీ శ్యామలాల్‌జీ అవనిగడ్డకు వచ్చినప్పుడు అమ్మావాళ్ళు హైదరాబాద్‌లో ఉన్నారు. అమ్మని వారికి పరిచయం చేయుట కొరకు నాన్నగారు ఇంటి వద్ద లేనప్పటికి వారిని హైదరాబాద్‌లో మా ఇంటికి భోజనానికి తీసుకువచ్చారు. శ్రీ శ్యామలాల్‌జీ ఉప్పు కారం తక్కువ తింటారు. ఉడకేసిన కూరలంటే వారికి ఇష్టం. అందుచేత ప్రభాకర్‌జీ ముందుగానే మా ఇంటికి వచ్చి దగ్గరుండి కూరలు ఎలా చెయ్యాలో, ఏమి చెయ్యాలో అమ్మతో చెప్పి చేయించారు.

శ్రీ శ్యామలాల్‌జీ వచ్చి వెళ్ళిన అయిదు రోజులకి నవంబరు 19న దివిసీమ ఉప్పెన తాకిడికి గురి అయింది. వేలాది మంది మరణించారు. లక్షలాది పశువులు చనిపోయాయి. ఊళ్ళకి ఊళ్ళే తుడిచి పెట్టుకు పోయాయి. ఒక మాటలో చెప్పాలంటే ప్రపంచంలో కనీవినీ ఎరుగని బీభత్సం దివిసీమలో జరిగింది. నాన్నగారు ఆ రోజున సేవాశ్రమంలో ఉండి అనాథ బాలలు తుఫాను వాత పడకుండా రక్షించారు.

నాన్నగారు మానసికంగా చాలా దెబ్బతిన్నారు. సహాయ కార్యక్రమాలు నత్తనడక నడుస్తున్నాయి. వేలాది మృతదేహాలు ఎక్కడవి అక్కడే పడి ఉన్నాయి. తీసే నాథుడు లేడు. పైగా ఊళ్ళన్నీ చెప్పలేనంత దుర్వాసనతో నిండి ఉన్నాయి. అవనిగడ్డ, నాగాయలంక, కోడూరు పరిసర గ్రామాల నుండి వచ్చిన నిర్వాసితులతో నిండి పోయాయి. వారికి భోజన సదుపాయాలు కలుగజేస్తున్నారు. ఎందరో దయామయులు విచ్చేసి బాధితులకు తమకు తోచిన సహాయం అందజేస్తున్నారు.

25వ తేదీ సాయంకాలం నాన్నగారు భావదేవరపల్లి వెళ్ళారు. వారి వెంట నేను కూడా వెళ్లాను. భావదేవరపల్లి రోడ్డు అప్పుడే బాగు చేశారు. భావదేవరపల్లిలో మేము చూసిన దృశ్యాలు హృదయ విదారకమైనవి. శవాలు, మృత కళేబరాలు ఎక్కడికక్కడ పడి ఉన్నాయి. పోలీసులు వాటిని తీసే ప్రయత్నం చేస్తున్నారు. కానీ వారి శ్రమ సముద్రంలో నీటి బొట్టులాగా ఉంది.

భావదేవరపల్లి పరిస్థితే ఇలా ఉంటే దిగువ గ్రామాల పరిస్థితి ఇంకా ఎంత హృదయ విదారకంగా ఉన్నదోనని నాన్నగారు బాధ పడ్డారు. "20 సంవత్సరాల నుంచి కృషి చేసి వెనుకబడ్డ దివిసీమను ఎంతో అభివృద్ధి చేశాను. నా కృషి కడలి పాలైంద"ని నాన్నగారు బాధపడి, మంత్రి పదవిలో కొనసాగుట కంటే, సామాన్య కార్యకర్తగా దివిసీమ పురోభివృద్ధికి పాటు పడటం మంచిదని తలంచి తన రాజీనామా కాగితాన్ని భావదేవరపల్లి నుంచే ముఖ్యమంత్రికి పంపించారు.

బాధితులకు ధైర్యం చెప్పి రాత్రి 8 గంటలకు అవనిగడ్డ చేరాము. మా ఇంటి వరండాలో శ్రీ ప్రభాకర్‌జీ కూర్చుని ఉన్నారు. వారితో పాటు శ్రీ ఊటుకూరి నరసింహారావుగారు కూడా ఉన్నారు. పూజ్య వినోభాజీ తాను వడికిన ఖద్దరు వస్త్రాన్ని, ఒక రూపాయి విరాళాన్ని ఇచ్చి సహాయ కార్యక్రమాలలో పాల్గొనుటకుగాను శ్రీ ప్రభాకర్‌జీని పంపారు. ప్రభాకర్‌జీని చూడగానే పోయిన ప్రాణం వచ్చినట్లయి పరిస్థితినంతా నాన్నగారు ఆయనకు వివరించారు.

ముందుగా శవాలను తొలగించే సమస్య ఆలోచించాలి. ఎక్కడి శవాలు అక్కడ ఉంటే మరికొన్ని సమస్యలు ఉత్పన్నం కావచ్చు. కలరా వంటి వ్యాధులు తలెత్తవచ్చు. పైగా ఆయా గ్రామాల ప్రజానీకం అవనిగడ్డ, నాగాయలంక, కోడూరులలో తల దాచుకొని ఉన్నారు. గ్రామాలను పరిశుభ్రం చేసి బాధితులను స్వగ్రామాలకు తిప్పి పంపించాలి.

శవాల తొలగింపు సమస్యపై ప్రభాకర్‌జీ తీవ్రంగా ఆలోచించారు. పలువురితో చర్చించారు. ఫలితంగా రాత్రి 12 గంటలకు శవాలను తీయుటకు స్వచ్ఛంద సేవకులను తీసుకు వెళ్లాలని నిర్ణయం తీసుకున్నారు. కానీ కుళ్ళిపోయిన శవాలను చేతులతో తీయటానికి వీలుపడదు. అందుచేత తెడ్డు లాంటి కర్రలను శవాలను ఎత్తుటకు, వాటిని పడవేయుటకు పాడి లాంటి వాటిని చెక్కలతో తయారు చేయించారు. ఈ కార్యక్రమాలు పూర్తయ్యేసరికి దాదాపు తెల్లవారింది.

శవాలను తీయుటకు వెళ్ళే స్వచ్ఛంద సేవకుల బృందానికి "శవసేన" అని పేరు పెట్టారు ప్రభాకర్‌జీ. శవసేనకు ఆయనే నాయకత్వం వహించారు.

ప్రభాకర్‌జీ సారథ్యాన తొలి బృందం 26వ తేదీ ఉదయాన "శవసేన జిందాబాద్" అంటూ నినాదాలు చేసుకుంటూ లారీలో బయలుదేరి వెళ్ళింది. నాన్నగారు కూడా తొలి బృందంలో ఉన్నారు.

శవాలంటేనే భయపడుతున్న ప్రజలు శవసేన కార్యక్రమం విజయవంతం కాదని అన్నారు. కానీ రాత్రికి శవసేన కార్యకర్తలు విజయోత్సాహంతో అనాధ ప్రేత సంస్కారాన్ని చేశామన్న సంతృప్తితో అవనిగడ్డ చేరారు.

నాన్నగారు, ప్రభాకర్‌జీ మందపాకలలో శవసేన కార్యక్రమాన్ని ప్రారంభించి, కార్యకర్తలను అక్కడ ఉంచి, వారిద్దరూ కాలి నడకన ఉప్పెనకు గురైన గ్రామాలను పరిశీలిస్తూ అర్ధరాత్రికి అవనిగడ్డ చేరారు.

శవసేన కార్యక్రమం విజయవంతంగా సాగిందని నలుమూలలా తెలిసి పోయింది. అభినందనల పరంపరలు అందుకున్నారు ప్రభాకర్‌జీ. వివిధ స్వచ్ఛంద సంస్థలు, రాజకీయ పక్షాలు, సాంఘిక సేవకులు, విద్యార్థులు రంగంలోకి దూకారు. శవాలను తొలగించే పవిత్ర కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రభాకర్‌జీ చొరవ వల్లనే కొద్ది రోజులలోనే శవాలను తొలగించి గ్రామాలను పరిశుభ్రం చేయటానికి అవకాశం కలిగింది.

శవసేన విజయవంతం కావడంతో ప్రభాకర్‌జీ తమ దృష్టిని సహాయ కార్యక్రమాల పైకి మళ్ళించారు. దివిసీమ విపత్తు ప్రపంచ వ్యాప్తంగా తెలిసిపోవడంతో ఎన్నో అంతర్జాతీయ సంస్థలు, మన దేశంలోని స్వచ్ఛంద సంస్థలు, సంస్థలే కాకుండా ఎందరో కరుణామయులు దివిసీమకి విచ్చేసి బాధితులకు తాత్కాలిక సహాయాన్ని అందించారు.

సహాయ కార్యక్రమాలలో సమన్వయం లేకపోవుట వల్ల అందిన వారికే అందడం, అసలు అందని వారికి అందకపోవడం జరుగుతున్నది. సహాయం కొన్ని గ్రామాలకే పరిమితమవుతున్నది కూడా. మారుమూల గ్రామాలకు సహాయం అందడం లేదు. అందుచేత ప్రభాకర్‌జీ ఉప్పెన, తుఫాను పునర్నిర్మాణ సమితిని స్థాపించి సహాయ కార్యక్రమాలను సమన్వయం చేయుటకు పూనుకున్నారు. శ్రీ లవణం, శ్రీమతి హేమలతా లవణం, శ్రీ ఎం.ఎస్ రాజలింగం, శ్రీ జయసింహాచారి వంటి ప్రముఖ సర్వోదయవాదుల సేవలను ఈ కార్యక్రమ సఫలతకు వినియోగించారు.

దివిసీమలో పనిచేస్తున్న స్వచ్ఛంద సంస్థలను తరచూ సమావేశ పరచి చేస్తున్న కార్యక్రమాలు, చేయవలసిన కార్యక్రమాల గురించి చర్చించేవారు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రభాకర్‌జీ వారధి లాగా పనిచేశారు.

ప్రభాకర్‌జీ అవనిగడ్డలో ఉండే సమయంలో గాంధీక్షేత్రంలోని అనాధ

శరణాలయ పిల్లలతో ఎక్కువసేపు గడిపేవారు. పిల్లలంటే ఆయనకు అమిత ప్రేమ. ప్రభాకర్‌జీ అంటే పిల్లలకు అమిత భక్తి. ప్రభాకర్‌జీ ఊరి నుండి వచ్చారంటే పిల్లలందరూ అమితానందంతో ఆయన్ని చుట్టుముట్టేవారు.

రాత్రివేళ ఎప్పుడు మెలుకువ వస్తే అప్పుడు ప్రభాకర్‌జీ సేవాశ్రమం లోనికి వెళ్లి పిల్లలు నిద్రపోతున్నారా లేదా అని పరిశీలన చేసేవారు. ప్రతిరోజు తెల్లవారు జామున నాలుగు గంటలకు లేచి ముందు మరుగుదొడ్లు శుభ్రం చేసి, కాలకృత్యాలు నిర్వర్తించుకొని, పిల్లలందరినీ సమకూర్చుకొని వారి చేత దైవ ప్రార్థన చేయించేవారు.

పిల్లల చేత వ్యాయామం చేయించే ఉద్దేశ్యంతో తెల్లవారుజామున తాను ముందు పరుగు తీస్తుంటే వెన్నంటి వందలాది బాలబాలికలు వారిని అనుసరిస్తూ పరుగెత్తుతుంటే ఆ దృశ్యం చూడ ముచ్చటగా ఉండేది. ప్రభాకర్‌జీ బాల్యంలో మంచి క్రీడాకారుడని పేరు తెచ్చుకున్నారు.

ప్రతిరోజు సేవాశ్రమం పిల్లలతో శ్రమదానం చేయించడం ఆయన విధిగా పెట్టుకున్నారు. శ్రమదాన కార్యక్రమం జరుగుతున్నప్పుడు ప్రభాకర్‌జీ పిల్లల మధ్య చుక్కల్లో చంద్రుని వలె ఉండేవారు. పిల్లల పరిశుభ్రత విషయంలో చాలా జాగ్రత్త తీసుకునేవారు. ముఖ్యంగా ఆడపిల్లలు తల దువ్వుకున్నారా లేదా అని పరిశీలన చేస్తూ ఉండేవారు. పిల్లల ఆరోగ్యాన్ని గూర్చి చాలా శ్రద్ధ చూపేవారు. జ్వరం వచ్చిన పిల్లలను వేరుగా ఉంచి, వారి పథ్యపానాలు జాగ్రత్తగా నిర్వర్తించేందుకు ఒక గదిని ప్రత్యేకించేవారు. నిత్యం ఆ గదిలోనికి వెళ్లి అస్వస్థులైన ఆ బిడ్డల యోగక్షేమాలు చూస్తుండేవారు. డాక్టర్లను పిలిపించి వారికి మందు లిప్పించి, పాలు, రొట్టె మొదలైన పదార్థాలు అందజేయించేవారు.

ప్రభాకర్‌జీ భజనలు, కీర్తనలు శ్రావ్యంగా పాడుతారు. సుప్రసిద్ధ కవులు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన "నారాయణ, నారాయణ, అల్లా, అల్లా! మీ పాలిటి పిల్లల మేమెల్లా" అనే గీతాన్ని స్వయంగా పిల్లలకు నేర్పి పాడించేవారు. సేవాశ్రమం పిల్లలకు కూచిపూడి నాట్యం నేర్పేందుకు ఏర్పాటు చేశారు కూడా. చిన్నతనంలో ప్రభాకర్‌జీకి నాటకరంగంలో అనుభవం ఉంది. హనుమంతుడు, రంగూన్ రౌడి మున్నగు పాత్రలను ఆయన నటించే వారట.

ఆంధ్ర జాతీయ కళాశాలలో కులపతి అడివి బాపిరాజు, మహాకవి కాటూరి వెంకటేశ్వరరావుగార్ల సాంగత్యం ప్రభాకర్‌జీకి సాహిత్యంలో అభినివేశాన్ని కలిగించింది.

బాపిరాజుగారి జీవిత స్మృతులను ఆయన స్మరించేవారు. కాటూరి వారి రచనలు ఆయనకు కంఠోపాఠం.

ఒకసారి ఉప్పెనలో ప్రభాకర్‌జీ అనుభవాలను గ్రంథంగా వ్రాయించాలనే ఉద్దేశ్యంతో వెళ్లి ఆయనను అడిగాను. అప్పుడాయన వెంటనే కాటూరి వారు రచించిన ఒక పద్యాన్ని చదివి, ఆ పద్యంలోని వర్ణనను వివరంగా చెప్పి, "ఉప్పెన భీభత్సాన్ని కళ్ళకు కట్టేలాగా ఉప్పెన స్మృతుల్ని ఉపన్యాస రూపంలో చెబుతాను. వాటిని వ్రాయించే ఏర్పాట్లు చెయ్యి" అని చెప్పారు.

ఇంతలో గోవధ నిషేధ సమస్యపై వారు కేరళకు వెళ్ళడం వల్ల ఆ పని ప్రారంభం కాలేదు. ఇలా అప్పట్లో ఉప్పెనను గురించిన ఒక గొప్ప గ్రంథావతరణం ఆగిపోయింది.

సేవాగ్రాం ఆశ్రమంలోను, గాంధీజీతో ప్రభాకర్‌జీ అనుభవాలను "గాంధీ పథం" అనే పేర శ్రీ ఊట్ల కొండయ్యగారు రచించారు. అది తెలుగు పాఠకుల అభిమానాన్ని చూరగొన్నది. అలాగే కస్తూర్బా జీవిత విశేషాలతో ఒక గ్రంథం తయారు చేయవచ్చునని ప్రభాకర్‌జీ చెబుతూ ఉండేవారు. ఆ పుస్తకం తయారయి ఉంటే కస్తూర్బాను గురించి లోకానికి తెలియని అనేక విషయాలు వెలువడి ఉండేవి. ఆ భాగ్యానికి మనం నోచుకోలేదు. ఆ పని జరగకుండానే ప్రభాకర్‌జీ వెళ్ళిపోయారు.

స్వతహాగా గాంధేయవాదియైన శ్రీ మురార్జీ దేశాయ్‌గారు ప్రభాకర్‌జీని గౌరవించేవారు. ఆనాటి భారత ప్రధాని శ్రీ మురార్జీ దేశాయ్‌గారు 1977 నవంబరులో తుఫాను బాధిత ప్రాంతాలు చూడడానికి అనుకోకుండా హెలికాప్టరులో వచ్చారు. ఆ రోజు నాన్నగారు ప్రధానికి స్వాగతం చెప్పడం కోసం గన్నవరం విమానాశ్రయానికి వెళ్ళారు. శ్రీ మురార్జీ దేశాయ్, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారిని వెంటబెట్టుకొని గాంధీక్షేత్రానికి విచ్చేసి, తుఫాను బాధితుల సహాయ శిబిరాన్ని తిలకించారు. శ్రీ ప్రభాకర్‌జీ ప్రధానికి సహాయ కార్యక్రమాలను గురించి వివరించారు. మా అమ్మను తీసుకువెళ్ళి ఆయనకు పరిచయం చేశారు. ప్రధాని హెలికాప్టర్ వద్దకు కారులో వెడుతూ నాన్నగారు ప్రభాకర్‌జీని కూడా కారులో తన వెంట తీసుకువెళ్ళారు.

రామకృష్ణ మిషన్ వారు పునర్నిర్మించిన గొల్లపాలెం గ్రామానికి ప్రారంభోత్సవం జరపడానికి 1978, నవంబరు 13వ తేదీన ప్రధాని రెండవసారి దివిసీమ విచ్చేశారు. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సంఘ సేవకుల సమాఖ్య దివిసీమ ఉప్పెన భీభత్సాన్నీ,

తదనంతర పునర్నిర్మాణాన్ని వివరిస్తూ ఇంగ్లీషులో ప్రచురించిన Devartation Development అనే ప్రత్యేక సంచికను ప్రభాకర్‌జీ ప్రధానికి బహూకరించారు.

శ్రీ మురార్జీ దేశాయ్ ప్రభాకర్‌జీ పట్ల ప్రేమాభిమానాలు చూపుతూ, ఆయన క్షేమ సమాచారాలడిగి తెలుసుకున్నారు. "మీరు సేవాగ్రాంలో నిరాహార దీక్ష చేసినట్లు శ్రీమతి నిర్మలా గాంధీ చెప్పింది. సేవాగ్రాం విషయాలను గూర్చి బాధపడవద్దు. నేను త్వరలో అక్కడకు వచ్చి సర్దుబాటు చేయడానికి ప్రయత్నిస్తాను" అని ప్రధాని శ్రీ మురార్జీ దేశాయ్ ప్రభాకర్ జీతో అన్నారు.

ఉప్పెన బాధిత ప్రాంతాలలో పర్యటించడానికి శ్రీమతి ఇందిరాగాంధీ 1977 నవంబరు 27వ తేదీన దివిసీమకు విచ్చేశారు. ఆ క్రిందటి రోజే అంటే 26వ తేదీన ప్రభాకర్‌జీ శవసేన నేర్పాటు చేశారు.

శ్రీమతి ఇందిరాగాంధీ భావదేవరపల్లి గ్రామాన్ని చూచి సాయంకాలం 6 గంటలకు మా ఇంటికి వచ్చారు. ప్రభాకర్‌జీ శవసేన కార్యకర్తలను ఆమెకు పరిచయం చేసి, శవసేన కార్యక్రమాలను వివరించగా విని, శ్రీమతి గాంధీ శవసేన నిర్మాణం చేసినందుకు ప్రభాకర్‌జీని చాలా అభినందించారు.

మరల శ్రీమతి ఇందిరాగాంధీగారు 1978 సెప్టెంబరు 2వ తేదీన పునర్నిర్మాణ కార్యక్రమాలను పరిశీలించే నిమిత్తం అవనిగడ్డకు విచ్చేశారు. ప్రభాకర్‌జీ ఇందిరాగాంధీ గారి చేత సేవాశ్రమంలో పాఠశాల భవనానికి శంఖుస్థాపన చేయించారు. బహిరంగ సభలో శ్రీమతి ఇందిరాగాంధీకి ప్రభాకర్‌జీ స్వాగతం చెప్పారు.

ఉప్పెన బాధిత ప్రాంతాలను చూడడానికి వచ్చే అన్ని రాజకీయ పక్షాల నాయకులు ప్రభాకర్‌జీని కలసి చర్చలు చేస్తుండేవారు. జనతా పార్టీ తరఫున శ్రీమతి సుశీలా నయ్యర్ అవనిగడ్డకు విచ్చేశారు. ప్రభాకర్‌జీ గాంధీక్షేత్రంలో ఉన్నారని తెలుసుకొని ఆమె నడచి వచ్చి ఆయనను చూచి యోగక్షేమాలు తెలుసుకొని వెళ్ళారు. ఆర్.ఎస్.ఎస్. అధినేత శ్రీ బాబా సాహెబ్ దేవరస్‌గారు అవనిగడ్డకు వచ్చినప్పుడు ప్రభాకర్‌జీని గౌరవించి, ఆర్.ఎస్.ఎస్. వారేర్పాటు చేసిన సభలో ఆయన చేత ప్రసంగింపజేశారు.

దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు గాంధీ స్మారక నిధి ఆధ్వర్యములో 1978, డిసెంబరు 8, 9, 10వ తేదీలలో అవనిగడ్డ గాంధీక్షేత్రంలో జరిగాయి. ప్రభాకర్‌జీ ప్రోత్సాహమే దీనికి మూలకారణం. గాంధీ స్మారకనిధి అధ్యక్షులు

శ్రీ అరుణాచలం, కార్యదర్శి శ్రీ పూర్ణచంద్ర జైన్, వివిధ రాష్ట్రాల గాంధీ స్మారక నిధి అధ్యక్ష, కార్యదర్శులు, నిర్మాణ కార్యకర్తలు మహాసభలో పాల్గన్నారు. రాష్ట్ర గవర్నరు శ్రీ కె.సి. అబ్రహాంగారు సభలను ప్రారంభించారు. మహాసభలు మూడు రోజుల పాటు విజయవంతంగా జరిగాయి.

గోవధ నిషేధంపై కేరళ ప్రభుత్వంతో సంప్రదించుటకు మహాసభలో ఒక కమిటీని నియమించింది. దానిలో ప్రభాకర్‌జీ సభ్యుడు. చివరి రోజు సమావేశంలో మనం గోవును రక్షించాలంటూ ప్రజల చేత శపథం చేయించారు ప్రభాకర్‌జీ.

1979, మే 11వ తేదీన ఆంధ్రప్రదేశ్ తీర ప్రాంతం మరల తుఫానుకు బలియైంది. తుఫాను హెచ్చరికలు విని తల్లడిల్లిన దివిసీమ ప్రజలు అవనిగడ్డ గాంధీక్షేత్రానికి చేరారు. గత సంవత్సరపు ఉప్పెన భయంకర స్మృతులు గుర్తుకు వచ్చి ప్రజలు గజగజ లాడిపోయారు. అవనిగడ్డ చేరిన ప్రజానీకానికి భోజన, వసతి సౌకర్యాలు ఏర్పాటు చేయడంలో మేము నిమగ్నమై ఉన్నాము. తుఫానుకు నెల్లూరు, ప్రకాశం జిల్లాలు తీవ్రంగా దెబ్బతిన్నాయని వార్త అందినది. గత సంవత్సరం దివిసీమను వరించిన శోక దేవత ఈ సంవత్సరం ప్రకాశం, నెల్లూరు జిల్లాలను కౌగిలించుకున్నది.

తుఫాను సహాయ కార్యక్రమాలలో పాల్గొనే నిమిత్తం మే 19వ తేదీన నాన్నగారు ఒంగోలు వెళ్ళారు. నేనూ వారి వెంట వెళ్లాను. నాలుగు రోజు లక్కడ ఉండి, తుఫాను బాధితులకు గాంధీక్షేత్రం తరఫున నూతన వస్త్రాలు పంచిపెట్టాము. 22వ తేదీన మేము కనిగిరి వెళ్ళాము. ఈ ప్రాంతం తుఫానులో బాగా దెబ్బ తిన్నది. మేము కనిగిరి వెళ్ళిన రోజునే ప్రభాకర్‌జీ ఒంగోలు వచ్చి, మేము బస చేసిన హోటల్‌కు వెళ్లి మా గురించి విచారించగా, మేము కనిగిరి వెళ్ళినట్లు చెప్పారట. అక్కడ నుండి ప్రభాకర్‌జీ నెల్లూరు ప్రాంతాలకు వెళ్ళారు. అందువలన అప్పుడు వారిని కలుసుకోలేక పోయాము.

జూన్ 3వ తేదీన ప్రభాకర్‌జీ హైదరాబాద్ నుండి తిరుపతి చేరి అక్కడ స్థానిక కార్యక్రమాలలో పాల్గొని 5వ తేదీకి నెల్లూరు చేరారు. అక్కడ అఖిల పక్ష కమిటీ వారిని కలుసుకొని తుఫాను బాధితులకు సహాయ కార్యక్రమాల గురించి చర్చలు జరిపారు. పద్మవిభూషణ్ శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారిని కలుసుకొని పల్లెపాడు స్వరాజ్య ఆశ్రమం గురించి చర్చలు జరిపారు. అక్కడ నుండి కోడూరు వెళ్ళారు. కోడూరు నుంచి సముద్ర తీర ప్రాంతమైన పట్టపుపాలెం వెళ్లి, అక్కడి మత్స్య

పారిశ్రామికులను కలుసుకొని వారికి జరుగుతున్న సహాయ కార్యక్రమాల గురించి తెలుసుకున్నారు.

ప్రభాకర్‌జీ పట్టపుపాలెం ఎలా వెళ్ళారు? రెండు కిలోమీటర్ల దూరం నడిచి వెళ్లి, బకింగ్‌హాం కాలువ దాటి ఆ ఊరు చేరారు.

ఆయన వెంటనున్న జయసింహాచారిగారు "నేను నడువలేను. మీ ఆరోగ్యం కూడా బాగా లేదు కదా! శ్రమ తీసుకొని వెళ్ళవద్దు" అంటూ వారించడానికి ప్రయత్నించారు. ప్రభాకర్‌జీ వినలేదు. "సేవా కార్యంలో మరణించడం కంటే కావలసిందేమున్నది?" అన్నారట.

పట్టపుపాలెం నుండి ఒంగోలు చేరి తుఫాను బాధిత ప్రాంతాలలో తిరిగారు. ఆ రాత్రి కందుకూరు చేరి అక్కడ మకాం చేశారు. మరునాటి ఉదయం (జూన్ 6వ తేది) అక్కడ డిప్యూటి తహసీల్దారుగారిని, కొందరు ఉపాధ్యాయుల్ని కలుపుకొని ముప్పాళ్ళ వెళ్ళారు. రెండు గంటల సేపు భయంకరమైన తుఫానులో తీవ్రంగా దెబ్బతిన్న ముప్పాళ్ళ పరిసర గ్రామాలు చూచి కందుకూరు చేరారు. సాయంత్రం 5 గంటల వరకు కందుకూరులోనే ఉన్నారు. ప్రభాకర్‌జీకి వడదెబ్బ తగిలింది. గుండెనొప్పి, జ్వరమూ వచ్చాయి. తాను ప్రకృతి చికిత్సాభిమాని కావడం చేత ఇంగ్లీషు మందులు వాడడానికి నిరాకరించి, విశ్రాంతి కూడా తీసుకోకుండా వెంటనే బయలుదేరి బాపట్ల వచ్చారు. ఆ రాత్రి కాళ్ళ నొప్పులతో చాలా బాధపడ్డారు.

7వ తేదీ నుంచి స్థానిక ప్రకృతి వైద్యుని వద్ద చికిత్స ప్రారంభించారు. చికిత్సలో ఉపవాసం మొదలైంది. జ్వరం 102 డిగ్రీలకు వచ్చి నిలిచింది. 8, 9 తేదీలలో జ్వర తీవ్రతతో బాధపడుతూనే ఉపవాసం కొనసాగించి చికిత్స నడిపించారు. మనిషి బాగా బలహీన మయ్యారు. 10వ తేదీకి పరిస్థితి ప్రమాదకరంగా పరిణమించింది. అప్పుడు ఆయనను ప్రసిద్ధుడైన ఒక స్థానిక అలోపతి డాక్టరుకు చూపించారు. ఆయన తన నర్సింగ్ హోంలో ప్రభాకర్‌జీకి ఆ రోజు చికిత్స నడిపి. గుంటూరు ప్రభుత్వాసుపత్రికి తీసుకువెళ్లవలసిందిగా సలహా ఇచ్చారు.

ప్రభాకర్‌జీ 13వ తేదీన అవనిగడ్డ వస్తారని మేము ఎదురు చూస్తున్నాము. 12వ తేదీ రాత్రి 9 గంటలకు గుంటూరు నుండి "ప్రభాకర్‌జీ పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నది. గుంటూరు ప్రభుత్వాసుపత్రిలో చేర్చాము" అంటూ గాంధీ పీస్ ఫౌండేషన్‌కు చెందిన శ్రీ మూర్తిగారు టెలిగ్రాం ద్వారా తెలియపరచారు. ప్రభాకర్‌జీ కొరకు ఎంతో ఉత్సాహంతో ఎదురుచూస్తున్న మాకు పిడుగు లాంటి ఈ వార్త చేరింది.

గుంటూరు వెళ్లి ప్రభాకర్‌జీ పరిస్థితి చూడగానే మాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆయన స్పృహ కోల్పోయి ఉన్నారు. ముక్కు ద్వారా ఆక్సిజన్ ఎక్కిస్తున్నారు. మనిషిలో కదలికలు లేవు. ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో ఆయన ప్రక్కన కొంచెంసేపు బాధాతప్త హృదయంతో కూర్చున్నాము. ప్రభాకర్‌జీ పరిస్థితి విషమించిందని, మెదడుకు సంబంధించిన వ్యాధి వచ్చిందని హాస్పిటల్ సూపరింటెండెంటు శ్రీ వెంకట్రావుగారు చెప్పారు.

1979, మే 17వ తేదీ రాత్రి 12.20 గంటలకు ప్రభాకర్‌జీ అస్తమించారు.

దివిసీమకు ప్రభాకర్‌జీ చేసిన సేవలకు స్మృతి చిహ్నంగా చింతకోళ్ళ గ్రామానికి ప్రభాకర్‌జీ పురం అని నామకరణం చేశారు.

అవనిగడ్డ గాంధీక్షేత్రంలో మా నాన్నగారు వారి విగ్రహాన్ని నెలకొల్పి గాంధీ శాంతి సంస్థ కార్యదర్శి శ్రీ రాధాకృష్ణతో ఆవిష్కరింప చేశారు. వారి స్మృత్యర్థం 'ప్రభాకర్‌జీ దీన జన ఫౌండేషన్'ను ఏర్పరచారు. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సేవా సంస్థకు సంఘం వారు ఉత్తమ సమాజ సేవకులకు ప్రభాకర్‌జీ అవార్డు బహూకరించ తలపెట్టి మొదటి అవార్డు మా నాన్నగారికే ఇవ్వడం జరిగింది. వారి పవిత్రాత్మకు నా అశ్రు నివాళి.



శ్రీ ఎమ్.వి. కృష్ణారావు, శ్రీ ప్రభాకర్‌జీ, శ్రీ ఎన్. జనార్దన రెడ్డి, శ్రీ కోనేరు రంగారావు, కేంద్రమంత్రి శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి, శ్రీ ఎ.వి.ఎస్. రెడ్డి, కలెక్టర్, డా॥ ఎమ్. చెన్నారెడ్డి – ముఖ్యమంత్రి, స్వామి ప్రధమానంద, శ్రీ వీరనారాయణరెడ్డి– ఎస్.పి.,



# బాలాసాహెబ్ దేవరస్

దివిసీమ ఉప్పెనలో రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ సేవలు విశిష్టమైనవి. అవనిగడ్డలో సంఘ కార్యకర్తలతో మాకు వ్యక్తిగత సాన్నిహిత్యం ఉండేది.

నా మిత్రుడు కోట శివ మధుసూదన్ నేను స్థాపించిన గ్రామీణ యువజన వికాస సమితికి కార్యదర్శిగా ఉంటూ, గాంధీక్షేత్రంలో జరిగే కార్యక్రమాలకు నిర్వహణ చేస్తుండేవాడు.

శ్రీ శనగవరపు వెంకటేశ్వర్లు (మీసాల మాష్టారు) స్థానికంగా ఆరెస్సెస్ ప్రచారకుడుగా ఉండేవారు. శిశువిద్యామందిరంలో ఉపాధ్యాయుడు. ఈయన కూడా గాంధీక్షేత్రంలో జరిగే కార్యక్రమాలకు సహకారిగా ఉండేవారు.

ఉప్పెన వచ్చిన మరునాటి ఉదయానికే వేలాదిమంది నిరాశ్రయులైన ప్రజలు గాంధీక్షేత్రాలన్ని ఆశ్రయించారు. రోజుకు కనీసంలో కనీసంగా 10 వేలమందికి వండి వడ్డించటం సామాన్యమైన విషయం కాదు. వీరిరువురూ మరికొంతమంది ఆరెస్సెస్ కార్యకర్తల్ని తీసుకువచ్చి వడ్డన కార్యక్రమం చేపట్టారు. వారు ఆరెస్సెస్ బ్యాడ్జీ పెట్టుకుని వడ్డన చేశారు.

10 వేలమందికి అన్నం వడ్డన చిన్నపనేమీ కాదు. క్రమశిక్షణతో అందరినీ కూర్చోబెట్టి కడుపార ఆదరణతో తినిపించడం గొప్ప కార్యం. ఒళ్లు హూనమౌతున్నా శ్రమకు తట్టుకుని వాళ్లు పనిచేశారు.

నాన్నగారి విరోధుల్లో ఎవరో ఈ విషయాన్ని వక్రీకరించి, శ్రీమతి

ఇందిరాగాంధీకి ఫిర్యాదు చేశారు."మండలి కృష్ణారావుగారు ఆరెస్సెస్ వారికి అప్పగించేశారు" అనేది ఆ ఫిర్యాదు.

ఉప్పెన వచ్చిన వారానికి నవంబరు 27న శ్రీమతి ఇందిరాగాంధీ దివిసీమ పర్యటనకు వచ్చారు. గాంధీక్షేత్రంలో ఆరెస్సెస్ కార్యకర్తలు వద్దనలు చేయటం ఆమె కళ్లారాచూశారు. ఆ సమయంలో భావజాలాల వైరుధ్యాల్ని, కులమత భేదాల్ని కాదు, ఆర్తులకు తక్షణ సేవలు అందటం ముఖ్యం. అందుకు ముందుకువచ్చిన వారందరినీ కలుపుకు వెళ్లాల్సిన సమయం అది. ఇందిరాగాంధీ ఆరెస్సెస్ కార్యకర్తలను దగ్గరకు పిలిపించుకుని, వాళ్లని హృదయపూర్వకంగా అభినందించారు. వారిలో శ్రీ దత్తాత్రేయ కూడా ఉన్నారు.

దివిసీమ ఉప్పెన సమయంలో ఆరెస్సెస్ వారు అందించిన సేవలను మెచ్చుకుంటూ సర్వోదయనాయకులు RSS అంటే Ready to Social Service అన్నారు. ఆ విధంగా మొదలైన సేవాకార్యక్రమాలు దీనదయాళ్ పురం వరకూ సాగాయి. అవనిగడ్డలో ఉన్న స్థానిక కార్యకర్తలతో మొదలైన ఈ సేవా మహాయజ్ఞానికి బాలాసాహెబ్ దేవరస్ గారి నిర్మాణాత్మక సూచనలు, ఆదేశాలు ఒక దిశా నిర్దేశం చేసాయి. మృతదేహాలను తీయటం దగ్గర్నించీ, ఇళ్ల నిర్మాణం వరకూ, అవిశ్రాంతంగా శ్రమించారు వారంతా!

శ్రీ దివి ద్వారకాచార్య, శ్రీ బండారు దత్తాత్రేయ, శ్రీ వేదాంతం సంగమేశ్వర శాస్త్రి, శ్రీ కె.విద్యాసాగర రావు ప్రభృతులు దేవరస్ గారితోపాటు దివిసీమలోనే ఉండి పర్యవేక్షణ చేశారు. వేల సంఖ్యలో స్వయంసేవకులు తరలి రావటంతో వేగంగా మృతదేహాలను పూడ్చిపెట్టటమో తగలపెట్టటమో చేయగలిగారు.

బాలాసాహెబ్ గారు కర్ణాటక పర్యటనను మధ్యలో ముగించుకుని దివిసీమకు వచ్చేశారు. ముందుగా మండపాక గ్రామాన్ని ఆయన సందర్శించారు. ప్రాణాలతో బయటపడిన ప్రజలను ఓదార్చారు. అవనిగడ్డ జూనియర్ కాలేజీలో తలదాచుకుంటున్న బాధితుల్ని వెళ్లి పలకరించారు.

ఆ సాయంత్రం మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారి అధ్యక్షతన సభ జరిగింది. ఆ సభలో బాలా సాహెబ్ గారు 50 వేల రూపాయలను సైక్లోన్ రిలీఫ్ కమిటీకి అందచేశారు. తాను బెంగుళూరు నుండి తిరిగివస్తున్నప్పుడు ఉప్పెన ప్రాంతాలకే వెడుతున్నానని తెలిసి, అప్పటికప్పుడు వసూలు చేసి ఇచ్చిన విరాళాల మొత్తం ఈ 50 వేల రూపాయలని ఆయన చెప్పారు.

దీనదయాళపురం నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించిన శ్రీ బండారు దత్తాత్రేయ ఆ తరువాత బి జె పి రాజకీయాలలోకి ప్రవేశించి, కేంద్ర మంత్రిపదవి నధిష్టించారు.

ఆనాడు జనతా యువమోర్చా అధ్యక్షులుగా ఉన్న ముప్పవరపు వెంకయ్య నాయుడుగారు ఇప్పుడు భారత ఉపరాష్ట్రపతి కావటం ఆనంద దాయకం. శ్రీ వెంకయ్య నాయుడు రాజకీయ గురువు శ్రీ భోగాది దుర్గాప్రసాద్ పేరిట పర్రచివర గ్రామంలో దుర్గాప్రసాద్‌పురం నిర్మించారు. శ్రీ దుర్గాప్రసాద్ మాకు బంధువు అవుతారు. ఆరెస్సెస్ సంచాలకులుగా వ్యవహరిస్తూ, 1972 జై ఆంధ్ర ఉద్యమం సమయంలో పోలీసు కాల్పుల్లో అమరులయ్యారు.

ఉప్పెన అనంతరం వివిధ సామాజిక సేవా సంస్థలతో సహా అనేక హిందూ, హిందూయేతర సేవా సంస్థలు, మతసంస్థలు, సామాజిక వేత్తలు, పీఠాధిపతులు ఎందరో ఈ పునర్నిర్మాణ పుణ్యకార్యంలో పాల్పంచుకున్నారు. ఈ సేవలలో అత్యంత చిరస్మరణీయమైనది దీనదయాళపురం నిర్మాణం. ఒక దశలో దీనదయాళ్ పురాన్ని ఒక పర్యాటక ప్రాంతంగా ప్రజలు తరలివచ్చి సందర్శించారంటే ఆ నిర్మాణ చాతుర్యాన్ని ఊహించుకోవచ్చు. క్రమశిక్షణకు మారుపేరుగా నిలిచిన కార్యకర్తల బలమే ఈ విజయానికి కారణం.

ఈ పునర్నిర్మాణ సేవలో ప్రధానంగా పాలుపంచుకున్న ఇరువురు ఆరెస్సెస్ ప్రముఖుల సేవలను గుర్తు చేసుకోవటం ఈ వ్యాసం లక్ష్యం. వారిలో ఒకరు ఆరెస్సెస్ అధినేత బాలాసాహెబ్ దేవరస్ కాగా మరొకరు నానాజీ దేశముఖ్.

దీన్‌దయాళ్ పురం నిర్మాణంలో శ్రీ నానాజీ దేశ్‌ముఖ్ నిర్వహించిన పాత్ర మరువలేనిది. శ్రీనానాజీ భారతీయ జనసంఘ్‌లో ప్రముఖపాత్ర నిర్వహించిన రాజకీయవేత్త. రాజ్యసభ సభ్యులుగా కూడా ఉన్నారు. జనతాపార్టీ ఆవిర్భావ సమయంలో ప్రధాన కార్యదర్శిగా వున్నారు. తదుపరి రాజకీయాలను వదిలేసి సమాజసేవకు జీవితాన్ని అంకితం చేసుకున్నారు.

దీనదయాళ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూటును ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలో దాదాపు 500 గ్రామాలను తీర్చిదిద్దారు. 1950లోనే గోరఖ్‌పూర్‌లో మొట్టమొదటి గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని చిత్రకోటలో స్థాపించారు.

విద్య, వైద్య గ్రామపునార్నిర్మాణ కార్యక్రమాల్లో వీరు చేసిన కృషికి భారతప్రభుత్వం పద్మవిభూషణ్ పురస్కారాన్నిచ్చి గౌరవించింది.

దీనదయాళ్ పురం నిర్మాణానికి ప్రధాన ప్రేరకులు శ్రీబాలాసాహెబ్ దేవరస్, శ్రీనానాజీదేశ్‌ముఖ్‌లు ఇద్దరూ నిర్వహించిన పాత్ర గొప్పది.

శ్రీ మధుకర దత్తత్రయ దేవరస్ 1915 డిసెంబర్ 11 న జన్మించారు. బాలాసాహెబ్ దేవరస్‌గా ఆయన ప్రసిద్ధులు. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ మూడవ సంచాలకులుగా ఆయన పనిచేశారు.

దేశీయత, జాతీయత ఆయన లక్ష్యాలు. ఆయన ఎంతో ముందు చూపుతో చేసిన సూచనలు, వేసిన ప్రణాళికలు చిరస్మరణీయాలు.

ఉప్పెన భీభత్సవార్తలు వెలువడగానే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ వారు ఒక సైక్లోన్ రిలీఫ్ కమిటీ నియామకం చేశారు. ఆ కమిటీవారు తక్షణం రంగంలోకి దిగి బట్టలు, ఆహారం, మందులు, మంచినీళ్లు, విరాళాల రూపంలో సేకరించి ఉప్పెన బాధితులకు అందించారు.

స్థానిక ఆరెస్సెస్ ప్రచారక్ శ్రీ సోపల్లి సోమయ్యగారు ఆనాడు వేగంగా ప్రతిస్పందించిన తీరు గొప్పది. మీసాల మాష్టారుగా అవనిగడ్డలో పిలువబడే సంగవరపు వెంకటేశ్వర్లుగారు, ఇంకా మరికొంతమంది ముంపుగ్రామాల్లోకి వెళ్లడానికి ప్రయత్నించారు గానీ, భయంకరమైన దుర్గంధం వ్యాపించి ఉండటంతో వాళ్లు వెళ్లలేక పోయారు. శవాలను తొలగించటమే ఒక పెద్ద సమస్య అయ్యింది. కొంతమంది ఖైదీలను తెచ్చి అందుకు నియోగించారు గానీ ఎవరికీ అది సాధ్యపడలేదు.

ఆంధ్రప్రదేశ్ మరియు మహారాష్ట్రల నుండి వేలాది సంఘ కార్యకర్తలు తరలివచ్చి, శవాలను తొలగించే పనిని వేగంగా చేపట్టారు. ఒక ఇంట్లో పదిమంది కుటుంబం ఉంటే తండ్రి ఒక్కడే బతికాడు. తక్కినవారంతా కొట్టుకుపోయారు. ఆ పెద్దాయన తన భార్యాపిల్లల్ని వెదుక్కొంటూ తిరుగుతున్నాడు. చివరికి ఒక విద్యుత్ స్తంభం మీద అతని భార్య శవం కుళ్లిన స్థితిలో కనిపించింది. హృదయవిదారకమైన ఇలాంటి సన్నివేశాలెన్నో ఆనాడు శవసేన కార్యకర్తలు కళ్లారా చూశారు. శవాలు కుళ్లి ఉబ్బిపోయి గుర్తించటానికి వీల్లేనిస్థితిలో ఉన్నాయి.

ఆ సమయంలో దాసరి ఆంజనేయులు గారని ఒక కార్యకర్త విజయవాడ నుండి వచ్చి అవనిగడ్డలోనే ఒక సంవత్సరంపాటు ఉండి సహాయ కార్యకార్యక్రమాల్లోనూ, పునర్నిర్మాన కార్యక్రమాల్లోనూ పాల్గొన్నారు. హైదరాబాదు నుండీ బండారు దత్తాత్రేయగారు, శ్రీ దేశికాచారిగారు, విద్వాన్ రెడ్డిగారు, శ్రీభాగయ్యగారు వచ్చి ఇక్కడే నిలబడి సేవాకార్యక్రమాలను పర్యవేక్షించారు.

బాబులురెడ్డిగారి అధ్యక్షతన ఉప్పెన సహాయ కమిటీ ఏర్పడింది.

శ్యామ్ పరందేజీ నాగపూరులోని ఆరెస్సెస్ ప్రముఖ కార్యాలయంలో తన ఉద్యోగాన్ని వదిలి దివిసీమ వచ్చి పునర్నిర్మాణ కార్యక్రమాలు పూర్తయ్యేవరకూ ఇక్కడే ఉండిపోయారు. విశాఖపట్టణానికి చెందిన శ్రీ జి.ఎస్.కె ఆచార్యగారు ప్రముఖ సేవలందించిన వారిలో మరొకరు.

ఢిల్లీలోని దీనదయాళ్ పరిశోధనా కేంద్రానికి సంబంధించిన 12మంది వైద్యుల బృందం తక్షణ సాయానికి తరలివచ్చింది. కర్నూలు, కాకినాడ, హైదరాబాద్, ఖమ్మం తదితర వైద్యకళాశాలలనుండి వైద్యులు, మెడికోలుకూడా వైద్యపరమైన సేవలు అందించేందుకు వచ్చారు. ఎక్కువ జననష్టం సంభవించిన పర్రచివర, మూలపాలెం ప్రాంతాల్లో తక్షణ వైద్య శిబిరాలు ఏర్పాటు చేశారు.

కోడూరు, పర్ర చివర ప్రాంతాల్లో గుట్టలుగా పడిఉన్న మృతదేహాలను తరలించేందుకు ప్రత్యేకంగా “శవసేన”ను ఏర్పాటు చేశారు. 26వ తేదీన మొదలుపెట్టి ఈ కార్యక్రమం రెండువారాలపాటు కొనసాగింది. 15 గ్రామాల్లో 600 మృతదేహాలను తొలగించారు. పూనే నుండి వచ్చిన జ్ఞానప్రబోధిని సంస్థ కార్యకర్తలు కూడా ఈ కార్యక్రమంలో పాల్పంచుకున్నారు. మొత్తం 500 మంది సేవాకార్యకర్తలు ఈ సేవల్లో పాల్గొన్నారు.

అవనిగడ్డ, పర్రచివర, పల్లిపాలెం, యడవపాలెం, పెదగౌండ్ల పాలెం, గరువు హరిజనవాడ ప్రాంతాల్లో తక్కువ ఖర్చుతో కూడిన కుటీరాలు నిర్మించే కార్యక్రమాన్ని తొలుత ప్రాంభించారు. ఒక్కక్కటి 900:00 రూపాయలచొప్పున మొత్తం 65 కుటీరాలను నిర్మించారు. పైకప్పులకు జింకు షీట్లకు బదులు షాలిమార్ షీట్లు వాడారు. జనవరి 5న ఈ కుటీరాల ప్రాంభోత్సవం జరిగింది.

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ అధ్యక్షులు బాలాసాహెబ్ దేవరస్ డిసెంబర్ 9న ఉప్పెన ప్రభావిత ప్రాంతాల్లో పర్యటించాలని వచ్చినప్పుడు శాశ్వత ప్రయోజనాలను చేకూర్చే నిమిత్తం అనేక సూచనలు చేశారు. వారి సూచనలమేరకు పక్కా ఇళ్ల నిర్మాణానికి ఒక మౌలికమైన నిర్ణయం తీసుకున్నారు.

హంసల దీవికి 4 మైళ్ల దూరంలో సముద్రం ఉంది. కానీ, 15 అడుగులు ఉవ్వెత్తున అలలు ఎగసి పడ్డాయి. అంతలోతు నీటిలో కనీసం 10 గంటలపాటు

ఊరు మునిగి ఉంది. ఆ ఊళ్లో 130 గడపలున్నాయి. హంసలదీవి వేణుగోపాలస్వామి గుడి వారందరి ప్రాణాలను కాపాడింది. గుళ్లోకి రాలేకపోయిన 27మంది అశువులు బాసారు. 130 ఇళ్లూ పూర్తిగా కొట్టుకు పోయాయి. ఆ కాళరాత్రిలో ఏ ఊరి చరిత్ర చూసినా ఇదే దృశ్యం.

సముద్ర తీర వాసులకు మంచినీటికి కరువు, ఉప్పెనలు, తుఫాన్ల బరువు అధికం. నదులు సముద్రంలో కలిసేందుకు వచ్చేది, చిట్టచివరి గజం వరకూ ఉన్న తీరప్రాంత వాసులకు మంచినీరందించటానికే! ఎగువప్రాంతాలవారికి ఈప్రకృతి సూత్రం గిట్టకపోవటమే విచిత్రం!

హంసలదీవి ఉదంతం చూశాక సముద్రతీరప్రాంతాల్లో పక్కా ఇళ్ల ఆవశ్యకతని ప్రతి ఒక్కరూ గుర్తించారు. ఆ కారణంగానే, సిమెంటు శ్లాబులతో మాత్రమే సేవామూర్తులు పేదలకు కట్టించే ఇళ్లు ఉండాలని ప్రభుత్వం ఆదేశించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సిమెంటు శ్లాబు పద్ధతిలో మాత్రమే ఇళ్ళ నిర్మాణం చేపట్టాలని ఒక మౌలికమైన నిర్ణయాన్ని తీసుకుంది. రూ. 2,500/- వరకూ మ్యాచింగ్ గ్రాంటు ఇస్తామని కూడా ప్రకటించింది.

ఈ నేపథ్యంలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ ఒక ఊరు మొత్తాన్నీదత్తత తీసుకుని పునర్నిర్మించాలనే ఆలోచన చేసింది. ప్రాంత ప్రచారకుడు శ్రీ ఆర్. సోర్నయ్య, దీనదయాళ్ పరిశోధనా సంస్థ ప్రతినిధి డా జె.కె.జైన్ సర్వే చేసి మూలపాలెం గ్రామాన్ని దత్తత తీసుకోవటానికి నిర్ణయించారు. ప్రజలు కూడా సంతోషంగా స్వచ్ఛందంగా సహకరించటానికి ముందుకొచ్చారు.

జనవరి 28న మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారి చేత భూమిపూజ చేయించారు. మే 5వ తేదీ నాటికి 90 రోజుల్లో 90 ఇళ్ల నిర్మాణం పూర్తి చేశారు. ప్రతీ గృహంలో ఆధునిక సౌకర్యాలతోపాటు, టాయిలెట్, స్నానాల గది ఏర్పాటు చేశారు. బహుశా ఇదొక రికార్డు కావచ్చు. క్రమశిక్షణ కలిగిన కార్యకర్తల బలం ఉన్న రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం సంకల్ప బలమే ఇందుకు దోహదపడిందని చెప్పవచ్చు. రోడ్లు, కరెంటు ఇతర సౌకర్యాలు కూడా నెలరోజుల్లోనే పూర్తి చేయటంతో 14-07-1978న నాటి విదేశాంగ మంత్రి శ్రీ అటల్ బిహారీ వాజపేయి చేతుల మీదుగా దీనదయాళపురం ప్రారంభం అయ్యింది. లబ్ధిదారులు గృహప్రవేశులయ్యారు.

ఆరోజున ఆయన ప్రసంగం ఒక రాజకీయవేత్తగా కాక, ఒక తాత్త్వికవేత్తగా సాగింది. తుఫానుప్రాంతంలో కేంద్రమంత్రులు వచ్చినప్పుడు రాజకీయ విమర్శలుచేసి రాష్ట్ర ప్రభుత్వం పై ఆరోపణలు చేయటం జరిగేది. కేంద్రంలో జనతాపార్టీ ప్రభుత్వం, రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఉండటంతో ప్రధాని మొరార్జీ దేశాయి గారు సహా అందరూ అదే తీరులో విమర్శలు చేసి వెళ్లిన వారే! అలాగే, రాష్ట్రమంత్రులు కేంద్రాన్ని తీవ్రంగా విమర్శించేవారు దానికి భిన్నంగా ఆరోజు వాజపేయిగారి ఉపన్యాసం సాగింది.

ప్రజాస్వామ్య వ్యవస్థలో భిన్నమైన రాజకీయభావాలు కలిగినవారు ఉండటం సహజం కానీ, వీరిమధ్య సామరస్యం అవసరం అనీ, ఒకరికొకరు సహకరించుకుంటూ పనిచేసిననాడు లక్ష్యాలను సాధించుకోగలగటం కష్టమైన విషయం కాదని వాజపేయి తన ప్రసంగంలో పేర్కొన్నారు.

కేవలం ఒక ఇల్లు కట్టించి ఇచ్చినంత మాత్రాన బాధితులు మామూలు స్థితికి చేరిపోగలరనేది అపోహమాత్రమేనని, వారికి నాణ్యమైన జీవితాన్ని అందించేందుకు మరిన్ని సేవా కార్యక్రమాలు చేపట్టవలసి ఉంటుందని ఆరెస్సెస్ నాయకత్వం భావించింది. అందుకోసం కిసాన్ సేవాపథకం, జనసేవాపథకం, లాంటి కొన్ని కార్యక్రమాలను చేపట్టారు.

కృష్ణా గుంటూరు జిల్లాల్లో ఉప్పెన పాలిపడ్డ రైతులకు విత్తనాలు, మొక్కలు ఉచితంగా అందించారు. ఉప్పునీటిలో ముని చవుడు బారిన నేలల్లో చల్లేందుకు జిప్సం సమకూర్చారు. పురుగుమందులు కూడా ఉచితంగా సరఫరా చేశారు. దీనదయాళపురం, పిట్టలంక గ్రామల్లో ఎకరంన్నర లోపు భూములున్న రైతులకు ఈ సహాయాన్ని బాగా అందించారు.

జ్ఞానప్రబోధినీ అనే సేవాసంస్థ అలాగే, వర్ధమాన సేవాకేంద్రం, ఈ సేవల్లో ఎక్కువగా పాల్పంచుకున్నాయి. బ్యాంకులు కూడా ఈ మేరకు ఎంతగానో సహకరించాయి. జనసేవాపథకం ద్వారా కులవృత్తులు చేసుకునేవారికి ఆయా వృత్తులకు అవసరమైన పనిముట్లు వగైరా కొని ఇవ్వటం, వారికి ఆశ్రయం కల్పించటం, ఆకలికి మాడకుండా చూడటం, తిరిగి వారు జీవనోపాధినిచ్చే వృత్తుల్లోకి వెళ్ళేలాగా ప్రోత్సహించటం చేస్తారు. వంటసామాన్లు, వంటచెరకు, సరుకులు కూడా అందించేవారు.

దీనదయాళపురంలో 30-4-78న 15 మంది యువతీ యువకులకు ఆదర్శ వివాహాలు చేసి కొత్తబట్టలు, మంగళ సూత్రం ఇచ్చి ఆదరించారు.

భారతీ సేవా సదన్ ద్వారా తల్లిదండ్రుల్ని కోల్పోయిన బిడ్డల్ని చేరదీసి పోషించటం లక్ష్యంగా పెట్టుకున్నారు. ఇందుకోసం మచిలీపట్టణంలో ఒక భవనం అద్దెకు తీసుకుని, ఆశ్రమం ఏర్పరచి చదువు చెప్పించి పోషించే ఏర్పాట్లు చేశారు. అయితే, ప్రభుత్వమే సాంఘిక సంక్షేమ శాఖ ద్వారా అనాథ పిల్లల్ని దత్తత తీసుకునే నిర్ణయం తీసుకుని, స్వచ్ఛంద సేవా సంస్థల్ని తమ శక్తియుక్తులు పునర్నిర్మాణం మీద పెట్టవలసిందిగా కోరారు. తొలుత దీన్ దయాళ్ పురంలో ఒక ఆస్పత్రిని ప్రారంభించి రోజుకు 50 మంది రోగుల్ని చూసే ఏర్పాటు చేశారు. ప్రస్తుతం డా॥ ఎ.వి.ఎల్. నారాయణ దంపతులు నాగాయలంకలో దీనదయాళ్ ఆస్పత్రి నడుపుతున్నారు.

ఉప్పెన ప్రభావిత ప్రాంతంలో ఆనాడు ఆరెస్సెస్ వారు 169 గ్రామాల్లో తమ సేవల్ని అందించారు. 24,800 మందికి సేవలు అందించారు. 1,500 బస్తాల ధాన్యాన్ని పంచిపెట్టారు. 9 లక్షల బట్టల్ని పంచి పెట్టారు. వాటిలో లక్ష బట్టలు కొత్తవి. 50 వేల వంటపాత్రల్ని, 1500 దుప్పట్లని, 1000 ట్రంకు పెట్టెల్ని... ఇలా లెక్కలేనన్ని సేవలు అందించారు. సుశిక్షితులైన కార్యకర్తలు ఉండటం వలన, వారు బాధితులతో కలిసిపోయి, వారిని అక్కున చేర్చుకుని సేవలు అందించటం వలన ఇంత విజయం సాధ్యమయ్యింది. సేవలో నాణ్యతని, సేవలో దూరదృష్టిని, సేవలో శాశ్వతత్వాన్నీ ప్రదర్శించటం వారి నైజం. భారత మాత సేవలో పునీతులమైనట్టుగా భావించుకోవటం వారి అలవాటు. విశ్వహిందూ పరిషద్ ప్రముఖులు పూజ్య పెజావర్ స్వామీజీ సర్వే నిర్వహించి, ఎక్కడ ఎలాంటి సేవలు అవసరమౌతాయో ఒక ప్రణాళిక రచించి ఆ విధంగా నడిపించారు. శ్రీ బండారు దత్తాత్రేయ వ్యక్తిగతంగా నిలబడి ప్రణాళికాబద్ధంగా సేవలు నడిచేలా పర్యవేక్షించారు.

దివిసీమ పునర్నిర్మాణంలో స్వయంసేవకుల కృషి అనన్య సామాన్యమైనది! ఉప్పెన మొదలుపెట్టి పునర్నిర్మాణం పూర్తయ్యేవరకు వారి నిరంతర సేవలు స్ఫూర్తిదాయకంగా నిలిచాయి.



దీనదయాళపురం నిర్మాణానికి భూమి పూజచేస్తున్న శ్రీ నానాజీదేశ్‌ముఖ్,
శ్రీ బండారు దత్తాత్రేయ, శ్రీ మండలి వెంకటకృష్ణారావు.



అవనిగడ్డ గాంధీక్షేత్రంలో తుపాను బాధితుల సభలో ప్రసంగిస్తున్న
బాలాసాహెబ్ దేవరస్, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, ప్రభాకర్‌జీ



# ఆచార్య మైఖేల్ ఎ. విండీ

ఆచార్య మైఖేల్ ఎ. విండీ ఛిద్రమైన జీవన వ్యవస్థను పునర్నిర్మించే సేవా వ్యవస్థకు పితామహుడు. భారతదేశంలో ఆయన ప్రారంభించిన గ్రామీణ పునర్నిర్మాణ సంస్థ (విలేజీ రీ-ఆర్గనైజేషన్-వి. ఆర్. ఓ) చేసిన సేవలు, సాధించిన ప్రయోజనాలు అమోఘమైనవి.

దివిసీమ ఉప్పెనలో సేవలందించిన మరో మహోన్నత వ్యక్తి ప్రొఫెసర్ విండీ. ఉప్పెన వచ్చిన వెను వెంటనే దివిసీమకు వచ్చి సహాయ కార్యక్రమాల్లో నిమగ్నమయ్యారు. గుంటూరు దగ్గర పెదకాకానిలో 1969లో గ్రామ పునర్నిర్మాణ సంస్థ(వి.ఆర్.వో)ను నెలకొల్పి తక్కువ ఖర్చుతో ఇళ్ళ నిర్మాణం, స్త్రీ, శిశు సంక్షేమం, గ్రామీణులలో నైపుణ్యత పెంచే శిక్షణా కార్యక్రమాలు పెద్ద ఎత్తున చేస్తుండేవారు.

శ్రీ విండీ సహాయ కార్యక్రమాలు నిర్వహించేందుకు అవనిగడ్డ గాంధీక్షేత్రాన్ని వేదికగా చేసుకున్నారు. ఎందరో విదేశీ యువతీ యువకులు కూడా వారితో పాటు సేవా కార్యక్రమాల్లో పాలుపంచుకున్నారు. ఉప్పెనలు, తుపానులు వచ్చినప్పుడు వాటిని ఎదుర్కోవడానికి తీసుకోవలసిన చర్యలపై ఒక ప్రామాణికమైన నివేదికను రూపొందించడంలో వీరు ప్రముఖ పాత్ర నిర్వర్తించారు. తుపానులను ప్రజలు ఏ విధంగా ఎదుర్కొని నష్టనివారణ చేయవచ్చో తెలియజేస్తూ అనేక కార్యక్రమాలు చేపట్టారు.

ఉప్పెన అనంతరం కొద్దిరోజులుతర్వాత విల్లిబ్రార్డ్ ఫ్రెక్విన్ అనే డచ్ రేడియో

టెలివిజన్‌కు చెందిన అధికారి తన కెమెరామెన్‌తో కలిసి వి.ఆర్.వో. కార్యాలయానికి వచ్చాడు. తుఫాన్ బీభత్సాన్ని యథాతథస్థితిలో చిత్రించి ప్రపంచానికి చూపించటం అనేది ఆయన లక్ష్యం. విహంగ చిత్రీకరణ పద్ధతిలో హెలికాప్టర్ సహాయంతో ఆకాశంలోని దృశ్యాలను చిత్రికరించాలని కోరారు.

విండీగారు ఈ టెలివిజన్ బృందాన్ని తీసుకుని భారతీయ వైమానికదళం కెప్టెన్ గారిని కలిశారు. విశ్వప్రయత్నం మీద ఆయన బాధితులకు ఆహారపానీయాలు అందించే దళంతో పాటుగా విమానంలోకి అనుమతించారు.

కొంత చిత్రీకరణ తరువాత విల్లీబ్రార్డ్‌గారు హృదయ విదారకమైన అనేక దృశ్యాలు మిగిలిపోయాయని, మరొకసారి వెళ్లి చిత్రించాలని కోరారు. విండీగారు ప్రయత్నంమీద వైమానికదళం అధికారుల్ని అంగీకరింపచేశారు. మొత్తంమీద అద్భుతమైన డాక్యుమెంటరీ చిత్రీకరణ జరిగింది. దీని ప్రదర్శన చూసి డచ్చి దాతలు స్పందించడంతో 20 మిలియన్ డచ్చి గిల్టర్స్ విరాళంగా తుఫాను బాధితులకు అందాయని డా॥ టి. నాగేంద్రస్వామి ఆనాటి జ్ఞాపకాలను స్మరించుకుంటూ వ్రాశారు.

మైకేల్ విండీ ARTIC (Appropriate reconstruction Training and Information) అనే సంస్థను కూడా నెలకొల్పారు. ఫ్రెడ్‌క్యూనీ అనే సన్నిహితుడు ఈ విషయంలో ప్రొఫెసర్ విండీగారికి ఎంతగానో సహకరించారు. ప్రకృతివైపరీత్యాల సమయంలో తక్షణ సహకారం, పునర్నిర్మాణం అంశాల మీద ఫ్రెడ్‌క్యూనీ నిష్ణాతుడు.

విండీగారి నేతృత్వంలో దివిసీమ ఉప్పెన అనంతర పునర్నిర్మాణ కార్యక్రమంలో పూర్తిస్థాయిలో ప్రజలు భాగస్వాములుగా ఉన్నది "తలగడ దీవి" గ్రామం. ఊరంతా ఏకమై సిమెంట్ ఇటుకలు (Hallow Bricks) తయారుచేసే పనిలో పాల్గొన్నారు. ప్రజల భాగస్వామ్యం అప్పుడు తమకోసం తాము చేసుకునే సేవలో సంతృప్తి వుంటుందని తలగడదీవి నిరూపించింది.

సంఘం (కమ్యూనిటీ), సమాజం(సొసైటీ) అనేవి చాలా ముఖ్యమైన అంశాలు. పౌర సమాజాభివృద్ధికి సంఘాలు బలసంపన్నంగా ఉండటం చాలా అవసరం అనేది విండీగారి సిద్ధాంతం. సాంఘిక, ఆర్థిక, పర్యావరణ లక్ష్యాలు, వాటి అభివృద్ధి, ప్రాధికారికతలే సమాజాభివృద్ధికి దారితీస్తాయని ఆయన బలంగా నమ్మారు. వ్యక్తులు శక్తిమంతులైతే శక్తిమంతమైన సమాజాన్ని సాధించవచ్చని ప్రబోధించేవారు.

సంఘాభివృద్ధికి వ్యక్తుల్లో విలువలు, ఆదర్శాలు, లక్ష్యాలు తప్పక ఉండాలని,

మానవ హక్కులు, సామాజిక అనుబంధత్వం, సమానతా భావం, భిన్నత్వం పట్ల గౌరవం ఉండాలనీ విండీ ప్రబోధించేవారు.

అభివృద్ధి చెందిన సమాజంలో తమ సమస్యలను తమకు తాముగా పరిష్కరించుకోగలిగే స్థితి ఏర్పడుతుంది. బలమైన సాంఘిక వ్యవస్థ మనకు కావాలి. అందుకు కావలసిన వనరుల్ని, ఉపకరణాల్నీ మనం సమకూర్చు కోవాలని అనే వారు.

నాణ్యమైన జీవనానికి బాటలు వేసేందుకు వీ.ఆర్.ఓ. సంస్థను బలంగా తీర్చిదిద్దారాయన. దక్షిణాది రాష్ట్రాల్లో సముద్రతీర ప్రాంతాల్లో ఈ సంస్థ కార్యకలాపాలు విస్తరించి ఉన్నాయి. ప్రకృతి ప్రళయతాండవం చేసినప్పుడు ఈ వీ.ఆర్.ఓ. సంస్థ తక్షణ సహాయాలను సమకూర్చటం, దానితో పాటు ఛిద్రమైన జీవన వ్యవస్థను పునర్నిర్మించేందుకు సహకరించటం లక్ష్యంగా పనిచేస్తుంది.

1921లో బెల్జియంలో బగ్గెన్'హౌట్ అనే చిన్న పట్టణంలో జన్మించిన విండీ 12 మంది సంతానంలో 4వ వాడు. ఆ కుటుంబం అంతా క్రీస్తు పట్ల బలమైన విశ్వాసం కలవారు.

కాలేజి చదువు అయ్యాక మైఖేల్ విండీ1938లో క్రీస్తు సంఘంలో జెస్యూట్ గా చేరటానికి నిర్ణయించుకున్నారు. అతని సోదరుల్లో ఇద్దరు అప్పటికే జెస్యూట్లుగా మారారు.

ఏ కారణం చేతో తెలియదుగానీ మైఖేల్ విండీగారికి ఇండియాను చూడాలనే ఒక బలమైన కోరిక ఉండేది. 1946లో ఆ కల నెరవేరింది. క్రైస్తవ సమాజం వారు ఆయనని ఇండియాకు పంపించారు. బెల్జియం వదలి వచ్చేప్పుడు ఆయన తన కుటుంబానికి, స్నేహితులకి వీడ్కోలు పలికారు. బహుశా ఇంక తిరిగి రాననే భావన అప్పటికే ఆయనలో ఉండి ఉండాలి.

రాంచీలోని సెయింట్ జేవియర్స్ కళాశాలలో చరిత్ర అధ్యాపకులుగా ఆయన పనిచేశారు. తరువాత తమిళనాడులోని కొడైకెనాల్ లో కొంతకాలం ఉపాధ్యాయులుగా పనిచేసిన తరువాత 1954-55లో అలహాబాద్ విశ్వవిద్యాలయంలో సామాజిక శాస్త్రాలమీద పీజీ పూర్తిచేశారు.

1959-60ల్లో తిరిగి రాంచీ వచ్చి అక్కడ సెయింట్ జేవియర్స్ సోషల్ ఇన్స్టిట్యూషన్ నెలకొల్పి దానికి సంచాలకులుగా వ్యవహరించారు. రాంచీ

విశ్వవిద్యాలయంలో సోషియాలజీ ఆచార్యుడుగా పనిచేశారు. అనేక పాఠశాలలు నెలకొల్పి వాటికి సంచాలకులుగా వ్యవహరించారు.

1967 బీహార్ కరువు ఏర్పడినప్పుడు జయప్రకాష్ నారాయణ్ గారితో కలిసి పనిచేశారు.

గాంధీజీ అంటే ఆయనకు వల్లమాలిన అభిమానం. దేశంలో అత్యంత పేదప్రజల అభ్యున్నతికి గాంధేయమార్గంలో పనిచేయటం ఒక్కటే శరణ్యం అని నమ్మినవాడాయన. జీవితం అంతా ఒక యోగిలాగే బ్రతికారు విండీగారు. తెల్లని బట్టలు కట్టుకునేవారు. పట్టెడన్నం, కాసిని పప్పు గింజలు, ఒక అరటిపండు మాత్రమే తినేవారాయన. బ్రహ్మచర్యం పాటించారు. నేలమీదే పడుకునేవారు. సాధారణ తరగతుల్లోనే ప్రయాణించేవారు.

1969లో వచ్చిన పెనుతుపానుకు గుంటూరు జిల్లా అస్తవ్యస్థమైనప్పుడు ఆయన సేవలందించటానికి మొదటిసారిగా గుంటూరు వచ్చారు. అలా ఆయనకు ఆంధ్రులతో పరిచయం ఏర్పడింది. 15,000 మంది ప్రజలు సమస్తం కోల్పోయిన ఆ విషాద సంఘటన చూశాక ఆయనలో అనేక కొత్త ఆలోచనలకు దారితీసింది.

గాంధేయ మార్గంలోని ప్రత్యేకతను ఆయన బాగా గమనించారు. గ్రామీణ వికాసం గురించి మహాత్ముడు బోధించిన అంశాల ప్రభావం ఆయనపైన బాగా ప్రసరించింది. గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ఒక ఉద్యమ స్థాయిలో తీసుకు వెళ్లాల్సిన అవసరాన్ని ఆయన గుర్తించారు. అందుకోసం తన ప్రొఫెసర్ ఉద్యోగాన్ని వదులుకుని "గ్రామపునర్నిర్మాణ సంస్థ (విలేజి రీ ఆర్గనైజేషన్ వి.ఆర్.ఓ)ని వ్యవస్థాపించారు. గుంటూరు జిల్లా రాజపేట్ గ్రామంలో ఇటుకలతోనూ, సిమెంటుతోనూ ఆయన బాధితులకు ఇళ్లను కట్టించి ఇచ్చే పథకాన్ని ప్రారంభించారు. ఈ సంస్థ గుంటూరులోనే ఏర్పడింది. ఇప్పటికి దాని ప్రధాన కేంద్రం అదే!

ఆ తరువాత తన సేవా కార్యక్రమాలను ఆయన రాజస్థాన్, మహారాష్ట్ర, తమిళనాడు, ఒడీసాలక్కూడా విస్తరించారు. గ్రామ పునర్నిర్మాణ సంస్థల్లో విండీ వ్యవస్థాపించిన వి.ఆర్.ఓ. భారతదేశంలో మొదటిది కాగా, ఆసియాలో 8వదిగా గుర్తింపు పొందింది. 2015 నాటికి ఈ సంస్థకు 320మంది కార్యకర్తలుండి, 5 రాష్ట్రాల్లో విస్తరించిన కార్యకలాపాలున్నాయి.

ఈ దేశంలో సామాన్యుణ్ణి స్వయం ఉపాధితో నాణ్యమైన జీవితాన్ని పొందేలా చేయాలనే గాంధీగారి కలను వాస్తవ రూపానికి తెచ్చిన వాడు నిజానికి విండీయే! విండీ సేవలు మతాతీతమైనవి. మతం కోసం, దేవుడి కోసం కాక, మానవాళి కోసం పనిచేయాలని దృఢంగా నమ్మిన వాడాయన! తన ద్వారా సేవలు పొందుతున్న వ్యక్తి కులమతాలతోగానీ, భాషతోగానీ తనకు నిమిత్తం లేదనేవారు.

ఉన్నత గ్రామీణ జీవితానికి ఒక అరుదైన ఉద్యమంగా విండీ కార్యకలాపాలను టైమ్స్ ఆఫ్ ఇండియా అభివర్ణించింది. స్వచ్ఛంద సేవ అనే పదానికి విండీ ఒక ఆకృతి కల్పించారు. గాంధీ గారి గ్రామీణ వికాస వాదానికి ఒక ఆచరణను చూపించారు.

ఊరును తిరిగి కట్టడం, ఆ ఊళ్లో ఒక పాఠశాల, వ్యక్తుల్లో నైపుణ్యాన్ని పెంచే శిక్షణాకేంద్రాలు, బాలల కోసం అనాథాశ్రమం, హరిజన సంక్షేమ కేంద్రాలు ఇవన్నీ ఉంటేనే అది ఊరు అవుతుందని, వాటిని ఏర్పరచాలనీ ఆయన ప్రయత్నించారు. ఆయన స్థాపించిన వి.ఆర్.ఓ. సంస్థకు క్రైస్తవ సంఘాలు అనేకం ఆర్థిక సాయం అందించాయి. కానీ, దేవుని పేరుతో కాకుండా మానవసేవ పేరుతోనే తన కార్యక్రమాలు నిర్వహించారాయన.

ఊకతో తయారైన సిమెంటు లాంటి తక్కువ ఖరీదు సాధనాలతో ఎక్కువకాలం మన గలిగే విధంగా, వాతావరణ వైపరీత్యాల్ని తట్టుకోగలిగేలా ఆ గృహ సముదాయాల్ని నిర్మింపచేసేవారు. చెట్లను నరికి కాల్చిన బూడిదకు బదులుగా ఊక బూడిదను ఉపయోగించారు. పర్యావరణ పరిరక్షణ కూడా సేవలో ముఖ్యమైన అంశం అనేవారు.

అయన సేవాకార్యక్రమాలకు జెర్మనీలోని దాతలు ఎక్కువగా ఆర్థిక సాయాన్ని అందించేవారు. శ్రమదానాన్ని స్థానికులు, లబ్ధిదార్లూ ఇచ్చేవారు వీ.ఆర్.ఓ. ఇండియాకు అనుబంధంగా 'విఆర్'ఓ డ్యూష్ ల్యాండ్' అనే సంస్థను ఏర్పరచారు. దానిద్వారా నిధులు సమకూరేవి. 2015-16 నాటి లెక్కల ప్రకారం 80 మిలియన్ డాలర్లకు పైగా స్విట్జర్లాండ్, బెల్జియం, జెర్మనీ, ఆస్ట్రియా మొదలైన దేశాల నుండి నిధులు సమకూరినట్టు పేర్కొన్నారు.

మహాత్మాగాంధీ శాంతిబహుమతి (1982), కేంబ్రిడ్జి వారిచే ఇంటర్నేషనల్ "మాన్ ఆఫ్ ది ఇయర్" (1994) లాంటి జాతీయ, అంతర్జాతీయ పురస్కారాలెన్నో పొందారాయన.

2008లో ఆయన ఆరోగ్యం బాగా క్షీణించింది. చికిత్స నిమిత్తం బెల్జియంలోనే ఉండిపోయారు. ఆ తరువాత ఆయన తిరిగి భారతదేశానికి రాలేకపోయారు.

20 సెప్టెంబర్, 2009 ఉదయం పూట చివరి ఘడియల్లో ఆయన్ని కలిసిన ఒక జెస్యూట్ "మీరు మృత్యువుకు భయపడ్తున్నారా?" అనడిగాడట. వెంటనే విండీ గారు "లేదు...లేదు...నన్ను సృష్టించిన దేవుడి దగ్గరకు చేరుకోగలగటంలో ఎంతో ఆనందం ఉంది. స్వర్గంలో ఉన్న నా బంధుమిత్రులందరినీ చేరే మహత్తర అవకాశం అది నాకు" అని జవాబిచ్చారట. ఆరోజే ఆయన తుది శ్వాస విడిచారు.

నాణ్యమైన సేవని సేవాదృక్పథంతో బాధితులపట్ల గౌరవభావంతో చేయటం ఎలాగో ఆయన ఆచరణలో చూపించారు. శాంతి, అహింస, గ్రామీణ వికాసం అనే గాంధేయ సూత్రాలను అక్షరాలా ఆచరణలో పెట్టిన పుణ్యమూర్తి మైఖేల్ విండీ ముఖ్యంగా దివిసీమవాసులకు చిరస్మరణీయుడు.



శ్రీ మండలి, శ్రీ ప్రభాకర్ జీలతో చర్చిస్తున్న శ్రీ విండీ



# డా. డైక్‌మన్

డైక్‌మన్ ప్రపంచంలో పేదరికాన్ని రూపుమాపాలనే లక్ష్యం గల మహోన్నత వ్యక్తి. ప్రపంచ స్థాయిలో పేదల అభ్యున్నతికి పాటుబడిన అతి కొద్దిమంది ప్రముఖులలో డైక్‌మన్ ఒకరు. ఈ లక్ష్యంతో ఆయన ఎ.ఎం.జి. ఇంటర్నేషనల్ సంస్థను స్థాపించి, దానికి జీవితపర్యంతం సారథ్యం వహించారు.

ఎ.ఎం.జి. సంస్థ ప్రతినిధి శ్రీ జాన్ డేవిడ్ 1977 సంవత్సరం ఉప్పెన, తుపాను సమయంలో డా. డైక్‌మన్ గారిని అవనిగడ్డ గాంధీక్షేత్రానికి తీసుకువచ్చారు. ఆయన దివిసీమ ఉప్పెన సందర్భంగా చేసిన సేవలు చిరస్మరణీయం.

సామాజిక సేవను పూర్తిస్థాయిలో చేయడానికి గాంధీక్షేత్రం అత్యంత అనువైన ప్రదేశంగా చూడగానే డైక్‌మన్ గుర్తించారు.

ఆనాటి ఉప్పెన సృష్టించిన పెనువిధ్వంసంలో 300కు పైగా బాలబాలికలు తల్లిదండ్రుల్ని కోల్పోయి, అనాథలయ్యారు. ఈ పిల్లలందర్నీ చేరదీసి, మా నాన్నగారు అవనిగడ్డలోని గాంధీక్షేత్రంలో ఆశ్రయం కల్పించి, భోజన వసతి ఏర్పాటు చేశారు. ఐతే, వీరికి ఏ రకమైన విద్య గరపాలన్న సమస్య ఉత్పన్నమైంది. ఈ అంశంపై గాంధీక్షేత్రం కమిటీ సుదీర్ఘంగా చర్చించి, వీరికి వృత్తి విద్యా కోర్సులలో శిక్షణనిప్పిస్తే, బాలబాలికలు స్వయం ఉపాధిని పొందే అవకాశముంటుందని భావించింది. ఇందుకోసం, అవనిగడ్డ గాంధీక్షేత్రంలో ఒక సాంకేతిక శిక్షణా సంస్థను నెలకొల్పాలని నిర్ణయించి, దానికి సంబంధించిన పథకాన్ని తయారు చేయడం జరిగింది.

డా. డైక్‌మన్ అంతకు మునుపే తుపాను బాధిత ప్రాంతంలో ఒక కాలనీ నిర్మాణానికి ఆర్థిక సాయం అందించారు. ఆయన ఈ సాంకేతిక శిక్షణా సంస్థ పట్ల ఆసక్తిని కనబరచి, దానికి అవసరమైన ఆర్థిక సహాయం చేయడానికి ముందుకువచ్చారు.

ఆయన, ఆయన భార్య శ్రీమతి రూత్ డైక్‌మన్ రూ. 2.96 లక్షలు గాంధీక్షేత్రం కమిటీకి ఈ సాంకేతిక శిక్షణా సంస్థను నెలకొల్పడానికి విరాళంగా ఇచ్చారు. గాంధీక్షేత్రం కమిటీ శిక్షణా సంస్థకు 3.00 ఎకరాల స్థలాన్ని, అందులో 100×25 అడుగుల విస్తీర్ణం గల ఒక షెడ్డుతో పాటుగా సమకూర్చింది. ఈ సంస్థ భవన నిర్మాణానికి 22-11-1980న డా. డైక్‌మన్ గారితో శంకుస్థాపన చేయించాము.

నిర్మాణం పూర్తయ్యాక 14-11-1981 న శ్రీమతి రూత్ డైక్‌మన్ ఈ భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ శిక్షణా సంస్థకు "రూత్ డైక్‌మన్ ఎ.ఎం.జి. టెక్నికల్ ఇనిస్ట్యూట్" అని పేరు పెట్టడం జరిగింది. దాతల అభీష్టం మేరకు, ఈ సంస్థలో వడ్రంగం, చెప్పుల తయారీ, ప్రింటింగ్ మరియు బైండింగ్ వృత్తులలో శిక్షణకు కోర్సులను రూపొందించడం జరిగింది. కోర్సుల నిర్వహణకుగాను డా. డైక్‌మన్ 1982లో మరొక రూ. 3.09 లక్షల విరాళాన్ని ఇచ్చారు.

ఈ సొమ్ముతో అవసరమైన పరికరాలు, పనిముట్లు, ఇతర సామగ్రిని కొనుగోలు చేశాము.

10.11.1982న వడ్రంగం కోర్సును శ్రీమతి రూత్ డైక్‌మన్, ఆ మరునాడు 11.11.1982న చెప్పుల తయారీ కోర్సును డా. డైక్‌మన్ ప్రారంభించారు. కార్పెంటరీ వర్క్ షాపును అప్పటి కేంద్ర పెట్రోలియం శాఖామంత్రి శ్రీ పి. శివశంకర్ ప్రారంభించారు.

గాంధీక్షేత్రంలో ప్రారంభించబడిన ఈ "రూత్ డైక్‌మన్ ఎ.ఎం.జి. టెక్నికల్ ఇనిస్ట్యూట్" రూపకల్పన బాధ్యత మొత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో సాంకేతిక విద్యాశాఖ డైరెక్టర్ గా పనిచేసి, రిటైరైన శ్రీ పి. హెచ్. ఎన్.బి. శర్మగారు తన భుజస్కంధాలపై వేసుకొని, సమర్థంగా నిర్వహించి పూర్తిచేశారు. ఆ తరువాత కోర్సుల నిర్వహణ బాధ్యతను కూడా ఆయనే చేపట్టారు. రూత్ డైక్‌మన్ ఎ.ఎం.జి. టెక్నికల్ ఇనిస్ట్యూట్ లో కోర్సులు ప్రారంభిస్తున్న సందర్భంలో డా. డైక్‌మన్ చేసిన ప్రసంగం వారి హృదయాన్ని ఆవిష్కరించింది.

"నేను వెనుక వచ్చినప్పుడు మీలో భీతి కనిపించింది. ఇప్పుడు ఆనందాన్ని

చూస్తున్నాను. ఈ సంవత్సరం నుంచి మీరు సాంకేతిక విద్యలో శిక్షణ పొంది, బాధ్యతగల పౌరులుగా రూపొందుతారు. నవభారత నిర్మాణంలో స్వయంకృషితో ప్రతివారు తన కాళ్ళ మీద తాను నిలబడగలగాలి. ధనికుడై పుట్టి, సామాన్యుల సంక్షేమం కోసం స్వార్థం నుంచి బయటపడిన బుద్ధుని గురించి మీకు తెలుసు. ఏసు ప్రభువు పరలోకం నుంచి భూతలానికి వచ్చి, నిజమైన మానవుడై, మానవుని ప్రేమించాడు. ఏసు క్రీస్తువలె బ్రతికిన మహాత్ముడు గాంధీజీ. ప్రేమతోనే స్వాతంత్ర్యాన్ని సముపార్జించిన మహనీయుడాయన.

దైవకృప వల్లనే మేము మీ దగ్గరకు వచ్చి, మీ అక్కరల్ని మా అక్కరగా భావించి, మీకు సహకరిస్తున్నాము. ఈ స్కూల్ ద్వారా రాబోయే రోజుల్లో మీతో కలిసి ప్రయాణం చేయాలని ఉంది.

మాకు ఇక్కడ స్వగృహంలో ఉన్నట్లనిపిస్తుంది. నేను పల్లెటూరువాసిని. పల్లెలను పట్నాలుగా చేయాలని నాకు లేదు. నేను టీచర్ గా పనిచేశాను. కాబట్టి, నాకీ స్కూల్ ప్రారంభించే అవకాశం లభించినందుకు ఆనందిస్తున్నాను. పొరుగువారిని ప్రేమించడం, దేశభక్తి అనేవి రెండూ మానవుడనదగిన ప్రతి వ్యక్తికీ ఉండాలని డైక్మన్ పదేపదే చెప్పేవారు. తాను చేసిన సాయం స్వల్పమని, ఇంకా ఎంతో సాయం చేసే అవకాశం తనకివ్వాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను" అని ఎంతో వినయంగా ప్రకటించేవారు.

ప్రతి సంవత్సరం డైక్మన్ దంపతులు అవనిగడ్డకు వచ్చేవారు. వారు వచ్చారంటే అవనిగడ్డ అంతటా పండుగ వాతావరణం ఏర్పడేది. ఆయనకు ఘనస్వాగతం లభించేది. విశేషమేమంటే, మా నాన్నగారు, జాన్ డేవిడ్ గారు, డా. డైక్మన్ – ముగ్గురూ ఒకే సంవత్సరం, 1926 లో జన్మించారు.

ఒకసారి డైక్మన్ ప్రసంగంలో – "ఇక్కడ కృష్ణారావుగారు లేరు. వారి దుస్తులు ధరించి, వారి స్థానంలో నేనున్నాను. వారి బాధ్యత నాపై వేశారు. నేను ప్రపంచమంతటా తిరిగాను. కృష్ణారావుగారిలో ఉన్న నిస్స్వార్థ సేవ చాలా గొప్పది. భారతదేశంలో బయట నుంచి ఎవరైనా వస్తే, ఆదరించడం చాలా ఎక్కువ. మా దేశంలో అది లేదు. మీరు చూపే ఆదరానికి మేము ఎంతో ఆనందిస్తున్నాము. నేనూ మనిషినే. మీ ఆదరణకు, ఆప్యాయతకు హృదయం ఉప్పొంగుతున్నది. మీకింకా ఏదైనా చేయాలని మనసు ఉరకలు వేస్తున్నది. నాకున్న ఆస్తితో పోలిస్తే నేను మీకు చేసింది అతి స్వల్పం.

ఏసుక్రీస్తు ప్రభువు తనకు అపకారం చేసిన వారికి కూడా మేలు చేశాడు. అది ఆయన దైవత్వం. గాంధీజీ కూడా నిస్వార్థమైన సేవ చేసిన ఘనులే. నేను కేవలం నన్ను గౌరవించిన వారికే మేలు చేయాలని అనుకుంటున్నాను. మనం ఇతరుల నుంచి ఏమీ ఆశించకుండా సేవ చెయ్యాలి. పొరుగువారిని ప్రేమించడం, దైవభక్తి రెండు ఒకటే. ఈ స్కూల్లో యంత్రాలతో ఉత్పత్తి చెయ్యాలి. యంత్రం కంటే మానవుడు గొప్ప. మానవునిలో దైవత్వం ఉంది. ఎంత చదివినా ఈ విషయాన్ని విస్మరించరాదు". ఇదీ డా. డైక్‌మన్ గారి మహోన్నత మానవతా దృక్పథం.

తన యూరప్ పర్యటనలో భాగంగా మా నాన్నగారు 1983, సెప్టెంబర్ 18, 19, 20 తేదీలలో జర్మనీ దేశంలో పర్యటించారు. ఫ్రాంక్ ఫర్ట్ విమానాశ్రయానికి డా. డైక్‌మన్, అయన కుమారుడు వచ్చి, నాన్నగారికి స్వాగతం చెప్పి, అక్కడికి 200 కి.మీ. దూరంలో ఉన్న వారి నివాసమైన ఉప్పర్ టాల్కుమ్ కారులో తీసుకువెళ్లారు. వారి ఇంటి వద్ద శ్రీమతి రూత్ డైక్‌మన్, కుమార్తె క్లాండియా సాదర స్వాగతం పలికారు. వారి ఫామ్ హౌస్ ను చూపించారు. నాన్నగారి గౌరవార్థం ఆ రాత్రి డా. డైక్‌మన్ బ్రహ్మాండమైన విందు ఇచ్చారు. విందు తర్వాత, ఎ.ఎం.జి. సేవా సంస్థ కార్యకలాపాలను వివరించే డాక్యుమెంటరీ చలనచిత్రాన్ని ప్రదర్శించారు. ఆ చలనచిత్రంలో గాంధీక్షేత్రంలోని బాలబాలికల నృత్యాలు కూడా చోటుచేసుకున్నాయి. ఆ తరువాత గాంధీక్షేత్రం కార్యకలాపాలను వివరించే వీడియో టేపులను కూడా ప్రదర్శించారు.

దివిసీమ ఉప్పెన సందర్భంగా డైక్‌మన్ దంపతులు చేసిన సేవలకు రూత్ డైక్‌మన్ టెక్నికల్ ఇనిస్ట్యూట్ స్థాపనకు, వారిచ్చిన చేయూతకు మా నాన్నగారు దివిసీమ ప్రజల పక్షాన వారికి ధన్యవాదాలు తెలిపి, వారికి కృతజ్ఞతా పత్రాలతో పాటు, బందరు కలంకారీ దుప్పట్లను బహూకరించారు.

డా. డైక్‌మన్ గారి షష్టిపూర్తి మహోత్సవాన్ని అవనిగడ్డ గాంధీక్షేత్రంలో 14.11.1986 నాడు ఆత్మీయుల హర్షాతిరేకాల మధ్య ఎంతో ఘనంగా నిర్వహించడం జరిగింది.

సభకు అధ్యక్షత వహించిన మా నాన్నగారు ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సంఘ సేవకుల సమాఖ్య అధ్యక్షుని హోదాలో డా. డైక్‌మన్ సేవలను ప్రస్తుతించారు. భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ లో కుష్టురోగులకు, అనాథ బాలబాలికలకు

ఆయన చేస్తున్న సేవలు నిరుపమానమైన వన్నారు. 1977లో దివిసీమ ప్రాంతం ఉప్పెన, తుపానులకు గురైనప్పుడు డా. డైక్‌మన్ విచ్చేసి, భావదేవరపల్లి గ్రామంలో 80 గృహాలను కట్టించారని, అవనిగడ్డలో రూత్ డైక్‌మన్ ఎ.ఎం.జి. టెక్నికల్ ఇనిస్ట్యూట్ ను నెలకొల్పి, 100 మంది అనాధ బాలబాలికలకు భోజన వసతి సదుపాయాలు సమకూర్చారని అన్నారు.

ఎ.ఎం.జి. ఇండియా ఇంటర్నేషనల్ డైరెక్టర్ డా. ఎస్. జాన్ డేవిడ్ మాట్లాడుతూ, పీడిత ప్రజల సేవకు పరితపించే మహోన్నత వ్యక్తి డా. డైక్‌మన్ అని అన్నారు. జర్మనీలో వారి షష్టిపూర్తి ఘనంగా జరపాలని వారి బంధు మిత్రులు ఏర్పాట్లు చేసినా, ఆంధ్రప్రదేశ్ లో వరదలు వచ్చిన వార్త విని, ఆ కార్యక్రమాన్ని రద్దుచేసుకొని వచ్చి, ఆ డబ్బును ఆంధ్రప్రదేశ్ లో ఖర్చుపెట్టడానికి డైక్‌మన్ నిర్ణయించుకున్నారని ఆయన తెలిపారు.

డా. డైక్‌మన్ దంపతులను మా నాన్నగారు నూతన వస్త్రాలతోను, మెమెంటోలతోను సత్కరించారు. వివిధ స్వచ్ఛంద సేవా సంస్థల వారు డా. డైక్‌మన్ దంపతులను పూలమాలలతో సన్మానించారు. శ్రీ పి. హెచ్. ఎన్. బి. శర్మ సన్మాన పత్రాన్ని సమర్పించారు. శ్రీ దాసి బసవయ్య కవితాగానం చేశారు.

డా. డైక్‌మన్ తనకు జరిగిన సన్మానానికి సముచిత రీతిలో స్పందిస్తూ, "భారతదేశాన్ని నేను ఎంతగానో ప్రేమిస్తాను. భారత నాయకులంటే నాకు ఎంతో గౌరవం. భారత ప్రజలు మా పట్ల చూపుతున్న ఆదరాభిమానాలు మమ్మల్నెంతో ముగ్ధుల్ని చేశాయి. 1977 ఉప్పెన సమయంలో ఈ ప్రాంతానికి వచ్చినప్పుడు మండలి కృష్ణారావుగారితో పరిచయమైంది. వారి సేవాతత్పరత నన్నెంతో ఆకర్షించింది. ఈనాడు ప్రపంచంలో నా ముఖ్యమైన స్నేహితులలో మొదటి స్థానం కృష్ణారావుగారికిస్తున్నాను. కృష్ణారావు, జాన్ డేవిడ్ ల సహకారంతో నేను దీనులకు సేవ చేయగలిగాను" అన్నారు.

భారతదేశం సనాతన సంస్కృతికి నిలయమని, భారతదేశానికున్న సాంస్కృతిక సంపద జర్మనీకి లేదని డా. డైక్‌మన్ అంటూ, ఆర్యుల ద్వారా తమ దేశానికి సంస్కృతి వచ్చిందని, ఇండో-ఆర్యన్ కల్చర్ వల్ల ఉభయ దేశాలు ఒకే సంస్కృతికి చెందినవని భావిస్తున్నానని అన్నారు.

డా. హీంజ్ హెూర్స్ట్ డైక్‌మన్ జర్మనీ దేశంలో 30 సెప్టెంబర్, 1926న జన్మించారు. సమాజ సేవాతత్పరుడు. మానవసేవలోనే దైవత్వాన్ని చూసిన కరుణామయు డాయన.

ఆయన కుటుంబం 100 యేళ్ళుగా చెప్పుల తయారీ వృత్తిలోనే ఉంది. డైక్‌మన్ గారి తండ్రికి పాదరక్షల తయారీ కంపెనీ చిన్నది ఉండేది. అరకొర సంపాదన, దానికి తోడు నాజీ నియంతృత్వ పాలనలో ఎదురయ్యే సమస్యలతోనే ఆయన బాల్యం అంతా గడిచింది.

డైక్‌మన్ చదువు పూర్తికాక మునుపే తండ్రి మరణించాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో నాజీల నియంతృత్వాన్ని చవిచూసి, యుద్ధ ఖైదీగా హింసల పాలయ్యాడు. తీవ్రంగా గాయపడ్డాడు. యుద్ధానంతరం ప్రొటెస్టెంట్ థియోలజీని వైద్యశాస్త్రాన్ని అభ్యసించాడు. ప్రొటెస్టెంట్ మత సిద్ధాంతాలు ప్రచారం చేయడం జీవిత ధ్యేయంగా గడుపుతూనే, అదే సమయంలో వైద్యశాస్త్రం కూడా అభ్యసించాడు.

తండ్రి మరణం తరువాత అటు వైద్యవృత్తినీ, ఇటు పాదరక్షల కంపెనీనీ రెండింటినీ సమాంతరంగా నడిపారు. 1956లో ఆయన వైద్య వృత్తిని విరమించి, పాదరక్షల తయారీమీద పూర్తి దృష్టి పెట్టారు. ముఖ్యంగా సామాన్యుడికి అందుబాటులో ఉండే తక్కువ ఖరీదు చెప్పుల తయారీ ప్రారంభించారు. కుటుంబం మొత్తానికి సరిపడే పాదరక్షల జతలను ఒక ఫ్యామిలీ ప్యాక్‌గా చేసి, తక్కువ ధరకు అందించడం మొదలుపెట్టారు.

అనతి కాలంలోనే ఆయన ఈ వ్యాపారంలో అభివృద్ధిని సాధించి, 1960 నాటికి రిటైల్ చెప్పుల అమ్మకంలో యూరప్ మొత్తంలోనే ప్రసిద్ధి చెందిన పాదరక్షల వ్యాపారిగా ఎదిగారు.

ప్రతీ సంవత్సరం ప్రపంచంలో ధనికుల పట్టికను ప్రకటించే ఫోర్బ్సు లిస్టు ప్రకారం 4.9 బిలియన్ల ఆదాయంతో ప్రపంచంలో 295వ ధనవంతుడు ఆయన. ప్రపంచ వ్యాప్తంగా 3,350 రిటైల్ అమ్మకాల షాపులు ఆయన కంపెనీకి ఉండేవి. డైక్‌మన్ తన సంపదని సామాజిక బాధ్యత నెరవేర్చేందుకు భగవంతుడిచ్చిన వరంగా ఆయన భావించారు. తనకంపెనీలో పనిచేసే శ్రామికుల పట్ల ఎంతో దయతో వ్యవహరించేవారు.

కుష్టురోగుల సేవలకోసం, వ్యాధి నివారణ కోసం "wortundtat" (Wort & Tat) జెర్మనీ భాషలో 'మూలాలు మరియు చిక్కుముళ్ళు') పేరుతో 1977లో ఒక కార్యక్రమం ప్రారంభించారు. ఇండియా, ఆఫ్రికా, గ్రీస్, జెర్మనీ దేశాల్లోని 1,30,000మంది పేద ప్రజలకు దీనిద్వారా సేవలు అందించారు.

ఎ.యం.జి. అంతర్జాతీయ సంస్థకు డైక్‌మన్ మరియు ఆయన వ్యవస్థాపించిన వోర్ట్ అండ్ టట్ సంస్థలు ప్రధాన దాతలుగా ఉన్నారు. ఎ.యం.జి. ఇండియా అంతర్జాతీయ సంస్థకు ఆయనే వ్యవస్థాపకుడుగా ఉన్నారు.

జర్మన్ ప్రభుత్వం 2000 సంవత్సరంలో ఈయన్ని భారతదేశానికి గౌరవ రాయబారిగా నియమించింది.

1977 నుండి నేటి వరకు గత 40 యేళ్లుగా భారతదేశంలో పేదప్రజల విద్య, ఆరోగ్య సేవలు, ఇతర సామాజిక సేవలు అందించే విషయంలో ఈ సంస్థ తలమానికంగా ఉంది. ఆంధ్రప్రదేశ్, ఒడీసా, తమిళనాడు రాష్ట్రాలలో ఏ.యం.జి. - ఇండియా అంతర్జాతీయ సంస్థ 2,40,000 మంది పిల్లల భవిష్యత్తుకు బంగారు బాటలు వేసింది.

వ్యాపారానికి కూడా సామాజిక నిబద్ధత ఉండాలనీ, మనుషుల్నీ, వారి అవసరాల్నీ దృష్టిలో పెట్టుకుంటే వాణిజ్య రంగంలో ఎంతటి ఉన్నత స్థానికైనా చేరవచ్చనీ ఆయన తన ఆచరణ ద్వారా నిరూపించారు. గ్లోబలైజేషన్ పుణ్యమా అని, వర్తక వాణిజ్యాల మూలసూత్రాలు మారిపోయాయి. పూర్వపు రోజుల్లో వర్తకులు వినియోగదారుడు తమకు దేవుడు" అనే గాంధీగారి ప్రతిజ్ఞను అక్షరాల పాటించేవారు. ఇప్పుడు వినియోగదారుడి అవసరాలు, అతని ప్రయోజనాలు కాక, కేవలం వాణిజ్య ప్రయోజనాలకే ప్రాధాన్యత కనబరుస్తున్నారు.

డైక్‌మన్ ఈ ధోరణికి భిన్నమైన వ్యక్తి. వ్యాపారంలోనైనా ఉన్నత స్థితికి చేరవచ్చుననే సిద్ధాంతాన్ని ఆయన నిరూపించారు. జర్మనీలోనే కాదు, ప్రపంచమంతటా ఆయనకు గౌరవ పురస్కారాలు లభించాయి.

దివిసీమతో ఎంతో ఆత్మీయతానుబంధాన్ని పెనవేసుకున్న డా. డైక్‌మన్, దీనజన సంక్షేమానికి నిరంతరం పరితపిస్తూనే, 2-10-1988 న పరమపదించారు.





డా. డైక్‌మన్ దంపతులతో శ్రీ మండలి వెంకటకృష్ణారావు, శ్రీ బుద్ధప్రసాద్, జాన్ డేవిడ్, పిహెచ్.ఎస్.బి. శర్మ, శ్రీ పెరుమాళ్ళు



# డా. జాన్ డేవిడ్

మానవత్వాన్నే మతంగా భావించుకుని కరుణ అనే పదానికి పర్యాయ పదంగా నిలిచిన డా॥ ఎస్. జాన్ డేవిడ్ సేవామూర్తిగా ఎందరికో ఆదర్శమై నిలిచారు. ఆయనది అమృత హృదయం. దీనజన బాంధవుడాయన. ఆర్తజనుల కన్నీళ్లు తుడవటమే తన జీవిత లక్ష్యంగా పనిచేశారాయన.

దివిసీమ ఉప్పెన జరిగినప్పుడు జాన్ డేవిడ్ అమెరికాలో ఉన్నారు. అక్కడి ఎ.ఎం.జి. సంస్థ సిబ్బంది ద్వారా ఈ వార్తను తెలుసుకున్న జాన్ డేవిడ్ భారతదేశానికి వెంటనే చేరుకోవాలని తీవ్ర ప్రయత్నం చేశారు. అయితే ఎయిర్ ఇండియా విమానాలలో వారం రోజుల వరకు ఖాళీ లేదని తెలిసింది. ఎంతో ప్రయత్నం మీద స్విస్ ఎయిర్ లైన్స్‌లో ఇండియాకు వచ్చారు. విమానాశ్రయం నుంచే ఎవరితో మాట్లాడాలన్నా అవకాశం చిక్కలేదు. కోస్తా ఆంధ్ర అంతటా తుఫాను బీభత్సానికి కమ్యునికేషన్ వ్యవస్థ మొత్తం ఛిన్నాభిన్నమైపోయింది. అతి ప్రయత్నం మీద ఒక టాక్సీని మాట్లాడుకుని 16 గంటలు దుష్కర ప్రయాణం చేసి అవనిగడ్డ చేరుకున్నారు.

అప్పటికే ఎ.ఎం.జి. సంస్థ వారు తుపాను ప్రాంతంలో సహాయ కార్యక్రమాలను ప్రారంభించారు. విరిగిపడ్డ చెట్లను, కరెంటు స్తంభాలను దాటుకుంటూ వెళ్ళి, బట్టలు, బియ్యం, ఇతర వంటదినుసులను అవసరమైన వారికి అందజేస్తున్నారు.

ఆయన అవనిగడ్డ చేరుకోగానే మా నాన్నగారు ప్రాణానికి తెగించి 80 మంది బాలబాలికలను తుపాను బారిన పడకుండా కాపాడిన విషయం ఆయనకు

తెలిసింది. జాన్ డేవిడ్ నేరుగా వచ్చి నాన్నగారిని కలిసి, మృత్యువాత పడకుండా అంతమంది పిల్లలను రక్షించినందుకు ఆయనకు ధన్యవాదాలు తెలుపుతూ హృదయం ద్రవించి కన్నీటి పర్యంతమైనారు.

జాన్ డేవిడ్ జర్మనీకి చెందిన పారిశ్రామికవేత్త డా. హెచ్. హెచ్. డైక్‌మెన్ గారిని తీసుకొచ్చి వారి సహకారంతో అనేక కార్యక్రమాలు చేపట్టటం జరిగింది. భావదేవరపల్లి గ్రామంలో బాధితులకు ఇళ్లు నిర్మించారు.

తుపానులో కొన్ని వందలమంది పిల్లలు అనాథలయ్యారు. తల్లినో, తండ్రినో కోల్పోయిన వాళ్ళు ఎక్కువ. అలాంటి పిల్లలను 300 మందిని అవనిగడ్డ గాంధీక్షేత్రానికి తీసుకొచ్చారు. వారందరి పోషణ బాధ్యతకు ఆర్థిక సహాయం జాన్ డేవిడ్ అందించారు. 'దీనజన సంక్షేమ సమితి'కి ఈ అనాథ శరణాలయ నిర్వహణను అప్పగించారు. దానికి కార్యదర్శిగా నేనుండేవాణ్ణి.

శరణాలయంలో గాంధీ గారి బేసిక్ విద్యావిధానంలో పిల్లలకు చదువులు చెప్పే ఏర్పాటు చేశాము. ఆ పిల్లలకు చేతి వృత్తులు నేర్పించటం కోసం డైక్‌మెన్ టెక్నికల్ ఇనిస్టిట్యూట్ స్థాపించి అందులో అనేక సాంకేతిక విద్యలు నేర్పించారు. అచ్చు యంత్రాల పని, కుట్టుపని, చెప్పుల తయారీ లాంటి విద్యలు వారి సహకారంతో నేర్పించటం జరిగింది.

అప్పుడే గాంధీక్షేత్రం పత్రికని నా సంపాదకత్వంలో ప్రారంభించాము. ఆ పత్రిక 12 యేళ్ళు నిర్విఘ్నంగా నడవటానికి జాన్ డేవిడ్ గారి సహకారం ఎంతైనా ఉంది. ప్రతినెలా క్రీస్తు బోధనలతో కూడిన ఒక ప్రకటన ఇచ్చేవారు. ఆ డబ్బుతో పేపర్ ఖర్చు వచ్చేది. గాంధీక్షేత్రం ప్రింటింగ్ ప్రెస్సులోనే ముద్రణ అయ్యేది. అందువలన పత్రిక తేవటానికి ఆర్థిక ఇబ్బందులు ఉండేవి కావు.

తాను ఎంత ఎత్తుకు ఎదిగినా అతి సామాన్యుడిగానే జీవించారాయన. విదేశీయుల సౌకర్యార్థం పెద్ద హోటళ్ళలో బసచేసినా, బజారు హోటళ్ళల్లో కూర్చునే భోజనం చేసేవారు. ఏ బజ్జీల వాడినో, ఏ వేరుశనక్కాయల వాడినో పిలిచి వాడికి విసుగొచ్చేంత వరకు బేరం ఆడేవారు. 10 రూపాయలు బేరం చేసి 100 రూపాయలు ఇచ్చేవారు. వాడు చిల్లర ఇవ్వబోతుంటే వద్దు ఉంచుకోమనే వారు.

మా నాన్నగారిదీ వారిదీ ఒక ఆత్మీయ మైత్రీబంధం. మా నాన్నగారి సేవాజీవితంలో అత్యంత ప్రధానమైన వ్యక్తి జాన్ డేవిడ్ గారు. ప్రజా సేవ విషయంలో

మా నాన్నగారికి అనేక ఆలోచనలుండేవి. కానీ, వాటిని ఆచరణలోకి తేవటానికి తగినంత ఆర్థిక స్థోమత లేదు. వాటికి ఆర్థిక వనరులు సమకూర్చి గాంధీక్షేత్రాన్ని ఒక మహోన్నత సేవా సంస్థగా తీర్చిదిద్దటంలో ముఖ్య పాత్ర జాన్ దేవిడ్ గారిదే! నాన్నగారి ఆలోచనలు సఫలీకృతం చేసిన చిరస్మరణీయులు జాన్ దేవిడ్ గారు.

మా నాన్నగారు చనిపోయే నాటికి మాకు ఆర్థిక ఇబ్బందులు చాలా ఉండేవి. చేతిలో చిల్లి గవ్వ కూడా లేని స్థితి. గాంధీక్షేత్రం కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్లటం గురించి ఆందోళన పడుతుండగా మా నాన్నగారు కలలో కన్పించి “జాన్ దేవిడ్ ఉన్నారుగా అన్నీ ఆయన చూసుకుంటారు.. అన్ని కార్యక్రమాలూ కొనసాగుతాయి” అని చెప్పారు. అదే విధంగా ఆయన సహకారంతో సేవా కార్యక్రమాలు కొనసాగాయి.

ఈ పోటీ ప్రపంచంలో పేద అనాథ పిల్లలు కూడా తట్టుకుని ముందుకు రాగలిగేలా ఆ పిల్లల్ని తీర్చి దిద్దాలనేది జాన్ దేవిడ్ గారి లక్ష్యంగా ఉండేది. నాణ్యమైన జీవన వ్యవస్థలో పిల్లలు పెరిగితేనే వాళ్లు ఉన్నత స్థితికి చేరుకో గలుగుతారని ఆయన నమ్మేవారు. అనాథల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించటం, ఇంటర్వ్యూలను సమర్థంగా ఎదుర్కోగలగటం లాంటి విషయాల్లో గొప్ప స్కూళ్లలో చదివే పిల్లలకు ఏమాత్రం తీసిపోని విధంగా వీళ్ళు ఎదగాలని ఆయన తలపోసేవారు.

ఎ.యం.జి. పక్షాన సాంకేతిక శిక్షణా సంస్థని, రెండు నర్సింగ్ స్కూళ్లని, రాజమహేంద్రిలోను, చిలకలూరిపేట లోను 6 కాలనీలను ఆయన నెలకొల్పారు. అనాథ పిల్లలకోసం 'హోమ్ ఆఫ్ హోప్' పేరుతో వందకు పైగా శరణాలయాలు నిర్మించారు. వైద్య సేవలు లెక్కలేనన్ని చేశారు. గ్రామాల్లోంచి చదువుకునేందుకు వెళ్లే పిల్లలకు, 16 స్కూళ్లలో రోజుకు ఐదువేలమంది పిల్లలకు మధ్యాహ్న భోజనం పెట్టించటం లాంటి సేవలు చేసేవారు. పట్టాభిపురంలో కళావంతుల పిల్లలకోసం సేవా సంస్థను నడిపారు. పేద పిల్లలకు పెళ్లిళ్లు చేయించే వారు. ఆయన సేవాకార్యక్రమాలు నిజానికి లెక్కలేనన్ని!

వారి సతీమణి డా. సత్యవేదం గొప్ప వైద్యురాలు. చిలకలూరిపేటలో ఆమె పేద ప్రజల ఆశాజ్యోతి. ఆయన తల్లి కృపమ్మగారు కరుణామయి. జాన్ దేవిడ్ గారు గాంధీ క్షేత్రంలో కృపమ్మ గారి పేరున ఒక సేవాసదనం నిర్మించారు.

జాన్ దేవిడ్ లాగా సమాజ సేవా కార్యక్రమాలు చేసిన వారు చాలా అరుదు.

ఆయన వ్యక్తిగా ప్రచార పటాటోపాలకు దూరంగా ఉండేవారు కానీ, ఆయన చేసిన దాంట్లో అణుమాత్రమే చేసిన వ్యక్తులకు 'పద్మశ్రీ' బిరుదు లొచ్చాయి. ఆయనకు అలాంటి కోరికలేవీ ఉండేవి కావు. ప్రత్యేకించి ఆయన కుష్టు రోగుల సేవా కేంద్రం ద్వారా చేసిన సేవను, పడుపు వృత్తిలోంచి స్త్రీలకు విముక్తి కలిగించి వారి కాళ్లపై వారు నిలబడేలా ఆయన చేసిన కృషిని తెలుగు జాతి ఎన్నటికీ మరచిపోలేదు.

జాన్ డేవిడ్ గారికి ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు. కుమారుడు జెస్సి బార్నబాస్, "ఫార్ కార్నర్" సంస్థ ద్వారా సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. అల్లుడు అరుణ్ కుమార్ మహంతి 'ఎ.యం.జి. సంస్థ'కు జాన్ డేవిడ్ తరువాత సంచాలకుడిగా ఉన్నారు. మహంతి మామగారి ఆశయాలకు అనుగుణంగా వ్యవహరిస్తూ వారి లక్ష్యాలను ముందుకు తీసుకు వెళ్లటం ముదావహం.

విశాఖపట్టణం జిల్లా నర్శీపట్టణందగ్గర బలిఘట్టం ఆయన జన్మస్థలి. 17 అక్టోబర్ 1926న జన్మించారు. తల్లి కృపమ్మ. తండ్రి గాబ్రియేల్. క్రైస్తవ భక్త కుటుంబం.

చిన్ననాడే తండ్రిని కోల్పోయి, కటిక పేదరికంలోకి నెట్టివేయబడిన కుటుంబంలో అనాధగా పుట్టిన ఒక మొగ్గ, తెలుగు వారు గర్వించదగిన రీతిలో పద్మరాగమై వికసించింది.

దాతల సాయంతో ఎనిమిదో తరగతి చదువుతున్న కాలంలో ఆయనకు బ్రిటిష్ ప్రభుత్వం పట్ల ఏహ్యాభావం ఏర్పడింది. సుభాష్ చంద్రబోస్ స్థాపించిన ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరాలని ప్రయత్నించాడు కూడా!

బ్రిటిష్ సైన్యమే అయినప్పటికీ మాతృదేశ సేవగా భావించి ఆయన జబల్పూరు సైన్య విభాగం సిగ్నల్ వ్యవస్థలో ఉద్యోగిగా చేరారు. అక్కడ టెలీప్రింటర్ ఆపరేషన్ బాగా నేర్చుకున్నాడు. తరువాత ఢిల్లీ, బర్మాలలో కూడా పనిచేశారు. తరువాత వృద్ధురాలైన తన తల్లి సేవకు గాను హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నారు. కానీ ఎక్కువకాలం మిలిటరీ ఉద్యోగంలో ఆయన కొనసాగలేదు.

1955లో చిలకలూరిపేటకు చెందిన డా॥ సత్యవేదం అనే వైద్యురాలిని వివాహం చేసుకున్నారు. క్రీస్తు సూచించిన ప్రబోధం, పోషించటం, రోగాలను మాన్పటం అనే మూడంచెల (3 dimensional) మార్గంలో వెళ్లాలని ఆయన నిశ్చయించుకున్నారు. క్రైస్తవ మత బోధకుడిగా మారారు. వైద్యురాలైన తన భార్య

ఆదాయంతోనే, పేదప్రజలను, అట్టడుగు ప్రజలను, నిరాశలో కూరుకుపోయిన వారిని ఆదుకోసాగారు.

క్రైస్తవ మతపరమైన సదస్సులో పాల్గొనటానికి ఒకసారి అమెరికా వెళ్లారు. సమాజ సేవకు చేయూతనిచ్చే ప్రముఖ వ్యక్తులను అక్కడ కలుసుకునే అవకాశం ఆయనకు లభించింది. ఆర్థికంగా అలా అండదండలు దొరకడంతో 1968లో సమాజ సేవారంగాన ఒక మహా కెరటంలా ఆయన ఉవ్వెత్తున సంక్షేమకార్యక్రమాలు ప్రారంభించారు. తాను సంచాలకుడుగా నడిపిన ఎ.యం.జి. (ఇండియా) అంతర్జాతీయ సంస్థ ఈ రోజున భారతదేశంలోనే అతిపెద్ద సేవా సంస్థగా నిలిచింది.

ఆరోగ్యం, విద్య, అనాధ పిల్లల ఆదరణ, అత్యయిక సేవలు, ప్రకృతి వైపరీత్యాల సమయంలో బాధితులను ఆదుకునే సేవలను ఆయన ఈ సంస్థ ద్వారా విస్తృతంగా చేపట్టారు. నిజానికి సేవా కార్యక్రమాలు చాలామంది చేస్తారు. కానీ, జాన్ డేవిడ్ గారి దృష్టి విశాలమైనది, విశిష్టమైనది, విలక్షణమైనది కూడా. ఆయన అందించే సేవలు ఎవరో ఒక దాత వచ్చి ఆదుకునే పద్ధతిలో ఉండవు, అవి ఒక తండ్రి తన బిడ్డల యోగక్షేమాలు కనిపెట్టుకున్నట్టు ఉంటాయి. అది జాన్ డేవిడ్ గారి పని తీరుకు ఒక ఉదాహరణ. చిలకలూరిపేట కేంద్రంగా ఆయన సేవలు విస్తరించాయి. సేవా సామ్రాజ్యానికి రాజధానిగా చిలకలూరిపేట వర్ధిల్లింది. ఒక మత ప్రచారకుడిగా ఆయన గ్రామగ్రామాన తిరిగారు. పేదరికం, అనారోగ్యం, అవిద్య తాండవిస్తుండటాన్ని ఆయన గమనించారు. ఆయన సేవలు పొందటానికి పేదరికం ఒక్కటే కొలబద్దగా ఉండాలని ఆయన భావించారు.

1977లో జాన్ డేవిడ్ గారితో మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావు గారికి పరిచయం అయ్యింది. కృపానంద అనే ఒక పాస్టర్, బాలికల వసతి గృహాన్ని అవనిగడ్డలో నెలకొల్పాడు. ఆయన ద్వారా జాన్ డేవిడ్ గారితో నాన్నగారికి పరిచయం అయ్యింది. అది మొదలు జాన్ డేవిడ్ గారి సహకారంతో గాంధీక్షేత్రంలో అనేక సేవాకార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు.

1977 అక్టోబరులో మహాత్మాగాంధీ 109వ జయంతి ఉత్సవాల సందర్భంగా 109 వయోజన విద్యా కేంద్రాలు ప్రారంభించాలని మా నాన్నగారి సంకల్పం. వాటికి ఆర్థిక సహకారం అందజేయడానికి జాన్ డేవిడ్ ముందుకొచ్చారు. గాంధీగారి కోడలు శ్రీమతి నిర్మలాగాంధీ వాటిని ప్రారంభించారు. నిర్మలా గాంధీ వచ్చి వెళ్ళిన మర్నాడే

నవంబరు, 19న దివిసీమలో ఉప్పెన రావటం, 10 వేలమంది మరణించటం, ఊళ్లకు ఊళ్లు కొట్టుకుపోవటం జరిగింది. ఆ విపత్తు సమయంలో మా నాన్నగారికి ఆసరాగా నిలిచింది జాన్ డేవిడ్ గారే!

ఒక విశేషమేమంటే మా నాన్నగారు, జాన్ డేవిడ్ గారు, డైక్‌మెన్ గారు ముగ్గురు మిత్రులూ ఒక నెల వ్యవధిలో ఒకే సంవత్సరంలో 1926 జన్మించారు. ఒకే భావాలతో జీవించారు. సేవా జీవులుగా చరిత్రలో మిగిలారు.

దేశంలో ఎందరో అత్యున్నతమైన వ్యక్తుల అంత్యక్రియల్లో నేను స్వయంగా పాల్గొన్నాను. కానీ ప్రజలు కన్నీరు మున్నీరుగా విలపిస్తూ తుది వీడ్కోలు పలికింది జాన్ డేవిడ్ గారికి మాత్రమే. ఎన్నో వేలమంది అభాగ్యుల, అనాధల జీవితాల్లో వెలుగులు నింపిన సేవామూర్తి అస్తమయం సహజంగానే అందరినీ దుఃఖపూరితుల్ని చేసింది. జాన్ డేవిడ్ లాంటి వారు కోటికొక్కరు కూడా పుట్టరు. ప్రచార పటాటోపాలు లేకుండా నిశ్శబ్దంగా ఆర్తజన సేవ చేసిన ధన్యజీవి జాన్ డేవిడ్.



డా. డైక్‌మన్, శ్రీ మండలి వెంకటకృష్ణారావు, శ్రీ జాన్ డేవిడ్



# మీర్ అక్బర్ ఆలీఖాన్

మహోన్నత జాతీయవాది, మాజీ గవర్నర్ అక్బర్ ఆలీ ఖాన్‌గారు మా నాన్నగారికి ఆత్మీయ మిత్రులు. మా నాన్నగారు చేపట్టిన అన్ని కార్యక్రమాలలోనూ ఆయన చేదోడువాదోడుగా ఉండేవారు. సమాజ సేవారంగంలో ఒక విధంగా ఆయన సలహాలు, సంప్రదింపులు లేకుండా నాన్నగారు దాదాపుగా ఏపనీ చేయలేదని చెప్పవచ్చు.

ఉప్పెన అనంతరం పునర్నిర్మాణంలో అక్బర్ ఆలీఖాన్ గారిది పరోక్షపాత్ర. జాతీయ స్థాయిలోనూ, అంతర్జాతీయ స్థాయిలోనూ ఆయనకు అసంఖ్యాకంగా సేవా సంస్థల నిర్వాహకులతో సత్సంబంధాలున్నాయి. వారందరినీ దివిసీమకు రప్పించటంలో ఆలీఖాన్ గారు విశేష కృషిచేశారు. ఆయన పూనిక లేకపోతే దివిసీమలో ఇంత కారుణ్య సాగరం ఉప్పొంగి ఉండేది కాదు.

ఉప్పెన, తుపాను తర్వాత మా నాన్నగారు స్వచ్ఛంద సేవా సంస్థలన్నింటినీ ఒక త్రాటిమీదకు తెచ్చి, ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సేవా సంస్థల సమాజ సేవకుల సంఘాన్ని స్థాపించి, దానికి శ్రీ అక్బర్ ఆలీ ఖాన్ గారిని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఆ సందర్భంలో ఆయన ఈ క్రింది సందేశాన్నిచ్చారు:

"ఒక ప్రజాస్వామ్య దేశంలో మనుగడ సాగించే ప్రజలకు జాతి పునర్నిర్మాణం పట్ల పూర్తి బాధ్యత ఉండాలి. ప్రభుత్వపు బాధ్యతలతో పాటు, ప్రజల సహకారం కూడా ఉన్నప్పుడే సంక్షేమ కార్యక్రమాల అమలు సమర్థంగా జరుగుతుంది. మనం

మహాత్మాగాంధీ, నెహ్రూ వంటి మహనీయులకి ఎంతగానో ఋణపడి ఉన్నాం. వారి త్యాగాల వలనే మనం స్వాతంత్ర్య ఫలాలను అనుభవించగలుగు తున్నాం. ఐతే, నైతికంగా, ఆర్థికంగా ప్రజల్ని సమాయత్తం చేయడానికి సామాజిక, ఆర్థిక రంగాల్లో చేయవలసిన కృషి ఎంతో ఉంది. నా స్నేహితులు మండలి వెంకట కృష్ణారావుగారి కృషి వలన స్వచ్ఛంద సంస్థల సంఘం ఒకటి స్థాపించబడటం నాకెంతో ఆనందంగా ఉంది. దీనివల్ల, అభివృద్ధిలో ప్రజలు భాగస్వాములు కావడమేకాక, ఉప్పెనలు, తుపాన్ల వంటి ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు సహాయ కార్యక్రమాలను ప్రజలే పూనుకొని స్వయంగా నిర్వహించుకో గలుగుతారు. స్వచ్ఛంద సంస్థలు చేపట్టే సహాయ పునరావాస కార్యక్రమాలను సమన్వయం చేయడానికి ఈ సంఘం ఎంతో ఉపకరిస్తుంది. ఇందుమూలంగా, సమయమూ, ధనమూ వృథా కాకుండా అత్యధిక ఫలితాన్ని పొందగలుగుతాము. ప్రభుత్వ శాఖలను, స్వచ్ఛంద సంస్థలను ఒకరినొకరు అర్థం చేసుకొనేటందుకు వీలుగా, వారి మధ్య సాన్నిహిత్యం పెంపొందించే బాధ్యతని కూడా ఈ సంఘం చేపట్టాలి. అప్పుడే ఆశించిన ఫలితాలు లభిస్తాయి".

1977 ఉప్పెన తరువాత వారు అనేక పర్యాయాలు అవనిగడ్డ గాంధీక్షేత్రానికి విచ్చేశారు. 1986లో మా నాన్నగారి షష్ట్యబ్దిపూర్తి సంఘానికి అధ్యక్షులుగా వ్యవహరించారు.

అక్బర్ ఆలీ ఖాన్‌గారు పూర్వకాలపు ఒక జాగీర్ దార్ కుటుంబానికి చెందినవారు. వీరి తండ్రి మీర్ మహబూబ్ ఆలీ గొప్ప వ్యక్తిత్వంగల మనిషి. అక్బర్ ఆలీ ఖాన్‌గారు 1899 నవంబర్ 20వ తేదీన హైదరాబాద్ లో జన్మించారు. ప్రాథమిక విద్య ముఫీదుల్ ఆనం పాఠశాలలో అభ్యసించారు. దీనిని రాజా బన్సీలాల్, ఆయన కుటుంబ సభ్యులు స్థాపించారు. మెట్రిక్యులేషన్ సిటీ హైస్కూల్ లో పూర్తి చేసుకొని ఆలీఘర్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్య కోసం చేరారు. 1929 లో మహాత్మాగాంధీ, ఆలీ సోదరుల స్ఫూర్తితో అక్కడినుంచే సహాయ నిరాకణోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ఆ కాలంలో డా. జాకీర్ హుస్సేన్ అలీఘర్ జాతీయవాద విద్యార్థులకు నాయకత్వం వహిస్తున్నారు. ఈ విషయం తెలుసుకొని హైదరాబాద్ నుంచి అక్బర్ హైదరీ, సర్ రోస్ మసూద్, లతీఫ్ యార్ జంగ్, హబీబుర్ రహమాన్ షేర్వాన్ వంటి ఉద్దండులతో ఒక ప్రతినిధి బృందం ఆలీఘర్ కు వెళ్ళి హైదరాబాద్ కు చెందిన

విద్యార్థులు జాతీయోద్యమంలో చేరకుండా ఆపేందుకు వారికి నచ్చజెప్పటానికి ప్రయత్నించింది. ఐతే, దాదాపు పదిమంది విద్యార్థులు వీరి సలహా పాటించకుండా జాతీయోద్యమంలో పాల్గొన్నారు. అలా పాల్గొన్నవారిలో అక్బర్ ఆలీ ఖాన్ ప్రముఖులు.

1923 లో ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చేరి, బి.ఎ. పట్టా పొందిన పిమ్మట, ఉన్నత చదువుల కోసం లండన్ వెళ్ళి లండన్ విశ్వవిద్యాలయం నుంచి ఎల్.ఎల్.బి. (హానర్స్) డిగ్రీ పొందారు. పిమ్మట మిడిల్ టెంపుల్ నుంచి బారిస్టర్ పట్టా పొందారు.

ఉస్మానియా పట్టభద్రుల సంఘం, ఎగ్జిబిషన్ సొసైటీ, ఎకనామిక్ కమిటీ మొదలైన సంస్థలతో వీరికి సన్నిహిత సంబంధాలుండేవి. 1929 లో భారత జాతీయ కాంగ్రెస్ మాజీ అధ్యక్షులు శ్రీ శ్రీనివాస అయ్యంగార్ పర్యవేక్షణలో ఈయన హిందూ, ముస్లిం విభేదాల  పరిష్కారానికి ఒక పథకాన్ని రూపొందించారు.

1952 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనేట్ మెంబరుగా ఎన్నికయ్యారు. ఆలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం, జామియా మిలియా, జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయాలకు సెనేట్ మెంబరుగా పనిచేశారు.

హైదరాబాద్ రామాంతపూర్ లోని తన స్థలం 15 ఎకరాలను విరాళంగా ఇచ్చి, 1957లో ఒక పాలిటెక్నిక్ కాలేజీని స్థాపించారు. ఇందుకోసం రూ.50,000/- లను కూడా విరాళంగా ఇచ్చారు. జవహర్ లాల్ నెహ్రూ మరణానంతరం ఈ కాలేజీకి ఆయన పేరు పెట్టారు.

శ్రీ కృష్ణమీనన్ నేతృత్వంలోని ఐక్యరాజ్య సమితి ప్రతినిధి బృందంలో ఈయన సభ్యులుగా ఉన్నారు.  అనంతశయనం అయ్యంగార్ బృందంలో చైనాకు  జరిగిన సద్భావనయాత్రలో పాల్గొన్నారు. మాస్కో, ఫిన్లాండ్‌లతో పాటుగా, ఆసియా, సౌతాఫ్రికాలోని ఎన్నో దేశాల్లో పర్యటించారు.

18 ఏళ్ళ పాటు రాజ్యసభ సభ్యులుగానూ, 12 సంవత్సరాలు రాజ్యసభ డిప్యూటీ చైర్మన్ గానూ పనిచేశారు. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ డిప్యూటీ లీడరుగా ఎన్నికయ్యారు. హిందూ, ముస్లింల ఐక్యతను బలపరచడానికి జీవితాంతం పనిచేశారు.

1972-74 మధ్య ఉత్తరప్రదేశ్ గవర్నరుగాను, 1974-76 మధ్య ఒరిస్సా గవర్నరుగాను పనిచేశారు. 1975 సంవత్సరంలో విరాళాలు సేకరించి, నాంపల్లి ప్రభుత్వ ఆసుపత్రిలో యూసఫ్ బాబా వార్డును నిర్మింప చేశారు. ఆలీఘర్ ముస్లిం

విశ్వవిద్యాలయం పూర్వ విద్యార్థుల సంఘాన్ని స్థాపించారు. భర్తృహీనులైన స్త్రీల సహాయానికి ఒక సంస్థను స్థాపించారు.

1948లో జిన్నా గారు వీరిని మజ్లీస్ ఎ ఇల్తాహదుల్ ముస్లిమీన్ పార్టీలో చేరవలసిందిగా కోరారు. కానీ ఆ ఆహ్వానాన్ని సున్నితంగా తిరస్కరించిన జాతీయవాది ఆయన. హైదరాబాద్ రాష్ట్రానికి ప్రధానిగా పనిచేయవలసింగా నిజాం ప్రభువు ఆహ్వానిస్తే వద్దని పక్కకు తప్పుకుని, అదే సంవత్సరం భారత జాతీయ కాంగ్రెస్ హైదరాబాద్ ఆతిథ్య సంఘానికి ఉపాధ్యక్ష పదవి స్వీకరించారు.

జాతికి ఆయన పట్ల గల గౌరవానికి నిదర్శనంగా, శ్రీ అక్బర్ ఆలీ ఖాన్ గారిని భారతప్రభుత్వం 1965లో పద్మభూషణ్ బిరుదుతో సత్కరించింది. 1975లో మా నాన్నగారు నిర్వహించిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు ఆయన తన సంపూర్ణ సహకారాన్ని అందించారు. అప్పుడు వారు ఒరిస్సా గవర్నర్‌గా ఉండేవారు.

1994 లో పరమపదించిన ఈ మహనీయునకు నివాళులర్పిస్తున్నాను.



స్వామి బోధ స్వరూపానంద, స్వామి ప్రదమానంద, మీర్ అక్బర్ ఆలీఖాన్, కోదాటి నారాయణరావు, ప్రభాకర్‌జీ, శ్రీ రాధాకృష్ణ, సెక్రటరీ గాంధీ పీస్ ఫౌండేషన్, ప్రొ॥ ఎన్.జి. రంగా, శ్రీ ఎమ్.వి. కృష్ణారావు.



# శ్రీ లవణం, శ్రీమతి హేమలతా లవణం

శీమతి హేమలతా లవణం, శ్రీ లవణం దంపతులు దివిసీమ ఉప్పెన అనంతర పునర్నిర్మాణ కార్యక్రమాల్లో ప్రముఖ పాత్ర వహించారు. వివిధ సేవాసంస్థల సేవాకార్యక్రమాలను సమన్వయం చేయటంలో ఈ దంపతుల కృషి అమోఘమైనది. మా నాన్నగారు, ప్రభాకర్‌జీ ఇద్దరూ కలిసే ఆ దంపతులకు ఈ బాధ్యత అప్పగించారు.

దివిసీమ పునర్నిర్మాణానికి దాతల నుండి ద్రవ్య సహాయం బట్టలు, పాత్ర సామగ్రి వగైరా ప్రవాహంలా రాసాగాయి. వీటిని ఒకపద్ధతిలో పంపిణీ చేయకపోతే, దూరగ్రామాలకు ఏదీ అందదని లవణంగారు పంపిణీ బాధ్యతని స్వీకరించారు. హేమలతగారు, ఎం.ఎస్ రాజలింగం గారు కలిసి ఒక స్టోరు నిర్వహించారు. వచ్చిన సహాయ సామగ్రిని వచ్చినట్టు ఈ స్టోరులో నమోదు చేసి, ఎక్కడ సహాయం తక్కువ అందిందో అక్కడకు తరలించే బాధ్యతని వీరు నిర్వహించారు.

దాతలు కూడా వివిధ కులమతాల పేరుతో వచ్చి, ఆయా కులాల మతాల వారికే సేవలందిస్తామనే వారు. లవణం గారు దీన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. శవాల్లో తమతమ కులస్థుల్ని లేదా మతస్థుల్ని ఏరి ఆ ప్రకారం అంత్యక్రియలు చేయండని వాళ్లతో లవణం గారు అనేవారు. ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో తాము కులమతాల ప్రస్తావన తెచ్చినందుకు వారిలో చాలామంది సిగ్గుపడ్డారు కూడా! తమపేర్లు ముద్రించిన బనీన్లు వగైరా తెచ్చిన వారిని లవణం గారు తిరస్కరించేవారు. వాళ్ళు బాధితులేగానీ, కూటికి లేనివాళ్లు కాదు, ఇలాచేసి వాళ్లని అవమానించవద్దనేవారు.

పరామర్శకు వెళ్లినప్పుడు, ఒక ఇంట్లో తల్లీ కూతుళ్లు ఇద్దరే మిగిలారు. తల్లి బయటకు వస్తే కూతురు లోపలే ఉండిపోతోంది. హేమలతగారు పరిస్థితి గమనించి, వారికి ఒక్క చీరే ఉన్నదని అర్థం చేసుకుని అప్పటికప్పుడు కొన్ని చీరలు అందించారు. ఆ అనుభవం తరువాత ఇద్దరు విద్యార్థుల్నీ, ఇద్దరు విద్యార్థినీలని ఒక టీముగా వేసి, ప్రతీ ఇంటికీ పంపించి అవసరాలు తెలుసుకుని వాటిని తీర్చే బాధ్యతలు అప్పగించారు. సేవా తత్పరత కలిగిన సంస్థలు, దాతలు, ఫండింగ్ ఏజెన్సీలు లెక్కలేనంతమంది వచ్చినప్పుడు అక్కడ వారిమధ్య సమన్వపరిచే వ్యవస్థ ఉండాలి. ఎవరికివాళ్లు అనువైన చోట ఖర్చుచేసి వెళ్లిపోవాలని చూస్తారు. మారుమూల దిగబడిపోయిన వారికి గుక్కెడు మంచి నీళ్లు కూడా అందవు. అందుకని ఈ సంస్థలన్నింటినీ కలిపి ఒక సమన్వయ సమితిని ఏర్పాటు చేయాలని మా నాన్నగారు, లవణం గారు ఒక ఆలోచన చేశారు.

ఆర్. ఎస్.ఎస్ తరఫున బండారు దత్తాత్రేయగారు, ఆక్స్-ఫామ్ తరఫున టిగ్గర్ స్టాక్, ఇంటర్ యాక్ట్ తరఫున కెప్టెన్ స్కాట్, వి ఆర్ ఓ తరఫున విండే, రోమన్ క్యాథలిక్ రిలీఫ్ కమిటీ తరఫున ప్రకాష్, సాల్వేషన్ ఆర్మీ తరఫున ఫాదర్ జాన్ పట్టమట్టం, ఫాదర్ అమల్ రాజ్, ఇంకా వివిధ విశ్వవిద్యాలయాల ఎన్.ఎస్.ఎస్ విద్యార్థులు, రామకృష్ణమిషన్, శ్రీ సత్యసాయి సేవా సమితి, ఇలా అనేకమందిని పిలిచి, సంప్రదించారు. అందరూ ఇలా సమన్వయంగా పనిచేయటం ఇదే ప్రథమం అనీ, ఇంతకుముందెప్పుడూ ఇలా పనిచేసిన సందర్భాలు లేవనీ అంటూ సమన్వయ సమితి ఏర్పాటుకు అంగీకారం తెలిపారు.

ఎక్కువ సంస్థలు పాశ్చాత్య క్రైస్తవ సంఘాల నుండి వచ్చాయి కాబట్టి, వారి ప్రతినిధిని కన్వీనరుగా పెడితే బావుంటుందని లవణం గారు సూచించారు. కానీ అందరూ లవణం గారినే కన్వీనరుగా ఉండవలసిందిగా కోరారు. కన్వీనర్ కార్యాలయం విజయవాడ నాస్తిక కేంద్రం లోనే ఉండేందుకు అందరూ ఆమోదం తెలిపారు కూడా!

ప్రతీ మంగళవారం సాయంత్రం 5-7 మధ్య జరుగుతున్న పునర్నిర్మాణపనిని సమీక్షించుకోవటం, ప్రతీ శనివారం ఉదయం 9-1 మధ్య వివిధ దేశాల్లో ఉపద్రవాల నిర్వహణ విషయం మీద సమాచారాన్ని తెప్పించుకుని పంచుకుంటూ పని సమర్థత పెంచుకునేవారు.

కమ్మనమోలు అనే గ్రామాన్ని గాంధీపురంగా మార్చి, దేశం మొత్తం మీద ఉండే ఖాదీ సంస్థలన్నీ కలిసి ఆ ఊరు పునర్నిర్మాణ బాధ్యతలు తీసుకున్నాయి.

ఉప్పెనకు ముందు ఆ ఊళ్లో హరిజనవాడ దూరంగా ఉండేది. హరిజనవాడ సహా ఒకే గ్రామంగా దాన్ని కలిపి కట్టాలనీ, గ్రామాలనే కాదు సామాజికమైన అంశాలను కూడా మనం పునర్నిర్మించుకోవాలని లవణంగారు వాదించారు.

అదే సమయంలో ఆర్టిక్ Appropriate Reconstruction Information Training Centre -అనే సంస్థను వ్యవస్థాపించి, కెప్టెన్ స్కాట్, శ్రీకాంత్, కల్నల్ బాలకృష్ణ లకు దాని బాధ్యత అప్పగించారు. బాలకృష్ణగారు నాస్తిక కేంద్రం లోనే ఉంటూ దాని పనులు చూసేవారు. ఆ సమయంలోనే గాలివానలకు తట్టుకునే పాకల మీద విశేష పరిశోధన జరిగింది. అలాంటి ఒక పాకను ప్రయోగాత్మకంగా నాస్తిక కేంద్రంలో నిర్మించి చూశారు.

నాస్తికుడు మంచిపని చేస్తున్నాడంటే సైతాన్ మంచివాడనటం లాంటిదని కొందరు క్రైస్తవమతాధిపతులు వాటికన్ సిటీకి ఫిర్యాదు చేసినప్పుడు, వాటికన్ నుండి ఒక ప్రతినిధి రహస్యంగా వచ్చి లవణం గారి పనితీరుని పరిశీలించారు.

"ఎవరు మంచి పనిచేసినా మంచిని మంచి అనకపోతే మనం సత్యానికి దూరం అయిపోతాం. అందులోనూ గోరా, లవణం ఇద్దరూ ప్రముఖ గాంధేయ వాదులు. వారి సత్యనిష్ఠ, వారి సేవాకార్యక్రమాలవల్ల గాంధీ, వినోబా జయప్రకాష్ నారాయణ్ లాంటి వాళ్లు వారిని సన్నిహితంగా స్వీకరించారు.." అంటూ నివేదిక పంపాడట, ఆ రహస్య ప్రతినిధి.

చనిపోయిన వారు దయ్యాలై తిరుగుతున్నాయనే భయం ఉప్పెన బాధితుల్లో చాలామంది కుండేది. సముద్రుడికి శాంతికోసం కోళ్లు, పొట్టేళ్ళను బలి ఇవ్వటం జరిగింది. దాన్ని నివారించి, మేముంటే దయ్యాలు రావని వాళ్లతో కలిసి రాత్రీ పగలూ అక్కడే గడిపారు లవణం దంపతులు. గ్రామస్థులకు ఆత్మస్థైర్యం నింపటానికి వాళ్లు చాలా కృషిచేశారు.

మా నాన్నగారు గ్రామాల పర్యటనకు ఎక్కడికి వెళితే, అక్కడికి వెంట లవణం గారు తప్పక ఉండేవారు. ఇద్దరివీ అరచేతి ఖద్దరు చొక్కాలు. చూచినవారు అన్నదమ్ములని భావించేవారు. సహాయ కార్యక్రమాలను శ్రీమతి హేమలత సమన్వయం చేసేవారు. అలా కొన్ని నెలల పాటు వారు మా గాంధీక్షేత్రంలో ఉండిపోయారు. అప్పటి నుంచి లవణంగారు దంపతులతో ఆత్మీయానుబంధం ఏర్పడింది.

ఆయన నన్ను "బాబూ" అంటూ ఆప్యాయంగా పిలిచేవారు. నీవు ఎంత

ఉన్నత పదవిలో ఉన్నా నాకు బాబువే. బాబూ అనే పిలుస్తాను అని అనేవారు. వారితో కలసి అనేక కార్యక్రమాలు నిర్వహించాము. సాంఘిక చైతన్య శిక్షణా శిబిరాలు నిర్వహించాము. యువకులలో జాతీయ భావాలు పెంపొందించటానికి వారి ప్రయత్నానికి చేదోడు వాదోడుగా కొన్ని కార్యక్రమాలు చేశాము. ఎప్పుడైనా వారి వద్దకు వెళ్లి కాసేపు మాట్లాడితే విరైన శక్తులు మళ్లీ పుంజుకున్నాయా అనిపించేది. తన మాటల్లో మనకు కొత్త ఆలోచనలు రేకెత్తించేవారాయన. నిస్పృహను పారద్రోలేవారు. నూతనోత్తేజాన్ని నింపేవారు.

సాంఘిక విప్లవకారుడు 'గోరా' గారి ప్రథమ పుత్రుడు లవణంగారు. గోరా గారితో మా నాన్నగారికి అత్యంత సాన్నిహిత్యం ఉండేది. వారి భావాలన్నిటితో ఏకీభవించకపోయినా వారి సంస్కరణావాదం మా నాన్నగారిని ప్రభావితం చేసింది. నాన్నగారితో పాటు చిన్నప్పుడు నేను గోరా (గోపరాజు రామచంద్రరావు) గారిని చూశాను. వారి సతీమణి శ్రీమతి సరస్వతి గోరా తుది శ్వాస విడిచే వరకు నా పట్ల ఎంతో ప్రేమాభిమానాలు ప్రదర్శించేవారు. వారిని కలిసినప్పుడల్లా చక్కటి సలహాలిచ్చి, మార్గ నిర్దేశనం చేసేవారు.

వారి కుమార్తె మాజీ పార్లమెంట్ సభ్యురాలు శ్రీమతి చెన్నుపాటి విద్య రాజకీయ పరంగా నాకు సంపూర్ణమైన మద్దతిచ్చేవారు. డాక్టర్ విజయం, డాక్టర్ సమరం, కుమార్తె శ్రీమతి మైత్రి, నౌగోరా, అల్లుళ్ళు శ్రీ అర్జునరావు, శ్రీ వీరయ్యలతో మిగతా కుటుంబ సభ్యులందరితోనూ నాకు సేవానుబంధం పెనవేసుకొని ఉంది. లవణంగారు, శ్రీమతి హేమలతా లవణంగారు ఒక రకంగా నాకు మార్గదర్శకులు.

లవణంగారు బాల్యం నుండి అన్ని రంగాల్లోనూ, అన్ని సందర్భాలలోనూ తన తండ్రి గోరా గారిని అనుసరించేవారు. 1940లో గోరాగారు బందరు కాలేజీ ఉద్యోగానికి రాజీనామా యిచ్చినప్పుడు తొమ్మిదేళ్ల లవణంగారు తాను ఎప్పుడూ కూడా ఈ విద్యాలయాలకు వెళ్లననీ, డిగ్రీలు తీసుకోనని ప్రతిజ్ఞ చేశారు. నాటికీ నేటికీ లవణంగారు ఏ పాఠశాల్లోనూ చదువలేదు. ఏ డిగ్రీ పుచ్చుకోలేదు. గోరా సన్నిధే ఆయన విద్యాలయంగా, అనుభవమే విద్యగా శిక్షణ పొందారు.

లవణంగారు చక్కని వక్త, మంచి రచయిత, గొప్ప అనువాదకుడు. వీటన్నిటినీ మించి పట్టుదల గలిగిన త్యాగమూర్తి గొప్ప కార్యకర్త. ఆయన సమాజ సేవారంగం విస్తృతమైనది. నాస్తికోద్యమం, సంఘసంస్కరణోద్యమం, సాంఘికపరివర్తనోద్యమం,

గాంధేయ నిర్మాణ కార్యక్రమం, సర్వోదయ ఉద్యమం వీటిన్నిటిలో లవణంగారు కృషి విశిష్టమైనది.

లవణంగారు 1930 అక్టోబరు 10న విజయనగరంలో జన్మించారు. తల్లి శ్రీమతి సరస్వతి గోరాది విజయనగరం. ఆ సమయంలో ఉప్పు సత్యాగ్రహం ముమ్మరంగా సాగుతుండటంతో "లవణం" అని పేరు పెట్టారు తండ్రి గోరా. 12 సంవత్సరాల చిన్న వయస్సులోనే 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. పోలీసులు అరెస్టు చేసి అరచేతి మీద ఆరేసి దెబ్బలు కొట్టి, కేసు పెట్టకుండా వదిలి వేశారు.

1945లో తండ్రి గోరా గాంధీగారి దగ్గరకు వెళ్ళినప్పుడు లవణంగారు కూడా వెంట వెళ్ళారు. అయితే ఇంగ్లీషు, హిందీ రాకపోవడంతో గాంధీ గారితో మాట్లాడలేక పోయినందుకు బాధపడి, ఈసారి గాంధీ దర్శనానికి వచ్చేసరికి హిందీ నేర్చుకోవాలని పట్టుదలతో మూడు నెలల్లో హిందీ నేర్చుకుని గాంధీ గారి దగ్గరకు వెళ్ళారు. వినోబా, జయప్రకాష్ నారాయణలతో కలసి సర్వోదయ ఉద్యమంలో పని చేశారు. వినోబా ఆంధ్రదేశ భూదానోద్యమ యాత్రలో ఆయన ప్రసంగాలకు అనువాదకుడిగా వ్యవహరించారు. ఇండియా – చైనా యుద్ధం తరువాత ఢిల్లీ – పెకింగ్ స్నేహయాత్రలో పాల్గొన్నారు. అక్కడ కొందరు విదేశీయులు కలసి అమెరికా రమ్మని ఆహ్వానించి, మార్టిన్ లూథర్ కింగ్ నాయకత్వాన జరిగిన నీగ్రో ఉద్యమాన్ని స్టడీ చేయటానికి స్కాలర్‌షిప్ ఇప్పించారు. అలా అమెరికా వెళ్ళారు. ఆ తరువాత నాస్తికోద్యమం, ఇంటర్నేషనల్  హ్యూమనిస్టు ఉద్యమాలలో పనిచేస్తూ చాలా దేశాల్లో సంచరించి, ప్రసంగాలు చేశారు.

"చిన్నప్పట్నించీ ఇంట్లో సంస్కరణ వాతావరణం, జాతీయోద్యమ వాతావరణం ఏర్పడినందున దానిలో తిరిగేసరికి ఆ భావాలే పైకి వచ్చాయి. స్వాతంత్ర్యం వచ్చే నాటికి నాకు 16,17 సంవత్సరాల వయస్సు. స్వాతంత్ర్యం వచ్చింది కేవలం రాజకీయ అధికారం కోసం కాదు, మన సమాజాన్ని మనం మార్చుకోవాలి. ఆర్థిక మార్పుల్ని ప్రధానంగా ప్రభుత్వమే తీసుకు వస్తుంది. కానీ సాంఘిక మార్పుల్ని ప్రజలే తీసుకురావాలి. రాజకీయంగా అధికారం లేనివారు ప్రయత్నిస్తేనే సాంఘిక సంస్కరణలు విజయవంతం అవుతాయనే భావంతో నేను ఎక్కువగా సాంఘిక సంస్కరణోద్యమాన్ని తీసుకున్నాను. ఆ తరువాత హేమలతతో నా వివాహం జరగడం కూడా దీనికి మిక్కిలి తోడ్పడింది" అని లవణంగారు చెపుతుండేవారు.

1960 జనవరిలో వివాహమైన వెనువెంటనే వినోబా భావే చంబల్ లోయలో బందిపోట్ల ఆత్మ సమర్పణ, లొంగుబాటు పాదయాత్రలో పాల్గొనమని లవణం దంపతులను ఆహ్వానించారు. నూతన వధూవరులు చంబల్ లోయలో 15 రోజులపాటు బందిపోటు దొంగలను సంస్కరించటం ద్వారా జరుపుకున్నారు.

1972 లో మా నాన్నగారు శ్రీ పి.వి. నరసింహారావు మంత్రి వర్గంలో సాంఘిక సంక్షేమ శాఖామంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించిన తరువాత హైదరాబాదులో సాంఘిక సంస్కరణ సదస్సు నిర్వహించారు. అందులో శ్రీలవణం దంపతులు ప్రముఖ పాత్ర నిర్వహించారు. అప్పటి నుండి అనేక సంస్కరణ కార్యక్రమాలలో వారితో కలిసి పనిచేయడం జరిగింది. వాటిలోమహోన్నత మైనది స్టువార్టుపురం నేరస్థజాతుల సంస్కరణోద్యమం. ఎన్ని విమర్శలు వచ్చినా చలించకుండా మానాన్నగారు ఉద్యమంలో శ్రీ లవణం దంపతుల పక్షాన నిలిచారు.

శ్రీమతి హేమలతా లవణం ఒక వ్యాసంలో ఇలా వ్రాశారు.

“ఆనాడు అంటే 1974 జనవరి 27 సాయంత్రం స్వచ్ఛమైన జలం వంటి నిర్మల వ్యక్తిత్వం, వెలుగువాక వంటి విశిష్ట మనీషి ఆ అంధకారాన్ని చీల్చుకుంటూ సమాజం చేత తిరస్కరింపబడి, భయం ఒడిలో జీవితం గడుపుతున్న జనం వద్దకు వచ్చారు. ఆయన మండలివెంకట కృష్ణారావుగారు. వారు వచ్చింది స్టువర్టుపురం. మాజీ నేరస్థ జాతుల కాలనీకి. వ్యక్తిగతం గాను ప్రభుత్వ పక్షాన ఆశనివ్వడానికి, సాంఘిక అన్యాయాన్ని పారద్రోలడానికి, కాలనీ అంతా కలియదిరిగి చూశారు. వారి గుడిసెల్లోకి వెళ్లి చూస్తే మండలివారికి కనిపించింది దొంగ సొత్తు కాదు; వారిలోని దీనత్వం, నిస్సహాయత! వాటిని రూపుమాప వలసిన తన బాధ్యత అందరిపైనా ఉంది. సంఘంలో ఒక సభ్యునిగా, ప్రభుత్వ యంత్రాంగంలో ఒక మంత్రిగా, ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారి ప్రతినిధిగా, అన్నిటికీ మించి తోటి మానవునిగా తన బాధ్యత ఆయన్ను కదిలించింది. అందుకే “మమ్మల్ని మనుషులుగా బ్రతకనీయండి”, గౌరవంగా బ్రతకనీయండి, మా పిల్లలకు కూడా అందరివలె అవకాశాలు ఇవ్వండి అని వారు కోరితే, ‘ చూద్దాం’ అనలేదు మండలి. ‘చేద్దాం’ అన్నారు – అంతే. వారిని నేరవృత్తి నుండి తప్పించడానికి ప్రత్యామ్నాయ జీవితోపార్జన కలిగించడానికి, వారికి సామాజిక గౌరవం లభింప జేయుటకు ఆయన పూనుకున్నారు. ఇప్పటి వరకూ ఒకసారి కాదు మూడు సార్లు కాలనీకి వచ్చారు.

తాను మొదటిసారి వచ్చిన నెల రోజులకే బనగానపల్లి బ్యాంకు దోపిడీ జరిగింది. స్టువర్టుపురం వారే చేశారని అందరూ అనుమాన పడుతున్న సమయంలో కూడా "దొంగలను సంస్కరించడమేమిటి...? పదిపుటాలు పెట్టినా పాత అలవాటు పోతుందా" అని అందరూ హేళన చేసున్నా, 'మానవునిలోని మంచితనాన్ని స్పందించ గలిగితే మార్పురాక తప్పదు' అనే దృఢ నిశ్చయంతో విమర్శను లెక్కచేయక ఆ కాలనీకి మళ్లీ వచ్చారాయన. దొంగల తల్లులు దొంగ సొత్తును, దొంగలైన తమ బిడ్డలను స్వచ్ఛందంగా పోలీసులకు అప్పగించారు. ఎన్ని కష్టాలున్నా ప్రభుత్వం శ్రద్ధ వహించగలదని వారికి హామీ ఇచ్చి, ముఖ్యమంత్రి రాకకు బాట వేశారు శ్రీ మండలివారు.

ప్రజాస్వామ్య సమాజంలో సామాజిక సమస్యల పరిష్కారం కేవలం ప్రభుత్వం గానీ, కేవలం సంఘసంస్కర్తలుగానీ చేయలేరు. ప్రభుత్వానికీ, సంఘసంస్కర్తలకూ మధ్య సమాన హోదాలో సహకారం ఉండాలి. అప్పుడే ప్రభుత్వం చేసే ఆర్థిక పునరావాసానికి సంఘసంస్కర్తలు తీసుకువచ్చే సాంస్కృతిక పునరావాసం తోడై నూతనత్వం స్థిరపడుతుంది. మా నాన్నగారు ఈ విషయాన్ని పదే పదే ప్రకటిస్తూ వచ్చారు. త్యాగమూ, నిరాడంబరత్వమూ సమాజ సేవకు మూలస్తంభాలు. ఇవి మండలి వారిలో స్పష్టంగా కనిపిస్తాయి. రాత్రి పూట ఆర్టీసీ బస్సుల్లోనే ప్రయాణం చేసేవారు. "గౌరవం అందరిదీ ప్రత్యేకంగా తనది మాత్రమే కాదు'' అంటూ దండలు నిరాకరించేవారు. గౌరవం అందరిదీ కనుకనే ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో స్టువార్టుపురం నుంచి ఆరుగురు స్త్రీ పురుషులను పిలిపించి వారిలో ప్రస్ఫుటమైన సంస్కరణను సత్కరించారు. స్టువార్టుపురం పేరును 'గాంధీపురం'గా మార్చాలని సూచన చేశారు"అంటూ మా నాన్నగారి గురించి శ్రీమతి హేమలతా లవణంగారు వ్రాశారు.

గాంధీక్షేత్రం మాసపత్రిక కోసం నేను లవణంగారితో జరిపిన ముఖాముఖి సందర్భంలో "గాంధీమార్గం ఈ సమాజానికి ఎంతవరకూ అనుసరణీయం" అని వారిని నేను ప్రశ్నించాను. దానికి ఆయన చాలా ఓపికగా ఇలా సమాధానం ఇచ్చారు:

"గాంధీ ప్రభావం సమాజం మీద ఎప్పుడూ ఉంటుంది. అటువంటి గాంధీని అర్థం చేసుకోవలసిన అవసరం చాలా ఉంది. గాంధీజీ ఒకప్పుడు అస్పృశ్యత నిర్మూలనకి హరిజన దేవాలయ ప్రవేశం చాలన్నాడు. తరువాత హరిజనులు, హరిజనేతరులు కలిసి మెలసి భోజనాలే కాదు, వివాహాలు చేసుకుంటేనే తప్ప అస్పృశ్యత పోదు.

అస్పృశ్యత నిర్మూలనకు చెందిన వివాహాల్ని మాత్రమే తన ఆశ్రమంలో చేయిస్తానని ప్రతిజ్ఞ కూడా తీసుకున్నారు. గాంధీ గారిని తగినంతగా మనం అర్థం చేసుకోలేదు-

ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించడానికి మనం ఒక్కసారిగా యాంత్రిక నాగరికతను వెనక్కి నెట్టివేయలేము. యంత్రాలు ఉన్నప్పటికీ కూడా ఆర్థికంగా స్వయం పోషకత్వం సాధించుకోవాలి.

దేశీయులు స్థానికంగా పంటలు పండించుకుంటూనే, అక్కడే పత్తి పండించుకొని దాన్ని వడికి, నేసి కట్టుకునేట్లయితే వస్త్రంలో స్వయంపోషకత్వం వస్తుంది, ఆహారంలో స్వయంపోషకత్వం వస్తుంది, గృహ నిర్మాణంలో స్వయం పోషకత్వం వస్తుంది. తిండి, బట్ట, ఇళ్ళూ ఎక్కడికక్కడ స్థానికం అయిపోయాక మిగిలిన వాటికి పెద్ద పెద్ద యంత్రాలు పెట్టుకున్నా మానవ వనరులకు ఇబ్బంది ఉండదు. తిండి, బట్ట, ఇంటిని వ్యాపారంలో భాగం చేయకూడదు. ఆ వ్యాపారం కొంత మందికి గుత్త కాకూడదు- అనేది గాంధీ ఆర్థిక వ్యవస్థలో ప్రధానమైన సిద్ధాంతం. ఎప్పుడైతే ఈ ఆర్థిక స్వయం పోషణ వస్తుందో అపుడు ఆర్థిక రంగ వలసలు తగ్గిపోతాయి. అందుకని గాంధీ సిద్ధాంతాలు విశ్వశాంతికి దోహదపడుతాయని విశ్వసిస్తున్నారు. వీటి రిలవెన్స్ ఎప్పుడూ ఉంటుంది. మనం ఆనాటి సమాజ వ్యవస్థను దాటి ఇప్పుడున్న వ్యవస్థకు అనుకూలంగా గాంధీజీ చెప్పిన విషయాలు అన్వయించుకోవలసిన అవసరం ఉంది.

గాంధీ గారు కొల్లాయ కట్టుకున్నారు గనుక ఇప్పుడు కూడా నేను కూడా కొల్లాయ గుడ్డ కట్టుకుంటాను. గాంధీగారు మేకపాలు తాగారు కనుక నేను కూడా తాగుతాను అనేటు వంటి భావన పనికి రాదు. అది ఫిజికల్ అప్పిరియన్స్‌ను దాటి గాంధీ చెప్పిన విషయాలతో గాంధీని అనుసరించడము కాదు. గాంధీని అన్వయించు కోవాలి. అందుకు ఇప్పుడున్న సమాజ వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ, రాజకీయ వ్యవస్థ, టెక్నికల్ సొసైటీ ఇవి దాదాపు 50, 60 పాళ్లు ఉంటారు. మిగతా 40, 50 పాళ్లు గాంధీని తెచ్చి కలుపుకుంటాము. అలా అన్వయించుకున్నప్పుడు గాంధీ తప్పక ఉపయోగపడతాడని అనుకుంటాను.

"హేమలత గారితో మీ వివాహం ప్రేమ వివాహమా? పెద్దలు కుదిర్చిన వివాహమా?"అని గాంధీక్షేత్రం పత్రికకు ఇంటర్వ్యూ సందర్భంగా వారిని నేను ప్రశ్నించాను. దానికి వారి సమాధానం వారి మాటల్లోనే...:

"అసలు హేమలతని పెళ్లి చేసుకునే ముందు ఎప్పుడూ చూడలేదు. మేము జోక్ గా అంటూ ఉంటాము. గోరాగారు – జాషువాగారు ప్రేమించుకున్నారు. అందుచేత మేమిద్దరమూ పెళ్లి చేసుకున్నాము అని. జాషువాగారు గోరాగారు ఒక సభలో కలుసుకున్నారు. అంతకుముందు వారిద్దరూ ఒకరినొకరు బాగా తెలుసు. వారిద్దరి భావాలు చాలా సన్నిహితమైనాయి. అప్పుడు నాకు 21 ఏళ్ళుండేవి. హేమలతకు 17 ఏళ్ళుండేవి. అందుచేత పెండ్లీడు వచ్చిన అబ్బాయి మీకున్నాడు. అమ్మాయి నాకుంది. మనమెందుకు వియ్యమందకూడదని అనుకున్నారు. అయితే నాకు కనీసం 26 ఏళ్ళు వచ్చే వరకు వివాహం చేసుకోగూడదని నిర్ణయంలో ఉండేవాడిని. 1951 లో వివాహ ప్రసక్తి వచ్చినా నాకు 26 ఏళ్ళు వచ్చేవరకు వివాహం గురించి నేను ఆలోచించను అని అన్నాను గానీ నేను హేమలతను చేసుకోను అని మాత్రం అనలేదు. ఈలోగా తన కుమార్తెను జాషువాగారు చదివిస్తూ వచ్చారు. నేను వినోబాగారి వద్దకు భూదానోద్యమంలోకి వెళ్ళిపోయాను. 1959 లో మళ్ళీ గోరాగారు జాషువాగారు కలిసినప్పుడు "లవణంకి ఇంకా వివాహం కాలేదు కదా! మనం ఎందుకు ఆలోచించకూడదు?" అన్నారు. 1960 జనవరిలో మా వివాహం సేవాగ్రాం ఆశ్రమంలో జరిగింది. వివాహం నిశ్చయమైనప్పుడే మేం ఒకరినొకరు చూసుకున్నాం. అందుచేత నిశ్చయం చేసిన పెళ్లేగానీ, ప్రేమ వివాహం కాదు." అన్నారాయన.

సమాజాన్ని మనం చూడవలసిన దృష్టి కోణం మీద లవణంగారు దంపతులకు తమవైన నిర్దిష్ట ఆలోచనలున్నాయి. "సమాజంలో ఉన్న దురాచారాలన్నీ ఒకే ఒక భావానికి చెందినవి. ఇందులో ఉండే చెడులన్నీ మనిషికి మనిషికి మధ్య దూరాల్ని బట్టి వస్తున్నాయి. మనుషులు ఒకరికొకరు దూరం చేసుకుంటున్నారు. ఒకరు దొంగ అని దూరం చేశారు. ఒక అమ్మాయి వేశ్య అని దూరం చేశారు. ఒకరిని అస్పృశ్యుడని దూరం చేశారు. ఈ విధంగా మనం తేడాలు చాలా తెచ్చిపెట్టుకొని దూరం చేస్తున్నాము. ఎప్పుడైతే మనం అలా దూరం చేయకుండా అందరము ఒకటే అని చెప్పి ఉంటామో, అప్పుడు దొంగని కూడా గౌరవించి, ప్రేమించి మన మధ్యకు తీసుకుంటే దొంగతనం చేయలేడు.

ఏ మనిషైనా పదిమంది మధ్య ఉంటే సంఘ వ్యతిరేక ప్రవర్తన చేయలేడు. కనుక మనం దొంగల సంస్కరణ చేసేప్పుడు దొంగలకు మేమేమి చెబుతున్నాము. నీవు దొంగతనం చేస్తుంటే నీ పిల్లలు కూడా నిన్ను అసహ్యంగా చూస్తున్నారు. నీవు ఎక్కడకు వెళ్ళినా నీకు గౌరవం లేకుండా ఉంది. కనుక నీకు గౌరవం కావాలంటే

నీవు దొంగతనం మానేసి సమాజంలో సమభాగుడవు కావాలి. అలాగే వేశ్య వృత్తి ఉంది. నేనేమో ఒక వేశ్యకు ఒక యువకుడికి వివాహం చేశాను. అప్పుడు ఆ అమ్మాయికి అదే చెప్పాను. నీవు గౌరవంగా బ్రతకాలంటే పాత జీవితాన్ని నీవు పూర్తిగా మరచి పోవాలి. నేను గృహిణిని అని చెప్పేసి నూటికి నూరు వాళ్లు గృహిణిగా ప్రవర్తించాలి. కనుక సమాజంలో అందరూ కలిసిపోయే వాతావరణం ఎక్కడ ఏర్పాటు చేస్తామో దానిని 'సంఘదృష్టి' అని అంటాము. ఈ సంఘదృష్టి పెంపొందించడమే సంఘ సంస్కరణ కార్యక్రమం.

మనం అందరం ఒకటే! మనలో ఏవైనా తప్పులుంటే ఒకరికొకరు నచ్చచెప్పు కోవడం ద్వారా మనం తప్పులు మార్చుకో గలుగుతాం. కులతత్వం అనేది ఒక లోపం. దానిని మార్చుకోగలుగుతాం. మతమౌఢ్యం అనేది ఒక లోపం. దాన్ని మార్చుకోగలుగుతాం. అలాగే దొంగతనం చేయడమనేది దానికి ఆర్థిక కారణాలేమైనప్పటికి అది సమాజంలో ఒక లోపం. దానిని మార్చుకో గలుగుతాం. ఈ సాంఘిక రుగ్మతలు ఈ సాంఘిక చెడుగులు వీటినన్నిటిని జబ్బుగా భావిస్తే, దానికి మందు ఏమిటంటే సంఘ దృష్టి ఆచరణలో చూసినప్పుడు సంఘదృష్టి సంఘ సంస్కరణోద్యమంగా మారుతుంది" అన్నారాయన.

శ్రీమతి హేమలతగారు ఆ భర్తకు తగిన భార్య. ఆయనతో సమాన ప్రసిద్ధిని పొందిన సంఘసేవకి. మహాకవి జాషువా ముద్దుబిడ్డ ఆమె. చిన్ననాడు క్రైస్తవభక్తిలో పెరిగినా, నాస్తికులైన అత్తవారింట ఆమె అచిరకాలంలోనే సామాజిక చైతన్యాన్ని సంతరించుకో గలిగారు. తండ్రి జాషువా, మామ 'గోరా'గా ప్రసిద్ధులైన సామాజిక తత్త్వవేత్త, గోపరాజు రామచంద్రరావు గారు, భర్త లవణంగారు ఈ ముగ్గురు స్ఫూర్తిదాయకులైన తెలుగుప్రముఖుల సాహచర్యంలో హేమలతగారు పెంపొందించు కున్న వ్యక్తిత్వం తెలుగు సమాజానికి, స్త్రీ చైతన్యానికి, ఎంతగానో తోడ్పడింది.

అస్పృశ్యత కూడా మూఢనమ్మకమే నంటారు హేమలతా లవణం గారు. కులభేదం, మతభేదం, అంధవిశ్వాసాలు ఈ మూడూ సామాజిక జీవన వ్యవస్థని ఛిద్రం చేస్తున్నాయని ఆమె ఆవేదన చెందేవారు. ఇవి కేవలం మనుషులమధ్య మాత్రమే కాదు, ఈ విభేదాలు అడ్డుగోడలై నీరు, పండుగలు, ఆహారం సమస్త ప్రకృతి సంపదకూ విస్తరించాయని బాధపడే వారామె.

వినోబా భావే గారితో కలిసి లవణం గారు, హేమలతా లవణం గారు చంబల్ లోయలో దొంగలను సంస్కరించే కార్యక్రమంలో పాల్గొన్నారు. ఆ అనుభవంతో ఆమె

స్టువార్టుపురం నేరస్థులను సంస్కరించే కార్యక్రమాన్ని1974లో ఆమె ప్రారంభించారు. అలాగే నిజామాబాద్ జిల్లాలో జోగినీ దురాచారం రూపుమాపేందుకు, ఆ వ్యవస్థను పెంచిపోషిస్తున్న వాళ్ళని సంస్కరించటానికి ఆమె నిర్వహించిన పాత్ర చిరస్మరణీయ మైనది. సమాజంలో మార్పు కోసం ఆమె నిరంతరం పరితపించారు.

2015 ఆగస్టు 15న శ్రీ లవణం మరణించారు. ఆయన చివరిదశలో విజయవాడలోని హృద్రోగ ఆసుపత్రిలో ఉండగా చూడటానికి వెళ్ళితే సమాజానికి ఇంకా ఏదో చేయాలనే తపనతో మనం కలిసి చేయవలసిన కార్యక్రమాలెన్నో ఉన్నాయంటూ చెప్పుకొచ్చారు. అప్పటికే డాక్టర్లు వారు ఎక్కువకాలం బ్రతికే పరిస్థితి లేదని నాతో చెప్పారు.

"మీరు హాస్పటల్ నుంచి ఇంటికి వచ్చిన తరువాత మనం కూర్చొని చర్చించి కార్యాచరణ గురించి ఆలోచిద్దాం" అని వారి వాక్ప్రవాహాన్ని ఆపవలసి వచ్చింది. ప్రాణాలు పోయే స్థితిలో కూడా తన శరీరస్థితి గురించి కాకుండా సమాజస్థితి గతులపైనే నిరంతరం పరితపించే మహోన్నత సేవామూర్తులు లవణంగారు.

"ఇవి నీతీ నిజాయితీ రోజులు, ఇవి న్యాయానికి, ధర్మానికి రోజులు అని ఎలుగెత్తి చాటితే అవినీతి, అన్యాయం, అక్రమం, అధర్మం పలాయన మవుతాయి. ఈ పనికి యువతరం పూనుకోదా? పూనుకుంటుందనే మా ఆశ, మా విశ్వాసం" అనేది ఆ దంపతుల ఆలోచన. కీర్తిశేషులైన ఆ దంపతుల కలలు ఫలించాలని కోరుకుందాం!



శ్రీమతి హేమలతా లవణం, శ్రీ మండలి దంపతులు





తుపాను బాధితులతో శ్రీ మండలి వెంకటకృష్ణారావు. శ్రీ లవణం



# శ్రీ ముక్కామల నాగభూషణం

1977 ఉప్పెన తుపానులో విశేష సేవలందించిన సేవామూర్తులలో శ్రీ ముక్కామల నాగభూషణం గారు ఒకరు. ఈలచెట్లదిబ్బ, నాచుగుంట దీవుల్లో సైక్లోను షెల్టర్లు కట్టడానికి టాటా రిలీఫ్ కమిటీ ముందుకు వచ్చింది. అయితే నిర్మాణ సామాగ్రి మొత్తాన్నీ కృష్ణానదిలో పడవల మీద తీసుకు వెళ్ళాల్సిన పరిస్థితులు ఉండటంతో వారు వెనక్కి తగ్గారు. ఆ సమయంలో శ్రీ ముక్కామల నాగభూషణం గారు ముందుకు వచ్చి కెనడియన్ బాప్టిస్టు మిషన్ వారి సహాయంతో ఎన్నో వ్యయప్రయాసలకు లోనై షెల్టర్ల నిర్మాణం పూర్తి చేశారు.

ఆ సమయంలో అక్కడి ప్రజలు త్రాగునీటికి కటకటలాడటాన్ని, సాగు నీరు లేని పరిస్థితుల్ని గమనించి నాగభూషణం గారు చలించిపోయారు. నిజానికి చుట్టూ జలాలే! కానీ తాగేందుకు గుక్కెడు నీళ్లు లేని స్థితి. ఇసుక చలమల్లోంచి మురికి నీటిని పట్టుకుని తేర్చుకొని దాహార్తి తీర్చుకుంటూన్నారు.

నిజానికి దివి మెయిన్ ఐలాండులో కృష్ణానదిలోని పల్లపు వాగులతో అక్కడక్కడ సాగుచేస్తుండేవారు. ఎక్కువగా మెట్టపైరులు వేస్తుండేవారు. తరువాత కృష్ణానది రెండు పాయలుగా చీలిన చోట పులిగడ్డ వద్ద కాటన్ సలహాతో పంపింగు స్కీమ్ పెట్టి, దివి మెయిన్ ఛానల్ కు అవనిగడ్డ వద్ద లాకులు నిర్మించారు. అక్కడి నుండి అవనిగడ్డ ఈస్టు, సౌత్ చానల్స్ తవ్వారు ఈ కాలువల వలన 50 వేల యకరాలు సాగుబడిలోకి వచ్చాయి.

పులిగడ్డ పంపింగ్ స్కీము వద్ద సముద్రపు ఆటుపోటులకి నదీ జలం ఉప్పగా మారిపోతుండటంతో, కాంప్ బెల్ చీఫ్ ఇంజనీర్ కృష్ణానదికి అడ్డంగా నది వెడల్పునా ఒక తొట్టిమాదిరి అక్విడక్టు కట్టి కాలువనీరు నదికి తగలకుండా నదిని దాటించారు. ఆ విధంగా దాన్ని కాంప్'బెల్ అక్విడక్టు అంటారు. దీనివలన 80 వేల యకరాలు సాగులోకి వచ్చాయి.

పులిగడ్డ నుండి హంసలదీవి, గుల్లలమోద దాకా ఏటి కట్టలు నిర్మించారు. పున్నమి అమావాశ్య పోటుల వలన ఉప్పునీరు ముంచుకురాకుండా సముద్రపు కట్ట నిర్మించాలనే డిమాండు ఎప్పటినుండో ఉంది. ఆంధ్రరాష్ట్రం వచ్చాక ప్రకాశం మంత్రివర్గంలో ఉపముఖ్యమంత్రిగా ఉన్న నీలం సంజీవరెడ్డిగారిని మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు కలిసి రెండు ఏటి కట్టలను కలుపుతూ సముద్రపు కట్టను వేయించవలసిందిగా కోరారు.

దీనికోసం సంజీవరెడ్డి గారు ఫ్లడ్ కంట్రోల్ స్కీము క్రింద ఆర్థిక సహాయం కోసం కేంద్రప్రభుత్వానికి వ్రాశారు. భారతదేశానికి చుట్టూ సముద్రం ఉంది తీర రాష్ట్రాలన్నీ సముద్రానికి కట్ట వెయ్యమని అడుగుతాయి. కాబట్టి సాధ్యం కాదని కేంద్రం తేల్చి చెప్పింది.

2-9-56న సంజీవరెడ్డిగారు నాన్నగారి ఆహ్వానం మీద గులమోద వచ్చి అక్కడ చక్కగా పండుతున్న పైర్లను చూశారు. ఈ పంటని రక్షించుకోవలసిన బాధ్యత ఉన్నదని నాన్నగారు ఆయనకు నచ్చచెప్పారు. ఆ సమయంలోనే గుల్లలమోదనుండి లాంచీలో నదిమీద వెడుతూ దారిలో ఎదురుమండి ద్వీపాన్ని చూశారు. అక్కడ ప్రజలకు త్రాగునీరు లేనిసంగతి ఆయన కళ్ళారా చూశారు.

1957లో పార్లమెంటు సభ్యుడయిన తరువాత మా నాన్నగారు ఎదురుమొండి వెళ్ళారు. అక్కడ దొరికే ఎలికూర, ఉరవడి కాయల్ని తిని చూశారట. కటిక చేదుగా ఉంటాయవి. అక్కడి ప్రజలు వాటినే 4-5 సార్లు ఉడికించి చప్పన చేసుకుని తింటారట. అది అనారోగ్యం కూడా! నాన్నగారికి చాల బాధ అనిపించింది. ఈ విషయాలన్నీ ఆయన జూలై 1990 గాంధీక్షేత్రం పత్రికలో ఒక వ్యాసంలో వ్రాశారు.

కె.యల్.రావుగారు కూడా వచ్చి చూశారు. ఎట్టకేలకు కృష్ణా కెనాలునీటిని నదీగర్భంలో పైపులద్వారా తీసుకుని రావాలని ఆయన సూచించారు. పంపింగ్ స్కీము పూర్తి కాగానే, నీటిపారుదల శాఖామాత్యులు శ్రీ శీలం సిద్ధారెడ్డి ఆ స్కీముకు

ప్రారంభోత్సవం చేశారు. అందుకోసం పంపింగ్ స్కీము దగ్గర ఒక రిజర్వాయరు కూడా ఏర్పాటుచేశారు. కానీ, ఎగువరాష్ట్రాల్లో ఆనకట్టల నిర్మాణాలవలన దిగువన దివిసీమకు నీరు తగినంత రావటం తగ్గిపోయింది. రిజర్వాయర్లోకి నీరు రావటం లేదు. పడ్డ శ్రమకు తగ్గ ఫలితం దక్కని పరిస్థితి.

1977 ఉప్పెన అనంతరం, పునర్నిర్మాణ కార్యక్రమంలో భాగంగా తుఫాన్ షెల్టర్ల నిర్మాణంలో మునిగి ఉన్న ముక్కామల నాగభూషణం గారు ప్రత్యేకించి ఎలిచెట్లదిబ్బ ఎదురుమండి ప్రజలకు మంచినీటి సరఫరాకోసం ఏదైనా చేయాలని సంకల్పించారు.

ఇందుకు మరో పూర్వరంగం ఉంది. ఎలిచెట్ల దిబ్బ, నాచుకుంట ప్రాంతాల్లో తుఫాను షెల్టర్లను కట్టడం సాధ్యం కాదని టాటీరిలీఫ్ కమిటీ చెప్పడంతో ఆ నిర్మాణ బాధ్యతను నాగభూషణం గారికి అప్పగించారు. కెనడియన్ బాప్టిస్టు మిషను వారిద్వారా అనేక శ్రమలకోర్చి నాగభూషణం గారు వాటిని నిర్మించారు. నిర్మాణ సమయంలో మంచినీళ్ళను 10-15 మైళ్లనుండి తెచ్చుకోవలసి వచ్చింది. ఇక్కడి ప్రజలకు గుక్కెడు మంచినీళ్ళు ఇచ్చే సేవ ఏదైనా చేయాలనే ఆలోచన్ని ఆ విధంగా నాగభూషణం గారికి బలంగా కలిగింది.

పూర్వపు కృష్ణా వెస్ట్‌బ్యాంక్ కాలవ లోంచి ఎత్తిపోతలపథకం నుండి ఒక కిలోమీటర్ పొడవునా నదీగర్భంలో పైపులైన్ వేసి, వాటిద్వారా ఆ దీవులకు త్రాగునీటిని అందించాలనే సంకల్పానికి మళ్ళీ ఊపిరి పోశారు. తన పథకం వివరాల్ని కెనెడియన్ బాప్టిస్ట్ మిషన్ ప్రతినిధి రెవరెండ్ రోజర్ కాన్ గారితో ఆయన సంప్రదించారు. ఎత్తిపోతల పథకాన్ని ప్రభుత్వం చేపడితే, నదీగర్భంలో పైప్ లైన్ వేసి నీటిని అందించేందుకు ఆర్థిక సాయాన్ని చేయటానికి కాన్ గారు అంగీకరించారు.

ఫిల్ కంపెనీలో ఆయనకు తెలిసిన ఇద్దరి ఇంజనీర్లను రెండు దీవులకూ తీసుకొచ్చారు. అక్విడక్టు లేకుండానే హై డెన్సిటీ పాలీ ఎథిలీన్ పైపులద్వారా నీటిని సరఫరా చేయవచ్చని వాళ్లు సూచించారు. 90 క్యూసెక్కుల నీటిని సరఫరా చేయాలంటే 630 మి.మీ వారంగల పైపులతో కిలోమీటర్ల పొడవునా మూడు లైన్లు వేయాలని, నదీగర్భంలో రెండు మీటర్ల లోతున పూడ్చుకుంటూ పైపులైన్లు నడపాలని వాళ్లు సూచించారు. నిజానికి, ఇంత కైవారం ఉన్న పైపులు భారతదేశంలో అప్పటికి తయారు కావటం లేదు. వాటిని తయారు చేయించగలిగితే దేశంలోనే ఇది మొదటి ప్రాజెక్టు అవుతుందని వాళ్లు చెప్పారు.

విజయవాడ ఇరిగేషన్ సర్కిల్ సూపరెంటిండింగ్ ఇంజనీర్ శ్రీ వై.సి.పి. చౌదరి, మేజర్ ఇరిగేషన్ చీఫ్ ఇంజనీర్ శ్రీచారు రాజారావుగార్లను కలిసి ఈ విషయాలు వివరించారు నాగభూషణం గారు.

వారి సహకారంతో ఆనాటి ముఖ్యమంత్రి అంజయ్యగారిని కలిసేందుకు మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు అన్ని ఏర్పాట్లు చేశారు. నాన్నగారు గట్టిగా పట్టుబట్టడంతో, ఈ ఎత్తిపోతల పథకానికి ఫుల్ ఎయిడ్ ప్రాజెక్టుగా ప్రభుత్వం ప్రకటించింది. కానీ పని జరగలేదు. దానిమీద కెనడాలో ఉన్న రెవరెండ్ రోజర్‌కాన్ గారిని సంప్రదించి, పరిస్థితి వివరించారు నాగభూషణం గారు.

'రోజర్ కాన్' గారు పెద్దమనసుతో పంపుహౌసుల నిర్మాణానికి, పంపుసెట్లు కొనటానికి, పైపులైన్లు వేయటానికి, అయ్యే ఖర్చునంతా తాను భరిస్తానని, ప్రభుత్వం వారు ప్రాజెక్ట్ స్థలాన్ని ఇవ్వటం, ఆ ప్రాజెక్టు దాకా రోడ్లు వేయటం, విద్యుత్ లైన్లు ప్రాజెక్టు దాకా పొడిగించటం చేస్తే చాలని అన్నారు. 'వెస్ట్‌బ్యాంకు' కాలువ లోతును కూడా పెంచవలసి వస్తుందని రోజర్ కాన్ పేర్కొన్నారు. ఈ విషయాలన్నింటినీ జిల్లా కలెక్టర్ ద్వారా ప్రభుత్వానికి తెలియజేశారు. ప్రభుత్వం స్పందించలేదు. అవునని గానీ, కాదనిగానీ చెప్పలేదు. కానీ ఈలోగా తొలివిడత కెనడా నిధులు వచ్చేశాయి. నాగభూషణం గారు ఆ నిధుల్ని జిల్లా కలెక్టరుగారికి అందజేశారు. ఎత్తిపోతల పని మొదలుపెట్టిన దగ్గర్నించీ అన్నీ అవాంతరాలతో పనులు నత్తనడక సాగాయి.

1982, మే నెలలో ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ గారు ప్రాజెక్టు శంకుస్థాపన చేశారు. కానీ డిజైన్ల శాఖవారు, ఇంకా ఇతర శాఖల వాళ్ల అభ్యంతరాల మధ్య పని సాగని పరిస్థితి. నదీ గర్భంలో భూమి లోపల 6 మీటర్ల లోతున పైపు లైన్ నడపాలనేది వారి ఆదేశం. కాంట్రాక్ట్ కంపెనీ అదనంగా 3 కోట్లు అడిగింది. పనులు ఆగిపోయాయి.

ఈ లోగా యన్.టి. రామారావుగారు అధికారంలోకి వచ్చారు. మా నాన్నగారు నాగభూషణంగారిని, రోజర్ కాన్ గారిని తీసుకుని రామారావుగారిని కలిశారు. రామారావుగారు ప్రత్యేక శ్రద్ధ కనబరచటంతో చివరికి ఇరిగేషన్ శాఖ ప్రిన్సిపల్ కార్యదర్శి ప్రసాద్ గారు ఒక జీవో ద్వారా ఆ సమస్యను పరిష్కరించటానికి ప్రయత్నించారు. పైపులైన్ల మన్నికకు ఎక్సోటిక్ కంపెనీ వారు ఐదేళ్ల బ్యాంకు గ్యారంటీని గనక ఇచ్చినట్లైతే రెండు మీటర్ల లోతులో భూమిలోంచి పైపులైన్లను నడిపేందుకు

అనుమతి ఇచ్చిన జీవో అది! అయితే, ఎక్సోటిక్ కంపెనీ అంగీకరించకపోవటంతో వారి కాంట్రాక్టుని రద్దు చేసి, ఫిల్ కంపెనీకి ఇచ్చారు. చివరికి 1990 జూన్ 25న ఎదురుమండి ఎలిచెట్లదిబ్బఎత్తిపోతల పథకాన్ని నాటి ఉప ప్రధాని శ్రీ దేవీలాల్ వచ్చి ప్రారంభించారు.

రేపల్లె నుండి మృత్యుంజయపాలెం దాకా పైపులైన్ వేసి, ఒక సబ్ స్టేషన్ ఏర్పాటు చేసి, పంపింగ్ స్కీముకు విద్యుత్తు అందించటంలో కేంద్ర రూరల్ ఎలక్ట్రికనఫికేషన్ పూర్వాధ్యక్షులు యం వెంకటరత్నం గారి కృషి ఎన్నదగినది.

దేశానికి స్వాతంత్ర్యం కోసం నాగభూషణంగారు పోరాడారు. విద్యావ్యాప్తి కోసం, పేదప్రజల అభివృద్ధి కోసం అనేక కార్యక్రమాలు చేపట్టి జయప్రదంగా పూర్తిచేశారు. వెనకబడిన ప్రాంతాల పునర్నిర్మాణానికి పూనుకున్నారు. క్రీడల అభివృద్ధికీ, సాహితీ సాంస్కృతిక రంగాల అభివృద్ధికీ విశేషంగా కృషి చేశారు. గేయాలు వ్రాశారు. పరిశోధనాత్మక గ్రంథాలు వ్రాశారు. మరుగునపడిన జానపద కళలను వెలుగులోకి తెచ్చారు. ఒకటేమిటి బహుముఖీనమైన సేవలు చేశారు.

రెవరెండ్ రోజర్ కాన్ గారి కోరికమీద విజయవాడ గుణదల వై.యం.సి.ఎ. ప్రాంగణంలో తన తండ్రి వెంకటప్పయ్య పేరుతో ఒక హాస్టలు భవనాన్ని, తల్లి మాణిక్యమ్మ పేరుతో ఒక ఆసుపత్రిని నిర్మించి ఇచ్చారు.

నాగభూషణంగారు సంపాదకులుగా 'ప్రగతి' సచిత్ర వారపత్రిక 1974 నుండి నడచిన గొప్ప సాహిత్య పత్రిక. అది మొదట 1969లో మద్దకూరి చంద్రశేఖరరావుగారు సంపాదకులుగా ప్రారంభమైంది. ఒడిదుడుకులున్న సమయంలో దాన్ని నడిపే బాధ్యత నాగభూషణంగారు తలకెత్తుకున్నారు. నేను ఇంటర్మీడియట్ చదివే ఆ రోజుల్లో ప్రగతి తప్పకుండా చదివేవాణ్ణి.

దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్లు', వాసిరెడ్డి సీతాదేవి 'వైతరణి', లత వ్రాసిన 'నరకానికి నిచ్చెన' లాంటి ప్రసిద్ధ నవలలు ఈ పత్రికలోనే వచ్చాయి. ముద్దుకృష్ణ, పెద్దిభట్ల సుబ్బరామయ్య, సింగరాజు, లింగమూర్తి, దాశరథి, కె.వి. రమణారెడ్డి, కొడవటిగంటి కుటుంబరావు, శెట్టి ఈశ్వరరావు, వేగుంట మోహన ప్రసాద్, ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, గుంటూరు శేషేంద్రశర్మ లాంటి ప్రసిద్ధుల రచనలు ఇందులో వచ్చేవి. అభ్యుదయ భావాలకు అద్దం పట్టే పత్రికగా దాన్ని నాగభూషణంగారు నడిపించారు. ఆ రకంగా ఆయన పేరుతో నాకు పరిచయం ఏర్పడింది.

ఆ తరువాత మా నాన్నగారు కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారు సాంఘిక సంక్షేమ శాఖామాత్యులుగా ఉన్న రోజుల్లో సాంఘిక సంస్కరణల సదస్సు నిర్వహించారు. ఆ సదస్సులో మొదటిసారిగా నాగభూషణం గారిని ప్రత్యక్షంగా చూశాను.

1977 ఉప్పెనలో తల్లిదండ్రుల్ని కోల్పోయి ఎందరో పిల్లలు అనాధలయ్యారు. అలాంటి పిల్లల్ని తెచ్చి మా నాన్నగారు గాంధీక్షేత్రంలో ఒక అనాధ శరణాలయం ఏర్పరచారు. దాన్ని నడపటం కోసం ప్రత్యేకంగా దివిసీమ 'దీన జన సంక్షేమ సమితి' అనే సంస్థను ఏర్పరచారు. ఆ సంస్థకు శ్రీ నాగభూషణంగారు అధ్యక్షులుగాను, నేను కార్యదర్శిగా వ్యవహరించాను. ఆ విధంగా నాగభూషణంగారితో కలిసి పనిచేసే అవకాశం తొలిసారిగా నాకు దక్కింది. ఆ పిల్లల ఆలనాపాలనా బాధ్యత నేను చూస్తే, నిధుల సమీకరణ బాధ్యత నాగభూషణంగారు వహించారు. నేను వారిని 'తాత'గారని పిలిచేవాణ్ణి. మా అమ్మగారిని 'అమ్మాయీ' అని పిలిచేవారు. మా నాన్నగారు వారిని 'మామగారు' అని పిలిచేవారు. వారు మరణించే వరకు మా ఇద్దరిదీ తాతా మనవళ్లు సంబంధంగానే కొనసాగింది.

నాగభూషణంగారు గొప్ప విజ్ఞాన నిధి. 1910లో కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా బుద్ధవరం గ్రామంలో జన్మించారు. మధ్య తరగతి రైతు కుటుంబం వారిది. చిన్ననాడే వేదాధ్యయనం చేశారు. జ్యోతిషశాస్త్రంలో ప్రావీణ్యం ఉండేది. 'అయన చలనా'లను అవలీలగా లెక్క కట్టగలిగే వారు. చిన్ననాటి నుండి అభ్యుదయ భావాలు, జాతీయవాదము పుణికి పుచ్చుకున్న వ్యక్తి. తన 12వ ఏట 1921 బెజవాడ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో వాలంటీరుగా పనిచేశారు. స్వాతంత్ర్య పోరాటలన్నింటా పాల్గొన్నారు. జైలు కెళ్లారు. అస్పృశ్యతా నివారణ, హరిజన సేవా కార్యక్రమాలు చేపట్టారు. కమ్యూనిష్టు పార్టీతో అనుబంధం ఉండి రహస్య జీవితం గడిపారు కూడా! 1943లో పురుడుపోసుకున్న 'ప్రజానాట్య మండలి' సంస్థ వ్యవస్థాపకుల్లో వారు కూడా ఒకరు. పేట్రియట్ పత్రికను కొంతకాలం నడిపారు. ఆంధ్రా క్రికెట్ అసోసియేషన్ అధ్యక్షులుగా కూడా వ్యవహరించారు.

ఒకసారి ఆకాశవాణి విజయవాడ వారు మా అనాధ ఆశ్రమంలోని పిల్లలతో రేడియో కదంబ కార్యక్రమం ఒకటి చేయిస్తే బావుంటుందని అడిగారు. నేను విజయవాడ నాగభూషణంగారి ఇంటికి వచ్చి ఈ విషయం చెప్పాను. ఆరుబయట కుర్చీలు వేసుకొని ఇద్దరం కూర్చున్నాం. ఆయన ఆశువుగా ఒక సంగీత రూపకాన్ని

చెప్పటం ప్రారంభించారు. చక్కని పాటలు కూడా అందులో ఉన్నాయి. ఆయన చెపుతుంటే నేను వ్రాయసాగాను. వేగంగా ఆయన చెబుతుంటే నాకు వ్రాయటం చాలా కష్టమయింది. జానపద బాణీలతో శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించే విధంగా రూపొందింది. ఆ రూపకం ఆకాశవాణిలో బహుళ జనాదరణ పొందింది. అనేకమార్లు పునఃప్రసారం అయింది కూడా!

ఆకాశవాణిలో వ్యవసాయ కార్యక్రమాలు పర్యవేక్షించే అధికారి శ్రీ హనుమంతరావుగారు నాగభూషణంగారితో రెండు సంగీత రూపకాలు వ్రాయించారు. వాటిలో ఒకటి దివిసీమ నేపథ్యంలో వ్రాశారు. ఈ రెండు రూపకాలకు ఆకాశవాణి జాతీయ, అంతర్జాతీయ బహుమతులు లభించాయి. ప్రతిష్ఠాత్మకమైన రూపకాలుగా విజయవాడ కేంద్రానికి పేరు తెచ్చిపెట్టాయి. ఉప్పెన తాడి చెట్టంత ఎత్తున వస్తే, దానికి రెట్టింపు ఎత్తున మానవత్వం ఉప్పొంగుతుందనే భావనతో మా నాన్నగారు మానవత్వానికి ప్రతిరూపాలైన బుద్ధుడు, క్రీస్తు, గాంధీ మహాత్ముల విగ్రహాలను అవనిగడ్డలో నెలకొల్పారు. నా కోరికపై ఆ విగ్రహాల మీద అద్భుతమైన పాట వ్రాశారాయన.

అరుగో! అరుగో! అరుగరుగో
గౌతమ బుద్ధుడు, జీసస్ క్రీస్తు,
గాంధీ మహాత్ముడు అరుగరుగో ॥
ప్రశాంత వదనులు పరమపావనులు
విశాలహృదయులు వినిర్మలాత్ములు
మానవసేవయే మాధవసేవని
మరి మరి జెప్పిన మహామనీషులు ॥అరుగో॥
సత్యమేవ జయతేయని శంఖం
ఎత్తినట్టి సత్యాగ్రహ మూర్తులు
సర్వం సత్యే ప్రతిష్ఠితంబని
సర్వలోకముల చాటిన జ్ఞానులు ॥అరుగో॥
పరమధర్మమీ అహింస మానవ
పురోభివృద్ధికి పరమ ప్రమాణం
పరమార్థంబిదె ప్రవరులు వినుడని

పలుమారు జెప్పిన పరమ ధార్మికులు ॥అరుగో॥
హింసహింసనే ప్రోత్సహించగా
హింసను మాపి అహింస హసించును
సంశయమేటికి హింసమానుడని
సంబోధించిన సంయమీంద్రులు ॥అరుగో॥
పొరుగువాని ప్రేమించిన త్యాగులు
పగవారిని ప్రేమించిన యోగులు
పతితులు గాచిన పావనమూర్తులు
పరమహంస లనబరగు త్రిమూర్తులు ॥అరుగో॥

1976లో మచిలీపట్టణంలో స్పందన సాహితీ సమాఖ్య ఆధ్వర్యంలో కృష్ణాజిల్లా రచయితల మహాసభలు జరిగాయి. ఆ సందర్భంగా వేసిన ప్రత్యేక సంచికను నేను చూడటం జరిగింది. ఆ స్ఫూర్తితో అవనిగడ్డలో కృష్ణాజిల్లా రచయితల మహాసభలు జరిపితే బావుంటుందని నాకు అనిపించి, బందరు సభల ప్రధాన కార్యదర్శి శ్రీ గుత్తికొండ సుబ్బారావు అప్పట్లో మచిలీపట్టణం ఎల్.ఐ.సి.లో పనిచేసేవారు. వారి ఆఫీసుకు వెళ్లి నా ఆలోచన చెప్పగానే ఆయన వెంటనే అంగీకరించారు. అప్పుడు ఈ విషయాన్ని తాతగారికి చెప్పాను. ఆయన తన ఇంట్లోనే ఒక సమావేశాన్ని ఏర్పరచి, జిల్లాలోని ముఖ్య సాహితీవేత్తలను ఆహ్వానించారు. 1982లో అవనిగడ్డ 5వ కృష్ణాజిల్లా రచయితల సభలకు రూపకల్పన చేశారు. ఆరుద్ర, దాశరథి లాంటి ప్రముఖులు ఆ సభలకు విచ్చేశారు.

మా నాన్నగారు దీనికొక వ్యవస్థని రూపొందించి, 'కృష్ణాజిల్లా రచయితల సంఘం' ఏర్పరచటం బావుంటుందని అన్నారు. మా నాన్నగారు గౌరవాధ్యక్షులుగా; నాగభూషణంగారు అధ్యక్షులుగా; గుత్తికొండ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా, డా.లత, డా.త్రిపురనేని వెంకటేశ్వరరావు ఉపాధ్యక్షులుగా; నేను, డా॥ జి.వి.పూర్ణచందు కార్యదర్శులుగా ఒక కార్యవర్గం ఏర్పడి రిజిస్టర్ చేయటం జరిగింది. అప్పటి నుండి కృష్ణాజిల్లా రచయితల సంఘం అనేక సదస్సులతో పాటు, నాలుగు ప్రపంచ రచయితల మహాసభలు నిర్వహించింది.

తాతగారి నేతృత్వం, పర్యవేక్షణలో 'అసుర నాగరికత', 'సప్త సింధు' లాంటి అనేక గ్రంథాలు ప్రచురించటం జరిగింది. నాగభూషణంగారి మరణం తరువాత

ప్రతిష్టంభన కొనసాగింది. 2004లో కృష్ణాజిల్లా రచయితల సంఘం మళ్ళీ కొత్త ఊపిరులు పోసుకొని, ఈ రోజున తెలుగు భాషోద్యమానికి వెన్నుదన్నుగా నిలబడింది. నాగభూషణంగారు వేసిన పునాదుల బలమే ఈ విజయానికి కారణం. నాగభూషణం గారి పేరుతో ప్రతి ఏడాది ఒక సీనియర్ పాత్రికేయుడికి 10,000 రూపాయల నగదు పురస్కారం ఇచ్చి గౌరవిస్తున్నారు.

నాగభూషణంగారిలో ఉద్యమకారుడు, సాహితీవేత్త, పత్రికా సంపాదకుడు, చరిత్ర పరిశోధకుడితో పాటు నిర్మాణరంగ నిపుణుడు కూడా ఉన్నాడు. విజయవాడలో డా. కె.ఎల్. రావుగారితో కలిసి గాంధీ పర్వత నిర్మాణం, మాంటిస్సొరి, మేరీస్టెల్లా కళాశాలల భవనాల నిర్మాణం వారు చేసినవే. గాంధీ పర్వత ప్రారంభానికి వచ్చిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్కు లక్ష రూపాయల విరాళం పోగుచేసి ఇచ్చారు. అనేక హరిజన హాస్టళ్లు, కాలనీలు నిర్మింపచేశారు.

వారిది గన్నవరం దగ్గర బుద్ధవరం గ్రామం. ఆ రోజుల్లో ఏ గ్రామంలోను ఎలిమెంటరీ స్కూళ్లు లేవు. బొడ్డపాటి కుటుంబరావుగారు ఇంగ్లీషు, సైన్సు, లెక్కలు చెప్పి మిడిల్ స్కూల్లో చేర్చారని. ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య గారితో హిందీ చెప్పించారని. ఉప్పులూరి వెంకట కృష్ణయ్య (కేసరపల్లి) తరచూ మా ఊరు వచ్చి కాంగ్రెస్ ప్రచారం చేస్తూ సహాయ నిరాకరణం గురించి చెప్పేవారని నాగభూషణం గారు చెపుతూండేవారు.

గన్నవరంలో థర్డ్ ఫారమ్ పాసైన తరువాత వ్యవసాయం చేస్తూ సంస్కృతం నేర్చుకున్నారు. 1930 ఏప్రిల్ 6న ఉప్పు సత్యాగ్రహం సమయంలో నాగభూషణం గారికి ఏడాది శిక్ష వేశారు. ఆ తరువాత కొద్ది రోజులకే గాంధీ ఇర్విన్ ఒడంబడిక వచ్చి వదిలేశారు. 1934 ఫిబ్రవరిలో హరిజన యాత్రకి గాంధీగారు విజయవాడ వచ్చారు. హరిజన సేవక్ సంఘం ఏర్పరచుకొని కొండా వెంకటప్పయ్య రాష్ట్ర అధ్యక్షులుగా, డా. ఘంటసాల సీతారామశర్మ జిల్లా అధ్యక్షులుగా, నాగభూషణంగారిని జిల్లా జాయింట్ సెక్రటరీగా తీసుకున్నారు. హరిజనుల కొరకు నూతులు త్రవ్వే కార్యక్రమం, ఇళ్ళ స్థలాలు పంపిణీ చేసే కార్యక్రమం, దేవాలయ ప్రవేశం, జంతు బలులకు వ్యతిరేకంగా సత్యాగ్రహాలు మొదలుపెట్టారు.

1935లో జిల్లా కాంగ్రెస్‌జాయింట్ సెక్రటరీ, గన్నవరం తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. ఆ సమయంలో కాంగ్రెస్ సోషలిష్టు గ్రూపు నాయకుడు

మద్దుకూరు చంద్రశేఖరరావుగారితో నాగభూషణం గారికి సాన్నిహిత్యం ఏర్పడింది. 1937లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. సత్యాగ్రహం వలన లాభం లేదు. తుపాకి గొట్టం ద్వారానే స్వాతంత్ర్యం వస్తుందని విశ్వాసంతో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. రహస్యంగా గ్రైనేడ్లు విసరడం, తుపాకులు పేల్చడంలో మంచి శిక్షణ పొందారు.

1936లో కృష్ణాజిల్లా రైతుసంఘం అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. 1939లో ఇచ్ఛాపురం నుంచి మద్రాసుకి కాలినడకన జమీందారీ విధానం రద్దు కొరకు యాత్ర జరిపారు. 1939లో మునగాల పోరాటంలో పార్టీకోసం రహస్య కార్యక్రమాలు నడిపారు. అప్పుడే మొదటిసారి మునగాల బుర్రకథ వ్రాశారు నాగభూషణం గారు.

1942లో క్విట్ ఇండియా తీర్మానాన్ని కమ్యూనిస్టులు వ్యతిరేకించడంతో గవర్నమెంటు కమ్యూనిస్టులపై బ్యాను తొలగించింది. నాగభూషణం గారు రహస్య జీవితానికి స్వస్తి చెప్పి బయటకు వచ్చారు.

1943లో ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. 1947లో ప్రకాశం ప్రభుత్వం తిరిగి కమ్యూనిస్టుల్ని వేధించటంతో రహస్య జీవితంలోకి వెళ్లి, స్వాతంత్ర్యానంతరం బయటకు వచ్చారు.

1948 జూన్ లో నిజాం పతనం తరువాత ఇంకా పోరాటం అనవసరమని భావించి రాజమండ్రి జైలులో ఉన్న రాష్ట్ర కమిటీలో ఉన్న నాగభూషణం గారు, మద్దుకూరు చంద్రశేఖరరావు, కంభంపాటి (సీనియర్) పార్టీకి వ్రాసి పంపారు. ఆ మూడు ఓట్లతో పాటు రాజేశ్వరరావు, రావి నారాయణరెడ్డి, బద్దం వెల్లారెడ్డి ప్రభృతులు పోరాటాన్ని ఆపాలని, సుందరయ్యగారు, బసవయ్యగారు, హనుమంతరావు గారు పోరాటం కొనసాగించాలని ఓటు వేశారు. ఇండియన్ యూనియన్ ఆర్మీపై పోరాటం చేయాలని చెప్పారు. జైల్లో ఉన్నవారు ఓటు వేయడానికి వీల్లేదని సాంకేతిక అభ్యంతరాన్ని లేవనెత్తుతూ రణదివేకి లేఖ వ్రాశారు. రణదివేగారు పోరాటం కొనసాగించాలనే సూచించారు. స్వయంగా వచ్చి ఓటు వేయటం కోసం అర్థరాత్రి జైలుగోడ దూకి తప్పించుకు వచ్చారు నాగభూషణం గారు. జైలు నుంచి తప్పించుకున్నందుకు 6 నెలలు శిక్ష విధించి. రాయవెల్లూరులో పెట్టారు. తరువాత పుదుక్కోట జైలులో ఒంటరిగా బంధించారు.

1943లో బొంబాయిలో మొదటి కమ్యూనిస్టు పార్టీ మహాసభల్లో ప్రజా నాట్యమండలి పక్షాన సాంస్కృతిక ప్రదర్శనలిచ్చారు. పనిపాటల్ని పోరాట పాటలుగా

రూపొందించారు. ప్రజా నాట్య మండలి నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు.

శతావతారాలు, వెర్రి పడగలు, తలనీలాలు, భారతదేశంలో వైజ్ఞానిక ప్రగతి, స్వాతంత్ర్య సమరచరిత్ర, అసురనాగరికత, నేను ఎలా కమ్యూనిస్టు నయ్యాను?" గ్రంథాలతోపాటు, ఆకాశవాణి కోసం వ్యావసాయక, సామాజికాంశాలగురించి, క్రీడలు గురించి అనేక రచనలు చేశారు. వారువ్రాసిన ఆకాశవాణి సంగీత రూపకాలకు రాష్ట్ర స్థాయిలో రెండు, భారత స్థాయిలో రెండు, ప్రపంచ స్థాయిలో ఒకటి బహుమతులు అందాయి. ఆంధ్ర రాష్ట్ర క్రికెట్ అసోసియేషన్‌కి 18 సంవత్సరాలుగా వైస్-ప్రెసిడెంట్‌గానూ, ప్రెసిడెంటుగానూ పనిచేశారు.

యావజ్జీవితాన్నీ సంఘసేవకే వినియోగించిన తాతగారు శ్రీ ముక్కామల నాగభూషణం గారు 27.7.1992 న పరమపదించారు. వారు ధన్యజీవి.



గవర్నర్ శ్రీ కుముద్‌బెన్ జోషీతో శ్రీ ముక్కామల నాగభూషణం,
శ్రీ మండలి వెంకట కృష్ణారావు, శ్రీ రోజర్‌కాన్



# శ్రీ కె.ఎస్. ఆచార్యులు, శ్రీ రాధాకృష్ణ

దివిసీమ పునర్నిర్మాణ కార్యక్రమంలో ముఖ్యమైన అంశం అక్కడి ప్రజల భవిష్యత్తుకు భరోసా కల్పించటం. నిరాశా నిస్పృహల్లో కూరుకుపోయిన ఆ ప్రజలకు ఆపన్న హస్తం అందించి, వ్వారిలో ఆత్మవిశ్వాసాన్ని ప్రోదిచేసి, వారిని మునుపటికన్నా ఉన్నతంగా జీవించేలా చేయటం లక్ష్యంగా ప్రపంచంలోనే ప్రథమ యత్నంగా పునర్నిర్మాణ కార్యక్రమాలు ప్రారంభం అయ్యాయి.

వివిధమతాలకు చెందిన సేవా సంస్థల ప్రతినిధులు, విధ స్వచ్ఛంద సేవా సంస్థలవారు, సేవాతత్పరులు అందరూ కలిసి కూర్చుని పరస్పర సమన్వయంగా పునర్నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించాలని ఐక్యంగా నిర్ణయించారు.

మునుముందు రాబోయే తుఫానుల నుండి ప్రాణాలను కాపాడుకోవటానికి తుఫాను సంరక్షణ కేంద్రాల నిర్మాణం, ఊళ్ళకు ఊళ్ళే నామరూపాలు లేకుండా ధ్వంసమై పోయిన నేపధ్యంలో ఆ ప్రజలకు పక్కా ఇళ్లను నిర్మించి ఇవ్వటం, అనాథలైన పిల్లలకు ఆశ్రయం కల్పించటం, వారికి విద్యాబుద్ధులు గరిపించటం, ఉప్పునీటితో పాడైపోయిన పంటభూములను సాగుయోగ్యం చేయటం, వ్యవసాయాన్ని తిరిగి ప్రారంభించటానికి కావాల్సిన చేయూత నివ్వటం లాంటి అనేక అంశాలు ఈ పునర్నిర్మాణ కార్యక్రమంలో ఉన్నాయి.

అపారమైన మేధా సంపత్తి ఉన్నప్పటికీ అత్యంత నిరాడంబరంగా జీవించిన గాంధేయవాది శ్రీ కె.ఎస్. ఆచార్యగారు ఈ పునర్నిర్మాణ కార్యక్రమంలో అనాథలైన

పిల్లలకు ఆశ్రయం కల్పించటమే కాకుండా వారికి గాంధీ విధానంలో చదువు నేర్పించే బాధ్యతను తలకెత్తుకున్నారు. "నయీ తాలీమ్ ఆచార్య"గా ఆయన దేశవ్యాప్తంగా ప్రసిద్ధుడు. కవి, పరిశోధకుడైన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి వీరు సోదరులౌతారు. కర్నమడకల శ్రీనివాసాచార్యులు వీరి అసలు పేరు.

ఆచార్యగారి కుమారుడు డా. రాధాకృష్ణ కూడా తండ్రి అంతటి గాంధేయవాది. గాంధీజీ, వినోబా భావే, జయప్రకాష్ నారాయణ్ ముగ్గురితోనూ అత్యంత సన్నిహితంగా పనిచేశారు. గాంధీ శాంతి సంస్థకు కార్యదర్శిగా జయప్రకాష్ నారాయణ్ గారి వ్యక్తిగత కార్యదర్శిగా వ్యవహరించారు. గాంధేయవాద ప్రచారకుడుగా డా. రాధాకృష్ణ గారు ఒక ప్రపంచ స్థాయి గుర్తింపు పొందారు. గాంధేయవాద ప్రచారానికి తండ్రీ కొడుకులిద్దరూ ప్రముఖస్థానాల్లో పనిచేసిన ఘనత ఈ తెలుగుబిడ్డలిద్దరికే దక్కింది.

శ్రీ కె.ఎస్. ఆచార్యులుగారు హైదరాబాద్‌లో 'అకాడెమీ ఆఫ్ గాంధియన్ స్టడీస్' పేరుతో గాంధీ విజ్ఞాన పరిషత్తు అనే సంస్థను నెలకొల్పారు. మహాత్ముని ఆశయాలు, ఆచరణలను, జీవితాన్ని పిల్లలకు సుబోధకం చేయటానికి ఇంగ్లీషు, తెలుగు భాషల్లో "గాంధీ కథ" పుస్తకాన్ని రచించారు. గ్రామాభ్యుదయం విద్యా కార్యక్రమాలు ఈ సంస్థ లక్ష్యం. ఈ సంస్థకు తొలుత ప్రభాకర్ జీ అధ్యక్షులు. తరువాత ఎస్.కె. ఆచార్యులవారే అధ్యక్షులయ్యారు. వారు సంపాదకుడిగా "గాంధీ విజ్ఞాన్" అనే త్రై మాసపత్రిక ఆంగ్లంలో ఈ సంస్థ పక్షాన నడిచింది.

1977, అక్టోబర్‌లో మహాత్మాగాంధీ 109వ జయంతి సందర్భంగా గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలా గాంధీ, మనుమడు శ్రీ కనూగాంధీ, వారితో పాటు శ్రీ కె.ఎస్. ఆచార్య, మరి కొంతమంది సర్వోదయ కార్యకర్తలు, నిర్మాణ కార్యకర్తలు అవనిగడ్డ గాంధీక్షేత్రాన్ని సందర్శించారు. అ సమయంలో మా నాన్నగారి ఆహ్వానం మీద అవనిగడ్డలోకూడా అకాడెమీ ఆఫ్ గాంధియన్ స్టడీస్ అనుబంధంగా ఒక గురుకులం ఏర్పాటు చేయటానికి సన్నాహాలు జరిగాయి. కె.ఎస్.ఆచార్య గారు అందుకు తగిన నిర్దిష్టమైన సూచనలిచ్చి వెళ్లారు. నెల తిరక్కుండానే దివి ఉప్పెన విరుచుకుపడింది.

ఉప్పెన కారణంగా తల్లిదండ్రులను కోల్పోయి అనాధలైన పిల్లలను మా నాన్నగారు గాంధీక్షేత్రానికి తీసుకువచ్చి, ఒక అనాధ శరణాలయం నెలకొల్పి అందులో ఉంచారు. ఈ అనాధ పిల్లలకు శ్రీ కె.ఎస్. ఆచార్యులు బేసిక్ విద్యావిధానం పద్ధతిలో

విద్య నేర్పేందు కోసం 'గాంధీ గురుకులం' సంస్థను ఏర్పరచారు. దానికి ఆయన డైరెక్టరుగాను, శ్రీ మల్లిశెట్టి రామచంద్రరావు ప్రధానోపాధ్యాయులుగాను ఉండేవారు. ప్రతి నెలా ఆచార్యులుగారు అవనిగడ్డకు వచ్చి మా ఇంట నాలుగు రోజులుండి వాళ్లకు దిశా నిర్దేశం చేసేవారు. ప్రతిరోజూ చేయవలసిన కార్యక్రమాలను గురుకులం బాధ్యులకు ఉత్తరాల ద్వారా సూచిస్తుండేవారు.

గాంధేయవాదులు అనేకమంది వచ్చి ఈ గురుకుల పాఠశాలను చూసి ఆశీస్సులందించారు. పిల్లలు ప్రకృతి వైపరీత్యం కారణంగా అనాథలైనప్పటికీ గాంధీ మార్గంలో చదువుకోగలిగిన అదృష్టవంతులని చెప్పాలి.

గాంధీగారు నూతన విద్యావిధానాన్ని నయీతాలిమ్ పేరుతో వ్యవహరించారు. దాన్ని బేసిక్ విద్యా విధానం అనికూడా పిలుస్తారు. మహారాష్ట్రలోని సేవాగ్రామంలో ఈ బేసిక్ విద్యావిధానం మీద ఒక సదస్సు జరిగినప్పుడు శ్రీ కె.ఎస్ ఆచార్యులుగారు నన్ను, శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తిగారిని, శ్రీ మల్లిశెట్టి రామచంద్రరావుగారిని తనవెంట ఆ సదస్సుకు తీసుకువెళ్లారు. గాంధేయ మార్గంలో విద్యాబోధన వలన విద్యార్థి మానసిక పరిపక్వత ఎంత వర్ధిల్లుతుందో నాకు అప్పుడే అర్థం అయ్యింది.

ఆ సందర్భంగా హరనాథ ఆశ్రమంలో వినోబా భావేగారిని దర్శించుకునే అవకాశం కూడా నాకు కలిగింది.

నయీ తాలీం శిక్షణ పద్ధతి చాలా ప్రశస్తమైన విద్యా విధానం. అది గాంధీమహాత్ముని ఆశీస్సులందినది. సమాజంలో జాతి, కుల, మత భేదాలు, స్థాన భేదాలు ఇవేవీ లేకుండా ఒకే సమాజం-ఒకే కుటుంబం, అందరూ చిన్న పెద్ద భేదం లేకుండా సమాజ కార్యక్రమాలన్నీ నిర్వహించాలి. ప్రార్థన-శుచిత్వం-ఆరోగ్యం-వంటపని-శాలా శిక్షణ, అతిథిసేవ, శ్రమ జీవనం-సాంస్కృతిక కార్యక్రమాలు-వీటి ద్వారా జ్ఞానార్జన. దీనికి కావలసిన గ్రంథ పఠనం నిరంతరంగా ఈ విధానంలో జరగాలి.

ఈ విద్యావిధానంలో పరీక్షలు అనేవి ఉండవు. శ్రద్ధగా చదువుకోవటమే ఉత్తీర్ణత. జీవితాన్ని నిజాయితీగా నడుపు కోవటం నేర్పటమే ఈ విద్య లక్ష్యం. జ్ఞానం అనేది ఒక వరం. ఆ వరాన్ని సద్వినియోగపరచే మానసిక శక్తిని అదనంగా ఈ విద్యావిధానం విద్యార్థికి అందిస్తుంది. ఏ వయసు విద్యార్థికి ఎంతజ్ఞానం ఉండాలో

అంతజ్ఞానాన్నీ అందిస్తూనే నైతిక విలువలు, ఆధ్యాత్మిక ప్రసన్నత, సమాజ అనుకూలతలను నేర్పించటం ఇందులో ప్రధానం. మానవుణ్ణి ప్రపంచమానవుడిగా తీర్చిదిద్దేలా ఈ విద్యావిధానం యూనివర్సల్ ఎడ్యుకేషన్ని అందిస్తుంది. వివిధ ప్రాంతాల నుంచి ఎందరో వచ్చి ఈ నయీతాలీం (నూతన విశ్వవిద్య) లో శిక్షణ పొంది వెళ్లి ఈనాడు తమతమ రంగాలలో పని చేసుకుంటున్నారు. ప్రభుత్వ సంస్థల నుండి, ప్రైవేటు సంస్థల నుండి కూడా విద్యార్థులు శిక్షణార్థం వచ్చేవారు.

డా.సర్వేపల్లి రాధాకృష్ణగారి దగ్గర మూడేళ్లు ఫిలాసఫీ చేసి 1922లో శ్రీ కె.ఎస్.ఆచార్యులు పట్టభద్రులయ్యారు. 1923 జూలైలో అప్పటి మైసూరు రాష్ట్రంలోని "దావణగిరి" అనే ఒక వ్యాపార స్థలంలో ఒక హైస్కూల్లో రూ.500/-ల వేతనంతో ఆయనకు ఉపాధ్యాయ వృత్తి లభించింది. ఉపాధ్యాయుడు కావాలనే కల ఆ విధంగా ఆయనకు నెరవేరింది.

అవి సహాయ నిరాకరణోద్యమం సాగుతున్న రోజులు. 1920 నుండి ఆచార్యులవారు గాంధీ భక్తుడిగా ఖాదీయె ధరించేవారు. విద్యార్థులకు గాంధీవిషయాలు, ఖద్దరు విషయాలు బోధిస్తూ ఉండేవారు. ఉపాధ్యాయ వృత్తిలోనే కొనసాగుతూ విద్యార్థుల్ని గాంధీ మార్గానికి ప్రేరేపించి దేశ భక్తులను చేయటం మంచిదనేది ఆచార్యులవారి నిర్ణయం అన్నాడు!

గాంధీ గారి అధ్యక్షతన జరిగిన బెల్గాం కాంగ్రెస్ సమావేశంలో పాల్గొన్నారు. గాంధీజీ తన దక్షిణ దేశ పర్యటనలో భాగంగా ద్రావణగిరిలో ఒక రోజు గడిపారు. గాంధీజీకి వసతి సౌకర్యాలు కల్పించే బాధ్యత సక్రమంగా నిర్వహించారు. ఇందుకు నగర నాయకుల వల్ల మన్ననలు, అధికారుల వల్ల అధిక్షేపణలు అందాయి.

ఆ తరువాత గాంధీగారిని నందికొండలో కలుసుకున్నప్పుడు, "పై అధికారులు కొందరు ఖాదీ విరోధులున్నారు. మీ వద్దకు ఈ రాజ్యపు దివాను గారు వచ్చినప్పుడు ఈ విషయము ప్రస్తావించి మేము ఖాదీ ధరించుట కభ్యంతరము లేకుండా చేయండి" అని కోరారట ఆచార్యులవారు.

''డాల్టన్'' శిక్షణాపద్ధతిలో మూడు సంవత్సరాలపాటు, ఆరుగురు ఉపాధ్యాయులతో ఆచార్యులవారు ప్రయోగాత్మకంగా విద్యార్థులకు చదువు చెప్పించారు. విద్యార్థులు తమకు వచ్చిన విషయాలు తామే ఎన్నుకొని పుస్తకాలు పరిశీలించి ఆలోచనా

శక్తిని పెంపొందించుకుంటూ విద్యార్జన చేయటం, ఉపాధ్యాయులు అందుకు తగిన సూచనలు, తోడ్పాటు నివ్వటం ఈ విద్యావిధానం. ఈ ప్రయోగం ఉపాధ్యాయులకు, విద్యార్థులకు కూడా సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చేదిగా ఉంటుంది. ఇందులో శిక్షణ పొందిన విద్యార్థు లిప్పుడు మన దేశపు గొప్పగొప్ప రంగాలలో తగిన పదవుల్లో ఉన్నారు.

ఈ ప్రయోగములో 2000 మంది ఉపాధ్యాయులుగా నూతన శిక్షణ పొందారు. విద్యాధికారి (డైరెక్టరు) నన్ను పిలిపించి "మీకు పూర్తి స్వేచ్ఛనిస్తున్నాను, గాంధీ గారి నూతన విశ్వవిద్య పద్ధతిలో గురుకులం విధానంలో ఈ శిక్షకుల శిక్షణను ఏర్పాటు చేయ"మన్నారు. 25మంది ఉపాధ్యాయుల్ని ఎంచుకుని ఒక "పల్లె"లో ఆచార్యులవారు ఉపాధ్యాయులకు ఈ విద్యావిధానంలో శిక్షణ ఇచ్చారు. సిలబస్సు–వ్యవస్థ–దినచర్య–పరీక్షలు మొదలైనవన్నీ ఆచార్యులవారి నేతృత్వంలో రూపొందించారు.

వ్యవసాయం, పండ్లతోటలు, నూలు వడకటం, బట్టలు నేయటం, ఇంకా ఇతర వృత్తులకు సంబంధించిన శిక్షణ విద్యార్థులకు పూర్తిగా అందేది. పాఠశాల కార్యాలన్నీ విద్యార్థులే నిర్వహించేవారు.

1954 జూన్‌లో ఉద్యోగం నుండి విరమించాక, ఆచార్యులవారు నయీతాలిమ్ అధికారుల పిలుపుతో సేవాగ్రామ్ వెళ్లారు. అప్పటికి ఆచార్యులవారి పెద్ద కుమారుడు డా. రాధాకృష్ణ ఎం.ఎస్.సి. పట్టా పొంది సేవాగ్రామ్ లోని పాఠశాలలో నయీ తాలీమ్ పద్ధతిలో ఉపాధ్యాయుడిగా ఉన్నాడు. అక్కడ శ్రీమాన్ ఆర్యనాయకం, ఆయన సతీమణి శ్రీమతి ఆశాదేవి తమ జీవితం ధారపోసి సేవ చేస్తున్నారు. ఆచార్యులవారు వాళ్లతో పాటు అక్కడ పనిచేయటం ప్రారంభించారు.

ఆరేళ్ల తర్వాత సర్వ సేవా సంఘపు నయీ తాలీం సమితి సంచాలకుడిగా పదేళ్లపాటు పనిచేశారు. దేశమంతా తిరిగి కళాశాలల్లోను, విద్యాలయాల్లోను ప్రచార కార్యక్రమం నిర్వహించారు.

తండ్రి తరువాత తండ్రి అంతటి వాడు కె.ఎస్.ఆచార్య గారి పెద్దబ్బాయి డా.రాధాకృష్ణ. రాధాకృష్ణ గారు 1923 అక్టోబర్ 12న ఆచార్యగారు కర్ణాటకలో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో చిత్రదుర్గలో జన్మించారు. వీరి మేనమామ గారు శిద్ధవనహల్లి కృష్ణశర్మ తెలుగు కన్నడ భాషల్లో గొప్ప రచయిత, అనువాదకుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, సామాజిక కార్యకర్త, విద్యావేత్త.

డా.రాధాకృష్ణ గారు 1946లో రసాయనశాస్త్రంలో పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తికాగానే కృష్ణశర్మగారు ఆయన్ని గాంధీగారి వార్ధా సేవాశ్రమ్‌లో ఉపాధ్యాయుడిగా చేర్పించారు. గాంధీజీ నయీతాలీమ్ ప్రయోగాలు చేస్తున్న సమయం అది. విద్యావేత్తలు ఇ.డబ్ల్యూ.అరక్కం, ఆశాదేవీ అరణ్యక్కం దంపతులు సేవాగ్రాంలో పోస్ట్ బేసిక్ స్కూల్ నడుపుతున్నారు. రాధాకృష్ణగారు దానికి ప్రిన్సిపాల్ అయ్యారు. 1947నుండీ 58 దాకా ఆ పదవిలో ఉన్నారు.

దేశ విభజన సమయంలో పశ్చిమ పాకిస్తాన్ నుంచి తరలివస్తున్న శరణార్థుల పునరావాసం కోసం పంజాబులోని రాజ్‌పురా ప్రాంతానికి డా.రాధాకృష్ణ గారిని పంపించారు. అప్పుడే పెళ్ళయిన కొత్త పెళ్ళికుమారుడాయన. ఆయన నవ వధువు కమలనీ, వారికి మార్గదర్శకంగా ఆశాదేవీ ఆర్యనయక్కం గారినీ వినోబాభావే అక్కడికి పంపించారు. వారికి సహాయంగా 40 మంది పోస్ట్ బేసిక్ స్కూల్ విద్యార్థులు కూడా వచ్చారు.

1952లో ఆయన సేవాగ్రామ్‌కి తిరిగివచ్చి, మళ్లీ 'నయీ తాలీమ్' కార్యక్రమంలో చేరారు. ఆచార్య వినోబాభావేకి ఆయన అత్యంత సన్నిహితంగా మెలిగారు. 1952 నుండీ భూదాన్, గ్రామ్‌దాన్ యజ్ఞాల్లో వినోబాకి సహకరించారు. 1959లో హిందూస్థానీ తాలిమీ సంఘీ సంస్థకు కార్యదర్శి అయ్యారు. 1969లో సేవాసంస్థలన్నిటికీ ఛత్రం అనదగిన సర్వసేవాసంస్థకు ప్రధాన కార్యదర్శి అయ్యారు. ఆ సమయంలో జయప్రకాశ్ నారాయణ్ గారితో ఆయనకు అత్యంత సాన్నిహిత్యం ఏర్పడింది. వ్యవసాయం, గ్రామీణ వృత్తుల పునర్వికాసం అనే 'జేపీ' గారి AGRINDUS కార్యక్రమానికి ఆయన ముఖ్య బాధ్యుడయ్యారు. అఖిలభారత ఖాదీ గ్రామపరిశ్రమల బోర్డ్, జాతీయ బేసిక్ విద్యా మండలి, కేంద్రీయ విద్యా సలహామండలి, అఖిలభారత శాంతి సేనామండలి, గాంధియన్ అధ్యయన సంస్థ, గాంధీ స్మారకనిధి, గాంధీ శాంతి సంస్థ మొదలైన సంస్థల్లో వివిధ హోదాల్లో పనిచేశారు.

జయప్రకాష్ నారాయణ్ గారు 1971లో బాంగ్లాదేశ్‌లో మానవ హక్కుల గురించి నిర్వహించిన అంతర్జాతీయ మహాసభకు ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. బంగ్లాదేశ్ శరణార్థుల పునరభివృద్ధికోసం గాంధియన్ గ్రూపుల్ని పంపి అనేక సేవాకార్యక్రమాలు నిర్వహించారు. ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా జేపీ నాయకత్వంలో

గాంధియన్ సంస్థలు నిర్వహించిన పోరాటంలో డా. రాధాకృష్ణగారు ఒక సమన్వయ కర్తగా జేపీకి సన్నిహితంగా పనిచేశారు. 1975లో మీసా క్రింద ఆయన్ని అరెస్ట్ చేశారు కూడా!

మతం శాంతి అంతర్జాతీయ మహాసభ-న్యూయార్క్‌కి ఆయన వ్యవస్థాపక సభ్యులు, సంచాలకులు కూడా! ఇంగ్లండ్, అమెరికా, జెర్మనీలలో ఇలాంటి శాంతిసేవా సంస్థలతో ఆయనకు అనుబంధం ఉంది. ఆజన్మాంతం సర్వోదయ కార్యకర్తలకు ఆయన అండగా, మార్గదర్శకుడుగా వ్యవహరించారు.

గాంధీమార్గ్, గాంధీ విజ్ఞాన్, భూదాన యజ్ఞ, ఇంకా అనేక గాంధియన్ పత్రికల సంపాదకులుగా వ్యవహరించారు. దివిసీమ ఉప్పెన అనంతరం పునర్నిర్మాణ సమయంలో మానవ సాయాన్ని సమన్వయం చేయటంలో డా. రాధాకృష్ణగారు ముఖ్యపాత్ర పోషించారు. గృహనిర్మాణాలు, వ్యవసాయ పరమైన అంశాలు, ఆదాయం సమకూర్చే కార్యక్రమాల్లో రాధాకృష్ణ గారు, వారి తండ్రి శ్రీ కె.ఎస్ ఆచార్య గారు చేసిన నిరుపమాన సేవలను దివిప్రజలు ఎన్నటికీ మరిచిపోలేరు.

శ్రీ రాధాకృష్ణ గారి అధ్యక్షతన తిరుపతి కేంద్రంగా ఎస్.డి.ఆర్.ఎస్.ఐ. సంస్థ ద్వారా విస్తృత సేవా కార్యక్రమాలు జరిగాయి. కార్యదర్శి శ్రీ జి. శివరామమూర్తి, సమన్వయకర్త శ్రీ ఎ.యల్.నరసింహమూర్తి కార్యనిర్వాహకులుగా ఏర్పడిన ఈ సంస్థ మొదట అవనిగడ్డ పరిసర ప్రాంతాల మీద దృష్టిపెట్టి కార్యక్రమాలు ప్రారంభించింది. ఆ తరువాత బాపట్ల, రేపల్లె గ్రామాలకు కూడా సేవలను విస్తృతం చేశారు.

బాపట్లలో తుపాను బాధితుల కోసం రాధాకృష్ణ నగర్ కాలనీని నిర్మించారు. ఈ కాలనీలో 103 ఇళ్ళు, విద్య వైద్య సౌకర్యాలు కల్గించారు. ఈ విధంగా పెద్ద ఎత్తున గృహ నిర్మాణాలు జరిపించి రాధాకృష్ణ గారు ఆదర్శప్రాయులయ్యారు.

అవనిగడ్డ గాంధీక్షేత్రంలో ప్రభాకర్‌జీ అధ్యక్షుడిగా శ్రీ రాధాకృష్ణ ఉపాధ్యక్షుడిగా GUARD అనే గాంధేయ వాద సంస్థని ఏర్పరచి అనాధ బాలల కోసం ఎన్నో కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. ఈ పిల్లలకు పాలు పుష్కలంగా అందించడం కోసం ఒక డైరీ ఫారంని నెలకొల్పారు. వ్యవసాయ పురోభివృద్ధికి తోడ్పడటానికి ఫర్ ఫుడ్ ప్రాపర్టీస్ అనే సంస్థను నెలకొల్పి, వ్యవసాయ ఆధునీకరణ విధానాలపై రైతులను చైతన్యవంతులను చేసే అనేక కార్యక్రమాలు చేపట్టారు.

డా. రాధాకృష్ణ గారు చైర్మన్‌గా గాంధీ శాంతి సంస్థ (గాంధీ పీస్ సెంటర్-జి పి సి) ఏర్పడింది. ప్రకృతి వైపరీత్యాల సమయంలో సేవా తత్పరతతో వ్యవహరించిన అనేక సంస్థల అనుభవాలతో, గాంధీసేవా సంస్థ భారతదేశ వ్యాప్తంగా అనేక కేంద్రాలలో సేవా కార్యక్రమాలను నిర్వహించింది.

'ఆర్థిక సమతామండలి' కృష్ణాజిల్లాలోనూ, 'గ్రామశ్రీ' సంస్థ గుంటూరు జిల్లాలోనూ బలమైన సేవా సంస్థలుగా ముద్రపడ్డాయి. డా.రాధాకృష్ణగారి గాంధీ శాంతిసంస్థకు వీరంతా చేయూత నిచ్చారు.

స్వచ్ఛంద సేవలోని బలాలు, బలహీనతల గురించిన పూర్తి అవగాహన ఉన్న డా. రాధాకృష్ణగారు కృష్ణా గుంటూరు జిల్లాల్లోని తీరప్రాంతాల్లో ప్రజలకు చిరస్మరణీయమైన సేవలు అందించారు.



తుపాను బాధితులతో మాట్లాడుతున్న శ్రీ కె.ఎస్.ఆచార్యులు, శ్రీ మండలి వెంకటకృష్ణారావు



# శ్రీ వీరయ్య

ఉప్పెనలు, పెనుతుఫానులు, వరదలు దివిసీమకు కొత్తకాదు. జలవనరులన్నీ ఎగువవారికి వరంగానూ, దప్పిక, కరువు, ప్రకృతి వైపరీత్యాలతో దిగువ ప్రాంతం తీరవాసులకు శాపంలా నిరంతరం కలుగుతూనే ఉన్నాయి. 40 యేళ్ల నాటి దివిసీమ ఉప్పెన ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు మనుషులు పెద్దమనసుతో, మానవత్వంతో, ఎలా ప్రతిస్పందించాలి? ఏ విధంగా జనజీవితాన్ని తక్షణం సాధారణ స్థితికి తేవాలి అనే అంశాలమీద కొన్ని కొత్త ఆలోచనలకు కారణం అయ్యింది.

ఆ కొత్త ఆలోచనే "పునర్నిర్మాణ సేవ"! దాతల సాయాలు వరదలెత్తి వచ్చినప్పుడు వాటిని ఒక ప్రణాళికాబద్ధంగా, దివి బాధితులందరికీ సమానంగా అందేలా చేయటం, అందరికీ పునర్జీవితాన్ని ప్రసాదించచటం లక్ష్యంగా దివి పునర్నిర్మాణ సేవ కొనసాగింది. జరిగిందాన్ని పీడకలగా భావించి, దాన్ని మరిచిపోయి, ఆస్తుల్నీ, ఆప్తుల్నీ, జీవనాధారాల్నీ కోల్పోయిన ప్రజలంతా తిరిగి నవజీవనానికి ఉద్యుక్తులయ్యేలా చేయటం ఈ దివిసీమ ఉప్పెన అనంతర సేవల లక్ష్యం.

పునర్నిర్నిర్మాణానికి కొత్త రూపాన్ని కల్పించినవారిలో శ్రీ వీరయ్యగారు ముఖ్యులు. లోకం అంతటికి ఆయన వీరయ్య గారే! పూర్తి పేరుని ఆయన ఏనాడూ వాడుకోలేదు.

1977 నవంబరు ఉప్పెన దివిసీమను కబళించినప్పుడు, ఢిల్లీలో ఉన్న వీరయ్యగారు ఆగమేఘాల మీద అవనిగడ్డకు బయలుదేరి వచ్చారు. గాంధీక్షేత్రంలో

కొన్ని నెలలు ఉండి, ప్రభాకర్‌జీ నాయకత్వాన సహాయ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. తీరప్రాంతాలు ఉప్పెన వలన సర్వనాశనం అయితే, దివిసీమలోని కొన్ని ఎగువ ప్రాంతాలు కూడా తుఫాను తాకిడికి గురి అయినాయి. ప్రత్యేకించి దళిత వాడల్లో పాకలన్నీ కూలిపోయాయి.

శ్రీ వీరయ్యగారు కృష్ణానదిని ఆనుకుని ఉన్న శ్రీకాకుళాన్ని కార్యక్షేత్రంగా చేసుకుని, అక్కడ ఆర్థిక సమతామండలి కేంద్రాన్ని ఏర్పరచారు. దీనజన సేనకు శ్రీకాకుళాన్ని తన కార్యక్షేత్రంగా చేసుకున్నారు. వైద్య సహాయ కార్యక్రమాలు వాటి దారిన అవి నిరంతరంగా జరుగుతూనే ఉన్నాయి. అక్కడ మృతదేహాల్ని తరలించటానికి 2-3 వారాలపాటు పట్టినా, బాధిత ప్రజలకి రెట్టింపు సంఖ్యలో సేవాసంఘాల కార్యకర్తలు తరలివచ్చినా అక్కడ ఎవరూ ఆరోగ్య సమస్యలు తలెత్తకుండా ఆరోగ్య సేవలు అద్భుతంగా జరిగాయి.

ఇదంతా ఒక యెత్తు, ప్రజలు ఇతరులపై ఆధారపడకుండా తమ కాళ్ళపైతాము నిలబడేలా వారికి శారీరక, ఆర్థిక మానసిక పరిపుష్టిని కలిగించటం మరొక యెత్తు.

వీరయ్యగారు చేసిన పునర్నిర్మాణ కార్యక్రమంలో ఉప్పునీటితో తడిసి, చవుడుబారిన వందలాది ఎకరాల లంక భూముల్ని వ్యవసాయానికి అనుగుణంగా తీర్చిదిద్దటం అనేది ప్రధాన విషయం. వీరయ్యగారు చేపట్టిన పునర్నిర్మాణ సేవలో ఇది ముఖ్యమైంది. పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పించి, వారిని ఉన్నతులుగా తీర్చిదిద్దే కార్యక్రమాన్ని కూడా ఆయన చేపట్టారు. అందుకోసం వీరయ్యగారు ఆర్థిక సమతా మండలి రూరల్ చైల్డ్ హెల్త్ ఎడ్యుకేషన్ సర్వీసెస్ సెంటర్ (ARCHES)ని శ్రీకాకుళంలో నెలకొల్పారు.

మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారికి వీరయ్య గారితో ఆత్మీయతానుబంధం ఉండేది. మా నాన్నగారి తరువాత కూడా వీరయ్యగారు నా పట్ల ఎంతో ప్రేమాభిమానాలు చూపుతూ తమ సేవాకార్యక్రమాలలో నన్ను భాగస్వామిని చేస్తూ వచ్చారు.

1977 ఉప్పెన తదనంతరం అక్కడ నాటిన సేవాబీజం పెరిగి పెద్దదై దాని కార్యక్షేత్రం పరిధి విస్తరించి, ఎక్కడ సేవ అవసరమైనా అక్కడ తాము ప్రత్యక్షమయ్యేలా ఆర్థిక సమతామండలి సంస్థని ఆయన తీర్చిదిద్దారు.

దివిసీమకు వరదలు వచ్చిన సమయంలో దక్షిణ చెరువు లంక గ్రామం వరద తాకిడికి గురికాగా అక్కడి పేద దళితులు తలదాచుకునే గూడు లేక చెట్ల క్రింద, పుట్టల ప్రక్కన కాలం వెళ్ళదీస్తున్న పరిస్థితిని వీరయ్యగారికి వివరించి అక్కడ ఒక సామాజిక కమ్యూనిటీ హాలుని నిర్మాణం చేయమని కోరాను. మేమిరువురము కలిసి ఆ గ్రామాలకు వెళ్లాం. అక్కడ పరిస్థితులు ఆయనను ఎంతగానో కలచి వేశాయి. వెంటనే ఆయన నా కోరికని ఆచరణలో పెట్టారు.

వీరయ్యగారిది సునిశిత పరిశీలనాతత్వం. అక్కడ దళిత వాడలో ఒక చిన్న పాకకు పోస్టు బాక్స్ కట్టి ఉన్నది. అది ఏమిటని అడిగితే, అది సి.బి.సి.ఎన్.సి. స్కూల్ అని గ్రామస్తులు చెప్పారు. ఎప్పుడో వందేళ్ళ క్రితం సి.బి.సి.ఎన్.సి. వారు దళిత వాడల్లో పాఠశాలలు పెట్టారు. స్వాతంత్ర్యానంతరం వాటిని ప్రభుత్వానికప్పగించి వెళ్ళిపోయారు. అప్పటి నిబంధనల ప్రకారం ప్రభుత్వం కేవలం ఉపాధ్యాయులకు జీతాలు మాత్రమే ఇవ్వాలని, భవనాలను స్థానిక ప్రజలే నిర్మించుకోవాలని ఉన్నది. వెంటనే వీరయ్యగారు మనం కట్టే సామాజిక భవనాలు పాఠశాలలకు ఉపయోగపడాలని నిర్ణయం తీసుకున్నారు.

ఆ తరువాత మేమిరువురం దివిసీమలో సి.బి.సి.ఎన్.సి. పాఠశాలలు ఎక్కడెక్కడ ఉన్నాయో తెలుసుకుని వాటిని చూశాము. అన్ని స్కూళ్ళూ పూరిపాకల్లోనే ఉన్నాయి. సూర్యచంద్రులు యథేచ్ఛగా విహరించడానికి వీలుగా ఉన్నాయి. "ప్లాన్ ఇంటర్నేషనల్" వారి సహకారం తీసుకుని సి.బి.సి.ఎన్.సి. స్కూళ్ళకు పక్కా భవనాల నిర్మాణానికి వీరయ్యగారు పథక రచన చేశారు. నిర్మాణ విధానంలోను, బోధనలోనే కాకుండా ఉపాధ్యాయ శిక్షణ వంటి విషయాలలో కూడా ఈ భవనాలు ప్రభుత్వ పాఠశాలల కంటే ఎంతో మెరుగైన పనితనాన్ని కనబరిచాయి. ఈ విధంగా వీరయ్యగారు పేద దళిత విద్యార్థుల భవితకు బంగారు బాటలు వేశారు.

ఈ కార్యక్రమాలు నాకు వ్యక్తిగతంగా తృప్తినిచ్చాయి.

ప్రభుత్వం చేయని, చేయలేని పనిని వీరయ్యగారు ఒంటి చేత్తో అలవోకగా చేసి చూపారు.

వీరయ్యగారు చేసే పనిలో ఎంతో విశిష్టత ఉండేది. ఆయన చాలా క్లుప్తంగా మాట్లాడేవారు. నిర్మాణాత్మకమైన ఆయన ఆలోచనా విధానం ఎంతో విశాలంగా

ఉండేది. ప్రపంచ వ్యాప్తంగా ఎంతోమంది స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులను నేను ఎరుగుదును. వీరెవ్వరూ కూడా నిర్మాణ కార్యక్రమాల రూపకల్పనలోగానీ, నిర్వహణలోగానీ వీరయ్యగారికి సాటిరారు. జీవితాంతం నిర్విరామంగా దీనజన సముద్ధరణకు కృషి చేస్తూ వీరయ్యగారు హృదయమున్న మనిషిగా, ప్రేమను పంచే వ్యక్తిగా అందరి ప్రశంసలు పొందారు.

శ్రీకాకుళంలోని ఆర్థిక సమతామండలి ప్రాంగణాన్ని సబర్మతీ ఆశ్రమంగా తీర్చిదిద్దారు. ఆశ్రమ ప్రాంగణంలో అడుగుపెట్టిన వారంతా అక్కడి వాతావరణాన్ని, పర్ణ కుటీరాల్నీ చూసి ముగ్ధులై మైమరచిపోతారు. దివ్యమైన అనుభూతికి లోనవుతారు.

ఆంధ్రుల ప్రథమ రాజధాని శ్రీకాకుళంలో ఆంధ్ర మహావిష్ణు దేవాలయం ఒక సందర్శన ప్రాంతమైతే, ఆర్థిక సమతా మండలి ప్రాంగణం రెండవ సందర్శనీయ స్థలం అని బావిస్తాను.

బ్రిటన్ రాకుమారి, "సేవ్ ది చిల్డ్రన్ ఫండ్"కు అధ్యక్షురాలు అయిన ప్రిన్స్ ఆనే గారు శ్రీకాకుళం వచ్చి ఆర్థిక సమతామండలిని తిలకించి ఎంతగానో ముగ్ధులయ్యారు.

దివిసీమలో ఆక్వా పరిశ్రమకు శ్రీకారం చుట్టింది వీరయ్యగారే. సంగమేశ్వరం వద్ద అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి చేతుల మీదుగా చెరువులోకి రొయ్య పిల్లలను వదలడంతో మొదలైన ఈ కార్యక్రమం దివిసీమను, భారతదేశంలోనే ఆక్వారంగంల ముందు నిలిచేట్లు చేసింది. ఎందుకూ పనికి రావనుకున్న చవుడు భూముల్లో బంగారం పండించవచ్చన్న ఆలోచన చేసింది వీరయ్యగారే.

అలాగే చేనేత పరిశ్రమకు ప్రత్యేకమైన మగ్గాలు చేయించి వారి ఉపాధికి మార్గం చూపారు. చేనేత బట్టలకు గిరాకీ రావాలంటే ఎలాగా? పాత పద్ధతిలో పాత డిజైన్లనే వాటికి అమ్మకం ఉండదు. అందుచేత డిజైన్లను మారిస్తేనే వారి వృత్తికి మనుగడ ఉంటుందని భావించి, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్, అహ్మదాబాద్ నుండి నిపుణులను రప్పించి నేతపనివారికి శిక్షణ ఇప్పించారు. గుంత మగ్గాల బదులు స్టాండ్ మగ్గాలు పెడితే అనారోగ్య సమస్యలకు పరిష్కారమని భావింభావించారు. చేనేతవారి ఇళ్లు ఎత్తు తక్కువగా ఉండటం వల్ల ఆ ఇళ్ళలో స్టాండ్ మగ్గాల ఏర్పాటు సాధ్యం కాలేదు. అందుకని చేనేతవారికి కొత్తగా పక్కా ఇళ్లు నిర్మించి, 'స్టాండ్ మగ్గాలు'

ఏర్పాటు చేసే కార్యక్రమాన్ని చేపట్టారు. ఘంటసాల దగ్గర ఖోటకంలో కాలనీ నిర్మాణాలు చేయించారు. అప్పటి ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు వీరయ్యగారిని అభినందిస్తూ లేఖ వ్రాశారు.

శ్రీ వీరయ్య తూర్పు గోదావరి జిల్లా వంగలపూడి అనే గ్రామంలో 1939, జులై 15న జన్మించారు. గాంధీ స్మారక జాతీయ కార్యదర్శి శ్రీ దేవేంద్ర కుమార్ శ్రీ వీరయ్యని గాంధీ స్మారక నిధిలో పనిచేయడానికి ఆహ్వానించారు. గాంధీ శతజయంతి ఉత్సవాల నిర్వహణకు దేశమంతా వీరయ్యగారికి చక్కని అవకాశం లభించింది.

ఢిల్లీలో గాంధీ సాహిత్యాన్ని అందజేయడానికి 'గాంధీ బుక్ హౌస్' సంస్థకు డైరెక్టరు పదవిని ఆయన చేపట్టారు.దేశవ్యాప్తంగా అన్ని స్వచ్ఛంద సంస్థలను సమన్వయపరచి గాంధీ మహాత్ముని సందేశాన్ని గ్రామ గ్రామానికీ అందజేసే కార్యక్రమాన్ని గాంధీ స్మారకనిధి జాతీయ కార్యదర్శిగా శ్రీ దేవేంద్రకుమార్ చేపట్టారు. 1968లో శ్రీ వీరయ్యగారు దేవేంద్రకుమార్ కార్యదర్శిగా పనిచేశారు. ఆశేతుహిమాచల పర్యంతం ఆయన దేశపర్యటన చేశారు. దేశవ్యాప్తంగా ఉన్న అన్ని సేవా సంస్థలతోనూ వీరయ్యగారికి పరిచయాలున్నాయి. దివి ఉప్పెన సమయంలో వారి పరిచయాలు, పలుకుబడులు దివిపునర్నిర్మాణానికి ఎంతగానో సహకరించాయి.

సహాయచర్యల నిమిత్తం దేశవ్యాప్తంగా ఉన్న గాంధీ నిర్మాణ కార్యకర్తలు దివిసీమకు తరలివచ్చారు. ప్రభాకర్‌జీ ప్రారంభించిన శవసేన కార్యక్రమాన్ని వారు దృఢ చిత్తంతో నిర్వహిస్తున్నారు. 70 సముద్రతీర గ్రామాల్లో శవాలు గుట్టలుగా పడిఉన్నాయి. మా గాంధీక్షేత్రంలో కొన్నాళ్లపాటు ఉండి వీరయ్యగారు, లవణంగారు, హేమలతా లవణంగారు శవాల తొలగింపు బాధ్యతలు నిర్వహించారు. శ్రీ వీరయ్యగారు ఈ కార్యక్రమాన్ని సమన్వయం చేశారు. సహాయ సామగ్రి మొత్తం దివిసీమలోని మారుమూల ప్రాంతాలకు కూడా అందేలా చూడటంలో వీరయ్యగారి కృషి గణనీయమైనది.

ఆర్థిక సమతా మండలి దివిసీమ ఉప్పెన సేవల నేపథ్యంలో అవతరించిన సంస్థ. క్రమశిక్షణ కలిగిన సైనికుల్లాంటి కార్యకర్తల బలం ఉన్న సంస్థ ఇది. వీరయ్యగారి నేతృత్వంలో శిక్షణపొందిన ఈ కార్యకర్తలు ఆంధ్రప్రదేశ్‌లో ఆ తరువాత ఏర్పడిన అనేక విపత్తుల సమయాలలో విశేష సేవలందించారు.

తరచూ ప్రకృతి వైపరీత్యాలకు గురయ్యే ప్రాంతాల్లో కేవలం సహాయ కార్యక్రమాలతో సరిపెట్టకుండా, విపత్తులను ఎదుర్కొనే విధంగా ప్రజలను సన్నద్ధులను చేయటం అక్కడ ఎంత విపత్తు ఏర్పడినా ప్రాణనష్టాన్ని నివారించే శాశ్వత చర్యలను చేపట్టటం ఇలా డిజాస్టర్ ప్రిపేర్డ్‌నెస్ అనేది ఒక విధానంగా నిబద్ధతతో అమలు చేయాలని వీరయ్యగారు సూచించేవారు. ప్రజల్లో స్వయం సహాయం అనే దృష్టిని కలగించాలనే వారాయన.

నిజానికి స్వతహాగా వీరయ్యగారు స్వీయానుభవం దండిగా కలిగినవారు. అమెరికాలో శిక్షణ తరువాత ఆయన ఇంగ్లండు, ఫ్రాన్సు, బెల్జియం మొదలైన దేశాలు వెళ్లారు. బెల్జియం శాంతి విశ్వవిద్యాలయంలో కొన్నాళ్ళు శిక్షణ పొందారు. స్వదేశానికి తిరిగి రాగానే అనేక కంపెనీలు పోషక విలువలతో కూడిన ఆహారపదార్థాల తయారీకోసం ఆయనకు ఉద్యోగాలను ఇవ్వజూపాయి. అయినా గ్రామీణ ప్రాంతాల్లో పేదప్రజలకు తన జ్ఞానాన్ని పంచిపెట్టాలనే లక్ష్యంతో ఆయన ఆ ఉద్యోగాలను సున్నితంగా తిరస్కరించారు. కేవలం 500 రూపాయల జీతానికి 'గాంధీ బుక్‌హౌస్' సంచాలకుడి బాధ్యతలు చేపట్టారు.

ఢిల్లీలో గాంధీబుక్ హౌస్ సంచాలకుడుగా ఉన్న సమయంలో గోరాగారి కుమార్తె 'నౌ'తో ఆయన వివాహం జరిగింది. గోరాగారు, దేవేంద్రకుమార్ గారూ కలిసి వీరయ్యగారిని ఎంపికచేసి తమ కుమార్తెతో వివాహం జరిపించారు. ప్రముఖ గాంధేయవాది శ్రీ ప్రభాకర్‌జీ స్వయంగా దగ్గరుండి 'నౌ' తో వీరయ్యగారి పెళ్లి జరిపించారు.

తెలుగునాట ఆధునిక కాలంలో గాంధేయ నిర్మాణ కార్యక్రమాన్ని అక్షరాలా ఆచరణలో చూపిన మహోన్నత వ్యక్తి వీరయ్యగారు. వారు అనుకోని పరిస్థితిలో అనారోగ్యానికి గురై, మంచంలో ఉన్నప్పుడు పరామర్శించడానికి నేను వెళ్ళగా సైగలతోనే తన ప్రేమను వ్యక్తం చేసేవారు. వారిని ఆ పరిస్థితుల్లో చూడాలంటే మనసు వికలం అయ్యేది. వారి సతీమణి శ్రీమతి 'నౌ' తన భర్తని కంటికి రెప్పలా కాపాడి సేవ చేశారు. కాని "జాతస్య మరణం ధ్రువం" అన్న సూక్తికి ఎవరూ అతీతులు కానందున, వీరయ్యగారు మన మధ్య నుంచి శాశ్వతంగా వెళ్ళిపోయారు.

పేదవారి జీవితాలలో వెలుగులు నింపిన వీరయ్యగారు ఎందరికో విద్యాదానం చేశారు. ప్రకృతి వైపరీత్యాలకు గురైన ఎందరో నిర్భాగ్యులకు ఆపన్న హస్తం అందించారు. చిరాకు లేకుండా నిరంతరం సేవా కార్యక్రమాల్లో మునిగి ఉండే వీరయ్యగారు ఈ లోకం విడిచి పోవటం ఆపన్నులకు తీరని లోటు. వారు చూపిన సేవామార్గం, స్ఫూర్తి మనలను ఎల్లప్పుడూ ముందుకు నడిపిస్తాయి.

వీరయ్యగారి దివ్య స్మృతికి నివాళులు అర్పిస్తూ వారి ఆశయాల సాధనకు, వారు చూపిన సేవా మార్గంలో నడవడమే వారికి మనం అర్పించే నిజమైన శ్రద్ధాంజలి.





తుపాను ప్రాంతాలను సందర్శిస్తున్న శ్రీ మండలి వెంకటకృష్ణారావు, శ్రీ వీరయ్య ప్రభృతులు



# హెచ్ ఎన్ బోధన్ వాలా

దివిసీమ ఉప్పెన అనంతరం పునర్నిర్మాణంలో అత్యధికంగా పాలుపంచుకున్న సంస్థల్లో టాటా సంస్థ ముఖ్యమైంది. టాటా సంస్థల రిలీఫ్ కమిటీ చైర్మన్‌గా ఉన్న శ్రీ హెచ్ పి బోధన్‌వాలా వ్యక్తిగతంగా నిర్వహించిన పాత్ర గొప్పది.

టాటా సంస్థకు బట్టలమిల్లులు, విద్యుదుత్పత్తి కర్మాగారం, ఉక్కు కర్మాగారం లాంటి సంస్థలు ఎన్నో ఉన్నాయి. దేశప్రగతికి టాటా కర్మాగారాలు ప్రత్యక్ష తార్కాణాలు. వారి ఆదాయంలో 85% నిధులుగా చేసి, విద్య, వైద్యంతోపాటు, ప్రకృతివైపరీత్యాల సమయంలో సేవలందించటానికి వెచ్చిస్తుంటారు. స్కాలర్ షిప్పులూ, ఆర్థిక సహాయాలూ చేస్తుంటారు. భారతదేశంలో ఎక్కడ ఏ సహాయం అవసరం అయినా అక్కడ టాటా రిలీఫ్ కమీటీవారు తామున్నామంటూ ముందుకొస్తారు. ఈ రిలీఫ్ కమిటీకి శ్రీ హెచ్.పి బోధనవాలా అధ్యక్షుడుగా ఉన్నారు.

దివి ఉప్పెన రాగానే బోధనవాలా గారు హుటాహుటిన హైదరాబాద్ వచ్చి రాష్ట్ర ముఖ్యమంత్రిగారినీ, గవర్నర్ గారినీ కలిశారు. అవనిగడ్డవచ్చి నాన్నగారితో మాట్లాడారు. నాన్నగారూ, బోధనవాలాగారు ఉప్పెన ప్రభావిత ప్రాంతాల్లో పర్యటించారు. నాన్నగారు దగ్గరుండి అక్కడి పరిస్థితిని ఆయనకు బాగా ఆకళింపు అయ్యేలా వివరించి చెప్పారు. ఆయన చలించి పోయారు.

మా నాన్నగారి వ్యక్తిగత కార్యదర్శి, అంతకు పూర్వం ప్లానింగ్ డైరెక్టరుగా పనిచేసిన సంతానబాబు గారిని తోడిచ్చి బోధనవాలా గారితో సంగమేశ్వరానికి

పంపించారు మా నాన్నగారు. రవాణా సౌకర్యాలు పూర్తిగా ధ్వంసం అయిన ఆ పరిస్థితిలో వారిద్దరూ నడుచుకుంటూ సంగమేశ్వరానికి వెళ్లారు.

ఆ ప్రాంతాలన్నింటినీ పరిశీలించాక నాలి, సంగమేశ్వరం, సొర్లగొంది, కమ్మనమోలు గ్రామాల్లో తుఫాను షెల్టర్ల నిర్మాణానికి బోధనవాలా గారు అంగీకారం తెలిపారు. షుమారుగా 77.18 లక్షల రూపాయలను వీటి నిర్మాణానికి ఖర్చు చేశాము. టాటా సంస్థకు చెందిన వివిధ కంపెనీలు, వాటిలో పనిచేసే ఉద్యోగులూ కలిసి 56.68 లక్షల రూపాయల నిధులు అందించగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 20.5 లక్షల రూపాయలను విడుదల చేసింది. దివిసీమ మరియు గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాల్లో మొత్తం 600 ఇళ్లు, 11 కమ్యూనిటీ కేంద్రాల్ని నిర్మించారు.

టాటా సంస్థనుంచేవచ్చిన మరో మహోన్నత సేవామూర్తి శ్రీమతి లీలా సుమంత్ మోల్గావ్‌కర్. భారతదేశంలోనే మొదటిసారిగా రక్తదాన కేంద్రాన్ని ఏర్పాటుచేసి, బ్లడ్ బ్యాంకులను నెలకొల్పే ఆలోచన చేసిన సేవామణి ఆమె. 1963లో శ్రీమతి ఇందిరాగాంధీ కేంద్ర ఆరోగ్యశాఖామంత్రిగా ఉన్నకాలంలో ఆమె మొదటి రక్తదాన సేవా సంస్థను ఏర్పాటు చేసి, ఆమెతో ప్రారంభింపచేశారు. రక్తదాతల లిస్టు తయారు చేయటం, దాతలను రక్తదానం కోసం ప్రేరేపించటం, ప్రోత్సహించటం, రక్తం అవసరమైనవారు దాతలను సంప్రదించే విధంగా దాతల పేర్లను, వాళ్ల బ్లడ్ గ్రూపునూ అందుబాటులో ఉంచటం లాంటి సేవలన్నీ ఈ సంస్థ నిర్వహించేది.

1994లో టాటా మోటార్‌ఫోర్స్ లిమిటెడ్ సంస్థ 1948 సి.సి. డీజెల్ ఇంజెన్, 10 సీట్లు కలిగిన సుమో కారుని మార్కెట్లోకి విడుదల చేసింది. 3 సంవత్సరాల్లో లక్షకార్లను అమ్మిన ఘనత దానిది. ఇది సుమంత్ మోల్గావ్‌కర్ అనే మహారాష్ట్ర వ్యాపారవేత్త. టాటా మోటార్స్ సంస్థకూ రూపశిల్పి ఆయనే! ఆయన, ఆయన భార్య లీలా సుమంత్ మోల్గావ్‌కర్ ఇద్దరూ టాటా సంస్థలో నిర్మాణాత్మక పాత్ర పోషించిన వ్యక్తులు. సుమో అనే రెండక్షరాల పేరులో “సు” అంటే సుమంత్, “మో” అంటే మోల్గావ్‌కర్ అని! సుమంత్ గారు టాటామోటార్స్ సంస్థ వైస్ చైర్మన్‌గా ఉన్నారు. మారుతీ సుజుకీ సంస్థకు నాన్ ఎగ్జిక్యూటివ్ చైర్మన్‌గా కూడా వ్యవహరించారు.

1990లో సుమంత్ గారికి పద్మభూషణ్ పురస్కారం రాగా, లీలా సుమంత్ గారికి సామాజిక సేవారంగంలో 1963లోనే పద్మశ్రీ పురస్కారం లభించింది. ఆ విధంగా ఆ దంపతులిద్దరూ సమాజసేవలో పునీతులైన దేశప్రముఖులు.

2014లో వచ్చిన హుద్‌హుద్ తుఫాను సమయంలో రతన్ టాటాగారు 3 కోట్లు ముఖ్యమంత్రి సహాయనిధికి విరాళంగా ఇచ్చి ఆదుకున్నసంగతి ఇక్కడ స్మరణీయం.

టాటా ఇంజనీర్లు, ఆర్కిటెక్టులూ స్వయంగా వచ్చి నిర్మాణాలు చేపట్టారు. వేరొకరికి నిధులిచ్చి ఖర్చు పెట్టించటం లాంటివి చెయ్యలేదు. దివిసీమలో తుఫాన్లు వచ్చే అవకాశం ఉన్న ప్రాంతాల్లోనూ కమ్యూనిటీ సెంటర్లను నిర్మించారు. వరదలు, ఉప్పెనలు, తుఫానులూ వగైరా ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు ఈ కేంద్రాలు ప్రజలు తలదాచుకోవటానికి వీలుగా చెక్కుచెదరకుండా దృఢంగా నిలబడి ఉంటాయి. మిగిలిన సమయాలలో వీటిని స్కూళ్ళుగానూ, వైద్యశాలలుగానూ, ఉపయోగించు కునేందుకు వీలుగా ఉన్నాయి. ఒకేసారి 1200 మందికి ఆశ్రయం ఇవ్వగలిగినంత విశాలంగా ఈ రక్షణ కేంద్రాలను నిర్మించారు.

మే 1979లో రెండవ తుఫాను వచ్చింది. అప్పటికి ఇంకా పునర్నిర్మాణం పనులు ప్రాధమిక దశలోనే ఉన్నాయి. కానీ, టాటావారి తుఫాన్ సంరక్షణ కేంద్రం పూర్తయ్యింది. ముందస్తు హెచ్చరికలు బాగా చేయగలగడంతో అవనిగడ్డ రేపల్లె పరిసరాల నుండి ప్రజలు టాటా వారి ఈ సంరక్షణ కేంద్రంలో తలదాచుకున్నారు. ఈ కేంద్రంలో కిటికీల్లోంచి టెలిఫోన్ స్తంభాలు, చెట్లు అనేక ఇళ్ళు నేలకూలటాన్ని వాళ్ళు స్పష్టంగా చూడగలిగారు. తామెంత సురక్షిత స్థావరంలో ఉన్నామో వారికి అర్థం అయ్యింది.

The creation of Wealth: The Tata's from the 19th to 21 Century అనే పుస్తకంలో దివి ఉప్పెన సమయంలో వారి సేవల వివరాలను టాటా సంస్థవారు రికార్డ్ చేసుకున్నారు.

17-11-81న పునర్నిర్మాణ కార్యక్రమాలు పర్యవేక్షించటానికి శ్రీ బోధనవాలా మరొకసారి దివిసీమ వచ్చారు. మా నాన్నగారు వారిని ఘనంగా సన్మానించారు. ఆ సభలో శ్రీ బోధనవాలా చాలా ఉద్విగ్న భరితంగా ప్రసంగించారు.

నేను జెంషెడ్‌పూర్ నుండి వచ్చాను. అక్కడ 1906లో జెంషెడ్‌జీ టాటా ఉక్కు కర్మాగారాన్ని స్థాపించినప్పుడు ఒక ఇంగ్లీషాయన హేళనగా ఇండియాలో ఇనుమును తయారుచేయగలడా? చేస్తే నేను దాన్ని తినేస్తాను" అన్నాడు. జెంషెడ్‌జీ నాణ్యమైన ఉక్కును తయారు చేశాడు. కానీ దాన్ని తినడానికి ఆ పెద్దమనిషి బతికి లేదు.

జెంషెడ్‌జీ ఒక పార్సీ. నేను కూడా పార్సీ వాణ్ణే! ఇరాన్ లోని పార్స్ అనే ప్రాంతం నుండి శతాబ్దాల క్రితం మా కుటుంబాలు తరలివచ్చి, భారతదేశంలో మమేకం అయ్యాం. ఈ దేశపు ఆర్థిక ప్రగతిలో భాగస్వాములం అయ్యాం. మా సంస్థల ఆదాయాల్లోంచి 85 నిధుల్ని కేవలం సామాజిక సేవల నిమిత్తం మాత్రమే వినియోగిస్తున్నాం. ఈ నిధుల వినియోగం కోసం టాటా రిలీఫ్ కమిటీ ఏర్పడింది. నేను ఈ కమిటీకి చైర్మన్‌గా వ్యవహరిస్తున్నాను. దేశంలో ఎక్కడ ఏ విపత్తు సంభవించినా అక్కడ మేమూ మా సిబ్బంది వెళ్ళి తగిన సాయం అందిస్తాం.

ఆంధ్రాలో 1977 ఉప్పెన వచ్చినప్పుడు నేను ఇక్కడికి వచ్చాను. గౌరవనీయులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారితో కలిసి ఈ ప్రాంతాలన్ని కలియ తిరిగాను. ఇక్కడి బాధితుల కన్నీటి గాథలు వర్ణనాతీతం. ఇక్కడ షెల్టర్లు, ఇళ్లూ కట్టాం. ఇదంతా జరిగి నాలుగేళ్లు అయ్యింది. ఇప్పుడు మళ్లీ వచ్చి చూస్తున్నాను. ఇప్పుడు నాకు చాలా ఆనందంగా ఉంది.

మా సహాయంలో ఒక విశేషం ఉంది. గ్రాంట్ల రూపంలో ఎవ్వరికీ నిధులిచ్చే అలవాటు మాకు లేదు. ఏ సహాయం కావాలన్నా మా సిబ్బందేవచ్చి స్వయంగా అందిస్తారు. ఇతరులతో ఈ చేయించటం అనేది లేదు. అందువలన మా నాణ్యత మీద మాకున్న నమ్మకం రీత్యా దృఢమైన నిర్మాణాలు చేపట్టగలిగాం. మేము వెచ్చించే ధనం బాధితులకు స్వయం పోషకంగా ఉపయోగపడాలని కోరుకుంటాం.

దివి ఉప్పెన తరువాత ఇక్కడ జరిగిన సేవ అంతా ఆ విధంగా బాధితులకు పునర్జీవనాన్ని, పునరావాసాన్ని కలిగింపచేయటంలో శ్రీ కృష్ణారావుగారి ఆలోచనలు చాలా ఉన్నతమైనవిగా భావిస్తున్నాను. వారి మార్గదర్శకత్వం, దిశా నిర్దేశం వలనే ఇతర సేవా సంస్థలు సైతం ఇదే మార్గాన సేవలు అందించటం వలన మొత్తం దివిసీమ చాలా వేగంగా చేదు జ్ఞాపకాల నుండి బయటపడగలిగిందని భావిస్తాను.." అన్నారు.





టాటా రిలీఫ్ కమిటీ ఛైర్మన్ శ్రీ బోధన్‌వాలాగారితో సంప్రదిస్తున్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు



# ప్రిన్స్ ముఫ్ఫుఖం జా

దివిసీమ ఉప్పెనలో నిరాశ్రయులైన బాలబాలికలకు అవనిగడ్డ గాంధీక్షేత్రం ఆశ్రయం కల్పించింది. వాళ్లకు విద్యాబుద్ధులు గడపటానికి గాంధీ గురుకులాన్ని స్థాపించారు. అప్పటికి ఆ శరణాలయం పూరిపాకల్లో నిర్వహించబడుతూ ఉండేది. అది అగ్ని ప్రమాదానికి గురికావటంతో అనాధ బాలలకు చదువు అనే కార్యక్రమానికి పెద్ద అఘాతం ఏర్పడినట్టయ్యింది. అయినా మొక్కవోని ధైర్యంతోనూ, నిబద్ధతతోను, ఆత్మవిశ్వాసంతోనూ పక్కాభవనాల నిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

ప్రత్యేకించి నిజాం చారిటబుల్ ట్రస్టు పక్షాన ప్రిన్స్ ముప్పుఖంజా లక్షరూపాయల విరాళం అందించారు. ఆ రోజుల్లో లక్షరూపాయలు చిన్నమొత్తమేమీ కాదు. అయినా, భవనాల నిర్మాణానికి ఆ మొత్తం సరిపోకపోయినా అడుగు ముందుకు వేయటానికి ఆ నిధి ఎంతగానో తోడ్పడింది.

నిజానికి ఆనాడు దేశంలో అత్యంత ధనికుడైన వ్యక్తుల్లో ఒకడైన ఈ నిజాం యువరాజు అతి నిరాడంబరంగా మా అందరితోపాటు సంచరించటం ఆశ్చర్యాన్ని కలిగించింది. సంపన్నుడినన్న అహంకారం అతిశయం, ఆయనలో ఏ కోశానా మాకు కనిపించలేదు.

నడమంత్రపుసిరి రాకతో కొత్త ధనవంతులు అతిశయించి వ్యవహరించటాన్ని ఎందరి విషయంలోనో మనం చూస్తూనే ఉంటాం, స్వతహాగా రాజ కుటుంబీకుడు, సిరిసంపదలలో పుట్టిపెరిగినవాడూ విశ్వసంపన్నుడూ అయిన వ్యక్తి అన్నీ ఉన్న ఆకులా

ప్రిన్స్ ముఫ్ఫఖం జా అతి సామాన్యుడిలా, ఏ భేషజమూ లేకుండా సంచరిస్తున్నా డనిపించింది.

అవనిగడ్డలో మసీదు పునర్నిర్మాణానికి కూడా నిజాం ట్రస్టు నుండి ఆయన నిధులందించారు. ఆ మసీదును సందర్శించి, అక్కడి సామాన్య మహమ్మదీయుల్తో కలిసి నమాజు చేశారు.

నిజాం ట్రస్టు అందించిన సహాయం కన్నా ప్రిన్స్ ముఫ్ఫఖం జా నిరాడంబరత నన్ను ఎక్కువ ఆకట్టుకుంది. ఈనాటి కొత్త ధనవంతుల పటాటోపాలు ఎలా ఉంటాయో మనందరం చూస్తూనే ఉన్నాం. అణకువ అణువణువునా ఉట్టిపడే రీతిలో పుట్టు సంపన్నుడైన ఈ ప్రిన్స్ గారిని చూసి నేర్చుకోవలసింది చాలా ఉన్నదనిపించింది. అందుకే ఈ ఆపద్బాంధవులు గ్రంథంలో ఆయనక్కూడా సముచిత స్థానాన్ని ఇవ్వటం జరిగింది.

హైద్రాబాద్ రాష్ట్రానికి చిట్టచివరి నిజాం ఒస్మాన్ ఆలీ ఖాన్ మనుమడు. "మీర్ కరామత్ ఆలీ ఖాన్ సిద్దికి బయాఫెండి బహదూర్ ముఫ్ఫఖం జా" ఆయన అసలు పేరు. రాజవంశంలో 8వ తరంవాడు. యువరాజు అజామ్ జా కుమారుడు. ఆయన చదువు డూన్ స్కూల్లోనూ, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోనూ సాగింది. ఎక్కువకాలం విదేశాల్లోనే ఉన్నాడు. ఫ్రాన్సులో స్థిరపడ్డాడు.

నిజానికి 1980 వరకూ ముఫ్ఫఖం జా భారతదేశంలో అత్యధిక ధనవంతుల్లో ఒకడే. కానీ ఆ తరువాతికాలంలో రాజభరణాల రద్దు తరువాత చాలా ఆస్తిని కోల్పోయారు. వారి తాతగారు ఆఖరి నిజాం స్థాపించిన 'నిజాం ట్రస్టును' కొనసాగిస్తూ దానధర్మాలు, సేవా కార్యక్రమాలూ నిర్వహింపచేస్తూ ఉంటాడాయన.

అవనిగడ్డ వచ్చినప్పుడు ఆయన చేసిన ప్రసంగం చాలా క్లుప్తంగానూ, గంభీరంగానూ సాగింది:

"మీ స్వాగతానికి, మీ ఆహ్వానానికీ హృదయపూర్వకంగా సంతోషిస్తూ ఇక్కడికి రావటం జరిగింది. ఇక్కడి సేవా కార్యక్రమాలు నన్నెంతగానో ప్రభావితుణ్ణి చేశాయి. అంతేకాక తుఫాను సందర్భంలో మీరు ధైర్యంగా నిలబడి పునర్నిర్మాణ కృషి చేయటం నాకు చాలా సంతోషం కలిగించింది.

ఇక్కడి కార్యక్రమాలన్నీ శ్రీ కృష్ణారావుగారి వల్ల జరుగుతున్నాయి. వారు నాయకులే కాదు, సేవాతత్పరులు కూడా! నిజాం ట్రస్టు వారి సహాయం ఇక్కడ అందించటం నేను ఒక అదృష్టంగా భావిస్తున్నాను.

ముఖ్యమంత్రి తుఫాను బాధితుల సహాయనిధికి గాను గతంలోనే మేము కొంత దబ్బిచ్చాం. శతజయంతి సందర్భాలలోనే కాక నిరంతరం ఇక్కడ సేవలు ఒక అలవాటుగా సాగిపోతున్నాయి.

నేను ఒకనాడు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారిని కలిసినప్పుడు ఇక్కడి కార్యక్రమాల గురించి అడిగి అడిగి విషయాలను తెలుసుకున్నాను ఇంకా సాయం చేస్తానని చెప్పాను. అనాథ పిల్లలకు మేము సాయపడ్తున్నాము. వారికి వసతితోపాటు విద్యా విషయంలో కూడా కృషి జరుగుతోందని తెలిసి సంతోషించాను. వారికి వృత్తి విద్యల్లో నైపుణ్యం కలిగేలా నేర్పించటం మీద శ్రద్ధ చూపగలరు.

పూజ్యులు మా తాతగారు అనాథ శరణాలయం స్థాపన చేయటమే కాకుండా వారి విద్య విషయంలో కూడా శ్రద్ధ చూపేవారు. ప్రభుత్వం కొంతవరకే సాయం చేయగలుగుతుంది

ఇటువంటి ఆపద మరొకసారి మీకెవ్వరికీ రాకూడదని కోరుకుంటున్నాను. ఇక్కడ జరుగుతున్న కృషికి అందరి తోడ్పాటూ కావాలని నేను భావిస్తున్నాను. వైద్యరంగంలో మన అనుభవం వల్ల రోగాలు ప్రబలకుండా చూడవలసిన అవసరం ఉంది. అందుకు ముందే కృషి చేయాలి. కష్టాల్ని ఎదుర్కోవటానికి సంసిద్ధత మనం ఏర్పరచుకోవాలి.

ఇక్కడ ఒక ప్రదర్శనశాల ఏర్పాటుచేయబోతున్నారని విని, నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ ప్రదర్శనశాల కష్టనష్టాలను మాత్రమే కాకుండా, కష్టాలను ఎదుర్కొనే విజ్ఞానాన్ని తెలిపేదిగా కూడా ఉండాలని మనవి చేస్తున్నాను.

ఈ శత జయంత్యుత్సవాల ప్రారంభోత్సవం జరిపినందుకు నేను ఆనందిస్తున్నాను, ఈ పిల్లలందరూ ఇక్కడినుండి విద్యావంతులై నిపుణులై బయటకు వెడతారని ఆశిస్తున్నాను. అసాధారణ సేవా కార్యక్రమాలు నిర్వహించే అందరికీ నా ధన్యవాదాలు. సెలవు! ఇలా సాగింది ఆయన సంక్షిప్త ప్రసంగం.

ప్రిన్స్ ముఫ్ఫఖం జా చాలా తక్కువ మాట్లాడే వ్యక్తి. పది ప్రశ్నలకు ఒక సమాధానంగా ఉంటుంది ఆయన ధోరణి. విలేకరులు కూడా ఆయన దగ్గర్నించి జవాబులు రాబట్టటానికి చాలా కష్టపడతారు. తక్కువ మాట్లాడినా ఎక్కువ పని చేసే స్వభావం ఆయనది. గొప్ప వదాన్యుడు ఆయన. మనం చేసే దానధర్మాలు పేదలు తమ కాళ్లమీద తాము నిలబడేందుకు తోడ్పడేవిగా ఉండాలని ఆయన బలంగా

విశ్వసించేవారు. అందుకే అనాథ పిల్లలను చేరదీసి, వాళ్లకు వృత్తివిద్యలు నేర్పించాలనే వారు. తాను బతుకుతూ పదిమందిని బతికించే అవకాశం వృత్తివిద్యల వలనే సాధ్యమౌతుందని ఆయన బలంగా నమ్మేవారు.

ఆ రోజు సభలో మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు ఆయనకు స్వాగతం పలుకుతూ మాధవసేవకన్నా మానవసేవ గొప్పతనాన్ని విశదీకరించారు. గాంధీ, బుద్ధుడు, క్రీస్తు, అల్లా వీరంతా ప్రపంచ శాంతిని కోరినవారు. వారి కృషిని మత దృష్టితో కాక, సేవే ప్రధానం అనే దృష్టితో వారి నాదర్శంగా చేసికొని మనం పనిచేయాలన్నారు. ఆయన ఉపన్యాసం ఇలా సాగింది:

"ప్రిన్సు ముఫ్ఫఖం జా వారు చదివిందీ నివసించిందీ ఎక్కువగా విదేశాల్లోనే అయినా, ఆయన అప్పుడప్పుడూ వచ్చిపోతూ నిజాంట్రష్టు తరఫున అనేక దానధర్మాలు చేస్తున్నారు.

ఇక్కడి నిర్మాణం పనుల గురించి నేను శ్రీ అసిఫ్ పాషా గారి ద్వారా వారికి సవివరంగా వివరించాను. సాయపడ వలసిందిగా అభ్యర్థించాను. వారు అంగీకరించి, శ్రీ గురుదాసుగారిని పంపి, వివరాలు పరిశీలించి ఒక లక్షరూపాయలు విరాళంగా ఇచ్చారు. కానీ, దీని నిర్మాణానికి మూడు లక్షలయ్యింది. వారిచ్చిన దానికి ఇతరులు ఇచ్చినదాన్ని కలిపి ఈ నిర్మాణాన్ని పూర్తి చేయటం జరిగింది.

ప్రిన్సు ముఫ్ఫఖం జా గారిని ఒక్కసారి ఇక్కడకు రప్పించి, ఈ దివిసీమ పరిస్థితిని వారికి చూపించాలనే కోరికతో నేను వారిని కోరటం, వారు వచ్చి ఈ ప్రారంభోత్సవం చేయటం ముదావహం. వీరు ఉప్పెన సందర్భంలో ముఖ్యమంత్రి సహాయనిధికి కూడా విరాళం అందించారు" అంటూ వారికి కృతజ్ఞతలు తెలియజేశారు.

మాజీ న్యాయశాఖామాత్యులు శ్రీ అసిఫ్ పాషా గారు ఆ సభలో మాట్లాడారు. తుపానుకు పూర్వం, తుపాను సందర్భంలోనూ కూడా కృష్ణారావుగారితో కలిసి ఈ ప్రదేశాలన్నీ నేను చూడటం జరిగింది. స్వచ్ఛంద సేవాసంస్థలు ఈ ప్రాంతంలో చేసిన కృషి, గాంధీ క్షేత్ర నిర్మాణం అభివృద్ధి వీటన్నింటినీ గమనిస్తే ఒకమనిషి ఎంతపని చేయగలరో మనకు అర్థం అవుతుందన్నారు. నిజాం ట్రష్టు 20 కోట్ల రూపాయలతో ఒక నిథిని ఏర్పాటు చేయటం, అందుకు ప్రిన్సు ముఫ్ఫఖం జా వారు సాయపడుతూ విరివిగా దానధర్మాలు చేస్తున్నారని చెపుతూ వారి త్యాగనిరతిని ప్రశంసించారు.

ప్రిన్స్ ముఫ్ఫఖం జా 1939 ఫిబ్రవరి 27న జన్మించారు. ఫ్రాన్సులో హిలాఫెత్

రాజభవనంలో ఉంటున్నారు. భార్య ప్రిన్సెస్ ఎసిన్ ఇన్సియలెందరోగ్లు. ఈమె టర్కీ యువరాణి. చివరి నిజామ్ కుమారుడైన అజామ్ జా, దుర్రు షేవార్ ఈయన తల్లిదండ్రులు.

ప్రిన్స్ ముఫ్ఫఖ్ఖం జా తల్లి "బేగం సహిబా హటికె హేరియే ఆయ్సే దుర్రుషేవార్ సుల్తాన్ (ఒట్టోమన్ టర్కిష్)" గొప్ప అందగత్తె. దుర్రు షేవార్, ఆమె చెల్లెలు నీలోఫర్ ఇద్దరూ నిజాం యువరాజులు అజంజా, మొఫ్ఫఖంజాలను పెళ్లి చేసుకున్నారు. అ విధంగా రెండు గొప్ప రాజవంశాలకు వారసురాలు దుర్రు షేవార్!

భర్త అజంజాని యువరాజుగానూ, రాజ్యానికి వారసుడిగానూ ప్రకటించుట వలన ఆమె ప్రాధాన్యత పెరిగింది. షేవార్ తండ్రి టర్కీ రాజ్యానికి ఆఖరి ఖలీఫ్. టర్కీ దేశం భారత దేశం కూడా స్వాతంత్ర్యాం పొందటంతో ఆమె పుట్టింటా, అత్తింటా రాజ్యాధికారాలు పోయి ఒక్కసారిగా కష్టాలు దాపురించాయి. తరువాతి టర్కీ ప్రభుత్వం ఈమె కుటుంబాన్ని అవమానించింది. తన మరణం తరువాత టర్కీలో సమాధి చేయవద్దని ఆమె చెప్పారు. ఆమె మనస్తాపానికి అది గుర్తు. తన ఇద్దరు పిల్లల్నీ బ్రిటన్లో చదివించింది. ఇద్దరికీ టర్కిష్ అమ్మాయిల్నే ఇచ్చి పెళ్లి చేసింది.

దుర్రు షేవర్ అంటే ఆధునిక భావాలు కలిగిన మహిళగా ఆరోజుల్లో ఆమె ప్రసిద్ధి పొందారు. నిజాం చరిత్రలో తొలిసారిగా ఒక మహిళ బయటకు వచ్చి బహిరంగ సభలో పాల్గొన్నది ఆమే! 1933లో టేన్నిస్ పోటీ విజేతలకు బహుమతి ప్రధానం చేయటానికి ఆమె వచ్చారు. 1940లో నిజాం విమానాశ్రయాన్ని ఆమే ప్రారంభించారు. ఉస్మానియా జనరల్ ఆసుపత్రిని, దుర్రుషేవర్ చిల్డ్రన్ & జెనరల్ హాస్పిటల్ రెండింటినీ ఆమే ప్రారంభించారు. ఆలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయంలో అజ్మల్ 'ఖాన్ టిబియా కాలేజీ, ఆసుపత్రి ఏర్పాటు చేశారామె. ఆ రోజుల్లో దుర్రూ షేవార్'ని అమూల్య పగడం (ప్రైస్‌లెస్ పెరల్) అని గౌరవంగా పిలుచుకునే వాళ్లు.

దుర్రూ షేవార్ ఇద్దరు మగపిల్లలకు జన్మనిచ్చింది. పెద్దకొడుకు ప్రిన్స్ ముకర్రంజా, జవహర్లాల్ నెహ్రూ ఇద్దరూ బాగా సన్నిహితులు. నెహ్రూ కాలంలో నిజాం కుటుంబానికి సముచిత గౌరవం కల్పించటానికి కొంత ప్రయత్నాలు జరిగాయి. ముకర్రంజాని ఏదైనా మహమ్మదీయ దేశానికి రాయబారిగా పంపే ఆలోచన కూడా జరిగిందని చెప్తారు

రెండవ కుమారుడు ప్రిన్స్ ముప్పఖం జా. స్వతహాగా దాతృత్వం కలిగిన వ్యక్తి. తాతగారి వారసత్వ సంపదని పరిరక్షించాలనే ఆలోచన ఉన్నవాడు. హైదరాబాద్

నగరంలో ప్రసిద్ధ ముప్ఫఖం జా కాలేజి ఆఫ్ ఇంజనీరింగ్&టెక్నాలజీ ఈయన పేరుతోనే నెలకొల్పబడింది.

'ప్రిన్స్ ముఫ్ఫఖ్ఖం జా' గారికి ఇద్దరు మగపిల్లలు- పెద్దకుమారుడు నవాబ్ మీర్ రఫాత్ ఆలీఖాన్. రఫత్ జా అని పిలుస్తారు ఈయన్ని. రెండవ కుమారుడు నవాబ్ మీర్ ఫర్హత్ ఆలీ ఖాన్, ఫరాహత్ జా అని పిలుస్తారు ఈయన్ని. ఆనాటి నిజాం రాజ్యంలో ప్రసిద్ధి చెందిన మహా భవంతుల్లో చౌమహల్లా ప్యాలేశ్ అసఫ్ జాహి రాజవంశానికి మూలస్థానం. నిజాం రాజ్యాన్ని పాలించిన నిజాములకు ఈ భవంతి అధికార నివాసం.

ప్రిన్స్ ముప్ఫఖం జా దీన్ని తెలుగు వారి వారసత్వ సంపదగా తీర్చిదిద్దారు. సాంస్కృతిక వారసత్వాన్ని పదిలపరచి నందుకుగాను యునెస్కో వారు ఇచ్చే ఆసియా పసిఫిక్ ప్రతిభా పురస్కారం 2010లో ఈ మహాభవంతికి లభించింది. 1750లో సలాబత్ జంగ్ ఈ భవన నిర్మాణానికి పూనుకున్నాడు. 5వ నిజాం కాలంలో 1857లో దీని నిర్మాణం పూర్తయ్యింది. 2005 నుండీ దీన్ని ప్రజాపరం చేస్తూ నిజాం కుటుంబీకులు నిర్ణయం తీసుకోవటం ఒక విశేషం. ఇప్పటికీ ప్రభుత్వ పరంగా జరిగే అంతర్జాతీయ కార్యక్రమాల సందర్భంగా వచ్చే విదేశీ ప్రతినిధులకు గవర్నర్, రాష్ట్రపతి స్థాయి వ్యక్తులకు ఇచ్చే విందుల సందర్భంగా ఈ మహల్ ఎంతగానో తోడ్పడుతోంది.

రాష్ట్రం విడిపోయాక ఒకసారి ఆయన హైదరాబాద్ నగరానికి వచ్చారు. ఆ మహానగరం ఉత్థాన పతనాలన్నీ కళ్లారా చూసిన వాడు కావడంతో విలేకరులు ఆయన్ని గుచ్చి గుచ్చి అడిగినప్పుడు తెలుగువారు విడిపోయినందుకు మనసులో బాధని పంచుకున్నారు. "ఈ విభజన ప్రజల మేలుకోసమేనా?" అని ఎదురు ప్రశ్నించారు. "నాకు ఆంధ్ర తెలంగాణాల మధ్య ఒక కృత్రిమమైన హద్దుగీతల మీద విశ్వాసం లేదు. తెలుగువారంతా ఒకటే...ఒకటిగా జీవించాలనేదే నా భావన" అని అన్నప్పుడు ఆయన ఎంతో భావోద్వేగానికి లోనైనట్టు పత్రికలు వ్రాశాయి. "అంతర్జాతీయ కాన్ఫరెన్సులు జరిగినప్పుడు ఊరును శుభ్రం చేయటం కాదు, అది నిరంతరం జరగాల్సిన అంశం అన్నారాయన. చార్మినార్ ఆధునీకరణ గురించి అడిగినప్పుడు, చారిత్రక కట్టడాలను యథాతథంగా పరిరక్షించాలేగాని, వాటిని ఆధునీకరించే ఆలోచనలు మంచివి కాదు" అని వ్యాఖ్యానించారు.

తాను మళ్లీ తప్పక హైదరాబాద్ వస్తానని, ఇంక ఇక్కడే ఉండిపోతానని అన్నాడు. తనకు రాజకీయాలపట్ల గానీ, అధికార పదవులపట్ల గానీ ఆసక్తి లేదని, తనకు ప్రజలతో ఎక్కువగా గడపాలని ఉంటుందని ఆయన అన్నారు. ఎప్పటికైనా ఇక్కడకు వచ్చి ప్రజలతో మమేకమై జీవిస్తానని ఆయన ప్రకటించాడు. ఈ వృద్ధాప్యాన్ని ప్రజల వద్దే గడుపుతానన్నాడాయన.

రాచరికం పోయి, సంపదలు కోల్పోయినా రాజకీయాలపట్ల ఆసక్తి లేకపోవటం, అధికారాలు అనుభవించాలనే కోరిక లేకపోవటం, ఉన్నంతలో ప్రజలకు ఎంతో కొంత మేలుచేసి, వాళ్లు బతుకుతూ పదిమందిని బతికించేవారిగా ఎదగాలని కోరుకోవటం ఆయన ప్రత్యేకతలు.

కుటుంబంలో కమ్ముకున్న వైషమ్యాలు, ఆస్తి తగవులు, కోర్టు గొడవలు ఎన్ని ఉన్నా, ఆయన మనసు వాటికి అతీతంగా తెలుగు ప్రజలందరి సంక్షేమాన్ని మాత్రమే కోరుకోవటం విశేషం.



*నిజాంట్రస్ట్ ఛైర్మన్ శ్రీ ముఫ్ఫఖ్ఖంజా. శ్రీ ఆసిఫ్ పాషా, శ్రీ మండలి వెంకటకృష్ణారావు*



## శ్రీ టోకార్షీ లాల్జీ కాపడియా

దివిసీమ ఉప్పెన వార్తలు ఒక్కొక్కటిగా వెలుగులోకి వస్తున్న కొద్దీ ప్రపంచ వ్యాప్తంగా ఆర్ద్రత ముంచెత్తసాగింది. దాతలు, సేవాతత్పరులు స్వచ్ఛందంగా ముందుకు రాసాగారు. వారందరినీ సమన్వయయం చేసి, దివిసీమ పునర్నిర్మాణం వైపు దృష్టిసారించేలా చేయటంలో మా నాన్నగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు నిర్వహించిన పాత్ర ముఖ్యమైంది. సేవాతత్పరులకు మనదేశంలో కొదవలేదని, వారి సేవలను నిర్మాణాత్మకంగా ఉపయోగించటం అవసరం అనీ ఆయన భావించారు. ఆ మేరకు రాష్ట్ర ప్రభుత్వం ప్రముఖ సేవాసంస్థలతోనూ, సేవారంగ ప్రముఖులతోనూ ఒక సమావేశం ఏర్పాటుచేసి, దివిసీమ బాధితులకు తక్షణ సహాయం గురించి చర్చించింది. ఉప్పెన బాధితులకు ఇతోధికంగా సేవలందించవలసిందిగా విజ్ఞప్తి చేసింది.

టోకార్షీ లాల్జీ కాపడియా ఆనాడు ఆంధ్రప్రదేశ్ వాణిజ్య సంస్థలు మరియు పరిశ్రమల సమాఖ్యకు (ఫెడరేషన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ ఛాంబర్స్ కామర్స్ & ఇండస్ట్రీ) అధ్యక్షుడుగా ఉన్నారు. ఆయనకూడా అదే హోదాలో ఆ సమావేశంలో పాల్గొన్నారు. ఆయన వెనువెంటనే అందరినీ ఉప్పెనబాధితులసాయానికి స్పందించవలసిందిగా వాణిజ్య సంస్థలకు, పరిశ్రమల వారికీ పిలుపునిచ్చారు.

కాపడియాగారి మాటమీద నమ్మకాన్ని, గౌరవాన్నీ ఉంచిన వాణిజ్యవేత్తలు, పారిశ్రామిక వేత్తలు తక్షణం స్పందించటంతో 75 లక్షల రూపాయల విరాళం

పోగయ్యింది. ఆనాటి రూపాయ విలువతో పోలిస్తే అది సామాన్యమైన నిధి కాదు. కాపడియాగారు ఆ మొత్తాన్ని ముఖ్యమంత్రి సహాయనిధికి సమర్పించారు.

అక్కడితో తన బాధ్యత అయిపోయిందని కాపడియాగారు ఊరుకోలేదు. ఆయన తన పలుకుబడితో రాష్ట్రంలోనూ, దేశంలోని ఇతర ప్రాంతాలలోనూ ఉన్న సేవాసంస్థల వారిని సంఘటిత పరచారు. ఆర్ సి సి ఇళ్ల నిర్మాణాలకు ప్రభుత్వంవారు ఆమోదించిన డిజైన్ ప్రకారం బాధితులకు శాశ్వత గృహ నిర్మాణం చేయించే కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు.

శ్రీ కాపడియాతో కలిసి దివి బాధితులకు పునరావాసాన్ని, దివిసీమ పునర్నిర్మాణాన్నీ చేపట్టేందుకు అనేక సేవా సంస్థలు దేశవ్యాప్తంగా ముందుకొచ్చాయి.

గుజరాత్ నుండి సంకట నివారణ సంఘం పక్షాన శ్రీ హీరాలాల్ భగవతి, భగవాన్ మహావీర్ కళ్యాణ కేంద్రం, బొంబాయి పక్షాన శ్రీ చోతాలాల్ కందార్ ప్రభృతులు ఇలా ముందుకువచ్చిన వారిలో ప్రముఖులు.

భగవాన్ మహావీర్ కళ్యాణ కేంద్రం, బోంబాయి వారు 10,77,500 రూపాయల వ్యయంతో కొత్తపాలెం, సింహాచలం, కమ్మవారి చేరు, పాతపల్లె తుమ్మలపాలెం గ్రామాలలో 415 ఇళ్ల నిర్మాణాన్ని చేపట్టారు.

సంకట నివారణ సమితి (గుజరాత్) వారు 10,60,000 రూపాయల వ్యయంతో Vadepalem సత్యనారాయణపురం, గ్రామాలలో 408 ఇళ్లను నిర్మించేందుకు పూనుకున్నారు.

ఇలాగే మార్వాడీ రిలీఫ్ సొసైటీకలకత్తా వారు 2,50,000 రూపాయలతో, వెంకటదుర్గాంబపురంలో 100 ఇళ్ల నిర్మాణాన్ని చేపట్టారు. ఆనంద్ ఫౌండేషన్ పూనా వారు లక్ష రూపాయల వ్యయంతో పెదయాదర హరిజనవాడలో 40 ఇళ్ల నిర్మాణాన్ని చేపట్టారు. అఖిలభారత అనువ్రత్ సమితి, న్యూ ఢిల్లీ వారు లక్షరూపాయల వ్యయంతో భవానీపురంలో 40 ఇళ్ల నిర్మాణాన్ని చేపట్టారు.

రాజస్థాన్ అసోసియేషన్ బెంగళూరు వారు 84,000 రూపాయల వ్యయంతో పెదయాదరలో 40 ఇళ్లను నిర్మించాలని తలపెట్టారు. మార్వాడీ రిలీఫ్ అండ్ వెల్ఫేర్ సొసైటీ హైదరాబాద్ వారు లక్షరూపాయల వ్యయంతో 40 ఇళ్లను నిర్మించాలని పూనుకున్నారు.

ఈ మొత్తం కార్యక్రమాలను సమన్వయం చేయటానికి శ్రీ గుజరాతీ మార్వాడీ

రిలీఫ్ & వెల్ఫేర్ కమిటీని ఏర్పాటు చేసి దాని పర్యవేక్షణలో నిర్మాణ కార్యక్రమాలను పర్యవేక్షించారు. దీనికి కాపడియా అధ్యక్షుడిగా వ్యవహరించారు.

55,43,000 రూపాయల వ్యయంతో 1083 నివాస గృహాలను ఆర్ సి సి శ్లాబులు వేసి నిర్మించారు. ఉచిత గృహనిర్మాణాలకు ఎవరు ముందుకు వచ్చినా సగం ఖర్చు ప్రభుత్వం భరిస్తానని ప్రకటించి, అందుకు సమానమైన రూ. 55,43,000 మొత్తాన్నీ అందచేయటంతో వెయ్యికి పైగా పక్కా ఇళ్ల నిర్మాణం సాధ్యం అయ్యింది.

ఇండస్ట్రియల్ లైమ్స్ అనే సంస్థ ఒక మోడల్ గృహాన్ని నిర్మించింది దాని నిర్మాణాన్ని ప్రభుత్వం ఆమోదించిన తరువాత గృహనిర్మాణాలు ప్రారంభమయ్యాయి. అప్పటి రోడ్లు భవనాల శాఖ చీఫ్ ఇంజనీర్ శ్రీ కృష్ణమోహనరావు, పునరావాస వ్యవహారాల కమీషనర్ శ్రీ బి. కె. రావు ఐ ఏ యస్ రెవెన్యూ మంత్రి శ్రీ జనార్ధనరెడ్డి ప్రభృతులు అందించిన సహకారంతో ఈ ఇళ్ల నిర్మాణాన్ని వేగంగా పూర్తి చేయగలిగారు.

అప్పటికే అందుబాటులో ఉన్న ప్రిఫాబ్రికేటెడ్ విధానంలో నిర్మాణం కోసం మచిలీపట్టణంలో ఒక ఫ్యాక్టరీని నిర్మించారు. రెవెన్యూ శాఖామాత్యులు శ్రీ జనార్ధనరెడ్డి గారు ఇటుకలు వగైరా తయారు చేసే ఈ కర్మాగారాన్ని 30.4.1978న ప్రారంభించారు. ఇండస్ట్రియల్ లైమ్స్ సంస్థకు నిర్మాణబాధ్యతలు అప్పగించారు.

హైదరాబాద్ వెల్ఫేర్ సొసైటీ, గుజరాతీ సమాజం హైదరాబాద్ వారు బాధితులకు బట్టలు, వంటసామాన్లు మహిళలకు కుట్టుమిషన్లు, రైతులకు నాగళ్లు ఇతర వస్తుసామగ్రులను అందించి సహాయచర్యల్లో పాల్గొన్నారు. ఈ మొత్తం కార్యక్రమంలో ముఖ్యమైన అంశం కాపడియా గారి పిలుపు మేరకు తల్లిదండ్రుల్ని కోల్పోయిన అనాథ బాలలను దత్తత తీసుకుని వారికి విద్యాబుద్ధులు నేర్పించే కార్యక్రమాన్ని కూడా ఈ సంస్థలు చేపట్టాయి.

బోంబే కరీనా కలర్ కెమికల్స్ వ్యాపారుల సంఘం వారూ, గుజరాతీ ప్రగతి సమాజ్ వారూ కలిసి 90,000 రూపాయల వ్యయంతో తుఫాన్ రక్షణ కేంద్రాల నిర్మాణం చేపట్టారు. వీటిక్కూడా ప్రభుత్వం సమానమైన మొత్తాన్ని మ్యాచింగ్ గ్రాంతుగా అందించింది.

కృష్ణాజిల్లాలోనే కాకుండా, గుంటూరు జిల్లా రేపల్లెలో పక్కా గృహాల నిర్మాణం కోసం 2,00,000 రూపాయలను బొంబాయికి చెందిన శ్రీ భగవాన్ కళ్యాణ్ కేంద్ర సంస్థ వారు అందించారు.

ఈ కార్యక్రమాలన్నింటికీ ప్రేరకుడు, సమన్వయకర్త, పర్యవేక్షకుడూ శ్రీ టోకర్సీ లాల్జీ కాపడియా గారే. ఆయన పూనిక లేకుంటే ఇంత బృహత్తర సేవా కార్యక్రమాలు ఈ స్థాయిలో జరిగేవా అనేది సందేహమే! దేశవ్యాప్తంగా ధనిక వ్యాపారులతో తన సంబంధాలను, తన పలుకుబడినీ శ్రీ కాపడియా దివిసీమ పునర్నిర్మాణ కార్యక్రమాలకు వినియోగించారు.

సేవా మార్గంలో ఇది ఆయనకు తొలి అనుభవం కాదు. అప్పటికి పది పదేను యేళ్లుగా హైదరాబాద్ కేంద్రంగా శాశ్వత ప్రాతిపదికగా ఆయన చేపట్టిన సేవా కార్యక్రమాలు ఆయన పరమపదించిన తరువాత కూడా లక్ష్యసాధనలో ఈ నాటికీ ముందు వరుసన నిలిచిఉన్నాయి.

విద్యా సాంస్కృతిక శాఖామాత్యులుగా మా నాన్నగారు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు చేపట్టిన కార్యక్రమాలలో కూడా శ్రీ టోకార్షీ లాల్జీ కాపడియా వెన్నుదన్నుగా నిలిచారు.

1975లో ప్రంచతెలుగు మహాసభలు జరిపినప్పుడు తరతరాలతెలుగు మ్యూజియం నిర్మాణానికి హైదరాబాద్ నగర పౌరుల పక్షాన అప్పటికప్పుడు 5,00,000 రూపాయలు వసూలు చేసి ప్రభుత్వానికి అందించిన వ్యక్తి శ్రీ కాపడియా! అంతకు ముందు జరిగిన అఖిలభారత తెలుగు సాంస్కృతికోత్సవాలకు ఆంధ్రప్రదేశ్ బాల మహాసభలకు వచ్చిన ప్రతినిధులకు ఆయన ఆతిథ్యం ఇచ్చారు.

ఆయన జన్మతః తెలుగు వాడు కానప్పటికీ తెలుగునేలతో పెనవేసుకున్న అభిమానంతో తెలుగు భాషా సంస్కృతుల పట్ల మంచి అభిరుచితో ఈ ప్రోత్సాహాన్నందించారు.

గాంధేయ నిర్మాణ కార్యక్రమంలో వారితో కలిసి పనిచేసే అవకాశం నాకు కూడా కలిగింది. అదొక గొప్ప అనుభూతిగా భావిస్తాను.

హైదరాబాదు నగరం సుల్తాన్ బజారు కోఠీలో జంటనగరాలకు చెందిన పలువురు సాంఘిక కార్యకర్తలు, నాయకుల్ని ఒక ముఖ్యమైన అంతర్గత సమావేశం పేరుతో ఒక రోజు ఆహ్వానించారు శ్రీ కాపడియా. తిలక్ పార్కులో కొంత భూమిని హైదరాబాద్ పురపాలక సంఘం నుండి తీసుకుని గాంధీజ్ఞానమందిర నిర్మాణం చేయాలనేది ఆ సమావేశంలో ఏకగ్రీవంగా చేసిన తీర్మానం.

కాపడియాగారి అభ్యర్థన మేరకు మున్సిపాల్ అనుమతులు పొంది 1969

డిసెంబరు 27వ తేదీన సరిహద్దు గాంధీ భారత రత్న ఖాన్ అబుల్ గఫార్‌ఖాన్ గారి చేత గాంధీ జ్ఞాన మందిర్ భవనానికి శంఖుస్థాపన చేయించారు.

కాపడియాగారి వెంట శ్రీయుతులు పి.ఎల్. భండారీ, రామకృష్ణ ధూత్, సత్యనారాయణ గుప్త, బిరధీచంద్ చౌధరి, ఉత్తమ్ చంద్, శ్రీ కమల్ నారాయణ అగ్రవాల్ తదితరులు ఇంటింటికీ తిరిగి యీ భవన నిర్మాణం కోసం ధనం పోగు చేశారు. జంటనగరాలకు చెందిన పెద్ద పెద్ద వ్యాపారస్తులు, దాతలు విరాళాలు యిచ్చారు.

గాంధీజ్ఞాన్ మందిర్ లో గల విశాలమైన హాలు నిర్మాణానికి శ్రీ బాలాజీ శివనారాయణ అండ్ కంపెనీ ద్వారా పెద్ద మొత్తం విరాళంగా లభించింది. కేవలం 5 యేళ్ళ వ్యవధిలో భవన నిర్మాణాన్ని పూర్తి చేశారు.

1974 అక్టోబరు 2న కేంద్రీయ గాంధీ స్మారక నిధి అధ్యక్షులు శ్రీమన్నారాయణ గారు భవన ప్రారంభోత్సవం చేశారు. టోకర్సీ లాల్జీ కాపడియా పూనిక లేకపోతే ఈ కార్యం అడుగు కూడా ముందుకు కదిలి ఉండేది కాదు. ఆయన సమన్వయం చేయటంతో దేశవ్యాప్తంగా ధనిక వర్గాలు ముఖ్యంగా మార్వాడీ వాణిజ్య కుటుంబాలు ఈ వితరణ కార్యక్రమానికి చొరవగా ముందుకొచ్చాయి.

కాపడియా గారి పలుకుబడి అంతటిది. వినోబాజీతో ఆయనకున్న సాన్నిహిత్యం ఈ కార్యాన్ని సరళతరం చేసింది. ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ శంకుస్థాపనకు అంగీకరించటమే కాపడియా పెంపు చేసుకున్న ప్రతిష్ఠకు తార్కాణం.

గాంధీ జ్ఞాన్ మందిర్‌లో జరిగే కార్యక్రమాలన్నీ ఏకగ్రీవంగా నిర్ణయించబడి జరగటమే ఒక ఆనవాయితీగా ఈ సంస్థ నేటికీ నడుస్తోంది. మహాత్మా గాంధీ చిత్ర ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. గాంధీ, వినోబాభావేలకు సంబంధించిన చిత్రాలు ప్రదర్శిస్తుంటారు. సమాజంలో తరిగిపోతున్న నైతిక విలువల్ని పెంచడం, జాతీయ సంస్కృతీ సంరక్షణ ఈ సంస్థ లక్ష్యాలు. గాంధీ పుస్తకకేంద్రం కూడా ఏర్పాటు చేయబడింది. గాంధీ సిద్ధాంతాలు, ఆధ్యాత్మిక అంశాలమీద సభలు, ప్రవచనాలూ జరుగుతూ ఉంటాయి.

అనంతర కాలంలో బహుముఖీనంగా విస్తరించిన ఈ సంస్థ ఎగ్జిబిషన్ మైదానంలో గాంధీ దర్శన్ పేరట రెండతస్థుల భవన నిర్మాణం చేసింది. ప్రారంభంలో శ్రీ టోకర్సీలాల్జీ కాపడియా యీ గాంధీ దర్శన్ కార్యక్రమాలు నిర్వహించారు. వారు

కీర్తిశేషులయిన తరువాత శ్రీ బిరధీచంద్ చౌధరి బాధ్యత వహించి కార్యక్రమాలు నిర్వహించేవారు.

గాంధీ జ్ఞానమందిర్ భవనంలోనే గాంధీ స్మారక నిధి కార్యాలయాన్ని శ్రీ కోదాటి నారాయణరావు నిర్వహించేవారు.

గాంధీ సిద్ధాంతాలకు సంబంధించిన పుస్తక ప్రచురణ యీ సంస్థ లక్ష్యాలలో ఒకటి.

ఒక ప్రకృతి చికిత్సా కేంద్రంతో బాటు యోగకేంద్రం కూడా ఇక్కడ స్థాపించపడి పని చేస్తున్నది. లక్షలాది మంది స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు యీ యోగ కేంద్రం ద్వారా ఆరోగ్యవంతులైనారు, అవుతున్నారు. అనేక చోట్ల ఉపకేంద్రాలు కూడా స్థాపించబడి పని చేస్తున్నాయి. శ్రీ టోకర్సీ లాల్జీ కాపడియా యీ యోగ కేంద్రాభివృద్ధికి ఎంతో సహకరించారు. ఇప్పుడు గాంధీ జ్ఞాన మందిర్ యోగ కేంద్రానికి అధ్యక్షులు శ్రీకమల్ నారాయణ్ అగ్రవాల్, గౌరవ కార్యదర్శి శ్రీ సురేంద్ర లూణియా, డైరెక్టరు, డా. ప్రవీణ్ కాపడియా నియమింపబడి పని చేస్తున్నారు.

గాంధీజీ మరియు సర్వోదయ గ్రంథాల ప్రచురణకు సర్వోదయ విచార్ ప్రచార్ ట్రస్ట్ కూడా ఏర్పాటు చేయబడింది. ఈ ట్రస్ట్ ఆధ్వర్యాన నవజీవన ట్రస్టు, అహమదాబాదు వారు మహాత్మాగాంధీగారి ఆత్మకథను తెలుగులో ప్రచురించారు. వేమూరి రాధాకృష్ణ మూర్తి యీ గ్రంధానువాదం చేశారు. తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు పక్షాన ఆత్మకథ తెలుగు అనువాదాన్ని ఉత్తమ అనువాదంగా నిర్ణయించి శ్రీ రాధాకృష్ణ మూర్తి గారిని 1996 లో రూ. 5000 పారితోషికం యిచ్చి సన్మానించారు. ప్రత్యేకించి ఎట్టి ప్రచారం లేకుండానే ఈ గ్రంథం ఒక లక్ష ప్రతుల అమ్మకం జరిగింది.

గాంధీ జ్ఞానమందిర్ మహాత్మాగాంధీ, వినోబాభావేగార్ల సిద్ధాంతాల ప్రచార ప్రసారాలకు, నైతిక విలువల వ్యాప్తికి, యోగాభ్యాసానికి సాధనాస్థలి. సర్వోదయ విచార్ ప్రచార్ ట్రస్టు ఆదర్శాలకు మంచి కేంద్రం, ప్రతి రోజు 500 మందికి పైగా సాధకులు యిక్కడ యోగాభ్యాసం చేసి ఆరోగ్యవంతులు అవుతున్నారు. భారతీయ ప్రాచీన సంస్కృతి, సత్యము, అహింస, మానవ ప్రేమ వీటికి సంబంధించిన దివ్య సందేశాలను ఆకళింపు చేసుకుంటున్నారు. గాంధీ స్మారక భవనంగా గాంధీ జ్ఞాన మందిర్ హైదరాబాదు నగరంలోని సుల్తాన్ బజారు ప్రాంతంలోని ధ్యాన మందిరం. సమాజంలో తరిగి పోతున్న నైతిక విలువల్ని పెంచడం, జాతీయ సంస్కృతీ సంరక్షణ దీని లక్ష్యాలు.

గాంధీ జ్ఞానమందిరం యోగ కేంద్రం 1974లో గాంధీజయంతి రోజున ప్రారంభం అయ్యింది. వ్యక్తిత్వ వికాసం, ఆరోగ్య పరిరక్షణ ధ్యేయంగా ప్రాచీన భారతీయ వైజ్ఞానిక ప్రగతిని చాటుతూ యోగ మార్గాన్ని నేర్పించటం ఈ సంస్థ లక్ష్యం. ఈ భవనానికి ఒక వైపున మహిళాకళాశాల, వేరొకవైపున దర్బార్ హాలు, మరో వైపున విశాలమైన ఉద్యానవనం ఉన్నాయి. కనీసంలో కనీసంగా 2 లక్షలమంది ఇక్కడ యోగాభ్యాసం చేసి ఉంటారని అంచనా! జీవన ప్రమణాలను మెరుగుపరచుకోవటం లక్ష్యంగా ఇక్కడ నేర్పించే అంశాలను జీవితంలో ఉపయోగించుకుని లాభించిన వారు ఎక్కువమంది ఉండటంతో ఈ యోగ కేంద్రానికి విశేష ప్రాధాన్యత ఏర్పడింది.

డబ్బు చాలా మందికి ఉంటుంది. దాతృత్వం కూడా చాలామందికి ఉంటుంది. రెండిటినీ ఒకచోట సమన్వయపరచి, నిర్మాణాత్మకమైన, శాశ్వతమైన, సామాజికమైన సేవగా మలచటంలో శ్రీ కాపడియా దూరదృష్టినీ, సమ్యక్ దృష్టినీ దివిసీమ ఎన్నటికీ మరిచిపోలేదు.

శ్రీ కాపడియా ఒక కర్మయోగి. తనకు 10 యేళ్ల నాటినుండే హరిజన సేవ, ఖాదీ కార్యక్రమాల్లో పాల్గొనటం ద్వారా ఆయనలో సేవా తత్పరత అనేది ప్రాథమిక లక్షణంగా ఉండిపోయి, ఆయనవొక సౌజన్యమూర్తిగా మలిచింది. ఆస్తిపాస్తులతో పాటు సేవామూర్తిగా కీర్తిప్రతిష్టలు కూడా సమానంగా పంచుకున్నారు. నిగర్వి. నిరంతర ఆధ్యాత్మిక జీవితం గడిపినవాడు.

వ్యాపార కార్యకలాపాల్లో ఎంత తీరిక లేకుండా ఉన్నా సర్వోదయ కార్యక్రమాలకు తగిన సమయం కేటాయిస్తూనే ఉండేవాడు. అనాథాలయ నిర్వహణ, ఖాదీ గ్రామోద్యోగ ఉద్యమాల్లో చురుకుగా పాల్గొనేవారు.

1916లో లాల్జీభాయి, వేజ్బాయి దంపతులకు గుజరాత్ రాష్ట్రంలో కచ్ వద్ద పత్రి అనే గ్రామంలో జన్మించారు. వ్యవసాయకుటుంబానికి చెందిన తండ్రి లాల్జీ భాయి గాంధీజీ అనుయాయి. కానీ, శ్రీ కాపడియా 11 యేళ్ల వయసులోనే తండ్రిగారు హటాత్తుగా మరణించారు. కుటుంబం వీధిన పడింది.

వేరే దారిలేక పొట్టచేతబట్టుకుని, బొంబాయి వెళ్లాడు. ఒకవిధంగా వెట్టిచాకిరీ లన్నీ చేయాల్సి వచ్చింది. ఒక వ్యాపార పనిమీద బర్మా వెళ్ళాడు. అక్కడ నెలకు 100 రూపాయల ఉద్యోగం దొరికింది. వ్యాపారంలో మెళకువలు నేర్చుకోవటానికి ఆ ఉద్యోగం ఆయనకు బాగా సహకరించింది. బర్మాలో మొదట బియ్యం వ్యాపారం

చేశాడు. అంతలో బర్మాలో అంతర్యుద్ధం వచ్చింది. దాంతో కాపడియా కలకత్తాకు మకాం మార్చవలసి వచ్చింది. చిన్నచిన్న వ్యాపారాలు చేస్తూ, విరామంలో సేవా కార్యక్రమాలలో పాల్గొంటూ ఉండేవారాయన. పెద్దల సూచనమీద ఆయన హైదరాబాదుకు మకాం మార్చుకున్నారు. హైదరాబాదులో చాలాకాలం పాటు చిన్నచిన్న ఉద్యోగాలు చేశారు. నెమ్మదిగా స్వంత వ్యాపారం మొదలుపెట్టారు. ఆదాయం పెరుగుతూ వచ్చింది. దానితోపాటు వితరణ కూడా పెరుగుతూ వచ్చింది ఆయనలో.

హైదరాబాదులో రజాకార్ల దారుణాలు నడుస్తున్నకాలంలో చాలామంది ముస్లిం కుటుంబీకుల్ని ఆయన ఆదరించారు. సోయబుల్లాఖాన్ గారి హమ్ రాజ్ అనే దేశభక్తి పత్రికకు ఆయన తోడ్పాటునిచ్చారు. నిషేధిత పత్రిక అది. దానికి సాయం చేయటం అంటే దేశ ద్రోహం కింద పరిగణించబడ్డది. కానీ కాపడియాగారు ధైర్యంగా నిలబడ్డారు. కానీ రజాకార్లు సోయబుల్లాఖాన్ గారి శరీరాన్ని ముక్కలుముక్కలుగా నరికి హత్య అత్యంత దారుణంగా హత్య చేశారు. కాపడియాగారు తన పలుకుబడితో కొంత నిధిని సమీకరించి సోయబుల్లాఖాన్ గారి పేరుతో పాత్రికేయ ప్రముఖులకు ప్రతీ ఏడాది పురస్కారాలు ఇచ్చే ఏర్పాటు చేశారు.

సేవా తత్పరుడుగా ఎదుగుతున్నకొద్దీ శ్రీ కాపడియా వాణిజ్య రంగంలో అవధులు లేని స్థాయికి చేరుకోసాగారు. ఆంధ్రప్రదేశ్ స్టీల్ రీ రోలింగ్ అసోసియేషనుకు అధ్యక్షులయ్యారు. ఆంధ్రప్రదేశ్ గ్రెన్స్ అండ్ మర్చంట్స్ అసోసియేషన్ అధ్యక్షులుగా ఉన్నారు. ఫెడరేషన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్, అంధ్రప్రదేశ్ ప్రభుత్వ సేల్స్ టాక్స్ అడ్వయిజరీ కమిటీ వగైరా అనేక సంస్థల్లో కీలక పాత్ర పోషించారు.

తల్లి పేరుతో హైద్రాబాద్ శివరాంపల్లిలో వేజ్‌బాయి బాల నివాస్ అనే అనాథ బాల ఆశ్రమాన్ని స్థాపించి నిర్వహించారు. చదువుతోపాటు పిల్లలకు సాంకేతిక శిక్షణ ఇప్పించేవాడాయన.

గుజరాత్ లోని తన స్వంత గ్రామంలో గాంధీ విద్యాలయం పేరుతో ఒక స్కూలును ప్రారంభించారు. హైదరాబాదులో లక్ష రూపాయల విరాళమ్ ఇచ్చి, "అమృత కాపడియా నవజీవన్ ఉమెన్స్ కాలేజీని, టోకర్షీ లాల్జీ కాపడియా జూనియర్ ప్రగతి కాలేజీని నెలకొల్పారు. రాధాకిషన్ హోమ్ ద్వారా అభాగ్యులైన మహిళలు, అవివాహితులుగా గర్భవతులైన మహిళలు, వారి పిల్లలకు ఆశ్రయం కల్పించే సేవలు విస్తృతంగా నిర్వహింపచేశారు. గుజరాత్ ప్రగతి సమాజ్ వీరు నెలకొల్పిన సంస్థల్లో

గణనీయమైనది. ఈ సంస్థ పక్షాన అనేక విద్యాసంస్థలు నడుస్తున్నాయి. హైదరాబాద్ సికిందరాబాద్ గుజరాత్ సమాజం ద్వారా విశేషమైన సేవాకార్యక్రమాలు చేపట్టారు.

1953 కాంగ్రెస్ మహాసభల ఏర్పాట్లతోపాటు, నెహ్రూ లాంటి నాయకులకు ఆతిథ్య సౌకర్యాలు కల్పించే బాధ్యతలు నిర్వహించారు.

శ్రీ కాపడియా జాతీయభాషాభిమాని. గాంధీ మహాత్ముడు స్థాపించిన దక్షిణభారత హిందీ మహాసభ ఆంధ్రశాఖకు అనేక సంవత్సరాలపాటు కోశాధికారిగా పనిచేశారు. లాల్ బహదూర్ శాస్త్రిగారిని, సర్వేపల్లి రాధాకృష్ణ మహాశయుని ఆహ్వానించి 'ఆంధ్రసభ' రజతోత్సవాలు నిర్వహించారు. హిందీ మీడియంలో నడిచే హిందూ ఆర్ట్స్ కాలేజీకి వీరు కొంతకాలం కోశాధికారిగా ఉన్నారు. హైదరాబాద్ రోటరీక్లబ్ ద్వారా 25 గ్రామాలలో హైస్కూళ్లను ప్రారంభింపచేసారు.

తన "శ్రీ టోకర్షీ లాల్ జీ కాపడియా చారిటబుల్ ట్రస్టు" పక్షాన ప్రఖ్యాత నేత్రవైద్య నిపుణులు డా. శివారెడ్డి అధ్యక్షులుగా తాను కార్యదర్శిగా ఐ బ్యాంకును స్థాపించి, అప్పుడే చనిపోయిన వారి కళ్ళలోని కార్నియాను సేకరించే కార్యక్రమాలు చేపట్టారు. నేత్రదానం గురించి ప్రజల్లో విశేష ప్రాచుర్యం తీసుకువచ్చారు. కార్నియాలను అమర్చిన వారికోసం సరోజినీదేవీ ఆసుపత్రిలో ఒక ప్రత్యేకమైన వార్డును నిర్మింపచేశారు. మహావీర్ ఆసుపత్రి నిర్మాణానికి భూరి విరాళాన్ని అందించారు.

హైదరాబాద్ దగ్గర శివరాం పల్లిలో సర్వోదయ సేవా కార్యక్రమాలు నిర్వహించేందుకు "గ్రామసేవా కేంద్రం" ఏర్పాటు చేశారు. హైదరాబాదులో "సర్వదయ విచార ప్రచార ట్రస్ట్" నెలకొల్పి, సర్వోదయ సాహిత్యాన్ని అనేక భాషలలో ప్రచురించేందుకు కృషి చేశారు.

'జీవితము-చైతన్యము' పేరుతో ఆయన వ్రాసుకున్న ఆత్మకథలో తన 60వ యేట వానప్రస్థాశ్రమ ఆశ్రమం తీసుకుంటానని వ్రాశారు. షష్టిపూర్తినాడు తన మాట ప్రకారం తాను నెలకొల్పిన తన వ్యాపార సంస్థలకు రాజీనామాలు సమర్పించారు. సేవా సంస్థల్లో పదవులకూడా రాజీనామా చేశారు. శేష జీవితాన్ని రాగమోహాలకు అతీతంగా గడపాలని భావించారు. ఒక ఋషిలాగా జీవించారు. ఆత్మకళ్యాణానికి సన్యాశ్రమం అవసరం అని ఆయన నమ్మి ఆచరణలో పెట్టారు. గాంధీ మార్గాన సాదాజీవితాన్ని ఆయన గడిపారు. 'సున్నా' స్థాయిలో జీవితాన్ని ప్రారంభించి, అత్యంత సంపన్నుడిగానూ, అత్యున్నత పరిపూర్ణమానవుడిగానూ ఎదిగిన మహనీయుడు శ్రీ కాపడియా.

1968-69లో గాంధీ శతజయంతి సందర్భంగా భారతదేశ ప్రగతికి చేయవలసిన ఆర్థిక ఉపాయాలను తెలుపుతూ "భారతదేశ ఆర్థిక స్వాతంత్ర్యం" అనే గ్రంథం వ్రాశారు. 'ఫెడరేషన్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్" వారు దీనిని ప్రచురించారు.

"వేల యేళ్లుగా రూపొందిన మన ప్రాచీన సంస్కృతిని మనం కాపాడుకోవాలి. పాశ్చాత్య సంస్కృతిని గుడ్డిగా అనుకరించే మన యువతరానికి సరియైన విధానంలో మన ప్రాచీన సంస్కృతి, వాటి విలువల గురించి చెప్పే విద్యా విధానం తయారు చేయాలి" అనేది ఆయన భవిష్యత్తరాలకు చేసిన సూచన. ఈశ్వరుడు అందరికీ తండ్రి, వసుధైక కుటుంబం అనే భావనలతో అన్ని మతాలవారూ జీవించాలని ఆయన అభిలషించారు. మతంకంటే జీవిత విధానమే ముఖ్యం అని ప్రబోధించిన మహర్షి శ్రీ కాపడియా.

16-1-1916 న ఆయన జన్మించారు. 16-3-1996న దివంగతులయ్యారు. స్వతహాగా జైన మతస్థుడు. కారుణ్య భావనలో కలకాలం నిండు జీవితాన్ని గడిపిన వ్యక్తి. సేవ సేవను ప్రేరేపిస్తుంది. ఆపద్బాంధవుడిగా నిలిచిన మహనీయుడు కాపడియాజీవనరేఖలను, వారి సేవలను అందించటం ద్వారా సేవామయ భావజాలాన్ని నేటి తరంలో ప్రేరెపించగలగాలని ఆకాంక్ష.



తుపాను బాధితులకు కుట్టుమిషన్ పంపిణీ చేస్తున్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు, శ్రీ టొకార్షీ లాల్జీ కాపడియా



# శ్రీ యం యస్ రాజలింగం

చాలా మంది ఒక మాట చెప్పి ఊరుకుంటారు. కొందరు తన మాట నెగ్గలేదని బాధపడతారు. కొద్దిమంది తనమాట నెగ్గించుకుంటారు. గౌరవనీయులు యం యస్ రాజలింగంగారు మూడవ కోవకుచెందిన వారిలో ప్రథముడు. దివి ఉప్పెన ఏర్పడిన సమయంలో రాష్ట్ర హైకోర్టులో రెవిన్యూ శాఖకు ప్రభుత్వ న్యాయవాదిగా రాజలింగంగారు బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఉప్పెన వార్త వినగానే ఆయ్నాన్ బాధితుల సేవకోసం తరలి వెళ్ళటానికి సిద్ధపడ్డారు. కానీ, ప్రభుత్వ బాధ్యత కూడా ఉన్నది కాబట్టి, స్వచ్ఛందంగా కదిలి వెళ్లలేని పరిస్థితి. దాంతో తన పదవికి రాజీనామా తప్పలేదు. రాజలింగం గారు తక్షణం సహాయ కార్యక్రమాల్లో పాల్గనటానికి తనకు అనుమతి ఇవ్వవలసిందిగా హైకోర్టు న్యాయమూర్తిగారిని కోరారు. ఒక న్యాయవాదిగా ఆయన కేసులన్నీ బెంచికి వచ్చినప్పుడు వాటిని వాదించటానికి తన జూనియర్లు ఉన్నారని వివరించారు. అది సాధ్యపడక పోవటంతో న్యాయవాద వృత్తినుండి విరమిస్తున్నట్టు ప్రకటించి రాజీనామా పంపించారు. ఆనాడు ఆయన దృష్టి బాధితుల సేవ చేయటం. అందుకు చేస్తున్న వృత్తిని ఆయన తృణప్రాయంగా భావించారు.

వృత్తిని వదులుకోవటానికి ముఖ్య కారణం ప్రభాకర్ జీ నుండి వచ్చిన పిలుపు. దివిసీమకు సహాయ కార్యక్రమాలు గాంధీగ్రాం పునర్నిర్మాణం కార్యక్రమాలలో అండగా నిలబడటానికి రావలసిందిగా ప్రభాకర్ జీ ఆహ్వానం మేరకు ఆయన అన్ని భవబంధాలు వదిలేసుకుని దివిసీమకు తరలి వచ్చారు. ఆనాటి హైకోర్టు ప్రధానన్యాయమూర్తి

జస్టిస్ ఓబులరెడ్డి, న్యాయమూర్తి జస్టిస్ ఆవులసాంబశివరావు రాజలింగంగారి ఆదర్శాన్ని మెచ్చుకున్నారు. ఆయనకు అండగా నిలిచి ప్రోత్సహించారు కూడా! రాజలింగంగారు 60 యేళ్ల వయసులో పూర్తిస్థాయి సేవాకార్యక్రమాల వైపు మళ్లారు.

రాజలింగం గారు ఉప్పెనకు గురైన ప్రాంతాల్లో కాలినడకన విస్తృతంగా తిరిగారు. బాధితులకు సాయం అందించటానికి వివిధ ప్రాంతాలనుండి స్వచ్ఛంద సేవా సంస్థలుఅసంఖ్యాకంగా తరలి వస్తున్నారు. బయట నుండి వచ్చేవారికి ఏ ఏ గ్రామాల్లో ఏఏ అవసరాలున్నాయో, అక్కడ పరిస్థితి ఏమితో తెలిసే అవకాశం ఆనాడు లేదు. ఇప్పుడున్నంత సాంకేతిక పర్జినం గానీ, సమాచారాన్ని లోకానికి వెల్లడి చేసే మీడియా యంత్రాంగం కూడా ఇంత పటిష్టంగా ఆనాడు లేదు.

ఈ పరిస్థితుల్లో రాజలింగంగారు ఒక మ్యాపు తయారు చేశారు. అది దివి సముద్రతీరప్రాంతం మ్యాపు. అందులో ఉప్పెనకు దెబ్బతిన్న గ్రామాలను ఆయన వరుసగా గుర్తించారు. ఒక్కో గ్రామం విస్తీర్ణం, అందులో చనిపోయినవారి సంఖ్య, ఆస్తినష్టం, రహదారుల వివరాలన్నీ అందులో వివరంగా చూపించారు. మా నానగారు ఈ మ్యాపుని వందల సంఖ్యలో అచ్చువేయించి పంచారు. నిజానికి ఈ పఠం స్వచ్ఛంద సేవకులకే కాదు ప్రభుత్వ అధికారులకూ ఎంతగానో తోడ్పడింది. సహాయకార్యక్రమాలు చేపట్టేందుకు ప్రభుత్వానిక్కూడా సులభం అయ్యింది.

స్వచ్ఛంద సంస్థల సేవలు కూడా అందుబాటులో ఉన్న చోట అందించి వెళ్ళిపోయే పద్ధతిలో కాకుండా చిట్టచివరి మారుమూలప్రాంతానిక్కూడా సమానంగా అందేలా చూడాలంటే ఒక సమన్వయ వ్యవస్థ ఉండాల్సిన అవసరాన్ని మా నాన్నగారు, ప్రభాకర్ జీ, శ్రీ లవణం దంపతులూ, రాజలింగంగారూ కూర్చుని చర్చించారు. ఆ సమన్వయ కేంద్రాన్ని గాంధీక్షేత్రంలో ఏర్పాటుచేసి రాజలింగంగారు అక్కడే ఉండి పనిచేశారు. ఆ సందర్భంలో వారితో నాకు చాలా సాన్నిహిత్యం ఏర్పడింది. ఆయన పనుల్లో దగ్గరుండి సహకరించేవాణ్ణి. ఆయన మరణించేవరకూ వారితో నా అనుబంధం కొనసాగింది.

రాజలింగంగారిది విమర్శనా దృష్టి. సునిశిత పరిశీలనా శక్తి కలిగిన వ్యక్తి. పైగా పేరొందిన న్యావాది. ప్రతీ విషయాన్ని తర్కించి చూసేవారు. అవనిగడ్డలో ఆయన కేవలం సహాయ కార్యక్రమాలకే పరిమితం కాకుండా సర్వోదయ నిర్మానకార్యక్రమం మీద ప్రధానంగా మనసు లగ్నం చేసి ఆలోచన చేసేవారు. అంతలో ఖాదీకమిషన్

సభ్యుడైన శ్రీ దామోదర్ పాంద్రిక్ ఉప్పెన బాధ్యితుల కోసం ఖాదీ గ్రామోద్యోగు లందరి నుండీ ఒక రోజు జీతం విరాళంగా తీసుకుని 5 లక్షల రూపాయల నిధిని సమకూర్చారు. రాజలింగంగారు ఆ నిధిని పునర్నిర్మాణానికి వెచ్చించాలని సూచించారు. అందుకోసం ఆయన కొమ్మనవోలు గ్రామాన్ని ఎంపికచేశారు. శ్రీ దామోదర్ పాంద్రకర్ అధ్యక్షతన శ్రీకోదాటి నారాయణరావు, శ్రీ రాజలింగం మరికొందరితో నిర్మాణ కమిటీ ఏర్పడింది. గాంధీగ్రామ్ అని ఆ ఊరికి పేరుపెట్టారు.

రాజలింగంగారు అవనిగడ్డలో ఆర్టీసీ వారి స్థలాన్ని అద్దెకు తీసుకుని, అక్కడ సిమెంటు బ్లాకులు తయారు చేయించేవారు. ఇందుకు రాజలింగం గారి అల్లుడు శ్రీ అంబాప్రసాద్ కూడా సహకరిస్తూండేవారు. వరంగల్ ఇంజనీరింగ్ కాలేజి ప్రొఫెసర్ సోమయాజులుగారు, సద్గురు శివానందమూర్తిగారు సాంకేతిక సలహా లిస్తూ ఈ కాలేజీని నిర్మింప చేశారు. శ్రీ శివానందమూర్తి తెలుగునాట అప్పటికి పోలీసు వరంగల్ పోలీస్ శాఖలో పనిచేస్తుండేవారు. ఆతరువాతే ఆయన సద్గురువుగా ప్రసిద్ధులయ్యారు.

మహాత్మాగాంధీ మనుమడు శ్రీ కనూగాంధీ గాంధీనగరం సంకుస్థాపన చేశారు. ప్రజల శ్రమదానంతో 200 ఇళ్ల నిర్మాణం పూర్తయ్యింది. 1982 మార్చి 2న ఆనాటి విదేశీ వ్యవహారాలమంత్రి శ్రీ పి వి నరసింహా రావు ఈ గాంధీగ్రామ్'ని ప్రారంభించారు. గాంధీగ్రామ్ నిర్మాణం, వాటిని బాధితులకు అందించటం ఇవన్నీ పాక ఎత్తయితే, రాజలింగంగారు చేసిన ఒక సూచన అత్యద్భుతమైంది. ఈ సూచన అనేక కొత్త ఆలోచనలకు దారితీసింది కూడా! తీర ప్రాంతాల్లో తరచూ, వరదలు, తుఫాన్లు, ఉప్పెనలూ ముంచెత్తటం సర్వసాధారణ విషయం. ఇలాంటప్పుడు ప్రతీ ఇల్లు ఒక తుఫాను సంరక్షణ కేంద్రంగా ఉండాలనేది రాజలింగంగారి సూచన. అందుకోసం ఆయన అత్యంత దృఢమైన 20 అడుగుల మిద్దెను నిర్మించి ఒక నమూనా ఇంటిని రూపొందించారు. విపత్తు సంభవించినప్పుడు, ఆ ఇంట్లోని వారంతా దానిమీదకు చేరుకుంటే ప్రాణాలు కాపాడుకోగలుగుతారు.

ఆస్తుల్ని కాపాడ లేకపోయినా జననష్టాన్ని నివారించాలనేది ప్రభుత్వ విధానం కావటానికి ఈ సూచన ఎంతగానో తోడ్పడింది. 'హౌస్ కమ్ షెల్టర్'లు ప్రతీ గ్రామం లోనూ కొన్నయినా ఉంటే తుఫాను సంరక్షణ ఎక్కువ సులభం అవుతుందికూడా!

ప్రభుత్వ విధానంలో ఈ నమూనా నిర్మాణం ఇమడనందుఇన రాజలింగంగారి సూచనని ప్రభుత్వం పెద్ద ఎత్తున అమలుచేయలేకపోయినప్పటికీ, ప్రతీ గ్రామానికీ

ఒక తుఫాను సురక్షిత కేంద్రం నిర్మాణాన్ని తప్పనిసరిగా అమలు చేయటానికి దారి తీసింది. రాజలింగం గారు, ఊరుకొక కమ్యూనిటీ హాలు కాదు, ప్రతీ ఇల్లూ ఒక కమ్యూనిటీ రక్షణకేంద్రం కావాలని భావించారు.

రాజలింగం గారు ముక్కుసూటి మనిషి. ఏ విషయంలోనూ రాజీపడే స్వభావం కాదాయనది. అవసరం అయితే గాంధీమహాత్ముడితో కూడా ఆయన విడిచి వెళ్ళేందుకు సిద్ధపడ్డ వ్యక్తిత్వం ఆయనది. 1940లో వార్ధాలోని గాంధీమహాత్ముని గ్రామీణ విద్యాలయంలో శిక్షణ పొందారు. ఆ తరువాత సేవాగ్రాం ఆశ్రమంలో గాంధీజీ సాన్నిధ్యంలో రెండేళ్లపాటు ఆశ్రమవాసిగా ఉన్నారు. గోసేవా శాఖని, రసోయీ (అంటగది)ని నిర్వహించారు. ఆది నుండీ ప్రభాకర్'జీతో ఆయనకుగల సాన్నిహిత్యం రాజలింగంగారిని అత్యంత గాంధేయవాదిగా తీర్చిదిద్దింది.

మద్రాసు విశ్వవిద్యాలయం నుండి బి ఎస్ సి డిగ్రీనీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి న్యాయవాద పట్టాను పొందారు. స్వామి రామానంద తీర్థ నాయకత్వంలో హైదరాబాద్ సంస్థాన విముక్తికై జరిపిన పోరాటంలో పాల్గొన్నారు. సేవాగ్రాం నుండి బయటకు వచ్చినా ఆయన నిర్మాణ కార్యక్రమాలను కొనసాగిస్తానని మహాత్ముడుకి వాగ్దానం చేశాడు రాజలింగంగారు. సిరిసిల్లా తాలూకా ముస్తాబాదులో ఖాదీ చరఖా సంఘం ఏర్పాటు చేశారు. నూలు తీసేందుకు ఉపయోగించే చరఖాని ఒక రూపాయి పన్నెండుఇ పైసలకు గిట్టుబాటు అయ్యేలా ఆయనే స్వయంగా రూపొందించారు. కిసాన్ చరక్ నమూనాలో ఈ రాట్నం తయారయ్యింది. రూపాయి బేడకే ఒక రాట్నాన్ని ఇవ్వగలగటం విశేషం. ముస్తాబాదులో ఒక సర్వోదయ ఆశ్రమాన్ని కూడా స్థాపించారు. బాపూ పిలుపు, ప్రభాకర్ జీ సూచనల మేరకు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గని జైలుకెళ్లారు.

వరంగల్లు నుండి 1952లో మొదటిసారిగా యమ్ ఎల్ ఏగా ఎన్నికయ్యారు. నిజాం పతనం తరువాత తెలంగాణాలో ఏర్పడిన బూర్గుల రామకృష్ణారావుగారి మంత్రివర్గంలో పబ్లిక్ వర్క్స్ శాఖను నిర్వహించారు. హైదరాబాద్ వోలంతరీ కంట్రిబ్యూషన్ పథకాన్ని తొలిసారిగా పగడ్బందీగా అమలుచేయటమే కాకుండా దాన్ని చట్టబద్ధంచేసారు, 1957 ఎన్నికల్లో చిల్లంచెర్లనుండి శాసనసభకు ఎన్నికయ్యారు. 1964లో ప్రత్యక్ష రాజకీయాలనుండి తప్పుకుని న్యాయవాద వృత్తి చేపట్టారు. ప్రభుత్వ ముఖ్య న్యాయవాదిగాను, పబ్లిక్ ప్రోసిక్యూటర్ గానూ పనిచేశారు.

అమెరికా మరియు కొన్ని యురోపియన్ దేశాల్లో కార్మిఒక సమస్యల అధ్యనం కోసం వెళ్ళిన బృందంలో రాజలింగంగారు కూడా ఉన్నారు. ప్రభుత్వ పరమైన అనేక సలహా సంఘాల్లో వివిధ హోదాలలో పనిచేశారు. అకాడెమీ ఆఫ్ గాంధియన్ స్టడీస్, గాంధీ స్మారకనిధి, భాగ్యనగర్ ఖాదీ సమితి సంస్థల్లో సభ్యులు. భారతీయ విద్యా భవన్'లో బోధనానిపుణుడిగా ఉస్మానియా విశ్వవిద్యాలయం 'లా' కాలేజీలో లెక్చరర్గా, పనిచేశారు. వరంగల్ నగరంలో ఆంధ్ర గరల్స్ హైస్కూల్, అనంతలక్ష్మీ ఆయుర్వేద కళాశాల, విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాలల స్థాపనలో ప్రముఖపాత్ర వహించారు.

రాజలింగంగారు గొప్ప సాహిత్యవేత్తకూడా! అనేకమంది ప్రముఖ నాయకులపై సామాజికాంశాలపైన విశేష రచనలుచేశారు. 'గ్రామనాయకత్వం', 'తెలంగాణా ఉద్యమం' "బాపు-నేను' మొదలైన గ్రంథాలు వీరివి ప్రసిద్ధి. పి వి నరసింహారావు బయోగ్రాఫికల్ గ్లింప్సెస్" "దేశీయత-భూమిక" "స్వాతంత్రోద్యమంలో తెలుగు మహిళలు" మొదలైన పుస్తకాలను ఈయన అంకితం స్వీకరించారు. ఆంధ్రపత్రిక, డెక్కన్ క్రానికల్ పత్రికలకు విలేకరిగా కూడా పనిచేశారు. ప్రభాకర్ జీ అవార్డు, శివానందగురు బెస్ట్ సిటిజన్ అవార్డు, గాంధియన్ అవార్డు మొదలైన అనేక పురస్కారాలు పొందారు.

శ్రీ రాజలింగంగారు తెలుగు నేలమీద ఉభయ ప్రాంతాలవాడు. లేక, ఉభయప్రాంత మూలాలు వున్నవాడు. ఆయన తండ్రి తెనాలి దగ్గరి ఈమని వాస్తవ్యుడైతే, తల్లిది ఓరుగల్లు. ఆ కుటుంబం వరంగల్లులోనే స్థిరపడింది. శ్రీ రాజలింగంగారు పుట్టి పెరిగింది ఓరుగల్లులోనే!

9 ఫిబ్రవరి 1919న జన్మించిన రాజలింగంగారు 2012 జనవరి 22న చనిపోయేవరకూ చనిపోయేవరకూ సమైక్యవాది. ఆయన మరణాసన్నంగా ఉన్న సమయంలో తెలంగాణా ఉద్యమం తీవ్రాతి తీవ్రంగా ఉంది. తెలంగాణాలో ఇంటింటికీ తిరిగి సమైక్యవాదాన్ని ప్రచారం చేస్తానన్నారాయన. కానీ శారీరకంగా ఆయనది ఉత్సాహంగా కదలలేని స్థితి. 94 యేళ్ళ నిండుజీవితాన్ని సమాజసేవలో గడిపిన నిజమైన గాంధేయవాది రాజలింగం గారు.

నేటి కాలపు తూకపు రాళ్లతో రాజలింగంగారి నిబద్ధతని కొలిచి చూడటం సాధ్యం కానిపని. మనస్థాయి ఆలోచనావిధానానికి అందనంత ఎత్తైన మనిషి ఆయన. అంతలోతైన మనిషికూడా!



# శ్రీ ఎస్. వీరనారాయణరెడ్డి

దివిసీమ ఉప్పెన అనంతరం జరిగిన పునర్నిర్మాణ సేవలో కరుణరసాన్ని కుమ్మరించిన కృష్ణాజిల్లా పోలీస్ సూపరెంటెండెంట్ శ్రీ ఎస్.వీరనారాయణరెడ్డిగారి అసమాన సేవలు దివి ప్రజల్లో ఈ నాటికీ మెదుల్తుంటాయి. సుదీర్ఘకాలం ఆయన కృష్ణాజిల్లా ఎస్.పిగా ఉండటం చేత ఆయన ఇక్కడ చాలామందికి వ్యక్తిగతంగా తెలిసినవారు కూడా!.

ఉప్పెనకు ఎక్కువగా దెబ్బతిన్న మండపాక, భావదేవరపల్లి గొల్లపాలెం మొదలైన గ్రామాల్లో దైన్యం ఆవహించి ఉండగా సొర్లగొంది దీనదేవత మూర్తీభవించినట్టనిపించింది.

వీరనారాయణరెడ్డిగారు బాగా మారుమూల ప్రాంతమైన సొర్లగొందిని సందర్శించిన తొలివ్యక్తి. ఇక్కడ తక్షణ సహాయం అవసరం అని, ఇక్కడి దాకా వచ్చి సేవలు అందించటం ఇతరులకు చాలా కష్టమైన కార్యం అనీ ఆయన గుర్తించారు. ఆయన అందించిన సమాచారం మేరకు, ఆనాటి హోం సెక్రటరీ శ్రీ ఎం. వి. నారాయణరావు హుటాహుటిన కాలినడకన సుదూరం ప్రయాణించి ఇక్కడకు చేరుకున్నారు. వీరనారాయణరెడ్డిగారు వారిని స్వయంగా వెంట నడిచి తీసుకువచ్చారు. అక్కడి హృదయవిదారక పరిస్థితిని చూసి ఆయన చలించిపోయారు. నేరస్థుల పట్ల కఠిన శిలగా వ్యవహరించే పోలీసు అధికారుల హృదయాలు దీనస్థితిలో కూరుకుపోయిన ఈ గ్రామ ప్రజల దుస్థితి చూసి కరిగిపోయాయి.

తక్షణ చర్యగా పోలీసుల ఆధ్వర్యంలో సొర్లగొందిలో సహాయ శిబిరం ఏర్పాటు చేయించారు. ఆనాడు కె. రామచంద్రారెడ్డి గారు ఆంధ్రప్రదేశ్ ఇనస్పెక్టర్ జెనరల్ ఆఫ్ పోలీసుగా ఉన్నారు. సొర్లగొంది గ్రామాన్ని పోలీసు దత్తత స్వీకారానికి అధికారికంగా అనుమతి లభించింది.

ఈ గ్రామాన్ని పూర్తిగా పోలీసులే దత్తత తీసుకుని తిరిగి కొత్త జీవితాన్ని ఆ ప్రజలకు కల్పించాలనే నిర్ణయం అధికారికంగా తీసుకున్నారు. వీరనారాయణరెడ్డిగారు అన్నింటా తానై ఏర్పాట్లను పర్యవేక్షించారు. అంతకు పూర్వం ఆర్మీ ఆఫీసరుగా ఉండి, తరువాత పోలీస్ శాఖలోకి వచ్చిన డెప్యూటీ కమాండెంట్ శ్రీ ఎస్. బ్రహ్మారావుగారి సహకారం తోడవటంతో పోలీసు ఉద్యోగులు, కొందరు మంచి నడవడి కలిగిన ఖైదీలు, సింగరేణీ కాలనీకి చెందిన కొందరు కార్మికులు వచ్చి గట్టిగా నిలబడటం వలనే వేలాది శవాలను తొలగించి అంత్యక్రియలు జరిపించ గలిగామని వీరనారాయణ రెడ్డిగారు సొర్లగొంది నివేదికలో పేర్కొన్నారు. అనేకమంది స్వచ్ఛంద సేవకులు కూడా ఈ సేవలో భాగస్వాములయ్యారు.

అప్పటి జైళ్ల శాఖ ఐ.జి శ్రీ టి.ఎస్. రావుగారు ఆనాటి హోమ్ సెక్రటరీ శ్రీ ఎం.వి. నారాయణరావు గారితో, కొందరు ఖైదీల స్వచ్ఛంద సేవని కూడా ఇందుకోసం తీసుకోవటం మంచిదని సూచించారు. నారాయణరావు గారు వెంటనే ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి ఖైదీల సేవకు అనుమతి కోరుతూ వ్రాశారు. అరగంటలోపే ప్రభుత్వ కార్యదర్శి నుండి అనుమతి మంజూరయ్యింది. మంచినడవడిక కలిగి, స్వచ్ఛంద సేవకు సిద్ధమైన 50 మంది ఖైదీలను ఇందుకు వినియోగించేందుకు అనుమతి ఇచ్చారు. రాజమండ్రి సెంట్రల్ జైలు సూపరెంటెండెంట్ శ్రీ జె. కృష్ణాజీరావుగారు 50 మందిని ఈ మేరకు ఎంపిక చేశారు. అందరూ సుదీర్ఘకాలంగా శిక్ష అనుభవిస్తున్న వారే! హుటాహుటిన వారిని దివిసీమకు తీసుకు వచ్చారు. మర్నాటి ఉదయం నుండీ పోలీసులూ ఖైదీలు కలిసి శవాలకు అంత్యక్రియల కార్యక్రమాలను చేపట్టారు.

ఖైదీలను చిన్న చిన్న గ్రూపులుగా విభజించి ఒక్కో గ్రూపునీ మొత్తం దివిసీమ ఉప్పెన ప్రభావిత ప్రాంతాలన్నింటికీ పంపించారు. పోలీసులతో నిమిత్తం లేకుండా స్వంతంగా పనిచేసే విధిని కూడా కొన్ని గ్రూపులకు అందించారు. ఇలా మొత్తం శవాల తొలగింపు, తదితర సేవలు అందించటానికి ఒక నెలరోజులు పట్టింది. ఒక్క ఖైదీ నుండి కూడా ఎలాంటి చెడు ప్రవర్తన గురించి ఫిర్యాదు లేకుండా ఆశించిన

దానికన్నా ఎక్కువగా సేవలు అందించారు. శవాల ఒంటిమీద ఉన్న నగలు ఇతర విలువైన వస్తువులను ఖైదీలు తెచ్చి అధికారులకు భద్రంగా అందించటం ఇక్కడ ముఖ్య విషయం.

ప్రతీ ఊళ్లోనూ తొలి చర్యగా గ్రామస్థుల సహకారంతో పెద్ద పెద్ద షెడ్లు నిర్మించారు. వీటిలోనే ఖైదీలు, పోలీసులు, ఇతర స్వచ్ఛంద సేవకులతోపాటు ఆయా గ్రామస్థులు కూడా తలదాచుకున్నారు. గ్రామస్థులు ఉప్పెన గాయం లోంచి నెలరోజుల తరువాత తెప్పరిల్లడం మొదలయ్యింది.

ఇంక శవాలేమీ లేవని నిర్ధారణ అయ్యాక ఖైదీల క్యాంపు ముగిసినట్టు ప్రకటించారు. ఖైదీలను తిరిగి రాజమండ్రికి తరలించారు. కొద్ది రోజులయ్యాక ప్రభుత్వ క్యాబినెట్ సమావేశమై ఖైదీల సేవల్ని ప్రస్తుతిస్తూ తీర్మానించింది. ఈ ఖైదీలు హత్య తదితర నేరాల మీద జీవిత ఖైదు అనుభవిస్తున్న వారు కావటం గమనార్హం. కానీ, ఏ ఒక్క ఖైదీ కూడా తప్పించుకు పోవాలని ప్రయత్నించలేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ పుణ్యకార్యంలో పాల్పంచుకున్న ఖైదీల శిక్షాకాలాన్ని తగ్గిస్తూ తీర్మానం చేయటం కొసమెరుపు.

ఈ అనుభవాన్ని పురస్కరించుకుని ప్రభుత్వం వారు మరో అడుగు ముందుకు వేసి, మచిలీపట్టణం దగ్గర వేదపాలెంలో వరదకట్ట నిర్మించటానికి 200 మంది ఖైదీల సేవలను వినియోగించుకున్నారు. ఈ ప్రయోగం కూడా నారాయణరెడ్డి గారి పూనికతో పూర్తిగా విజయవంతం అయ్యింది. చాలా తక్కువ సమయంలో 200 మంది ఖైదీలు కలిసి 2 కిలోమీటర్ల ఆనకట్టను నిర్మించారు. స్వచ్ఛంద సేవకు గ్రామస్థుల సహకారం కూడా లభించింది.

పరిస్థితుల ప్రేరణతో హంతకులుగా మారినవ్యక్తులు ఈ పుణ్యకార్యంతో పవిత్రులై పూర్తి పరివర్తన పొందినవారిగా కనిపించిందని జైళ్లశాఖ ఐ.జి శ్రీ టి.ఎస్.రావుగారు సార్లగొంది నివేదికలో వ్రాశారు. ఖైదీలూ మనుషులేననీ, అందరికీ ఉన్నట్టే వారిలోనూ భావోద్వేగాలు, ఉద్విగ్నతలూ ఉంటాయని, వారిలోపల ఉండే మనిషిని తట్టి లేపటమే ముఖ్యం అనీ వ్రాశారు. తప్పులు చేయటం మనిషి లక్షణం, క్షమించటం దేవుడి లక్షణం అన్నారాయన.

శవసేవలు కొనసాగుతూ ఉండగా, రాష్ట్ర పోలీసు ఐ. జి రామచంద్రారెడ్డిగారు రాష్ట్రంలోని అందరు పోలీసు అధికారులకు ఒక రోజు జీతం ఈ సార్లగొంది

పునర్నిర్మాణానికి అందించవలసిందిగా అభ్యర్థనలు పంపారు. రూ.10 లక్షల నిధి సమకూరింది. అంతకు సమాన మొత్తంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముఖ్యమంత్రి తుఫాను సహాయనిధి నుండి మరో 10 లక్షల రూపాయలు అందించింది. ఆ విధంగా సొర్లగొంది గ్రామాన్ని పూర్తిగా పునర్నిర్మించటానికి ఆశాజనకమైన 20 లక్షల రూపాయల నిధి సమకూరింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పోలీస్ హౌసింగ్ కార్పోరేషన్ వారు సాంకేతిక సహాయం అందించారు. వారి ఇంజనీర్లు ఇక్కడ రహదారులు మరియు గృహనిర్మాణాలను పర్యవేక్షించారు. ప్లాన్ లే-ఔట్లకు కావలసిన ప్రభుత్వ అనుమతులు వచ్చేందుకు వీరనారాయణరెడ్డిగారు విశేష కృషి చేశారు.

సొర్లగొంది అంటే షార్కు చేపల దారి అని! ఉప్పెనలో ఎక్కువమంది గ్రామస్థులు మరణించిన ఊరిది. నవంబర్ 77న తుఫాను వస్తే జూన్ 1978 వరకూ ఆ గ్రామం అంతా నీటి మునకలోనే ఉంది. కేవలం 16 ఎకరాల మెరక ప్రాంతం ఒక్కటే అక్కడ అనువుగా ఉన్న ప్రాంతం. ఆ ఊరి ప్రజల మృతదేహాల్ని తెచ్చి, ఈ మెరక ప్రాంతంలో దహనం చేశారు. గ్రామ పునర్నిర్మాణం చేయటానికి కూడా ఈ దహనం చేసిన స్థలాన్నే ఎంచుకోవాల్సి వచ్చింది.

కాలనీ నిర్మాణం జరుగుతున్నప్పుడు గ్రామస్థులకు ఆస్థలం ఒక మరు భూమిగా కనిపించింది. అక్కడే తిరిగి తాము నివాసం ఉండటానికి గ్రామస్థుల మనసంగీకరించలేదు. అయితే అదే మెరక ప్రాంతం అనీ భవిష్యత్తులో కూడా అక్కడ ఇళ్లు నిర్మిస్తేనే సురక్షితం అనీ వీరనారాయణరెడ్డిగారు వారికి నచ్చజెప్పి అంగీకరింప చేశారు. తామందరికీ విడివిడిగా ఇళ్లు కావాలనీ, మూడు సెంట్ల స్థలంలో ఇళ్ల నిర్మాణం చాలదనీ ప్రతీ ఇంటికీ మరింత విశాల స్థలం ఇవ్వాలనీ వాళ్లు కోరారు. ఒక మోడల్ గృహాన్ని నిర్మించి చూపించాక ఆ ఇంటి పద్ధతిలో అన్ని ఇళ్లూ ఉంటే సంతోషమే నన్నారు గ్రామస్థులు.

గృహనిర్మాణ సామగ్రిని తరలించటానికి రవాణా సదుపాయాలు లేకపోవటం ఒక పెద్ద సమస్య అప్పుడు. వర్షాలు కూడా పెరగటంతో నిర్మాణ కార్యక్రమాలు ఆలశ్యం కాసాగాయి. ఇటుకలు, సిమెంటులకు కొరత ఏర్పడింది. అయినా వీరనారాయణ రెడ్డిగారు వెనుకడుగు వేయకుండా ఆ సమస్యల్ని అధిగమించ గలిగారు. కొందరు పోలీసు ఉద్యోగులు స్వయంగా వచ్చి స్వచ్ఛందంగా శ్రమదానం చేయటంతో సమస్యలు కొన్ని తీరాయి. మొత్తం 336 ఇళ్లను నిర్మించారు. ఇంకా

3,50,000 రూపాయలు మిగిలాయి. ఆనాటి రెవెన్యూ శాఖామాత్యులు రూ. 5 లక్షలు అందించారు. ఈ మొత్తం డబ్బుతో ప్రతీ ఇంటికీ అదనంగా ఒక వంటిల్లు కూడా నిర్మించారు.

ఇళ్ల నిర్మాణం పూర్తయి, సొర్లగొందిలో మళ్లీ జీవకళ రావటానికి ప్రతీ పోలీసు ఉద్యోగీ స్వచ్ఛందంగా సహకరించారు. ఇతర సేవా సంస్థలు నిర్మించిన దానికన్నా తక్కువ ఖరీదుకే ఇక్కడ 336 ఇళ్ల నిర్మాణం సాధ్యం అయ్యిందంటే, వీరనారాయణ రెడ్డి గారి పాత్రను మనం ఊహించుకోవచ్చు. ఇంటికి 5,500 చొప్పున 336 ఇళ్ళని 16,50,000కే నిర్మించారు.

గజానికి 25 రూపాయల వ్యయంతో ఇళ్ళనిర్మాణం పూర్తయ్యిందంటే ఇదెలా సాధ్యం అయ్యిందని ప్రతీ ఒక్కరూ ఆశ్చర్యపోయారు. పోలీసు హౌసింగ్ కార్పోరేషన్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ పి.వి.జి. కృష్ణమాచార్యులుగారు తనకెంతో సహకరించటం వలనే ఇది సాధ్యం అయ్యిందంటారు శ్రీ వీరనారాయణరెడ్డి.

గ్రామానికి గృహకళ వచ్చాక అక్కడ ఒక పోలీస్ ఔట్ పోస్టును ఏర్పాటు చేశారు. గ్రామస్థుల కోరిక మీద పోతరాజు గుడిని, ఒక మండపాన్ని కూడా నిర్మింపచేశారు. టాటా కంపెనీవారు అక్కడ ఒకపెద్ద తుఫాను సంరక్షణ కేంద్రాన్ని నిర్మించారు. ఒక కిలోమీటరు పొడవున మొక్కలు నాటి కోతకు, ముంపుకు ఈ ప్రాంతం గురికాకుండా ఏర్పాట్లు చేశారు.

తక్కిన అన్ని సేవలూ స్వచ్ఛంద సేవా సంస్థలు చేసినా, శవాలను తొలగించి అంత్యక్రియలు చేయటంలో పోలీసు సిబ్బంది, ఖైదీలు, స్వచ్ఛంద సేవకులు చేసిన సేవ గొప్పది. అది కేవలం సొర్లగొందికే పరిమితమైన విషయం కాదు, కృష్ణా గుంటూరు జిల్లల్లో ఉప్పెన ప్రభావిత ప్రాంతాలన్నింటా శవాలకు అంత్యక్రియలు జరిపి పోలీసు యంత్రాంగం ఒక బాధ్యతగా ఆ పుణ్యకార్యాన్ని నెరవేర్చారు.

మా నాన్నగారూ, వీరనారాయణరెడ్డిగారు ఉప్పెన ప్రాంతాల్లో కలిసే పర్యటించేవారు. ఈ వినాశనం లోంచి ప్రజలను బయటకు తేవటానికి రేయింబవళ్ళూ శ్రమపడుతూ ఒక దశలో మా నాన్నగారు నిర్వేదానికి గురయ్యారు. ఆత్మీయుల్ని, సన్నిహితుల్నీ ఎందరినో కోల్పోయిన దుఃఖం మా నాన్నగారిని కలచివేసింది. ఎన్నో సంవత్సరాలుగా దివిసీమను ఒక దివ్యసీమగా మలచుకు రావటానికి ఆయన పడిన శ్రమ అంతా రాత్రికి రాత్రి తుడిచిపెట్టుకు పోయిందనే బాధలోంచి ఆయన బయటపడలేకపోయారు.

ఈ ప్రజలకోసం ఏదో ఒకటి చేసి, వారికి పునర్జీవనం కలిగించటం ఒక్కటే ఆయన ముందున్న లక్ష్యం. అందుకోసం ఈ మంత్రిపదవిలో కొనసాగటం ఆయనకు అర్థం లేనిదిగా కనిపించింది. అలా అనిపించినదే తడవు రాజీనామా పత్రాన్ని వ్రాసి, తన సెక్యూరిటీ వాళ్లకిచ్చి దాన్ని వైర్లెస్ ద్వారా ముఖ్యమంత్రికి పంపించమని అందించారు. ఆ సమయంలో ఆయన భావదేవరపల్లిలో ఉన్నారు.

ఇది తెలిసి వెంటనే వీరనారాయణరెడ్డిగారు పరుగున భావదేవరపల్లి వచ్చారు. ఇలాంటి నిర్ణయాలు తీసుకోవద్దనీ, ఈ సమయంలో ప్రభుత్వపక్షాన తగిన సహాయం అందాలంటే మీరు పదవిలో ఉండాలనీ ఆయన నాన్నగారిని ప్రాధేయపడ్డారు. వేల సంఖ్యలో స్వచ్ఛంద సేవకులు, ఉద్యోగులు అహోరాత్రులూ కష్టపడ్తున్నారు. వారందరి మీదా మీ రాజీనామా ప్రభావం ఉంటుంది, అది సేవాకార్యక్రమాలను మందగింప చేస్తుందని కూడా ఆయన నాన్నగారికి నచ్చచెప్పాలని చూశారు. ఆ సమయాన వీరనారాయణరెడ్డిగారిలో నిజంగా ఒక మనిషిని, ఒక మానవతా మూర్తిని చూశానని మా నాన్నగారు ఒక సందర్భంలో వ్రాశారు. నారాయణరెడ్డిగారి కళ్లలో నీళ్లు సుడులు తిరుగుతున్నాయి. మౌనంగా రోదించే హృదయంతో ఆయన వెనక్కి వెళ్లిపోయారు. "ఒక పోలీసు ఆఫీసర్ వేసుకున్న కఠినమైన యూనిఫాం వెనక ఇంత కరుణాంత రంగం ఉంటుందని నేను ఊహించలేదు..." అనేవారు మా నాన్నగారెప్పుడూ.

సొర్లగొంది గ్రామంలో మత్స్యకారులు అధికంగా నివసించేవారు. ఉప్పెనకు ముందు సొర్లగొంది వైశాల్యం రీత్యా ఆ చుట్టుపక్కల గ్రామాల కన్నా పెద్దది. అది ఈ ఉప్పెనలో పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. కనీసం 2,000 మంది మత్స్యకారులుండే వాళ్లు. చేపలవేటే వారి ప్రధాన వృత్తి. సముద్రమే వాళ్ళకు దేవత. సర్వస్వం కూడా! వాళ్లని ఇన్నేళ్లుగా పోషిస్తూ వచ్చిన ఈ సముద్రమే, ఒక్కసారిగా ఆగ్రహించి ఉవ్వెత్తున ఎగిసి ఆ ఊరినంతటినీ ముంచెత్తింది.

ఉప్పెన వెంటనే నాటి ముఖ్యమంత్రిగారూ, మా నాన్నగారు హెలికాప్టరులో ఈ ప్రాంతాన్ని సర్వే చేసినప్పుడు, మూడు బిల్డింగులు, ఒక కుక్క మాత్రమే అక్కడ కనిపించాయి. ఆ మూడింటిలోనూ ఒకటి పంచాయితీ బిల్డింగు, ఒకటి స్కూలు బిల్డింగు, మూడోది నాగులమారి దేవాలయం.

పూర్తిగ్రామం నీటిలో మునిగి ఉంది. ముళ్లపొదలతో నడవటానికి అసాధ్యంగా ఉంది. అలాంటి ఊరుని శ్రీ వీరనారాయణరెడ్డి ఎంచుకోవటం ఆయన ధైర్యానికొక

మచ్చుతునక. ఏ చోటుకైతే ఇతరులు చేరుకోగలగటం అసాధ్యమో, ఎక్కడ తక్షణ సాయం అవసరమో దాన్ని ఎంపిక చేయటంలోనే నారాయణరెడ్డిగారి విజ్ఞత కనిపిస్తుంది.

పునర్నిర్మాణం తరువాత సొర్లగొంది ఊరు రూపురేఖలే మారిపోయాయి. పోలీస్ డ్యూటీ చేసిన ఉద్యోగులు స్వచ్ఛంద సేవకులై బాధితులతో సన్నిహితుల్లా పనిచేశారక్కడ. నాయుడు బ్రహ్మారావు గారు మొత్తం సొర్లగొంది పునర్నిర్మాణాన్ని దగ్గరుండి పర్యవేక్షించారు.

ఈ దివిసీమ ఉప్పెన పోలీసుల్లో కూడా మానవత్వం పొంగి పొరలు తుంటుందని ఋజువు చేసింది...నా కదే ఆశ్చర్యం" అని మా నాన్నగారు చాలా సార్లు అనేవారు! తమలోని సేవా తత్పరత అనే గుణాన్ని పోలీసులు ఇదే విధంగా ప్రదర్శిస్తూ ఉండాలని ఆయన ఆకాంక్షించారు.

వీరనారాయణరెడ్డిగారికి బౌద్ధమతం పట్ల అనురక్తి ఎక్కువ. హైదరాబాదులో బుద్ధవిహారం నిర్మాణం విషయంలో ఆయన ప్రముఖపాత్ర వహించారు. బుద్ధుడి గురించి ఆయన అనేక రచనలు కూడా చేశారు.

ఒకసారి పోలీసులు సాధారణ తనిఖీలు చేస్తుండగా మా పార్టీ నాయకు డొకాయన ప్రయాణిస్తున్న కారులో మారణాయుధాలు దొరికాయని పోలీసులు కేసుపెట్టారు. తనని అన్యాయంగా ఆ కేసులో ఇరికించారని నా దగ్గరకొచ్చి ఆ నాయకుడు వాపోయాడు. నేను మా నాన్నగారికి ఈ విషయం గురించి చూడమని ఫోను చేసి చెప్పాను. మా నాన్నగారు నన్ను వెంటబెట్టుకుని బందరులో ఎస్పీ వీర నారాయణ రెడ్డిగారి దగ్గరకు తీసుకు వెళ్లారు.

"రోజూవారి సహజంగా పెట్రోలింగు జరిగేప్పుడు తనిఖీలో ఆ కారులో మారణాయుధాలు దొరికాయనీ, అతన్ని వేధించ వలసిన అవసరం తనకు లేదనీ వీరనారాయణరెడ్డిగారు మాకు స్పష్టంగా చెప్పారు. "నా తత్త్వం మీకు తెలుసుకదా?" అనడిగారాయన. బయటకు రాగానే నాతో మా నాన్నగారు "అలాంటివాళ్లతో సావాసం చేస్తే నీగతి అధోగతే...నీకంటే పెద్దవాళ్లతో, గొప్ప వాళ్లతో స్నేహం చెయ్యి, పైకొస్తావు" అన్నారు. ఆ ఒక్క మాట నా జీవితాన్నే మార్చివేసింది. వీరనారాయణరెడ్డిగారి మాటంటే మా నాన్నగారికి అంత నమ్మకం...అంత గురి కూడా!




సార్లగొంది ప్రారంభవోత్సవంలో ముఖ్యమంత్రి చెన్నారెడ్డి.
శ్రీవీరనారాయణరెడ్డి, శ్రీ నారాయణరావు



# ఫాదర్ పి యస్ అమలరాజ్

దివిసీమ ఉప్పెన బాధితులకు సేవలందించిన ప్రముఖులలో ఫాదర్ అమలరాజ్ ఒకరు.

కాథలిక్ డయోసిస్ విజయవాడ పక్షాన సేవలందించడానికి ఇక్కడకు వచ్చిన ఫాదర్ అమలరాజ్ అవనిగడ్డ సెంట్ ఆన్స్ హాస్పిటల్ని కేంద్రంగా చేసుకుని సహాయ కార్యక్రమాలు ప్రారంభించారు. అప్పటికప్పుడు పూనుకుని 5,000 మంది బాధితులకు భోజనాల ఏర్పాటు చేశారు. నిత్యావసర వస్తువులు, బట్టలు పంపిణీచేశారు.

శాశ్వత ప్రాతిపదికన సేవాకార్యక్రమాలు నిర్వహించటానికి 1978 ఫిబ్రవరి 27న నాగాయలంక కేంద్రంగా ఆయన దివిసీమ సోషల్ సర్వీస్ సొసైటీని ప్రారంభించారు. అప్పుడు అమలరాజ్ గారు ఒకటే నిర్ణయించుకున్నారు- 'దివిసీమ నాకు రెండో పుట్టిల్లు కావాలి' అని! వెంటనే వచ్చి మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారిని కల్సుకున్నారు. ఆనాటినుండీ ఆయన నాన్నగారి దివిసీమ - పునర్నిర్మాణ కార్యక్రమంలో భాగస్వామి అయ్యారు.

పంటభూములను పునరుద్ధరించి, వాటిని తిరిగి వ్యవసాయ యోగ్యం చేయటం ఆయన కార్యక్రమాలలో ముందుగా చెప్పుకోవలసింది. సముద్రపు నీటిలో మునిగి చవుడు బారిన పంటభూములు సాధారణస్థితికి చేరినందువలన రైతాంగం వ్యవసాయ పనులు ప్రారంభిస్తారని, తద్వారా వాళ్ల కాళ్లమీద వాళ్లు నిలబడేందుకు అవకాశం కలుగుతుందనీ ఆయన నమ్మారు. వెంటనే దానిని ఆచరణలోకి తెచ్చారు.

నాగాయలంక మండలం కమ్మనమోలు మండపాకలలో రెండు శాశ్వత వైద్యచికిత్సా కేంద్రాలు నెలకొల్పి వైద్యసేవలు ప్రారంభించారు. తల్లీ బిడ్డల ఆరోగ్యం పైన దృష్టిపెట్టి పొదుపు కార్యక్రమాలు స్వయం ఉపాధి కార్యక్రమాలు కుట్టు శిక్షణా కేంద్రాలు, బాలవాడీ కేంద్రాలను ఏర్పాటుచేశారు.

11 గ్రామాలలో గ్రామ సంఘాలు ఏర్పరచి, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను వారి ద్వారా పెద్ద ఎత్తున చేపట్టారు. వయోజన విద్యా కేంద్రాలను ఏర్పరచి రాత్రి పాఠశాలలను కూడా నిర్వహింపచేశారు. గ్రామీణులను సమన్వయపరచి, ఇళ్ల నిర్మాణంలోనూ, పారిశుధ్య నిర్వహణలోనూ వాళ్లు శ్రద్ధ వహించేలా చేశారు. స్వయం ఉపాధి పథకాల ద్వారా ఆర్థిక స్థోమతను పెంచుకునేలా వారిని చైతన్యపరిచారు. ఈ కార్యక్రమం మనం నోటిమాటగా చెప్పుకున్నంత తేలికగా జరిగిపోయినది కాదు. చాలా బృహత్తరమైనది. రకరకాల మనస్తత్వ ప్రజలను ఏకం చేసి అభివృద్ధిలో భాగస్వామిని చేయటం అసిధారావ్రతంలాగా సాగింది.

మోటార్ సైకిల్‌పై రాత్రింబగళ్లు గ్రామాలవెంట తిరుగుతూ వారు చేసిన మహత్తర సేవ నాకళ్లముందు ఈనాటికీ కదలాడుతూ ఉంది. ఈ బృహత్ కార్యక్రమంలో అనవసరంగా శ్రమించటం వలన ఆయన కొంతకాలం అనారోగ్యానికి గురికావలసి వచ్చింది కూడా! అయినా ఆయన లెక్కచేయలేదు.

దివిసీమ ఆర్తజనసేవలో మా నాన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారికి ఫాదర్ అమలరాజ్ కుడిభుజంగా నిలిచారు. నాన్నగారు స్థాపించిన ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల సంఘసేవకుల సంఘానికి కార్యదర్శిగా పనిచేశారు. స్వచ్ఛంద సంస్థల్ని సమన్వయపరచి పునర్నిర్మాణ కార్యక్రమాలను పెద్ద ఎత్తున చేపట్టటానికి ఆయన సహకారం ఎంతగానో ఉపయోగపడింది.

అనతికాలంలోనే ఆయన మా కుటుంబంలో ఒకడిగా మారిపోయారు. అంతటి సాన్నిహిత్యం ఆయనతో మాకు ఏర్పడింది. ఆనాటి నుండి ఈనాటివరకూ ఆయన నన్ను అభిమానిస్తూనే ఉన్నారు.

ఫాదర్ పి యస్ అమలరాజ్ గారు తమిళ క్రైస్తవుడు. శివకాశి దగ్గర ఒక పల్లెటూరులో 1943 జనవరి 30న జన్మించారు. తల్లిదండ్రులిద్దరూ కె.పి. స్టానిస్లాస్, చిన్నమ్మాళ్-ప్రాథమికోపాధ్యాయులు. మదురై సెయింట్ మేరీ హైస్కూల్లోనూ, తిరుచిరాపల్లి సెయింట్ జోసెఫ్స్ కాలేజీలోనూ చదివాడు. 1959లో సొసైటీ ఆఫ్

జీసస్ సంస్థలో సభ్యుడయ్యారు. చెన్నై లయోలా కాలేజీలోనూ, కోడైకానల్ సేక్రెడ్ హార్ట్ కళాశాలలోనూ, క్రైస్తవ తత్త్వ శాస్త్రాన్ని అభ్యసించారు.

1967లో గుంటూరు నల్లపాడు లయోలా పబ్లిక్ స్కూల్ వార్డెన్‌గా రెండేళ్లు పనిచేసి తిరిగి డార్జిలింగ్ వెళ్లి అక్కడ థియాలజీలో రెండవ డిగ్రీ చదివారు. 8 ఏప్రియల్ 1973న కేథలిక్ చర్చిలో మతాధికారిగా నియమితులయ్యారు. అప్పటినుండీ ఆయన ఆంధ్రప్రదేశ్ లోనే స్థిరపడి సామాజికసేవా కార్యక్రమాల్లో ముమ్మరంగా పాల్గొనసాగారు. 1974లో కరీంనగర్ జిల్లా వేములవాడలో క్రైస్తవ మత ప్రచారకుడుగా వెళ్లారు. మొదట అక్కడి నాంపల్లి అనే గ్రామం దగ్గర ఒక ఆరోగ్య కేంద్రాన్ని ప్రారంభించా డాయన. క్రమేణా ఒక తెలుగు మీడియం, ఒక ఇంగ్లీషుమీడియం పాఠశాలల్ని కూడా ఏర్పాటు చేశాడు.

జూన్ 1985లో ఆయన విజయవాడ ఆంధ్ర లయోలా కళాశాల రెక్టారుగా వెళ్ళారు. ఆయన కృషి ఫలితంగానే ఆంధ్రలయోలా కళాశాల పోస్టుగ్రాడ్యుయేట్ కళాశాలగా మారింది. ఎం.ఏ. సోషల్‌వర్క్, ఇంగ్లీషు కోర్సులతోపాటు అనేక పి.జి కోర్సులు వచ్చాయి. ఆయన రెక్టారుగా ఉన్న కాలంలో లయోలా కళాశాల అత్యంత ఆధునికతను సంతరించుకుంది. మొదటిసారిగా లయోలా కళాశాలలో ఆడపిల్లలను చేర్చుకోవటం ఈయన కాలంలోనే మొదలయ్యింది.

1989లో నాటి ముఖ్యమంత్రి యన్.టి రామారావు గారు తన హిందూపూర్ నియోజకవర్గానికి ఫాదర్ అమలరాజ్ గారిని, ఇంకా ఇతర జెస్యూట్ ఫాదర్లను ఆహ్వానించారు. ఫాదర్ ఎ.ఎక్స్ బోస్కో అమలరాజ్ గారికి పై అధికారి. అమలరాజ్ గారు ఆయనతో సంప్రదించి, పై అధికారుల అనుమతితో ఆనాడు హిందూపురంలో లయోలా తెలుగు మీడియం హైస్కూలును, దానికి హాస్టలు వసతినీ ప్రారంభించారు. దీనికి యన్.టి.ఆర్ గారి పూర్తి సహకారం ఆశీస్సులు అందించారు. అనతికాలంలోనే హిందూపురం పరిసరాలలో కుంటి నడక నడుస్తున్న ప్రాథమిక విద్యాలయాలను దత్తత తీసుకుని లయోలా హైస్కూలుకు అనుబంధం చేసి, ఉపాధ్యాయులను ఏర్పరచి నాణ్యమైన చదువు చెప్పించే ప్రయత్నం చేశారు. అమలరాజ్ గారు మొదట్నించీ మొక్కుబడిగా చదువులు చెప్పించి, చేశానన్నపేరుకు సేవా కార్యక్రమాలు చేయటాన్ని పూర్తిగా వ్యతిరేకించేవారు.

హిందూపురంలో అడుగు పెట్టటమే తడవు ప్రామాణికంగా చదువు నేర్పించే

సంస్థలను నెలకొల్పటం తన లక్ష్యంగా పెట్టుకున్నారాయన. ఇప్పుడు హిందూపురంలో లయోలా తెలుగు మీడియం స్కూలుతోపాటు, ఇంగ్లీషు మీడియం హైస్కూలు, సెయింట్ జేవియర్ బి.ఎడ్.కళాశాల వగైరా ఉన్నాయి. మడకసిర ప్రాంతంలో సెయింట్ ఆన్స్ బాలికల హైస్కూలుని కూడా నెలకొల్పారు.

కేథలిక్ కుటుంబాల కోసం హిందూపురంలో సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ చర్చిని కట్టించారు. లయోలా సోషల్ సర్వీస్ సొసైటీ నెలకొల్పి హిందూపురం, మడకసిర, పెనుగొండ, ముడిగుబ్బ ప్రాంతాల్లో సేవాకార్యక్రమాలు ప్రారంభించారు.

ఆయన విద్యా సంస్థల ఏర్పాటుతో ఆగిపోలేదు. తల్లీపిల్లల ఆరోగ్య కేంద్రాన్ని కూడా వ్యవస్థాపించారు. 1992లో డా.వై.యస్ రాజశేఖరరెడ్డిగారు ఫాదర్ అమలరాజ్ గారి కృషిని, ప్రతిభను గమనించి తన ఆధీనంలోని వై.యస్.ఆర్ డిగ్రీకళాశాలను, వై.యస్.ఆర్ పోలిటెక్నిక్ కళాశాలలను కూడా స్వీకరించి అభివృద్ధి చేయవలసిందిగా కోరారు. తన పై అధికారుల అనుమతితో ఈ రెండు కళాశాలల అభివృద్ధి బాధ్యతలనూ ఆయన స్వీకరించారు. అందుకోసం ఆయన పులివెందులకు తన నివాసాన్ని మార్చారు. ప్రస్తుతం ఇవి 3,500 మంది విద్యార్థులతో గొప్పగా నడుస్తున్నాయి. రాయలసీమలో చుట్టుపక్కల 380 గ్రామాలకు ఈ విద్యాలయాలు విద్యాదానం చేస్తున్నాయి.

ఒక దార్శనికుడు పూనుకుంటే పదికాలాలపాటు నిలబడే కార్యక్రమాలు సమకూరుతాయనటానికి ఫాదర్ అమలరాజ్ గారే తార్కాణం.

1997లో కడపలో కనీవినీ ఎరుగని రీతిలో వరదలొచ్చి చుట్టుపక్కల గ్రామాలను ముంచెత్తాయి. కడప కేథలిక్ డయాథీసిస్ వారి సోషల్ సర్వీస్ సొసైటితో కలిసి ఫాదర్ అమలరాజు తక్షణ సహాయ చర్యలకు పూనుకున్నారు.

ఆ సమయంలో దక్షిణ ఆసియా జెస్యూట్ల మహాసభ జరిగింది. నేపాలులో భూటానీ శరణార్థులకు విద్యాదానం గురించి అందులో కొన్ని మౌలికమైన నిర్ణయాలు తీసుకున్నారు. వాటిని అమలు చేయగల సమర్థుడైన వ్యక్తి కోసం అన్వేషించారు. అప్పటికి నేపాల్లో 1,08,000 మంది భూటాన్ శరణార్థులు వివిధ శిబిరాలలో తలదాచుకుంటున్నట్టు అంచనా వేశారు. ఈ 1,08,000 మందికీ నివాసాలు, ఆహారం, ఆరోగ్య పరిరక్షణ, చదువు మొదలైనవి ఏర్పాటు చేయాల్సిన అవసరం ఏర్పడింది. ఈ సమయంలో 'ఐక్యరాజ్యసమితి శరణార్థుల వ్యవహార హైకమీషనర్' (UNHCR) ముందుకొచ్చి తమవంతు సహాయ ఏర్పాట్లు ప్రారంభించారు. ఈ భూటానీయులకు చదువు చెప్పించే ప్రాజెక్టుని చారిటస్ నేపాల్ అనే సంస్థకు అప్పగించారు.

అయితే జెస్యూట్ల మహాసభ ఈ బాధ్యతను చేపట్టవలసిందిగా ఫాదర్ అమలరాజ్ గారిని కోరింది. ఆయన పూనికతో 1,600 మంది టీచర్లతో, 42,000 మంది భూటానీ విద్యార్థులకు చదువు చెప్పించటం కోసం 60 స్కూళ్లను వ్యవస్థాపించి, నాణ్యతా ప్రమాణాలతో నడిపించారు. ఒకవిధంగా ఇది ప్రపంచ అద్భుతాలలో ఒకటి. ఎలాగంటే ప్రపంచ స్థాయి ప్రముఖులు ఈ విద్యాలయాలను సందర్శించి ఇవి మామూలు ఉచిత విద్యాలయాలు కావు, అంతర్జాతీయ ప్రమాణాలతో కూడుకున్న చదువును బోధిస్తున్నాయి అని ప్రశంసించటం గమనార్హం. 2002లో బ్రిటన్ యువరాణి ఆనె నేపాల్లోని భూటాన్ శరణార్థుల శిబిరానికి వెళ్లి, అక్కడ భూటానీయుల కోసం నడుస్తున్న స్కూళ్లని స్వయంగా పరిశీలించటం ఇందుకొక ఉదాహరణ.

ఫాదర్ అమలరాజ్ గారి భూటానీ విద్యాసేవాకార్యక్రమాన్ని ప్రపంచ అత్యుత్తమ సేవా కార్యక్రమంగా శ్లాఘిస్తూ, ఐక్యరాజ్య సమితి న్యూయార్క్ లోని వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో అమలరాజ్ గారిని ఘనంగా సత్కరించింది కూడా.

నేపాలులోని ప్రతి విదేశీ రాయబారి తప్పకుండా అక్కడకు వెళ్లి కాందిశీకులను పరామర్శించి, సేవా కార్యక్రమాలను కళ్లారా చూసేవారు. పాదర్ అమలరాజ్ గారిని పరిచయం చేసుకుని అభినందించి వెళ్లేవారు.

అదే సంవత్సరం జెనీవాలో మానవహక్కుల అభివృద్ధి, పరిరక్షణ ఉపసంఘం సమావేశం జరిగింది. ఐక్యరాజ్య సమితి ఆహ్వానం మీద ఫాదర్ అమలరాజ్ గారు కూడా ఆ సమావేశంలోపాల్గొని, నేపాల్లో భూటానీయుల్ని వెనక్కి వారి స్వదేశానికి పంపించే ఏర్పాట్లు చేయవలసిందిగా ఐక్యరాజ్యసమితిని అభ్యర్థించారు.

2003లో ఐక్యరాజ్యసమితి హైకమీషనర్ మేడమ్ సడకో ఒగాట ఫాదర్ అమలరాజ్ గారితో కలిసి భూటాన్ శిబిరాలను సందర్శించారు. నేపాల్లో భూటాన్ శరాణార్థులకు అందించిన విద్య చాలా నాణ్యమైనదిగా ఆమె పునరుద్ఘాటించారు.

బెంగుళూరులోని జెస్యూట్ల శరణార్థ సేవాసంస్థ వారు భారతదేశం, శ్రీలంక, నేపాల్, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్థాన్ శరణార్థుల సమస్యలు చాలా తీవ్రంగా ఉన్నాయని, వాటిని సమన్వయం చేయటానికి బాధ్యత తీసుకోవలసిందిగా అమలరాజ్ గారిని కోరారు.

మే 2003లో అమలరాజ్ గారు జెస్యూట్ల సేవాసంస్థ సంచాలకుడి బాధ్యతలు స్వీకరించటానికి బెంగుళూరు వచ్చారు. తాలిబాన్ల యుద్ధం తరువాత ఇరాన్, ఇరాక్,

పాకిస్తాన్ల నుండి తిరిగివచ్చిన ఆఫ్ఘనిస్థాన్ శరణార్థుల సేవలకోసం ఆయన 2005లో ఆఫ్ఘనిస్థాన్ వెళ్లారు. ఆ సమయంలో ఆయన ఆఫ్ఘనిస్తాన్లో ఒక హైస్కూలుని నిర్మించారు. అది ఆఫ్ఘాన్ల ఆధీనంలో ఇప్పటికీ దిగ్విజయంగా నడుస్తోంది.

శ్రీలంకలో శరణార్థులకోసం 114 క్యాంపులు నిర్వహించారాయన. సునామీ సమయంలో శ్రీలంకలో సర్వం కోల్పోయిన బాధితుల కోసంవెయ్యి ఇళ్లు నిర్మాణం చేయించి అందించారు. అక్కడి వందలాది మత్స్యకారులకు వలలు, బోట్లు కూడా ఇప్పించారు. భర్తలను కోల్పోయిన స్త్రీలకు కుట్టు పనులు నేర్పించి తమకాళ్లమీద తాము బ్రతికేలా చేశారు.

2006లో శ్రీలంకలో మిలిటరీకీ, LTTE మిలిటెంట్లకూ మధ్య పెద్ద యుద్ధం జరిగింది. ఆ సమయంలో క్షతగాత్రులైన వేలాదిమందికి ఆయన సేవలందించారు. అలా ఆరేళ్లు శ్రీలంకలో సేవా కార్యక్రమాలతో గడిపారాయన.

2012లో తిరిగి భూటాన్ శరణార్థుల సమస్యమీద ఆయనను నేపాల్ పిలిపించారు. భూటానీయుల విద్యాపరమైన సమస్యను పరిష్కరించి సక్రమంగా నిర్వహించే బాధ్యతని తిరిగి ఆయనకు అప్పగించారు. 2014 వరకూ ఆయన అక్కడే భూటాన్ శరణార్థులకు శాశ్వత పునరావాసాల గురించి పరిశ్రమ చేశారు. ఆయన కృషి ఫలితంగా 70,000 మంది భూటానీయులు అమెరికా, బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మొదలైన దేశాల్లో స్థిరజీవితాన్ని పొందగలిగారు.

2014లో రాష్ట్రం విడిపోయి, తెలుగువారు రెండు ముక్కలయ్యారు. ఆ సమయంలో రోము అత్యున్నత మతాధిపతి ఫాదర్ అమలారాజ్ గారిని ఆంధ్ర, తెలంగాణా రాష్ట్రాలకు మతప్రచారాధిపతిగా నిర్ణయించి పంపారు. ఈ రెండు రాష్ట్రాల జెస్యూట్సుకు ఆయన అధికారిగా వ్యవహరిస్తారు. వారి ఆధీనంలో ఆంధ్ర లయోలా కళాశాల, ఆంధ్ర లయోలా ఇంజనీరింగ్ కాలేజి, (విజయవాడ) లయోలా అకాడెమీ సికిందరాబాద్ పనిచేస్తున్నాయి. పులివెందుల లయోలా డిగ్రీకళాశాల, లయోలా పబ్లిక్ స్కూల్ గుంటూరు, సెయింట్ పాట్రిక్స్ హైస్కూల్ సికిందరాబాద్ మొదలైన సంస్థలు ఆయన నేతృత్వంలో పనిచేస్తున్నాయి.

ఒక దార్శనికుడిగా, నిబద్ధత కలిగినవాడిగా, మానవ హక్కుల కోసం పాటుపడిన వ్యక్తిగా ఫాదర్ అమలరాజ్ మూర్తీభవించిన మానవత్వంగా కనిపిస్తారు.

2017 ఆగష్టు 4న మా నాన్నగారి జయంతిని పురస్కరించుకుని మండలి

వెంకట కృష్ణారావు సేవాపురస్కారాన్ని ఫాదర్ అమలరాజ్ గారికి అందించే సదవకాశం నాకు కలిగింది. ఆనాటి సభలో పాతజ్ఞాపకాలను నెమరువేసుకున్నారు. తన సేవా ప్రస్థానానికి నాంది దివిసీమే పలికిందని, ఆ అనుభవాలే తరువాత కాలంలో అనేక దేశాలలో చేసిన సేవాకార్యక్రమాలకు ఆధారభూతమైనాయని చెప్పారు.





శ్రీ మండలి వెంకటకృష్ణారావు, ఫాదర్ అమల్‌రాజ్

అనుబంధం :



# మానవతామూర్తి శ్రీ మండలి వెంకట కృష్ణారావు

**- తిరుమల రామచంద్ర**

దివిసీమ ఉప్పెన... తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. ఆనాడు శనివారం 1977 నవంబరు 19. సూర్యుడు అనుదినమూ ఉదయించినట్లే ఆ దినమూ ఉదయించాడు. ప్రజలు నిత్యకృత్యాలు యథావిధిగానే సాగించారు. కానీ ఒకటే భేదం. తుపాను సూచనలున్నాయి సుమా! జాగరూకతో మెలగాలి సుమా!... అని వాతావరణవేత్తలు హెచ్చరికలు చేశారు.

సరే, ఎప్పుడూ ఉన్నవే ఈ తుపానులు ఎన్నో వచ్చాయి. నిలువదొక్కు కున్నాము. ఇది కొంచెం తీవ్రమైనదేమో! ధైర్యంతో నిలబడదాము. అంతకన్నా ఏం చేయగలం? - అనుకున్నారు దివిసీమ వాసులు. పాపం! వాళ్లకేమి తెలుసు వంద సంవత్సరాల క్రితం మచిలీపట్టణాన్ని ముంచెత్తి, వేలకొలది ప్రజలను పొట్టన పెట్టుకున్న ఉప్పెన కన్నా పెద్ద జలప్రళయం తమపై వికటాట్టహాసంతో విరుచుకొని పడుతుందని, తమను నామరూపాలు లేకుండా చేస్తుందనీని? కొన్ని గంటలలో అంతా సమాప్త మయింది. సముద్రుడు ఎందుకు ఆగ్రహించాడో, అమాయక ప్రజలను అకారణంగా ఎందుకు దండించాడో తెలియదు.

కాని, ఇలాటి క్లిష్ట సమయాలలోనే నిత్యసత్యాలు పునర్నిరూపితం అవుతాయి. అగ్గిలో పడితే గాని అపరంజి ఏదో తెలియదు కదా! "మనస్వీకార్యార్థ న గణయాతి దుఖం న చ సుఖం" - అన్న భర్తృహరి సూక్తి మరొకమారు దేశమంతటా మారుమ్రోగింది. ఆ సూక్తికి మానవతా రూపమే శ్రీ మండలి వెంకట కృష్ణారావు.

శ్రీ మండలి, తుపాను సంభవించిన నాడు కాకతాళీయంగా అవనిగడ్డలో ఉన్నారు. అప్పుడాయన చేసిన సేవ సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ఆయనలోని మానవత్వం వేయి మత్తగజాల బలంతో ఉప్పెన కన్నా ఉవ్వెత్తున లేచింది. గంటకు రెండు వందల కిలోమీటర్ల వేగంతో వీచే పెను గాలులలోను ఆయన హిందీ విద్యాలయంలోని పిల్లలేమయ్యారో! సేవాశ్రమము, అనాథ శరణాలయం పరిస్థితి యేమిటో! - అని విలపిస్తూ పరుగెత్తారు, వారిని దక్కించుకొందామని. తెల్లవారింది. ఉప్పెన రాక్షసి ఎందరో ప్రజలను, ఎన్నో పశువులను సమూలంగా మింగిందని వార్తలు వ్యాపించాయి. ఒంటిమీద గుడ్డలున్నాయా, లేదా అన్నది కూడా పట్టించు కోకుండా బయలుదేరారు. పాదచారియై. కూలిపోయిన ఇండ్ల మధ్యన నడిచారు. జలప్రళయంలో మరుగయిపోయినవారు పోగా, మిగిలిన వారి మనసులలో బలం నింపడానికి నడిచారు. ప్రజల హృదయాలలోనే నడిచారంటే సరిపోతుంది, ఒక్క మాటలో.

అంతటితో ఆగలేదు ఆయన. కనీవినీ ఎరుగని ఈ ఘోరకలి ప్రభుత్వానికి తెలియాలి. ప్రభుత్వం సహాయ కార్యక్రమం వెంటనే ప్రారంభించాలి. త్వరగా చేరడానికి తగిన వాహనము లేదు.

అతి కష్టం మీద వారు విజయవాడకు వెళ్ళారు. హుటాహుటిగా ప్రభుత్వ యంత్రాంగాన్ని కదిలించారు. కాలిలో దాదాపు 36 ముళ్ళు గుచ్చుకున్నాయి. ఐనా, లక్ష్య పెట్టలేదు. కాలికి కట్టు కట్టించుకున్నారు. నడక ప్రారంభించారు. విరామమెరుగని నడక. పల్లె పల్లెకు తిరిగారు. పరిస్థితి చూచారు, పరితపించారు, పరితాపం పోగొట్టారు, చొరరాని ప్రాంతాలను హెలికాప్టర్ ద్వారా పరిశీలించారు.

ఈ సమాశ్వాసన యాత్రలో, ఈ సహాయ సేవా యాత్రలో ఆయన చూడని పల్లె లేదు. ఆయన మాట్లాడని మనిషి లేడు. ఆయన ఎన్నికల ప్రచారోద్యమంలో ఎన్నోమార్లు గ్రామాలు తిరిగారు. ఆ పర్యటనల పద్ధతి వేరు, ఉద్దేశం వేరు. ఈ యాత్ర అట్టిది కాదు. విషాదయాత్ర, పరామర్శ యాత్ర, పునరుజ్జీవయాత్ర. ఇలా తుపానుకు గురి అయిన ప్రాంతాన్నంతా కాలికి బలపం కట్టుకొని తిరిగారన్న సామెతగా పలుమారు తిరిగారు. ప్రజలలో విశ్వాసాన్ని నింపారు. విషాద యోగం వలదన్నారు. ఇప్పుడు కావలసింది పునరుజ్జీవ పునర్నిర్మాణాలని ఉత్సాహపరిచారు. తత్ క్షణమే చేయదగిన సహాయం, సహకారం చేశారు, చేయించారు.

అవనిగడ్డలో తుపాను బాధితుల శిబిరమైంది ఆయన మకాం. వేలకొలది తుపాను బాధితులు ఆహమిహకతో ఆత్రంగా, ఆశతో తోసుకొని వచ్చారు శిబిరానికి. తుఫాను బాధితులకు సహాయపడుదామని వచ్చే ప్రతివారికీ ఆ శిబిరమొక పర్యాటక కేంద్రమయింది. యాత్రాస్థలమయింది. శ్రీ మండలి నిర్విరామ కృషి వల్ల వందలకొలది స్వచ్ఛంద సేవా సంస్థలు ఉరుకులు పరుగులతో వచ్చాయి. ఆహారం, వస్త్రాలు అపారంగా అందజేశాయి. ఆయన చిత్తశుద్ధిని, అక్కడి హృదయవిదారక పరిస్థితిని చూచిన వందలకొలది సేవాసంఘాలు చురుకుగా పని ప్రారంభించాయి. ఎటు చూచినా కనిపిస్తూ, ఎవరిని చూచినా పలుకరిస్తూ, ఏమి కోరినా అందజేస్తూ పరమాణువులోని పరమ సూక్ష్మాంశం లాగా తిరుగుతున్న శ్రీ మండలి – సేవోత్సాహాలు మూర్తీభవించిన శ్రీ మండలి ఆ సేవా సంఘాలకు రెట్టింపు, మూడు రెట్లు ఉత్సాహవేశాలు పోశారు. ఎక్కడ చూచినా, ఇందుగలడందు లేడనే సూక్తి లాగ ఆయనే కనిపిస్తూ సేవ చేశారు. ఆయన వ్యక్తిత్వం అలాంటిది. కనుకనే రాష్ట్రపతి మొదలు నడివీధిలో నడిచే మనిషి వరకు, దేశంలోని సంఘ సేవాసంస్థలు మొదలు అంతర్జాతీయ సంస్థల వరకు, స్థానిక పత్రికలు మొదలు అంతర్జాతీయ పత్రికల వరకు ఆయన సేవానిరతి ప్రశంసలే. 1977 నవంబరు 19 తుపాను బాధితులను ఒక కంట కనిపెడుతూ, వారి బాగోగులు చూస్తూనే ఉన్నారు.

ఆ సేవాతత్పరత, చిత్తశుద్ధి శ్రీ మండలి అంతర్జాతీయ ఖ్యాతిని పెంపొందించాయి. 1977 సంవత్సరపు మానవతామూర్తిగా ఆయన కీర్తితులయ్యారు. మత ప్రచారకులు, సర్వోదయ కార్యకర్తలు, సంఘ సేవాపరాయణులు – అంతెందుకు, తుపాను బీభత్సం తెలిసిన ప్రతివ్యక్తి మత, వర్గ, కుల, రాజకీయ సిద్ధాంతాల భేదం లేకుండా ఆయనను ప్రశంసించారు. ఆయన బద్ధ శత్రువులు గూడా ఆయనను కొనియాడక తప్పలేదు. మాసిన గడ్డంతో, బెదురు చూపులతోను, మూర్తీభవించిన విషాదంలాగా ఉన్న ఆయన బొమ్మను దేశవిదేశాలలో దూరదర్శినిలో చూచిన వారికి ఉప్పెన వల్ల ఉప్పతిల్లిన ఘోర నష్టం నిజంగా ఎంతో ఆయన మాటల వల్ల, వివరణల వల్ల తెలిసింది. క్షణంలో ఎంతటి మానవ సమూహం మడిసిందో తెలిసింది. ఉపకార చింత గల వారికి, సంఘ సేవాసంస్థలకు సహాయ బుద్ధి సహజంగానే కలిగింది. దేశవిదేశాలలోని సంస్థలు ఆయనకు బాసటగా నిలిచాయి. నేడు దివిసీమలో పెక్కు సంస్థలు, వ్యక్తులు నిరాశ్రయులైన ప్రజలకు ఆశ్రయాలు కల్పించాయంటే, తక్కిన

సహాయ కార్యక్రమాలు జరిపి సేవ చేయగలిగాయంటే, ఇదంతా శ్రీ మండలి కృషి ఫలితమేనని, ఇతరుల సానుభూతి సహాయాలను పొందటానికి ఆయన పడిన పాట్లేనని ప్రతివారు గ్రహించగలరు. దివిసీమకు వెళ్ళిన ప్రతివారు, దేశీయులైనా, విదేశీయులైనా ఆయనను చూచి, ఆయన ద్వారా తమ సేవలు వెల్లడించుకోవాలని ఉవ్విళ్ళూరారు. అలా అయితే, తమ సహాయం సక్రమంగా, సరిగా, సకాలానికి ప్రజలకు అందగలదని వారు విశ్వసించారు, ఆ విశ్వాసం నెలకొల్పుకున్నారు శ్రీ మండలి.

పూర్వం కాటయవేముడు, ఆదివరాహమూర్తి చరిత్ర దివిసీమను ఉద్ధరించినట్లు చెబుతున్నది. ఈనాడు శ్రీ మండలి తుపాను సమయంలో మేరునగ ధీరుడుగా నిలిచి ప్రజలను ఆదుకున్నారు. సేవాశ్రమంలో తుపాను గాలికి కొట్టుకొని పోతున్న పిల్లలను రక్షించారు. బాధితులకు సహాయ కార్యక్రమాలు నిర్వహించారు. గ్రామాలలో పక్కా ఇండ్లు నిర్మించే పథకం అమలు పరచడంలో అలసట ఎరుగక పాటుపడ్డారు. ఆయన ఉత్సాహ ప్రోత్సాహాలు స్వచ్ఛంద సేవా సంస్థలు దివిసీమలో కృషి చేయడానికి, విజయవంతంగా పనిని నిర్వహించడానికి పాథేయాలయ్యాయి.

శ్రీ మండలి ధైర్యసాహసాలు పెనవేసుకున్న రాజనీతిజ్ఞుడు. సోషలిజానికి అంకితుడైన సిద్ధాంతవాది. ఉపజ్ఞ గల వ్యవస్థాపకుడు. విశ్రాంతి యెట్టిదో తెలియని కార్యకర్త. ఒక్క మాటలో ప్రజల మనిషి, మానవతామూర్తి. నిరాడంబరత, సర్వసులభత ఆయనకు గాంధీ మార్గం వల్ల అబ్బిన గుణాలు. బీద బిక్కి, శత్రువు, మిత్రుడు ఆయనను ఎప్పుడుబడితే అప్పుడు, ఎక్కడబడితే అక్కడ చూడవచ్చు, చెప్పవచ్చు, వినవచ్చు, తగిన మేలు పొందవచ్చు. నిజజీవిత విషయంలోను, సంఘ, ప్రభుత్వ విషయాలలోను ఆయన పూర్తిగా గాంధీ తత్త్వవాది. మనసా వాచా కర్మణా గాంధీ తత్త్వవాది.

గాంధీజీ ప్రబోధాలు పత్రికలో పఠించి బెజవాడలోను, బొంబాయిలోను గాంధీని దర్శించి ఉత్తేజితులై కార్యరంగంలో దూకారు. విధానసభ సభ్యులుగా, లోక్‌సభ సభ్యులుగా, మంత్రిగా చిరస్మరణీయ సేవ చేశారు. విద్యామంత్రిగా ఉన్నప్పుడు చేసిన సేవ ఆయనకు చిరకీర్తి సంపాదించింది. ప్రపంచ తెలుగు మహాసభను అత్యద్భుతంగా నిర్వహించారు. కార్యనిర్వాహణా దక్షులుగా రాత్రింబవళ్లు పనిచేసి తెలుగుజాతి చరిత్రలో అదొక మహత్తర సంఘటనగా ముద్ర వేశారు.

మాటల కన్నా చేతలకే ప్రాధాన్యమిచ్చే గాంధీ సిద్ధాంత విశ్వాసి గనుక గాంధీజీ

శతజయంతి నాడు అవనిగడ్డలో గాంధీక్షేత్ర నిర్మాణము ప్రారంభించి దానిని మహా సంస్థగా రూపొందించారు. ఉప్పెనలో సర్వస్వమూ కోల్పోయిన 400 మంది పిల్లలకు గాంధీక్షేత్రంలోని సేవాశ్రమంలో ఆశ్రయం కల్పించారు. వారికి ఉపాధి కల్పన, కుట్టు మిషన్ సెంటర్, బట్టల కట్టింగు ట్రయినింగు, స్త్రీ సంక్షిప్త విద్యా కేంద్రము, ఆశ్రమ పాఠశాల, గాంధీ గురుకులం, హిందీ ప్రచారక విద్యాలయము, మహావిద్యాలయం మున్నగు అనేక సంస్థలు నెలకొల్పారు. 80 వయోజన పాఠశాలలు స్థాపించారు. సర్వోదయ కార్యకర్తల, సంఘసేవకుల సభలు జరిపారు.

దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు నిర్వహించి గాంధీక్షేత్ర విశిష్టతను భారతదేశ వ్యాప్తం చేశారు. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల సంఘసేవకుల మహాసభలు జరిపి రాష్ట్రస్థాయి సంస్థను స్థాపించి స్వచ్ఛంద సేవలో సమన్వయ కృషికి తోడ్పడ్డారు. ప్రపంచ హిందీ మహాసభ సందర్భంగా భారత ప్రతినిధిగా మారిషస్ కు వెళ్లి అక్కడి ప్రధాని శ్రీ రాం గులాంను కలుసుకొని, మారిషస్ తెలుగు వారికి, ఆంధ్రప్రదేశ్ పట్ల సదవగాహన కల్పించారు. రాష్ట్ర సమైక్యానికి పెట్టని కోటగా నిలబడ్డారు.

దేశ పురోభివృద్ధి స్వచ్ఛంద సేవకుల మీదే ఆధారపడి ఉందని శ్రీ మండలి విశ్వాసం. ఆ విశ్వాసానికి కార్యరూపం ఇస్తున్న ఆదర్శ సంఘసేవకుడు ఆయన. ఇలాటి శ్రీ మండలిని ఉత్తమ సంఘసేవకునిగా నిర్ణయించి ప్రభాకర్ జీ మెమోరియల్ అవార్డుతో సన్మానిస్తున్నందుకు ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సమాజ సేవకుల సంఘాన్ని ప్రశంసిస్తున్నాను. శ్రీ మండలి వెంకట కృష్ణారావును హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.



226

# ఆపద్బాంధవులు

దివిసీమ ఉప్పెన
పునర్నిర్మాణ ప్రభావశీలురు



మండలి బుద్ధప్రసాద్ ప్రజాదృష్టి గల రాజకీయాలను ఒక ప్రక్క, సేవాదృష్టి గల నిర్మాణ కార్యక్రమాలు మరొక ప్రక్క, గ్రామీణ సంస్కృతిని వేరొక ప్రక్క, ఆధునిక విద్యని, ఆధునిక పరిజ్ఞానాన్ని ఇంకొక ప్రక్క తనలో మేళవించుకున్న వ్యక్తి. ఇందులో కొంతభాగం తండ్రి నుంచి పొందిన వారసత్వం ఉన్నా ఆ వారసత్వాన్ని దాటి తనకు తానుగా ఎదిగిన వ్యక్తి. దేశంలో వస్తున్న మార్పులను సునిశితంగా పరిశీలిస్తూ వాటి మధ్య ఒదిగిన వ్యక్తి. ఒకప్రక్క మార్పు కోసం తహతహ, మరొక ప్రక్క స్థిరత్వం కొరకు సర్దుకుపోయే మనస్తత్వం కూడా వుంది.

1977 నవంబరులో దివిసీమలో వచ్చిన వుప్పెన నాటికి నూనూగు మీసాల యవ్వనంలో ఉన్న బుద్ధప్రసాద్‌పై వైవిధ్యాల సంపుటిగా ఆ పెను ఉప్పెన చెరగని ముద్ర వేసింది. ఆ వైవిధ్యాలలో వైరుధ్యాలు కాకుండా సమన్వయాన్ని కాపాడుకుంటూ తన వ్యక్తిత్వాన్ని రంగుల ఇంద్రధనస్సుగా, బహుస్వర సమ్మేళనంతో సంగీతంగా, ఒక పూదోటగా మలుచుకొని భవిష్యత్తుకి రాజబాట వేసుకున్నారు. తండ్రి యొక్క ప్రభావం తన మీద ఎంతగా ఉన్నప్పటికీ దానిని ఒక అమూల్య సంపదగా స్వీకరించాడే తప్ప భారంగా భావించి దానిక్రింద అణిగిపోలేదు.

మితభాషి, మృదుభాషి, తాత్కాలిక ప్రయోజనాలను బలిపెట్టవలసిన అవసరం లేకుండానే దీర్ఘకాలిక అవసరాలను గ్రహించి అందుకు అనుగుణంగా వర్తమానాన్ని సరిదిద్దుకునే దూరదృష్టి గల విశిష్టమైన వ్యక్తి. నిరాడంబరమైన సాదా జీవితంలో నుంచి ఉన్నతమైన, ఉత్కృష్టమైన భావాల వైపు పయనించే శాశ్వత యాత్రికుడు. విలువల కోసం అవసరమైన రీతిలో నెలవులు ఏర్పరచుకునే నైపుణ్యం పుణికిపుచ్చుకున్న వ్యక్తిత్వం ఆయనది.

మా బుద్ధప్రసాద్ జీవితం ఒక కీర్తికుసుమం కావాలనీ, వ్యక్తిత్వ సుగంధం దశదిశలా వ్యాపించాలనీ కోరుకుంటున్నాను.

- **శ్రీ లవణం**, ప్రముఖ సంఘసేవకులు

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | GVPOLB264 | Date | 5/11/2020 |
| Front Cover | Yas | Back Cover | Yas |
| Blank Pages | CI, 224, 225 | | |
| Missing Pages | NO | | |
| Prepared | K Daveed | Scanned | Mounika |
| BOOK SIZE | H 8.3 W 5.5 | Pages | 229 |